


చెన్నపట్టణము, నవంబరు ౧౯౩౦

సంపుటము ౭ ప్రమోదూత సంవత్సరము కార్తీకమాసము సంఖ్య ౧౧


# హాంపీక్షేత్రము


కొడాలి వెంకటసుబ్బారావుగారు, B. A. కామరాజుగడ్డ శివయోగానందరావు గారు


## రాజ్యప్రదానము

[శ్రీ కృష్ణదేవరాయలు దక్షిణదేశదిగ్విజయయాత్రాసన్నాహములో వున్నాడు. అదివరకే చోళుడు, పాండ్యులు, యుద్ధాలు చేస్తున్నారు. చోళులది తంజావూరు; పాండ్యులు అయిదుగురు, అన్నదమ్ములు, ఏకోదరులు కారు; తల్లులు మువ్వురు, ఒకకులమునకు చెందని వారు. పాండ్యజ్యేష్ఠునిది మధుర. అది రాజధాని. కొంతకాలము అన్నదమ్ములు ఒకటిగానే యుద్ధము చేశారు. కాని చోళరాజువల్ల కులమునకు యెక్కువ తక్కువ అనే ద్వేషాలు యేర్పడినవి. ఇది సందుచేసుకొని చోళరాజు పాండ్యసోదరులను నల్గురిని ఖైదుపట్టుకున్నాడు. మొదటి పాండ్యుడు మాత్రము కృష్ణరాయలను శరణుచొచ్చినాడు. రారాజు తనసేనాని నాగమనీడును చోళునిపైకి పంపినాడు. నాగమనీడు చోళుని జయించి పాండ్యులను మరల ఖైదుచేసి చోళపాండ్యరాజ్యములను ఆక్రమించి తానే రాజని ప్రకటించి కృష్ణరాయలపై

తిరుగుబాటు చేశాడు. రాయలు ఆగ్రహించి అతనిపైకి తగినవానిని పంపవలె ననుకుంటున్నాడు. వీరమనీడు నాగమనీనికొడుకు తండ్రిచేసినపని తనకు, రాజుకు, కులమునకు, దేశమునకు అపకీర్తి అనుకున్నాడు. రాజాజ్ఞ పొంది తండ్రిమీదికి వెళ్లి, గెల్చి, ఖైదుచేసి పాండ్యులను, చోళుని వెంటపెట్టుకొని రాయలకు అప్పగించినాడు. రాయలు వీరమనేనిమెచ్చి తనకృతజ్ఞతకు తార్కాణముగా నాగమనేని క్షమించి తంజావూరునందు వీరమనేని రాజుగా ప్రతిష్ఠించి పాండ్యులను అతనికి సామంతరాజులుగా చేశాడు. అప్పటినుంచి తంజావూరులో తెలుగునాటి ప్రభుత్వము ఆరంభము అంటారు. ఇది అనుశ్రుతముగా వచ్చే కథ.]

* * * * *

పాండవు లేవురన్ మరల పాండ్యులుగా జనియించినట్లు రా
ణ్మండల మెంచెనో దిగులునన్ కనుమూయదు చోళరాడ్ధను
ష్పాండితి తత్సహోదరనిబంధనకై పరిపూర్ణసిద్ధితో
నుండెను మబ్బు మ్రోసిన మయూరమునందడిపోల్కి నుల్కుతోన్.

తెలుగుపతి కృష్ణరాయల కొలువుముందు - దిగ్విజయభేరి దెసలు శబ్దించె, వైరి
కుంతములు వైరికాంతల కుంతలములు - కృత్తములుగాగుణించి పొంగిరట ప్రజలు.

వీరనృసింహ కృష్ణపృథివీపతి వేల్చినహోమధూమదు
ర్వారతమిస్రపుంజము పరంతపమై ద్రవిడావనీసభా
గారములందు మబ్బులను గ్రమ్మెను వైదికకర్మ లౌకిక
ప్రేరణ మయ్యె మంత్రవిధులేగద నిత్యము వృద్ధిమూలముల్.

శరదాగమంబు రాయల - హరిహస్తి భటాగమంబు నైక్యముగా, ది
క్పరిపాలసతులు తమపయి - నరు డెత్తిన భీతి మోమునన్ తోచె నన్.

పాండిమంబున తొల్లింటిపసలు డింది - అంచ రెక్కలు చాటుగ నణగినారు
మామహారాజుబాహాసి మలసికొన్న - ధళధళలలోన చూపులు దాచినారు.

* * * * *

చోళులు పాండ్యులున్ ప్రళయసూచి పరస్పరబద్ధమత్సర
జ్వాలలు గ్రక్కుచున్, సరభసంబున పోరుచునుండియున్, జయ

శ్రీ లభియింపమిం విసుగు చెందరు దక్షిణదేశ మల్లిక
ల్లోలములో స్పృశించుటకు దోసిన దన్నము నీళ్లు వేళకుం.

* *

అంతవర కొక్కమాటపై నరుల నడుము - పాండ్యులు కులీనతకు వేరుపడిరి చోళ
రాజు తలయూచినగ మధురాపతియగు - మొదటిపాండ్యుడు రారాజుపదముబట్టి

అభయమిడ వేడినాడు రాయలును గని - దక్షిణాపథ దిగ్జయతాండవమున
కాదిశుభసూచనంబుగా నలరి కొలువు - మానుటకుముందు నాగమనీనితోడ

"అన్నలు దమ్ములుం పగతురై ఒకచోళుని భేదసాధనల్
పన్నిన మాయలోనం బడి పాడయి తంజపురంబు ప్రాపులో
నన్నము నీరు ముట్టక యహర్నిశముం మనసు నెంచి 'ఆగడా
పన్నడు మమ్ము నోమగలవా' డని ఆశలనూరి పోవుటల్.

విన్నాము పాండ్యరాజును - గన్నా మత డభయామన్న గైకొన్నాముం
మున్నే తలచిన దిగ్జయ - సన్నాహమునందె దీనిసమయము నమరెం.

నాగమనాయడా, సమరనాట్యము సల్పుము చోళ రాజభూ
భాగమునందు తద్గుణవిభంగమునందును, పాండ్యసోదరో
ద్యోగమునందు కూడిక, మృదుత్వము, గూర్పుము భీతి మాకు న
భ్యాగతుడైన యీతనిస్పృహత్వము నిల్పుము, గొల్పు మాశలం.

తొలి జయభేరిని నీవే - పలికింపుము తంజనగరపరిసరములలో
తెలుగుసిరి విలసనాస్పద - జలజంబుల నాటవోయి శాశ్వతగరిమం.

మధురలో పాండ్యరాజు సేమముగ నిల్పు - కట్టుదిట్టంబు లొనరింప గలవు నీవె
మాయనుజ్ఞలు మాటలుమాత్ర మంతె - సర్వ మెరుగుదు మాకు ప్రశస్తి తెమ్ము."

అని రేడు పల్కుట నాలించి పొంగి - మిన్నంటె తనపేరుమీదె రారాజు
నిల్పుచున్నాడనే నిరసనపుఛాయ - తా నెరుంగకయె పై తవిలి క్రీడింప

కేల్మోడ్చి "దేవర, కృతకృత్యుడైతి - కాదనువాడనే? కంపింపచేతు
చోళభూపతి మీకు జోహారుసేయ - సెలవీయు"డని పోయె సేనాధిపుండు.

* * * * *

చోళు డడంగె పాండ్యు లొకచోన నిబద్ధులు; తంజపట్టణ
శ్రీలకు పాండ్యరాజ్యము భరించుటకుఁ దగువాడు తానె కా
బోలును; స్వార్థముఁ విడిచిపుచ్చగలేక మహీశవాంఛచే
కాలము దాపురించిన మొగంబున నీలిమ జిమ్మ కళ్లలో

గర్వమును నహంకారము కదలబార, "తాను గెల్చిన రాజ్యము గాన తానె
భూధవుడుగా ప్రవర్తింపబోలు" ననుచు - ఆంధ్రసమ్రాట్టునకు జాబు నంపినాడు.
తిరుగుబాటును చేయించి సేనచేత - రాజభక్తికళంకము రాజినాడు
పాడయిన చోళపాండ్యభూభాగములను - జయవిధానము తనపేర సాటినాడు.

* * * * *

కృష్ణరాయలమోము కెంజాయ మొలిచి- అతిరోషవృత్తతామ్రాక్షు డైనాడు
కోప మెన్నడు రాని గుణరత్నజలధి - నడిరేయివలె శబ్దనష్టమై కొలువు
మనుజులే లేనట్లు మాటుమణంగ - సభ్యులు జీవచ్ఛవంబుల ట్లొకట
కొయ్యబారినవారు, కొనకన్నులందు - ప్రాణాలతో నల్లబడిపోయినారు.
మంత్రితిమ్మరుసయ్యమాత్ర మారేని - ప్రక్కను కేల నొకపత్రికఁ బూని
నిశ్శ్వాసమూదుచు నిల్చియున్నాడు - దీర్ఘచింతామగ్న ధీశక్తియుతుడు.

వీరమనీడ! నీపిత లభించిన చోళులరాజ్య మేలగా
నేరుచునంట, తా గెలువ నేరిచినాడట, కాన రాజ్యముఁ
కోరుట మాయనుజ్ఞ గొనకుండనె, భావ్యమటంచు నెంచగా
నేరిచెనంట, జాబులును నేరిచెనంట తెగించి పంపగఁ.

తనబాహాబలదారితారిరమ సొంతం బంట మాయాజ్ఞతో
పని లేదంట, సమస్తసేనలకు మాపై భక్తి లేదంట, మే
మను తా నెట్టులో అట్టులే యగుట, మాపోష్యంబులో లేదుచో
ళునిరాజ్యం బికమీదనంట, కనవచ్చుఁ జాబు నీవే యిటఁ.

అని పల్కు రాయల ఆంతర్య మంత - గ్రహియించినట్లుగా కనుసన్న చేసి
"అప్పాజి" జాబు తా నందిచ్చినాడు - నిలువునీరైన వీరమనేని కపుడు.
నేత్రములు లేఖమీదనే నిలిపినాడు-కాని చూపాత్మలోనె విలీనమయ్యె
తండ్రి-రాజు-సేవాధర్మతత్పరతయు, హృదయమును ముట్టి మంటల నెగయుచుండె.

అంతలో రాజు సభ కలయంగ చూచి - "ఆన్నృపద్రోహిశిరమైన, అతనినైన,
బహుమతిగ మాకు నీగలవా శోకంపు-కొలువులో నున్న యీకత్తి గొను నతండు."
అని మహావేశమున మాట లాడినాడు - కత్తి ఝుళిపించి చూపించి కన్నుగొనల
నిప్పురంగుల వెలిగించి నిల్చినాడు - జీవములు లేని కొలువు శ్వాసించె నపుడు.
దొరకడకు నెవడు చనునొ చూతు మనువారు - ఒకరిమొగమును నొకరు చూచు
కొనువారు
పౌరుషము లోన మరగింప, బయటపడగ - సాహసింపనివారును సభికులెల్ల.

వీరమనీడు జాబు నట్లు వీచి, మహాద్భుతశాంతలోచనాం
భోరుహముల్ జ్వలింప, నృపమూర్తికి నంజలిబద్ధుడై అనెన్
కోరెను "కృష్ణభూవిభునకున్ రిపుడై మన తెల్గునాటికిన్
దూరగుడైన నాదు పిత దూరగుడే సుమి నాకు" నంచునున్.

"ఇత డీపనికి చాలునేమో" యనే ధృతి చూపట్టు నప్పాజిచూపులందు
"తండ్రి యంత యొనర్చె తనయువం"తను శంక చూపట్టు మొరగుల చూపులందు
"దేశభక్తులలోటు తెల్గుదేశంబున చూపట్ట"దను రాజుచూపులందు
నిజమైన భృత్యుడు నృపహాళి"కను మెప్పు చూపట్టు తజ్ఞుల చూపులందు
పరిపరివిధంబు సభలోని భావగణము-చూపులను చీల్చుకొనుచు చొచ్చుకొనిపోయె
మానమున రాజు వీరమనేనిచేత-కత్తి నిడె సభ్యులకును రక్తములు పొంగ.

* * * * *

"తెలుగుసామ్రాజ్య వైజయంతికలు నిల్పి - ద్రవిడరాడ్దుర్గములమీద తాండవించె"
నను యశస్సును పొందించి ఆంధ్రభువిని - భూతలస్వర్గ మనిపింపబోవునట్టి.

ఆంధ్రరాయలకును ద్రోహమాచరించి - కులము బలమును గుణమును కోలుపోయె
నా జనకు డన్న యపకీర్తి నాశనంబు - గానినా డేల వీరమనేని బ్రతుకు."

అని రా జిచ్చిన కత్తి కేల గొని నేత్రాంతంబులం దద్దికొం
చును సభ్యుల్ జయనాదముల్ సలుపుకొంచున్ కొల్వు చాలించి వెం
టను రా నించుక దవ్వు నాతడు దిగంతంబుల్ నివాళింప వె
ళ్లెను సేనానముదంచితుం డగుచు తండ్రిన్ పట్టి బంధింపగన్.

* * * * *

బభ్రువాహను డయ్యపై నెత్తి గెల్చుట యాగాశ్వమునకు పోరాడుకొనుట
అర్జునుం డింద్రుపై నడరి గెల్చుట తండ్రి సుతుని పరీక్షలో చూడ జనుట
ప్రహ్లాదు డయ్యపై పగ బూని గెల్చుట భక్తి మెచ్చిన విష్ణు పాలు గొనుట
అల మరుత్తుడు తండ్రి నాగి గెల్చుట దీక్ష విడలేక నాగుల వ్రేల్చ జనుట
తండ్రికొడుకులు పోరు యుద్ధములలోన - మునుపు దేశముపై రాజమూర్తిపైన
భక్తి కల దొక్కటేని కన్పడదు నేడు - తెల్గుచారిత్రమున కట్టిదియును కలదు.

నాగమనీడు పట్టుబడి నా డొక ఘోర మహాపరాధశి
క్షాగతి నంది నల్గురు మొగంబున తిట్టుచునుండ సిగ్గుతో
మూగనుబోలి జీవముల బొందియు చచ్చినవాడు దుఃఖదు
ర్యోగములోన డీల్వడి వయోధికుడయ్యు కృశించుచుండెడిన్.

జనకుని కష్టపున్ దశ విషాదము రేగిన చిత్తవృత్తి మూ
ర్ఛను కొలుపంగ నాతని ప్రసంగము నేస్తుఁతోడ తెచ్చు వాం
ఛను విననాడి డాసి కనుసాహసమున్ పొనరింపలేక పై
దును తన వెంటబెట్టుకొని తోడ్కొనిపోయెను రేనియొద్దకున్.

*　　*　　*　　*　　*

అది మహాసభ ద్రవిడరాజ్యాధికార-హరణమును ద్రోహబుద్ధిసంహారణ మొకట
కృష్ణదేవమహారాయ కీర్తి భేరి - మొరయు నొకట వీరమనేనివిరుదు లొకట.

"జయ మహారాజ, నీ విజయశంఖము మ్రోగిన దాంధ్రజాతి ది
గ్జయమును పొంది శాశ్వతయశస్సును గన్నది చోళపాండ్యరా
డ్జయమున లొంగి దక్షిణము సర్వము మిమ్ముల చక్రవర్తిగా
నయమున గోరుకొన్నది వినమ్రుడ స్వామికి భక్తియుక్తుడన్.

తండ్రిని పరాభవించిన తనయుడన్న - దుర్యశముతోడ బ్రతుకుట దుర్లభంబు
నాదు సేవకవిధి తీర్చినాడ దేశ-సేవయున్ చేసినాడ నా చేతకొలది.

అరుగో పాండ్యసహోదరుల్ భవదనుజ్ఞాపేక్ష నైరీక్ష్యభా
సురదృష్టిప్రతిబద్ధమాలికలతో జోహారు లర్పించుచుం
డిరిదే యీతడె చోళరా, జితడె తండ్రీ! యంచు నే పిల్వ నే
మిర పుత్రా యని చీరు నా గురుడు సుమ్మీ" యంచు నేత్రాంతముల్.

సలసల వేడినెత్తురులు చారలుగట్టిన నీటిబొట్లు బు
గ్గలపయి రాలుచుండగ నఖంబులమీటుచు క్రిందు చూచుచున్
తల పయికెత్తకే పలికి స్తబ్ధుడవోలె నిలంబడెన్ సభా
స్థలియు కరంగి బాష్పముల జార్చె నవెచ్చటి సానుభూతియో ?

పైకి గంభీరమై పరగును కడలి - లోలోన మరగి నురుంగులుకట్టు
అతడు రాజాధిరాజైన కావచ్చు - నరు డతండును గుండె నరునిదే కాదె

కాని గంభీరుండు కడలినిం బోలి - వీరమనే డన్న వృత్తాంత మంత
విన్నాడు ఊహించుకొన్నాడుగూడ - పార్థివుం డంతట పలికినా డిట్లు.

"మేము స్వయంబుగా వెడలమే యను కించ తొలంగ దిగ్జయ
శ్రీ మము కూర్చినావు పిత చేసినతప్పు తొలంగ భీమసం
గ్రామము చేసినావు రిపుఖడ్గములన్ విదళించి ముఖ్యులన్
క్షేమముగా సమక్షమున చేరిచినావు నుతింప శక్యమే ?

నీ దేశభక్తికి, నీ శౌర్యమునకు, నీ స్వామిభక్తికి, నీ వినమ్రతకు,
నే కాదు కవులు వర్ణింతురు నిన్ను - ఏ రాజ్యమునకునై యింతలు చేసె

నాగమనాయ డానందంబుతోడ - నా చోళరాజ్యంబు సకలాధికార
ములను మదాజ్ఞచే పొంది పాలింపు - తెలుగురాజులపేరు దిద్దింపు మచట.

నాగమనీడ ! నీ కొడుకు నాటిన దిగ్జయలాభవృద్ధి సం
యోగశుభాంతరంబున వయోధికునిన్ నిను రక్షసేయు చే
త్రోగతి రాదు నీ కొడుకుతో సుఖియింపుము పుత్రవైభవా
భోగములోననే మరచిపొమ్మిక పూర్వపు నీదువర్తనన్.

పాండ్యు లేవు రంతర్ద్వేషభావములను - చీలిపోయిన రాజ్యము చేరదీసి
మధురనే రాజధానిగా మనుచుకొనుచు - వీరి మన్నృపాల, సామంతవిధుల తీర్చి

సుఖముగా నుండ్రుగావుత చోళరాజు, ధన్వి, శౌర్యయుతుండు, ముదంబుతోడ
ఆంధ్రసేనాధిపతిగ మే మాచరించు - ఉత్తరదిగంతజయమునం దుండుగాక."

అని మహారాజు సింహాసనంబందు - కూర్చుండె "అప్పాజి" గొంతెత్తి సభకు
"తంజాపురీ రాజ్యదానోత్సవంబు - జరుగు నాయత్తమై చను దేరు" డనుచు

ఆహ్వాన మిచ్చినా డానంద మొక టె - నాటిసభాస్థలి నాట్యం బొనర్చె.

*  *  *  *  *

ఆదినము తంజపట్టణం బన్ని యెడల - కళలు పెంపొందనట్టి ముఖంబు లేదు
లలిత రాగాభిషిక్తవిలాసలక్ష్ము - లాశ్రయింపనియట్టి గృహంబు లేదు.

"అతడు మహాదాత అడుగకయే యిచ్చు విద్యానగర కృష్ణవిభుడటమ్మ ?
రాజుకై కొడుకు పరాభవించినతండ్రి నాగమనాయసేనాని అతడ ?
ఆయేనుగంబారియం దున్న యువకుడా మన కింక రాజుగా మాన్యు డగును ?
అతడె తిమ్మరుసయ్య అప్పాజిబాబంట తెలుగువారలు కొల్చు దేవగురుడు ?
మన మొనర్చినపూజల మహిమ గాక - ఈయపూర్వోత్సవానంద మేమిట నగు"
ననుచు సౌధగవాక్షాంత రాంతరముల - నిలిచి పలికెను ద్రావిడీనిచయ మెల్ల.

అది రాజ్యదానముకై నిర్మితంబైన దివ్యమంటప మందు దివిజులట్లు
పాండ్యసోదరులును, పండితుల్, కవులును, సామంతులును, సర్వసైన్యపతులు,
చోళుడు, తిమ్మరుసును, తక్కుపెద్దలు, కొలువు తీరిచి తెల్గుకుంభినీశు
వైపు చూచుచునున్నవారు వీరమనీడు దీక్షామహావస్త్రతేజములను
వెలుగుచున్నాడు సభ్యులకలకలములు - మిన్నుముట్టెను రాజుసమీపమునకు
ఘనకిరీటము నొక్కటి కరమునందు - పూని చిరునవ్వె వీరమనేనితలకు.

భూసురాశీర్వాదపూర్వకంబుగ వేదఘోషలు దిక్కుల కొనలు సాగ
పుత్రాత్పరాజయ పూతు డౌనాగన్న కన్నులహర్షాశ్రుకణము మూాగ
కావ్యనిర్మాణ సంకల్పసత్కవిపాళి కల్పన కొకదివ్యకథయు గాగ
చారిత్రమందు విశ్వాసాత్మకుండైన రాజభక్తుండని వ్రాసుకొనగ
ఆకిరీటము తగిలించి ఆంధ్రరాజు - "తంజనగరమహారాజ్యదానమునకు
ఈత డర్హుం డటంచు మే మెంచినాము - దాన మిడినాము మీకు సంతసము గల్గ."

అని జయశబ్దముల్ దెసల నల్లుకొనంగ వచించినాడు పె
ద్దన గళ మెత్తి ఆశుకవితామధువాగ్ఝరి నించి నవ్యరా
జ్యనియతు డైన వీరుని ప్రశంస యొనర్చెను—నాటిమాట నే
డును కనవచ్చు తంజపురిలోని సరస్వతిమంటప ప్రభన్.

# ఉత్తరరామచరితము కరుణరసప్రధానక మగునా?*

ఓలేటి వేంకటసుబ్బారాయశాస్త్రి గారు

భవభూతిమహాకవి రచించిన యుత్తరరామచరితనాటకమందలి ప్రధానరసము కరుణమా? లేక కరుణవిప్రలంభశృంగారమా? అనువిషయమును జర్చించుచు బ్ర. శ్రీ కేం. సుబ్బారాయశాస్త్రులు గారు భారతియం దిదివరలో నొక వ్యాసమును బ్రకటించిరి. ఆనాటకమందలి రసము కరుణవిప్రలంభశృంగారమేయని వారి సిద్ధాంతము. ఈసిద్ధాంతము సర్వసామాన్యముగ విద్యాధికులందఱు నంగీకరించినదే. శ్రీ శాస్త్రి గారును బాగుగఁ జర్చించి తమ వాదమునకుఁ బ్రబలములగు నుపపత్తుల నొసఁగియున్నారు.

కాని వారియభిప్రాయముతో నేకీభవింపని "వేంకటలక్ష్మీనారాయణు" లను నిర్వు రుత్తరరామచరితమునఁ గరుణమే ప్రధానరసమని వాదించుచు "నిష్కంటకనిరాఘాటఘంటాపథవినాశన" మ్మని విచిత్ర మగు శీర్షికతో శాస్త్రిగారి మతమును ఖండించుచు నొకవ్యాసమును కడచిన మార్గశీర్ష మాసపు భారతీసంచికయందుఁ బ్రకటించిరి. ఆమూలాగ్రము వీరివ్యాసమును బరికించినచో వీరు శాస్త్రిగారి వ్యాసమును బూర్తిగ జదివినట్లుగాని, చదివియేయున్నచో నర్థము చేసికొనినట్లుకాని కన్పింపదు. వీరి సందేహముల కన్నింటికిని శాస్త్రిగారి వ్యాసములోనే సమాధానములు కలవు. వానిని వివరించుట చర్వితచర్వణమే యగును. ఐనను వారికి సమాధానము వ్రాయఁ దలఁపుకల్గుటచే వానినిగూడఁ గొన్నింటి గ్రహింపవలసివచ్చును.

కరుణరసవాదులు పదునెనిమిది యుక్తులు మాపుచున్నారని చెప్పి శాస్త్రిగారు వాని కన్నింటికిని సమాధానములువ్రాసిరి. అందుపై వీరు కరుణరసవాదులకుఁ బదునెనిమిదియేకాక యంతకన్న ఎక్కువగాఁ గారణములు కలవనియు ౧౭ యే యని శాస్త్రిగారు వ్రాయుట తప్పనియు వ్రాసిరి. ఏమిఖండనము; ఎంతటియుక్తి? వీరు శాస్త్రిగారిచ్చిన ౧౭ సమాధానములను విమర్శించుచు "౧, ౨, ౩, యుక్తులకుఁ జెప్పిన సమాధానములు మాకు విప్రతిపన్నములుకావు. ౫, ౬, ౭, ౮, యుక్తులు వ్యాప్తినిశ్చయసంపాదకములు కావన్నమాట మేము నంగీకరించినదే. ౯వ యుక్తి మా కుపపన్నమే. ౧౦వ యుక్తియొక్క సమాధానముకూడా మేమంగీకరించినదే" అనుచు అన్నింటిని ఇట్లే తప్పించి యంగీకరించియే యున్నారు ఇఁక వీరు ఖండింప మిగిలినదేమో తెలియరాదు. ఇట్టిగో శాస్త్రిగారి కరుణరసప్రధానవాదిమత యుక్తిసంఖ్యాగణనానౌచిత్యమును లెక్కించుట యెంతవఱకు సమంజసమో పాఠకు లెఱుఁగకపోరు.

ఇఁక వీరికి విప్రతిపన్నములుకాని శాస్త్రిగారి యుక్తులను గొంచెము చర్చింతిము.

(౧) "యది పున రియం కిం వదంతీ మహారాజం ప్రతి స్యందేత తతః కష్టం స్యాత్" అను సూత్రధారవచనముబట్టి భావివిప్రయోజనము సూచింపఁబడుచున్నదను కరుణరసవాదుల యుక్తి ఖండించుచు శాస్త్రిగారు "ద్వ్యాసతశ్చర్య పరిమితవిప్రయోగమే యీ కష్ట" మని చెప్పుచు నిది కరుణసాధకముకాదని వ్రాసిరి. మఱియు "సర్వథాఋషయో దేవతాశ్చ శ్రేయో విధాస్యంతి" అను నటవచనము పునస్సమాగమాశను సూచించుచున్నదనియును వ్రాసిరి. కరుణరసవాదులగు వేం. ల. నా. లకిట్టి యెడ శాస్త్రిగారి వచనము లుపపన్నములే యగుట వింతగా నున్నది.

రెండు, మూఁడు నెంబర్లుగల యుక్తులను వేం. ల. నా. ల యుత్తరపదము నొకేరీతినుండుటచే నా చెప్ప వలసినమాటకూడ నొకరీతియేయగుట తప్పక్పలో పని లేదు.

* కలగూరగంప చూచునది.—సం. భారతి.

వీరు నాల్గవయుక్తిని విమర్శించుచు "అద్యావసితం జీవితప్రయోజనం రామస్య" అనుచోఁ బ్రయోజనపదమున కేదో యపూర్వార్థ మిమిడియున్నదనియు శోకభారమునే వెల్లడింపవలెనన్న "అద్యావసితం జీవిత"మ్మనియే వ్రాసియుండును. అట్లుకాక జీవితప్రయోజన మ్మనుటచేఁ దన జీవితమునకుఁ బ్రయోజన మగు జానకీసమాగమము నేఁటితో సమాప్తమనియు, జీవితాంతమువఱకు జానకీవియోగమునకు సాంధికత్వము లేదనియుఁ దెలియఁబడుచున్నది" అనియు వ్రాసిరి. కాని వీరియభిప్రాయము సరిగా లేదు. ప్రయోజనపదప్రయోగము వీ రనుకొనిన యర్థముకంటె విపరీతార్థమునే కలుఁగఁజేయు సమర్థముగ నున్నదని వాదించు వారలకు వీ రేమని సమాధాన మిత్తురో? చూడుఁడు: రామునికిఁ బునఃప్రాప్త్యాశ లేనిచో "అద్యావసితం జీవిత" మ్మనియే ప్రయోగించియుండునుగదా? రామునికి సీతతోడిదే జీవితము. సీతాప్రాప్త్యాశ లేనిచో జీవితమే పరిసమాప్తమగును. సీతారాముల గాఢైక్య మిందుఁ బ్రతిధ్వనిత మగుచున్నది. ఇఁక "జీవితప్రయోజన" మ్మనుటచేతనే "అస్య జీవితప్రయోజన మవసిత" మ్మనియు, ముందు ప్రయోజనము కలుగవచ్చుననియుఁ గరుణవిప్రలంభమునకే ప్రయోజనపదప్రయోగము సాధకముకాఁగలదు. "అద్యజీవితమవసిత" మ్మనినచో నిరాశ సువ్యక్తము కాగలదు కదా? అట్లుకాక "ప్రయోజన" మ్మనుటచే వారి మతమునకే విరోధము కలుగును. ఇఁక ప్రయోజనపద ప్రయోగలాభ మింతతోఁ బూజ్యమైనది.

మరియు "శైశవాత్ప్రభృతి" ఈ మొదలైనవానిచే రతిసంస్పర్శములేని శోకమే నిరూపింపఁబడుచున్న దను కరుణరసవాదమును ఖండించి శాస్త్రిగారిదియంతయు సీతాపరిత్యాగపూర్వవృత్తాంతమే కావునఁ గరుణసాధకముకాదని వ్రాసిరి. దానిపైనున్న శిరిఖండనమున కరుణవాదులయుక్తి భావిసీతామరణసంభావనోపష్టంభకము కానిచో విప్రలంభమునకే యుపకరించునుకదా? మరియు నచట భ్రాంతిపడినది వేం. ల. నా. లే కాని శాస్త్రిగారుకాదని వారి వ్రాఁతఁబట్టియే తెలియును. ఇట్లు వీరి నాల్గవయుక్తి ఖండనము ముగిసినది. ఇఁక నాపైని విమర్శింతము.

'౫, ౬, ౭, ౮ నెంబర్లుగల యుక్తులు మృతత్వనిశ్చయసంపాదకములు కావన్నమాట మేము నంగీకరించినదే. కాని మృతత్వనిశ్చయములేనప్పుడు కరుణరసము కానేర దను శాస్త్రిగారి యూహ నిరాధారమని ముమ్ముందు నిరూపింతుము' అని వారు వ్రాసిరి. ఇటఁ గొంచెము విమర్శింతము. శ్రీ శాస్త్రిగారియుక్తులేమో వారికి నచ్చినవఁట. కాని మృతత్వనిశ్చయము లేనపుడును, కరుణము ప్రధానరసము కావచ్చునఁట. అదియెట్లు సరిపడునో తెలియకున్నది. ఏరసమైనను ప్రాధాన్యమును బొందవలసినపు డాద్యంతములు రెంటియందును (ముఖనిర్వహణములయందు) సువ్యక్తముగఁ బోషింపఁబడవలెను. రత్యాదులు స్థాయిభావము లగునపుడే వాని కంగిత్వము సిద్ధించును.

"సజాతీయై ర్విజాతీయై రతిరస్కృతమూర్తిమాన్;
యావద్రసం వర్తమానః స్థాయీ భావః ప్రకీర్తితః."
(దశరూపకమ్.)

"భావస్య స్థాయిత్వం నామ సజాతీయవిజాతీయానభిభూతతయా యావదనుభవ మవస్థానమ్."
(ప్రతాపరుద్రీయం.)

ఈ నాటకమున ముఖనిర్వహణములందు శృంగారమే నిరూపింపఁబడియుండుటఁ గరుణము ప్రధానము కాఁజాలదు. మృతత్వనిశ్చయమున్నపుడు కరుణను కరుణమేరసమని చెప్పవలనుపడదు. తొలుత మృతత్వనిశ్చయజ్ఞానమున్నను, పిదప కారణాంతరములచే సంగమము కలిగినయెడ నపుడు కరుణముకాక శృంగారమే ప్రధానరసమగుచున్నది.

"స్త్రీపుంసయోస్తువియోగే జీవిత్వజ్ఞానదశాయాం వైక్లబ్యపోషితాయా రతేరేవ ప్రాధాన్యాచ్ఛృంగారో విప్రలంభాఖ్యో రసః వైక్లబ్యంతు సంచారిమాత్రం. మృతత్వజ్ఞానదశాయాంతు రతిపోషితస్య వైక్లబ్యస్యేతి కరుణఏవ. యదాతు సత్యపి మృతత్వజ్ఞానే దేవతాప్రసాదాదినా పునరుజ్జీవనజ్ఞానం కథంచిత్ స్యాత్ తదాలంబనస్య ఆత్యంతికనిరాభాసాభావా చ్చిరప్రవాస ఇవ విప్రలంభఏవ, న సకరుణః." (రసగంగాధరః.)

ఈమీఁది పండితరాజవచనము మీఁది యభిప్రాయమునే యుద్ఘోషించుచున్నది. కాన మృతత్వజ్ఞానమున్నపుడే కరుణము ప్రధానము కానపుడు, మృతత్వజ్ఞానము లేకపోయినపుడును కరుణమే రసమనుట యెట్లో తెలియకున్నది

ఇంతియొకవింత; మీఁది వేం. ల. నా. ల వ్రాఁతనుబట్టి వారు మృతత్వనిశ్చయజ్ఞానము లేనట్లొప్పుకొనిరి. కాని రామునికి సీతామృతత్వనిశ్చయజ్ఞానమే కలదను వారి వాదమునకే విరోధము కలుగును. దానిని వారు గమనింపలేదేమో?

"........తొమ్మిదవయుక్తికి శ్రీశాస్త్రిగారిపై యుక్తి మృతత్వనిశ్చయసంపాదకము కాఁజాలదనుట మా కుపపన్నమే" అని. వేం. ల. నా.లు దానిని గూడ నంగీకరించిరి. ౧౧ వ యుక్తికి సమాధానముకూడ మేమంగీకరించినదేయని వ్రాసిరి. కాన వానిని జర్చించుట మనపనికాదు.

౧౧ వ యుక్తివిషయమై వ్రాయుచు
"ఉపాయానాం భావా దవిరళవినోద వ్యతికరైః
................ . ...............
................. ..............
............నిరవధి రయంతు ప్రవిశయః"

అనుచో శాస్త్రిగారు "ఇట రామునికిఁ బ్రాప్త్యాశ లేకపోలేదని వ్రాసిరి. కాని కారణము చూపకపోవుటచే నించుకంత జ్ఞానముకలపాఠకులకైనను వీరిసమాధానమునందు నీళ్లు......రని విశదము" అని వేం. ల. నా. లు వ్రాసిరి. తక్కినయుక్తులకు శ్రీ శాస్త్రిగారు సరియగు సమాధానములను చెప్పిరని వీరొప్పుకొనుచునేయున్నారు. ఈయొక్క దానికిని చెప్పకపోవుటచేతనే శ్రీశాస్త్రిగారినధిక్షేపించిరి. కాని శాస్త్రిగారన్నింటికివలె దానికిని యుక్తివ్రాసినారు కాని వ్రాయలేకపోలేదు. ఒకవేళ శాస్త్రిగారు దీనికిఁ దగినయుక్తిని వ్రాయలేదనుకొనుఁడు. ఐనను వేం. ల. నా.లు శాస్త్రిగారియుక్తులకు సమాధానములను పరుసనెంబర్ల రీతిని వ్రాయుచు ౧, ౨, ౩, సమాధానములు తమకు విప్రతిపన్నములు కావనుటలో సమాధానములిచ్చిరి. తమవఱకువచ్చినఁ దగవుండదనుకొందును. మరియు వేం. ల. నా.లు శాస్త్రిగారి వాక్యములఁ బరస్పరవిరోధముగలవనినుడివిరి. దానిని గొంత పరిశీలింతము.

నిరవధిపదమునకు విరహావసానకాలసంభావనకవకాశము లేదని శాస్త్రిగా రర్థము వ్రాసి యాపై "ఇట రామునకు ప్రాప్త్యాశ లేకపోలే" దని వ్రాయుటచే పరస్పరవిరోధ మనుకొనిరి. కాని వీరు నిరవధిపదమునకర్థము సరిగా బోధపఱచుకొనినట్లు తోచదు. నిరవధియనఁగా జీవితాంతముండునని యర్థము కాదు. ఈ విరహ మింతకాలముండునని యూహించుటకు వీలులేనిది. అనగా నేఁడే పోవచ్చును, లేనిచో మరి కొన్ని నాళ్లకు పోవచ్చును. ఇట్టిచో ప్రాప్త్యాశయుండుటకేమి విరోధము? మరియు నిట ప్రాప్త్యాశ లేదనియే యనుకొనుఁడు. అంతటితో ప్రాప్త్యాశ యంతరింప నేరదు. చూడుఁడు: ఒకఁడొక విషయమై ప్రయత్నింపవచ్చును. అప్పటి పరిస్థితులంబట్టి తన దురదృష్టమున నిరాశ కల్గి ప్రాప్త్యాశ యంతరింపవచ్చును. కాని మరికొంచెము కాలమునకు నప్పటిపరిస్థితులంబట్టియో, యదృష్టముం బట్టియో ప్రయత్నము ఫలించు సూచనలు కన్పడినపుడు ఆశ యుండునా, ఉండదా? అట్టిచో మనరాముని పాపమేమి? అతనికట్టి ప్రాప్త్యాశ యుండఁగూడదా?

మరియుఁ బ్రస్తుతప్రాప్త్యాశ లేనిమాత్రమున కరుణమే యనినచో శకుంతలాప్రాప్త్యాశ దుష్యంతునకు నంగుళీయకదర్శనానంతరముగూడ లేకున్నను నిర్వహణము సుఖాంతమగుటచే శృంగారరసప్రధానక మగు శాకుంతల నాటకముకూడ కరుణరసప్రధానకము కావలసివచ్చును.

పండ్రెండవ యుక్తివిషయమున గొంత విమర్శింతము.

"ఏకోరసః కరుణ ఏవ", "పుటపాకప్రతీకాశో రామస్య కరుణోరసః" అనుచోట్ల కరుణపదముండుటచే కరుణమే ప్రధానరస మని వీరి యూహ. కరుణపదప్రయోగమాత్రముననే వీరికి కరుణము ప్రధానమైనచో "సర్వథా సఏవ భగవా ననేకవారపరికల్పితో విప్రలంభః పునః పున రనుబధ్నాతి మామ్" అనుచోఁగల విప్రలంభపదప్రయోగముచే

విప్రలంభము ప్రధానమని యేల చెప్పఁగూడదు" ఇట్లు పదప్రయోగమాత్రముననే ప్రధానరసము నిర్ణయించుట పాడికాదు. అట్లేయయినచో శృంగారపదప్రయోగము గల చోట్ల నాపదముచేతనే శృంగారప్రధానక మనుట యుక్తమా? "విప్రలంభపదమునకు వీరరాఘవాచార్యులు భ్రమయని యర్థము వ్రాయుటచే దానివలన విప్రలంభము ప్రధానరసముకా"దని వ్రాసిరి. భావప్రకాశికాబోధికా వ్యాఖ్యలలో విప్రలంభపదమునకు విప్రలంభశృంగారమనియే యర్థము వ్రాయుటచే దీనిపై వీరేమి సమాధానింతురో?

మరియు వీరు "వ్యంజకములగు విభావాదులచే రసము వ్యక్తమగునపు డారసము స్వశబ్దముచే చెప్పకూడదు గాని, ఇచట చెప్పినను సమనాఖ్యాకోవ మెట్లుతగులు" నను నభిప్రాయమును వ్రాసిరి. వారు విభావాదులు లేవని యూహించిరి కాబోలు. ఉన్నపుడిచట దోషము తగులునా? తగులదా? "అట్లయిన కరుణపదము కరుణవిప్రలంభపరమని నపుడుకూడా దోషము తగవసమే. ఇటఁ గరుణవిప్రలంభమే రసమని యొప్పుకొన్నను వ్యంజకములగు విభావాదులచే నీరస మభివ్యక్తగుగును. పిదప నీ విప్రలంభమునే బోధించు కరుణపదముచే కరుణవిప్రలంభమును స్పష్టముగ బోధించుటచే రసమునకు స్వశబ్దవాచ్యత్వము కలుగదా" యని యందురేమో? కరుణవిప్రలంభమనుకొనినచో దోషమెట్లును తగులదు. బోధ్యత్వవాచ్యత్వములు సమానములా? బోధ్యత్వము వృత్తిసామాన్యనిష్ఠధర్మము. వాచ్యత్వమన్ననో అభిధామాత్రనిష్ఠము. "గంగాయాంఘోషః" యనుచో గంగాపదముచే బోధ్యమగు తీరము వాచ్యమేయని తలంతురా? కరుణపదమునకు విప్రలంభపదానువృత్తిచేసిగాని కరుణవిప్రలంభార్థము చెప్పకూడదని వారియభిప్రాయము. కాని పదాంతరానువృత్తి యుండినగాని కరుణపదమునకు విప్రలంభార్థము చెప్పరాదని యేయాలంకారికులైన నియమించిరా? కావున యిట కరుణవిప్రలంభమే ప్రధానరసమగుటచే ఏదోషములు కలుగనేరవు.

(శ్రీ) వేం. ల. నా. లీ 12వ యుక్తివిషయముయిరే వ్రాయుచు "రామునికిఁ బునస్సమాగమాశలేమిని రతినశించినదనియు, శోకమే యంగియగుచున్నదనియు, కరుణరసవాదు లుద్ఘోషించుచుండ శాస్త్రిగారది పెడచెవి నిబెట్టి తమపట్టువీడక, ప్రమాణములు చూపక, రతియున్నదని చెప్పుచు శోక మంగికాదనుట యసమంజసమనియు, కరుణరసవాదులు భావిసంప్రయోగనిశ్చయము రామునికి లేదని చెప్పుచుండ రతి నశించుటకు హేతువులేదని సమాధానముచెప్పుటయు నసంగతము" అని వ్రాసిరి.

భావిసంప్రయోగము కలదనుటకును, రతికలదనుటకును శాస్త్రిగారు యుక్తులు చెప్పియేయున్నారు. కాని వానినిజూడకనో, చూచియర్థము చేసికొనఁ జాలకనో వేం. ల. నా. లు "ప్రమాణములు చూపక" అని నిరాటంకముగ, నిశ్శంకముగ పల్కిరి. అందువారికి శాస్త్రిగారి యుక్తులు కనుపింపకున్న దత్పూర్వాత్మముల నీక్రిందవ్రాయఁ జాతురుగాక!

(౧) సీతారాముల పరస్పరానురాగ మనన్యసామాన్యము. అనితరవేద్యము. కావుననే తృతీయాంకమునఁ దమసతో "అహంఎవ్వ ఎదస్సహి అఅం జాణామి, మమవి ఏసో" అని సీత పలుకును. షష్ఠాంకమున రామునితోఁ గుశుఁడు రామాయణములోని శ్లోకద్వయమును జదువుచు "హృదయాన్యేవ జానాతి ప్రీతియోగంపరస్పర"మ్మనెను.

మఱియుఁ దృతీయాంకములో నాత్రేయితో వాసంతి

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి,
లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మర్హతి.

అనిచెప్పెను. వీనివలన రతియున్నట్లు తెలియుటలేదా? రామునకు మునులయెడ నమ్మకమున్నట్లు

"లౌకికానాంహి సాధూనా మర్థం వాగనువర్తతే,
ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి"

అను రామునిమాటంబట్టి తెలియుచున్నది.

వశి.- తత్కిమన్యదాశాస్మహే,
కేవలం వీరప్రసవా భూయాః.
ఋష్య. -తత్పుత్రపూర్ణోత్సంగా
మాయుష్మతీం ద్రక్ష్యామః.

తృతీయాంకమున వాసంతి రామునితో "అసనిర మరసింధుః.........మంగళాయ"

అని చెప్పినది. దీనింబట్టి రామునికిఁ బ్రాప్త్యాశ కలదనుట సర్వానుభవసిద్ధము. (మఱియు రామునికి సీతాజీవితత్వనిశ్చయ జ్ఞానమున్నట్లు మున్ముందుప్రమాణములు చూపఁబడును.) అట్టిచో రామునికిఁ బ్రాప్త్యాశ లేదని చెప్పుట కెట్లు వీలగును ?

రామునికిఁ బ్రాప్త్యాశ కలదనుటకు లోకానుభవమును గొంత గమనింపుఁడు.

ఒకఁడు తనభార్య విషయమున లోకులు తప్పుతలంచుచుండ దానిని సహింపలేక యతఁడామె నింటినుండి పంపివేసెననుకొనుఁడు. కాని యామె యందెట్టిదోషమును లేదని తానెఱుఁగును. తనభర్తయెడ నేమియుఁ దప్పులేదని భార్య హృదయమున్నార్తిగ నెఱుఁగును. అయి రువురికి నొకరిపై నొకరికిఁగల యనురాగ మెన్నటికైన నంతరింపఁగలదా?

భార్యామృతత్వ నిశ్చయజ్ఞానము లేనియపుడు భర్తకుఁ దత్ప్రాప్త్యాశ యుండకుండునా? నశింపఁగలదా? ఎప్పుడైనను లోకము యథార్థమును గ్రహించినచో నతనిభార్య యతనికి మఱల దక్కకపోవునా? అట్టిచో బ్రాప్త్యాశ యెట్లును నశింపదని తప్పక చెప్పనచ్చును.

మఱియు సీతాజీవితత్వనిశ్చయముంగూర్చియు, రామునికిఁగల ప్రాప్త్యాశంగూర్చియు ( ) శాస్త్రులుగారికిని నాకును జరిగిన సంభాషణ నిటఁ గొంత వివరింతును.

నేను—శాస్త్రులుగారూ, రామునికి సీతాజీవితత్వనిశ్చయజ్ఞానముకలదనియే మీయభిప్రాయమా ?

శాస్త్రి—అవును. అదియే నానిశ్చయము.

నేను—రామునికి సీతామృతత్వనిశ్చయము లేదనియే యంగీకరింతుము, కాని జీవితత్వనిశ్చయజ్ఞానముకలదని మే మంగీకరింపమని విమర్శకులు లనుచున్నారే !

శాస్త్రి—రామునికి సీతాజీవితత్వజ్ఞానమే యున్నట్లీక్రింది ప్రమాణములు చూపఁగలను.

౧. రా. ౩—"స్పర్శః పురా.........పున రాతనోతి" సఖులు పత్నిలయో కేవ్యాఽభ్యుపపన్నో ఽస్మి.

౨. "ఆలింపన్నమృత............తనోతి మోహమ్."

ఇంతియకాక "హాహా దేవి స్ఫుటతిహృదయ"మ్మను శ్లోక వ్యాఖ్యానమున కరుణరసవాదియే యనఁదగుచున్న వీరరాఘవాచార్యులుకూడ,

"కథంయస్సభాగ్యః కరోమి=కిం హృదయస్ఫోటాదినా నివారయామి. ఉత త్వదాగమనార్థం లోకాన్ననునయామి, అథవా తాన్ నిగృహ్య త్వా మానేష్యామివేతి భావః." అని వ్రాసిరి.

మరియు భావార్థబోధికయందుఁ గూడ "ప్రియతమాప్రాప్తా కమపాయ ముపలంభే నజానామీతి భావః" అని వ్రాయఁబడియున్నది. ఇయ్యవి సీతాజీవిత్వనిశ్చయమును దెలియఁజేయఁజాలవని యెవరైన ననుకొందురా?

మఱొకమాట:—సీతాజీవితత్వనిశ్చయజ్ఞానము రామునికి లేదనియే యనుకొనినను, మృతత్వనిశ్చయము మాత్రము లేదని వారుకూడ నంగీకరించియేయున్నారుకదా ? మృతత్వనిశ్చయము లేనపుడు, బ్రతికియుండుట సందేహమగునపుడు, సీత బ్రతికియున్నపుడేకాని మఱొకపుడు చేయవీలులేని హిరణ్యప్రతికృతికరణము సీత బ్రతికియేయున్నదని చెప్పకుండుటెట్లు ? ధర్మశాస్త్రవచన మెట్లున్నదో గమనించితిరా ?

" యస్యభార్యా విదూరస్థా పతితా దూషితాఽపివా;
అనిచ్ఛుః ప్రతికూలా వా తస్య ప్రతికృతిః క్రియా ".

బ్రతికియే లేనపుడీ శాస్త్రము ప్రవర్తించు టెట్లు?

నేను—అట్లయైన "క్రవ్యాద్భిరంగలతికా నియతం విలుప్తా"అని యున్నదే. అందు సీత మరణించినట్టు స్పష్టముగఁ జెప్పఁబడినదిగదా?

శాస్త్రి—దానింబట్టి రామునికి మృతత్వసంభావన యున్నట్లు తెలియఁబడువని నేను వ్రాసియేయున్నాను. సంభావనమున దోషమేమి కాదా ? "అతిస్నేహః పాపశంకీ" అను న్యాయమున రామునికిఁ గల యనురాగమే

యట్లు పలికించినది. ఇంకను, ఇచట 'విలుప్తా' అనుదానికి 'మృతా' అనియే యర్థము చెప్పినచో "జీవయన్నక స్మాత్" అనుచోట 'జీవయ'న్నన జీవింపఁజేయుచుననియే యర్థము చెప్పవలసియుండును. అట్లు చెప్ప వలనుపడదు కదా! కాన సీతావిముక్తుండగు రాముఁ డెట్లు మృత ప్రాయుఁడో రాముఁడులేని సీతకూడ నట్లే మృతప్రాయ యగుట "నియతం విలుప్తా" అని చెప్పబడినది.

నేను—అట్లయిన వేం. ల. నా. లు వ్రాసిన "రామునకు సీతామృతత్వనిశ్చయమునులేదు, తజ్జీవిత్వ నిశ్చయమును లేదని చెప్పి తీరవలయు"ననుమాటకు సామంజస్య మెట్లు కలుగునో తెలియదు.

శాస్త్రి—ఇదియును గాక జీవిత్వనిశ్చయము లేని యెడఁ బ్రాప్త్యాశకుఁ గారణాంతరము లేనందున నది లేకపోగాఁ బ్రాప్త్యాశచేతనే నిర్వహింపఁదగిన గర్భ సంధికే విచ్ఛేదాపత్తి కలుగును. కాన నిటఁ బ్రాప్త్యాశ యుండి తీరవలయునని నేను నా వ్యాసమున వ్రాసి యున్నాను.

నేను—అందులకు వారుకూడ నంగీకరించుచున్నారు. ప్రాప్త్యాశయుండవలెనఁట కాని నాయకునికే యుండ నక్కరలేదఁట! మరి యెవ్వరికైన నుండవచ్చునఁట! ఇచట తమసామురళల వాక్యములచేఁ గవి దాని నన్వేషించినాఁడఁట! కాన నాయకునికిఁ బ్రాప్త్యాశ లేదఁట!

శాస్త్రి—ఎవరివాక్యములచేతనైననేమి? రాముని చేఁగానిండు; తదితరులచేఁగానిండు. ఆ యెవరివాక్యముల చేతనైనను రాముని ప్రాప్త్యాశ నిరూపింపఁబడినదా లేదా? రామునికిఁ గాకున్న తక్కినవారికిఁ గలుగు టెట్లు?

నేను—అయితే రామునికే ప్రాప్త్యాశ కల దన్న మాట.

శాస్త్రి—నిశ్చయముగ నంతే. మఱియు నెవరికో యొకరికి ప్రాప్త్యాశయున్నమాత్రమున గర్భసంధినిర్వాహకమను నీమహాశయులు, ఎవరికో యొకరికి సీతాజీవిత్వ నిశ్చయజ్ఞానమున్నదని వారంగీకరించి కరుణవిప్రలంభమే రసమని యేల యూహింపరాదో?

నేను—మీరు విప్రలంభకరుణములగూర్చి చెప్పు నపుడు మీమాటకే విరోధము కలిగినదని విశాలకవారు లనుచున్నారు. మీరుచెప్పిన లక్షణమేమి?

శాస్త్రి—"యత్ర త్వేకస్మిన్విపన్నే ఽన్యో మృతికల్పే ఽపి తద్గతమ్, నాయకః ప్రలపేత్ప్రేమ్ణా కరుణోఽసౌస్మృతో యథా" అని కరుణవిప్రలంభమనియంటిని. కాదంబరి యందు మహాశ్వేతకును, కుమారసంభవమున రతికిని ఇష్ట జనమరణమున్నను, చంద్రమండలాంతర్గతపురుషవాక్య శ్రవణముచేతను, ఆకాశవాణీవాక్యశ్రవణముచేతను, భర్తృజీవిత్వనిశ్చయముకలిగి పునస్సమాగమాశ జనించుటచే వారి నాశ్రయించిన రసము కరుణవిప్రలంభమే యగును. రఘువంశమున నజప్రలాపమున నిట్టియవస్థాభేదము లేనందున నటఁ గరుణమేకాని శృంగారస్పర్శము లేకుండుటచే విప్రలంభము కాదు.

నేను—సరియే, కాని పిదప మీరు మఱియు నలంకారశేఖరాదిగ్రంథములందు "స్యాదేకతరపంచత్వే దంపత్యోరనురక్తయోః, శృంగారః కరుణాఖ్యోఽయము జన్యేన రతేరిహ" ఇత్యాదికముచే మృతత్వజ్ఞానమున్నను, పశ్చాత్సమాగమము లేకున్నను గూడఁ గరుణవిప్రలంభశృంగారత్వ మంగీకరింపఁబడి యున్న"దని వ్రాసినారఁట? దీనిచే నజునికి నాలంకారికులందరు నైకకంఠ్యముగఁ గరుణమే కల్గునని వ్రాయుచున్నారను మీ మాటంబట్టి యైకకంఠ్యము కుదురలేదఁట!

శాస్త్రి—మంచిదోషమే యెంచిరి. అలంకార శేఖరమున నజునికిఁ గల్గురసము కరుణవిప్రలంభమే యని వ్రాయఁబడనిండు. ఒక్కపుస్తకములోనే యట్లుండుటవలనను, తక్కినవానిలో కరుణమేయని యుండుటవలనను, అలంకారికులందఱును రఘువంశమున నజునివిషయమునఁ గరుణరసమేయని చెప్పిరని సామాన్యముగఁ జెప్పితిని. ఇట్లగుట లోకసిద్ధము. మఱియు నలంకారశేఖరమున నట్లు వ్రాయుట మాకు మీఁదుమిక్కిలి యుపయోగకారియగును. ప్రాప్త్యాశయున్నపుడు విప్ర

లంభమనికదా మాయూహ! అట్టిచోఁ బ్రాప్త్యాశలేక మరణనిశ్చయమేయున్నను విప్రలంభమునే యంగీకరించు శేఖరకారుఁడు మాకు విరోధించు టెట్లు? అతని మతమునఁ గరుణమున కిట్టిచోఁ దావే లేదే.

ఇంక వ్యాఖ్యాతలు కరుణరసమే ప్రధానమని వ్రాసినా రనుదానింగూర్చి కొంచెము విమర్శింతము. భవభూతిని వీరరాఘవాచార్యుఁడు పొగడినాఁడని వేం. ల. నా. లు వ్రాసిరి. కాని భవభూతియందతనికి గౌరవమున్నచో "అత్ర" "అనేన" ఇత్యాదులు ప్రయోగించి యుండఁడు. అదిగాక మొదటినుండియు దిట్టిన తనవ్యాఖ్య చూచువారుండరని మొగమెదుట మంచిమాటలాడి చివరకు గోముఖవ్యాఘ్రమై యంకము చివర నొక్కొక వాడికోల నిర్మించినాఁడు! ఇఁక ఇతనికిఁగల గౌరవము నిర్ణయించు టెట్లు? మరియు చాలమంది వ్యాఖ్యాతలు కరుణవిప్రలంభమనియే వ్రాసియున్నారు.

౧౮ వ యుక్తికి వ్రాసిన సమాధానము తమకు విప్రతిపన్నముకాదని వేం. ల. నా. లు వ్రాసిరి. కాని కరుణవిప్రలంభవాదు లగు వేంకటరాయశాస్త్రులుగారి వ్యాఖ్య వీరికెట్లు విప్రతిపన్నము కాదో తెలియకున్నది.

౧౯ వ యుక్తివిషయమై కొంచెము వ్రాయుదును. 'ఏతత్కృతికారుణ్యే' అను గోవర్ధనునిమాటలో కారుణ్యపదమునకుఁ గరుణరసమేయని యర్థము చెప్పుట కంతటి సామంజస్యముండునో, కరుణవిప్రలంభమునకుఁ గూడ, నంతటి యవకాశముండకపోలేదు. అసలు నాపదము సందిగ్ధముగా నున్నది. అది ప్రాధాన్యతను గాని యప్రాధాన్యతను గాని నిశ్చయముగఁ జెప్పఁజాలదు. మరియు విప్రలంభవాదులకు భావభూతార్థబోధినీవ్యాఖ్యాకర్త "అశ్వేదంర క్షోభిః......... అపిగ్రావారోదిత్యపిదళతి వజ్రస్యహృదయ"మ్మను శ్లోకవ్యాఖ్యానమున "విప్రలంభే భవభూతివర్ణితేన రామకృతశోకేన గ్రావసదృశానాంకఠినహృదయానాం రసానభిజ్ఞానా మపి శోకోద్దీపకతా కవినైపుణ్యప్రకాశికా వ్యజ్యతే" అని వ్రాయుచు గోవర్ధనుని మీఁదిశ్లోకము వ్రాయుటచే నది విప్రలంభసాధకమని చెప్పినను దోషము లేదు.

ఇదివఱలో రామునికి సీతాప్రాప్త్యాశ యున్నదని నిరూపింపఁబడుటచే శృంగారతిలకలక్షణము విప్రలంభవాదుల కనుకూలమేయగును.

"ఇష్టనాశాత్" అనుచో నాశపదమునకు మరణమేయని యర్థము చెప్పనెను. అదర్శనార్థము చెప్పినచోఁ గదిష్టజనమేమయ్యె ననుప్రశ్నకు సమాధానము రాకపోఁగా సందేహము తదవస్థమేయగును.

"నాశితప్రియతమః" అనుచో మరణమే యని యర్థముచెప్పినను సీతావియోగమున విలపించు రాముఁడు వేదనంబట్టఁజాలక "అతిస్నేహః పాపశంకీ"అను న్యాయమున నట్లు పలికియుండును గాని సీత మరణించెనను నిశ్చయముకల్గి చెప్పినదికాదని సహృదయు లూహింతురు గాక!

## సింహావలోకనము

ఇదివఱకే వ్యాసము చాల పెరిఁగినది. రెండు మూఁడు సారాంశముల నిట వ్రాసి విరమింతును.

శ్రీ సుబ్బారాయశాస్త్రిగారి యుక్తుల సమముగ ఖండింపక పోవుటచేతను, వీరశృంగారములలో నొకటియే ప్రధానరసముగ నుండవలెనను లక్షణమును ఖండింపక పోవుటచేతను, కొందఱు శాంతరసప్రధానములన్న ప్రబోధచంద్రోదయాదులు వీరరసప్రధానములేయను శాస్త్రిగారిమాటకు సమాధానమీయక పోవుటచేతను, ఈ నాటకము సుఖాంతమగుటచే రతికేగాని శోకమునకు స్థాయిత్వము లేదనుమాటకు సమాధానమీయక పోవుటచేతను, "యూనోరన్యతరస్మిన్" అను లక్షణము నీ నాటకమునఁ బట్టుకుని తారుమారు చేయక పోవుటచేతను, వీరొనర్చిన ఖండనమేమో బోధపడకున్నది. కాని కొందఱు కరుణవిప్రలంభమును రసాంతరముగ పరిగణింపలేదని వ్రాసిరి. పరిగణించినవారి మతమునకు వీరి సమాధానమేమి? కరుణరసవాదులు మాత్రము "ప్రసిద్ధేపి ......మిన్నతా" యని వ్రాయుటచే కరుణము ప్రధానము కావచ్చునని చెప్పుదురు. కాని యాకారికయం దిట్టి యర్థ మిమిడియున్నట్లు దోఁచదు. ఆనందవర్ధనాచార్యులుగారు దృశ్యకావ్యలక్షణములను జెప్పక ప్రాచీ

నుల సిద్ధాంతములనే యంగీకరించియున్నారు. అంగరస ములుగా ననేకరసముల నంగీకరింపవచ్చును. అంగిరసముగ మాత్రము ప్రాచీనదృశ్యకావ్యలక్షణకర్తలరీతిగ నంగీకరింపవలయునని యాకారికాభిప్రాయము. పోనిండు. ఉత్తరరామచరిత్రమున నాపాతతః కరుణమే గోచరమగుచుండుటచే నదికాక శృంగార మంగికాదని వారన్నను స్థాయియు నంగియు నగు రతి కది యంగమగుటచే దానికిఁ బ్రాధాన్యములేదు. చూడుఁడు:—ధ్వన్యాలోకమున నానందవర్ధనాచార్యులుగారు—

"రసాంతరసమావేశః ప్రస్తుతస్య రసస్య యః ।
నోపహం త్యంగితాం సోఽస్యస్థాయిత్వే నావభాసినః".

అను కారికారూపమున నిరూపించియున్నారు. కావుననే వేణీసంహారమున రౌద్రము మిక్కిలిగ నభివర్ణితమయ్యుఁ బ్రధాన మగు వీరమున కంగమగుటచే రౌద్రమున కంగిత్వములేదని పండితులు సిద్ధాంతీకరించియున్నారు.

మరియు నిది సుఖాంతమగుచుండ, శోకస్థాయిక మగు కరుణమే యిందు ప్రధానరసమని చెప్పనెట్లు సాహసించిరో!

"నాటకము మంగళాంతముగ నుండవలెనను నియమముండుటంబట్టి మంగళాంతముగ నొనర్చినాడు. కాన యిట గరుణమేరసమని" వేం.ల.నా. ల యభిప్రాయము. నాటకము మంగళాంతముగనే యుండవలెనను నియమము పాటించువారు నాటకము వీరశృంగారాన్యతరప్రధానక మను నియమమును ద్రోసివేయుట కదియేమి వివమిడెనా? లేక, సుఖాంతముగ ముగింపఁదలఁచిన పుత్రప్రాప్త్యాదికముతో ముగింపక సీతా సమాగమాంతముగ నేల ముగింపవలెను?

# ఉత్పాతము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

అకట! దుర్విధి నాఁగఁ గాలాహి తనదు
వేయిపడగలఁ గ్రక్కుచు విసపుమంట
మొత్తములు నన్ను మ్రింగ నాయత్తమగుచు
వచ్చుచున్నట్లు నాకుఁ గన్పట్టుచుండె.

అకట! హతవిధి నా గౌరవాలయంబు
నేలమట్టం బొనర్పంగఁ గూలఁద్రోచి
మరియు నిర్మింప నపయశోమందిరంబుఁ
దలఁచినాఁడోటు! దుశ్చేష్టితములు చలుపు.

వీఁగ నున్నది బెడిదంపు విసపుగాలి
ప్రేలనుండె శతఘ్నికాజాలకంబు
పగులనున్నవి యగ్నిపర్వతశతంబు
లకట! నాపయి నేఁ డెల్లి వికటవృత్తి.

పుడమి మృత్యు వవతరించు పుణ్యదినము
కాళరాత్రికి జనని దుఃఖప్రదోష
ములకుఁ బర్వకాలం బగు ప్రొద్దునందు
గావు పెట్టంగ విధి నన్నుఁ గాచియుండె

---

# సంస్కృతసాహిత్యమున రసవిచారము

సుశీలకుమార దేవ్ గారు, M. A., D. Litt. (Lond.)

సంస్కృత సాహిత్య కళాసౌందర్య మూలాధారములలో ధ్వనివలె తత్సన్నిహిత సంబంధముగల రసముకూడ నొకటి. భరతవిరచితమగు నాట్యశాస్త్రమునందిది కేవలము భావమాత్రావస్థలో జనన మంది క్రమక్రమముగా స్థిరపరివర్ధనమందుచు, విశ్వనాథుని కాలమునాటికి కవిత్వమునకు ప్రాణభూతమయిన ఆత్మగ స్థాపితమై ప్రధాన కళా సౌందర్యములలో నొకటిగ నిశ్చయింపబడినది.

రససంప్రదాయముల మాట యెట్లున్నను, ఒక విధముగ రసలక్షణముమాత్రము ప్రాచీన సాహిత్యగ్రంథకారు లందరికి దెలిసియేయుండెను. కాని వారు మొట్టమొదట నాటకమున మాత్రమే దీనిని బరిగణించువారు. అప్పటికి కవిత్వలక్షణమున కిది ప్రధానాంశములలో నొకటని బాగుగ గుర్తింపరైరి. అట్టిప్రాధాన్యము కలదని తొలుదొలుత సమర్థతతో జూపినవాడు తొమ్మిదవ శతాబ్దినాటి కాశ్మీరదేశీయుడగు ఆనందవర్ధనాచార్యుడు. తరువాత నతని ఆలోకగ్రంథమునకు లోచన మనుపేర వ్యాఖ్య రచించిన అభినవగుప్తుడు దీనిని మరింత సామర్థ్యముతో విపులీకరించెను. అది మొదలుకొని దీని నెల్లరు నంగీకరించిరి. ప్రతికూల సంప్రదాయము లెట్టివిన్నను దీనిని దొలగింపజాలవయ్యెను. మీదుమిక్కిలి తరువాతి సాహిత్యకారుల విమర్శనము లిది సాంగోపాంగముగ విస్తరిల్లుటకే తోడ్పడెను.

అపరిణతమే కావచ్చును, కేవలము నాటకీయమే కావచ్చును, రససంప్రదాయము ఆనందవర్ధనునికంటె జాలకాలము పూర్వము నుండియే ఉండెనని కనబరచుట కష్టము కాదు. కాని నాటకమునకంటె విలక్షణముగ, కావ్యమునకు రసముతో నెట్టి సంబంధము కలదను విషయము చర్చకు వచ్చినది అరుదు. కావ్యాలోకమున అలంకార, రీతి సంప్రదాయములకున్నంత ప్రాముఖ్య ముండుట చేత నాటకీయ రససంప్రదాయమున కంతప్రాముఖ్యము లభించెడిది కాదు. కాని ఇది భరతుని కింకను పూర్వము నుండియే యుండెననుట నిర్వివాదము. నాటకకళ ప్రత్యేకముగ నొక ప్రత్యేకాధ్యయన విషయముగ నేర్పడినట్లు కనబడును. సాహిత్యగ్రంథకారులలో విద్యానాథుడు, విశ్వనాథుడు అను వార లిరువురు మాత్రమే నాటకమునకు ప్రత్యేక ప్రకరణముల రచించుట సమంజసమని తలచిరి. భామహుడు, దండి—వీర లిరువురు నిజమునకు నాటకమును కావ్యభేదములలో నొకదానిగ గణించియుండిరి; కాని తద్విషయ వివరణమునకు దానికి సంబంధించిన కొన్ని ప్రత్యేకగ్రంథముల చేర్కొనిరి. ఇదేవిధమున వామనునకు నాటకమనిన అత్యంతాభిమానము, కాని కావ్యప్రకరణమునకు జెందదని తలచుటచే నతడు దానిగురించి వ్రాయుటయే వదలివైచెను. తెలిసినంతవరకు నాటకప్రకరణమును సాహిత్యగ్రంథమున గూర్చినవారలలో నత్యంతప్రాచీనుడు హేమచంద్రుడు. కాని యితనికృతి కొంచె మించుమించుగ సేకరించిన దానివంటిది. అభినవగుప్తుని గ్రంథములయెడల నితడు గనపరచిన అపరిమితాదరము ఇందుల కొక నిదర్శనము. కావున ప్రాచీనకావ్యకళా సంప్రదాయములకు భిన్నముగ నాటకసంప్రదాయము వెలసెననియు, తత్సంబంధమున నుద్భవిల్లిన రసవాదములు ప్రప్రథమమున కేవలము నాటకరచనకు మాత్రమే చెందినవై కావ్యవిషయమున పరిమితప్రభావము వహించియుండెననియు దోచుచున్నది. నాట్యరససంప్రదాయమును వెలువరిచినవారలలో ప్రాచీనతముడు భరతుడు. ఇతడు వ్రాసిన దాని నుండియే ఇతర సంప్రదాయములు, సిద్ధాంతములు అనేకములు వెలువడినవి. ఆనందవర్ధనుడుసహితము భరతునే ముఖ్యప్రామాణికునిగ గైకొనెను. కాని భరతుని ప్రధాన

విషయము రసము కాదు, నాటకము. ఇతడు నాటకమును వివరించుసందర్భముననే రసవివేచనమును గావించియున్నాడు. ఇందువలననే కావచ్చును, రాజశేఖరకవి భరతుని రసవిషయమునకు గాక రూపకమునకే ప్రామాణికునిగ గైకొనెను. రాజశేఖరుని అభిప్రాయానుసారము రసవాదమున కాదిమకర్త నందికేశ్వరుడు. ఇది నిజమగునేని, భరతుడు నందికేశ్వరుని రచనలనుండి రసమును గ్రహించి తననాటకమున వినియోగించుకొని యుండవచ్చును. వెండియు నితడు తన గ్రంథమందలి ౬, ౭ వ అధ్యాయములందును, మరి కొన్ని తావులందును స్వకీయకథనమునకు ప్రమాణములుగ నార్యా, అనుష్టుప్ శ్లోకముల నెక్కింటి నుదాహరించియున్నాడు. కావున రసవాదము భరతునికంటె బూర్వమును నుండి యుండె ననుట నిశ్చయము. కావ్యమునకు సారరూపమైనది రసమని వెల్లడిచేసిన వారిలో ప్రథముడు భగవాన్ శౌద్ధోదనినామక సూత్రకారుడని ౧౬ వ శతాబ్దియందుండిన కేశవమిశ్రు డను గ్రంథకర్త వచించియుండెను. వీరి అభిప్రాయములు అలంకారశేఖరమను గ్రంథములో లిఖింపబడియున్నవి. వస్తుతః వీనికిని మమ్మటుని యభిప్రాయములకును భేదమంతగ లేదు. కేశవమిశ్రుడు తా నితని ననుకరించుచుంటినని వచించుట తప్ప, అసలీశౌద్ధోదని ఎవరైనది నిశ్చయముగ దెలియదు. కాని భరతునివిషయ మట్లు గాదు. ఇతనివలన మనకు నిశ్చితమైన, విపక్షితమైన వృత్తాంతము తెలియగలదు. ఆనందవర్ధన, అభినవగుప్తులచే ప్రకటింపబడిన ధ్వనిసంప్రదాయము మహోన్నతదశను బొందుటకు బాలకాలము పూర్వమే భరతుని రసవిషయకాభిప్రాయములు విపులరీతి జర్పింపబడుచుండెడివి. ఇందులకు ఫలస్వరూపములుగనే భట్టలోల్లట, శంకుక, భట్టనాయకాదిమతము లనేకము లుద్భవిల్లినవి. వీరందరు భరతనాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానకర్తలై యతనినే తమకు మార్గదర్శకునిగ నెంచుకొనిరి. వీరల రసవిషయకవాదవివాదము లన్నియు మీద వచించిన రీతి కేవలము నాటకరచనకే చెందియున్నవి. ఇందుచే రసప్రాముఖ్యమును బాగుగ గుర్తింపని అలంకార,రీతిసంప్రదాయములు రెండును ప్రబలము లయి యున్న కారణమున ధ్వనిసంప్రదాయకులు దీని నంగీకరించి తమసంస్థయం దభివృద్ధిపఱుచుపర్యంతము రసవాదముగాని, తదావిష్కరణకర్తలుగాని బయటికి వచ్చినట్లే కానరాదు. ధ్వనికారులు దీనిని స్వీకరించి తదభివృద్ధికై పాటుపడుచుండ, నాతరుణమున నాట్యకళారససంప్రదాయులును గొంతవరకు ప్రతిఘటించి శత్రుసంప్రదాయములపై స్వకీయమహిమను వ్యాపింపజేయ దొరకొనిరి. అందువలన వారును రసమును స్వీకరింప బాధ్యులై దానికి దమసంస్థయం దొక అధీనస్థానము నొసంగిరి.

• భామహ, దండికవు లత్యంతప్రాచీన సాహిత్యగ్రంథకారులు. వీరలు రచించిన గ్రంథము లిప్పటికిని గలవు. ఈ గ్రంథములనుండియు మీద చేర్కొనిన విషయము విశదము కాగలదు. భామహుని మతానుసారము కావ్యమున కత్యంతావశ్యకమైన మూలతత్వము వక్రోక్తి. వక్ర మనగా చిత్రము. వక్రోక్తి అతిశయోక్తిగగూడ గణింపబడినది. ఇది సమస్తాలంకారములకు మూలాధారమువంటిది. కావ్యమందు రసమున కెట్టి ప్రాముఖ్యము నొసంగవలయునో భామహునకు దెలియదు. ఇందులకు నిదర్శనము రసవదలంకారమున కిత డిచ్చిన నిర్వచనమందు దొరకును. తదనుసారము రస మనునది అలంకార విశేషమునకు అంగభూతము, అప్రధానము. కాని,

"సైషా సర్వైవ వక్రోక్తిర నయార్థో విభావ్యతే"

అను భామహుని వక్రోక్తిసంబంధమైన ముఖ్యశ్లోకమును వివరించుపట్టున అభినవగుప్తుడు స్వాభిప్రాయానుకూలముగ

"ప్రమదోద్యానాది ర్విభావతాం నీయతే విశేషేణ చ భావయతే రసమయీ క్రియతే" అని వ్యాఖ్యానము సలిపియున్నాడు; అనగా వక్రోక్తిద్వారా కావ్యార్థము రసోచితముగ సలుపబడునని భామహుని ఉద్దేశ మనుటచే నతడు'విభావ్యతే' పదమును దాను గావించిన యర్థమందే ఉపయోగించి రసాలంకారములు రెండును వక్రోక్తినుండి ఉత్పన్నములగుట సూచించెనని అభినవగుప్తుని తాత్పర్యము.

కాని రసోత్పత్తి వ్యాపారముల గూర్చి శాస్త్రనియతమైనవాదము భామహుని సమయమం దారంభమైనట్లు తోచదు. అది గాక ఇతడు తరువాతి సాహిత్య గ్రంథకారులకు బరిచితములైన విభావానుభావాది సాంకేతికపదములనుగూడ దన గ్రంథమున వాడియుండ లేదు. మరియు వక్రోక్తికిమాత్రము అత్యవసరమైన రసము కావ్యమం దుండి తీరవలయు నను విధి లేదని ఇతని యుద్దేశమైనట్లును గన్పించును. కాని V.-3 వ పద్యములో నితడు కావ్యరసము శాస్త్రకర్కశత్వమును దగ్గించునని వ్రాసియున్నాడు. ఇది రుద్రటునిచేత స్వీకరింపబడిన భావనము. శాస్త్రము ప్రభుసమ్మితమనియు, కావ్యము కాంతాసమ్మితమనియు వ్రాసిన తరువాతి గ్రంథకారుల వచనముల కీభావనము ఆధారమై యుండవచ్చును. సామాన్యమైన అసాంకేతికార్థమున ప్రయోగింపబడిన యీకావ్యరసమనుపదమునకు అభినవగుప్తు ననుసరించి సాంకేతికార్థమును గల్పించుకొనుటవలననే ప్రాచీనగ్రంథకారులు రసమున కీమనోహర నూతన ధర్మము నాపాదింప గలిగిరి.

రసవిషయమున గొంచె మించుమించుగ నిట్టియభిప్రాయములనే కలిగియుండినందున దండియు దానికి గౌణస్థానమునే యొసంగెను. అయినను భామహునికంటె దానియెడల గొంచె మెక్కువ ధ్యానము గలిగియుండె ననుట నిక్కువము. ఎట్లనగా, శబ్దముద్వారా గాని, విషయముద్వారా గాని రసస్థాపనము చేయునది మాధుర్యగుణము. ఇది రీతియొక్క ప్రధానగుణములలో నొకటి. దీనియందు రసమును జేర్చుటవలన దండి దీని కెక్కుడు ప్రాముఖ్యము నొసంగెననుట ఉచితమే కాని ఇతనిమతానుసారము మాధుర్యమనగా అగ్రామ్యతాభావము మాత్రమే. రసస్వరూప మనిననో అందులకు భిన్నమైనది. హృదయంగమ వ్యాఖ్యానమందు దండి కభీష్టమగు మాధుర్యము అగ్రామ్యతాభావ మనియే వచింపబడియున్నది. మరియు హేమచంద్రుడు

"శ్రుతివర్ణానుప్రాసాభ్యాం వాగ్రసః, అగ్రామ్యాభిధేయతా తు వస్తురసః."

అని వివరముగ లిఖించియుండుటచే దండియొక్క మాధుర్యాంతర్గతమగు రసము రససంప్రదాయ ప్రతిపాదితమైన దానికంటె విలక్షణమైనదిగ గన్పట్టును. ఇదేవిధమున నితడు శబ్దమును "గిరాం రసః" అనుచోట మరియొక అర్థములో వాడియున్నాడు. ఇచట తరుణ వాచస్పతి వచించినప్రకారము రస మనగా సానుత్వమని గ్రహింపవలయును.

ఇంతమాత్రమున దండి రసవిషయమున బొత్తిగ అనభిజ్ఞుడని తలప వీలు లేదు. ఎందుచేతనన, కావ్యమునకు ఆధారభూతములైన యలంకారములు అర్థమును రసవంతము గావించునని యితని యభిప్రాయము. కాని ప్రస్తుతమందు మాత్రము కావ్యరసమునకు ప్రకరణానుసారముగ అగ్రామ్యతతోడనే సంబంధము గలిగియున్నట్లు ఎంచవలయును.

మరియు దండి మతానుసారము మహాకావ్యమందు రస, భావములు రెండును దప్పక సరిగ నుండి తీరవలయును. రసవత్, ప్రేయస్, ఊర్జస్వి, అలంకారముల గూర్చి వ్రాయు సందర్భమున నితడీవిషయమును విశదపరచి యున్నాడు. దీనిని బట్టి సర్వస్వీకృతములైన యెనిమిది రసముల నితడెరిగియుండినట్లే స్పష్టమగును. మరియు నితడీ అష్టరసముల పేర్కొనుటయే కాక, శృంగార, వీర, కరుణ, రౌద్రరసములు ఉపర్యుక్త అలంకారములకు మూలములనియు వక్కాణించియుండెను. అభినవగుప్తుని వ్యాఖ్యానుసారము దండియొక్క రసభావనము లోల్లటునింబోలి బాహ్యార్థ విషయకమై యున్నది: అనగా విభావానుభావముల మూలమున రసము వికాస మందునని ఇతనిమతము. మరియు నితడు అనిత్యములైన రతి, క్రోధములనుండి నిత్యములైన శృంగార, రౌద్రములలోనికి బరివర్తితమగు కార్యరూపముగ రసమును గ్రహించెననియు చెప్పవచ్చును. ఎట్లనగా, రసవదలంకారమును గూర్చి వ్రాయుచు

"రతిః శృంగారతాం గతా
రూపబాహుళ్యయోగేన"

అని రతి శృంగారముగ మారుటంగూర్చియు, వేరొక చోట

"ఇత్యార్యుహ్య పరాం కోటిం
క్రోధో రౌద్రాత్మతాం గతః"

అని క్రోధము రౌద్రముగ మారుటంగూర్చియు వ్రాసియుండెను.

కాని వీనియందలి రసము "అలంకారతయా స్మృతం" అనుట వలన అలంకారములకు అంతర్గతమైయుండి వాని కొకవిధమగు భూషణప్రాయముగనే యుండెను. కాబట్టి దండి రసభావముల కొంతవరకు గుర్తెరిగియుండియు వానిని భావకో లేక అర్థమునకో అంగభూతములైన భూషణములుగ నెంచెనే కాని వేరు కాదు. అలంకార రీతి సంప్రదాయములందు రసమున కిట్టి అధీనస్థానము దొరకుటకు ముఖ్యకారణము దానిని బాహ్యార్థ విషయకమైన దానినిగ గ్రహించుటయే

అటుతరువాత వామనుడు దండిసిద్ధాంతము లనేకములను చక్కగ నభివృద్ధిలోనికి దీసికొనివచ్చెను కాని రస విషయమునమాత్ర మిత డతని నంతగ మించినట్లగపడదు. సాహిత్యశాస్త్రమున నిత్యానిత్యములైన గుణాలంకారముల వివేచన మొనరింపవలసిన యావశ్యకతను గూర్చి వ్రాయుచు నితడు రసమును నిత్యములైన గుణములతో జేర్చియున్నాడు. ఇందువలన కేవల మలంకారముల కధీన మొనరించిన భామహ, దండి కవులకంటె వామనుడించుక ముందడుగు వైచె ననుట స్పష్టము. మరియు నితడు అర్థగుణకాంతిని రససాక్షాత్కారమును బొందియుండు నిత్యగుణముగ నిర్వచించియుండెను. కాబట్టి కాలాంతరమున రసమునకు లభించిన ప్రాముఖ్యమును ఇత డప్పుడే రవంత గుర్తించె ననుట వాస్తవము. అట్లయ్యు నితడు దానిని అలంకారమునకు ధ్వనివలె సహకారిగ నెంచుటవలన దానియొక్క సంపూర్ణమైన ప్రాముఖ్యమును గుర్తింపలేదనియే చెప్పవలయును.

ఉద్భటుడు భామహునిఅనుయాయి; వామనుని సమకాలీనుడు. ఇతడును ముఖ్యాంశములలో దన పూర్వులనే యనుకరించి భామహునివలె "రసవత్" లోనగు అలంకారములతో జేర్చి రసమును అప్రధానమైనదానిగనే పరిగణించెను. కావ్యమునకు రసము ఆత్మవంటిదని అర్థమిచ్చు శ్లోక మొకటి ఇతని గ్రంథముయొక్క కొన్ని ప్రతులలో గానవచ్చుచున్నది. మరికొన్నిటిలో గానరాదు. అందువలన అది ప్రక్షిప్తమనియే అనేకుల అభిప్రాయము. అట్టి దానినిబట్టి ఇతని యభిప్రాయమును నిశ్చయింప వీలు లేదు. భరతను తానుసారము ప్రాచీనుల ఎనిమిది రసములను, తొమ్మిదవదగు శాంతరసమును చేర్చుటచేతను, విభావానుభావసంచారిభావస్థాయిభావాది సాంకేతికముల నుడువుటచేతను రసవిషయమున ఉద్భటునకు మంచి జ్ఞాన ముండినటుల స్పష్టమగుచున్నది. కాని వీని నన్నింటి నిత డొకనిర్దిష్టమైన యలంకారమునకు భూషణప్రాయములుగనే పరిగ్రహించెను; అనగా రసమును స్వార్థమునిమిత్తము గాక ఏదోయొక అలంకారమునకు చమత్కారముగ నుండుననియో, లేక దానిని బెంపొందించు ననియో తలపోసెను. ఈ కారణముచేతనే ఇతని ప్రక్షిప్తశ్లోకము నుదాహరింపబూనిన ప్రతీహారేందురాజు రసభావముల ప్రవృత్తినిగూర్చి వివరముగ వ్రాయక గ్రంథవిస్తర మగునను భయమున మానివైచెను.

రసమునుగూర్చియు, దానికి సహకారులైన నాయికానాయకుల గూర్చియు నించుక భిన్నమగు రూపమున వ్రాసినవారిలో నత్యంత ప్రాచీనుడు రుద్రటుడు. కాని ఇతడు దీని కిట్టి శాస్త్రీయార్థము గల్పించినదియు తెలియదు. గ్రంథారంభమున రసభూయిష్ఠ కావ్యముల రచించి శాశ్వతకీర్తులం గాంచిన కవిపుంగవుల స్తుతించియు, రసపర్యాలోచనమునకై తన గ్రంథమున జాల తక్కువభాగ మొసంగుట యటు లుండ, దానిశాస్త్రీయార్థము వివరించుపట్టున బొత్తిగ మౌనమే వహించెను. ఇతని గ్రంథములోని ౧౬ అధ్యాయములలో కేవలము రెండు అధ్యాయములుమాత్రమే సాక్షాద్రసమును వర్ణించుచున్నది. అదియును వాదాత్మకముగ గాదు, వర్ణనాత్మకముగ. తక్కినభాగమంతయు నలంకార వివరణములతోడనే నింపబడినది. శుష్కశాస్త్ర విముఖులైనవారికి ధర్మార్థ కామమోక్షాత్మకమైన శిక్షను రసాన్వితములైన గ్రంథములద్వారా ప్రాపింపజేయుట మిగుల సులభమైన మార్గమని ఇతని యాశయము; అనగా కావ్యార్థమును

రసముద్వారా ఉజ్జ్వలమైనదానినిగ చేయునగునని తాత్పర్యము. రసవిషయమునకంటె నలంకారవిషయమై ఇతడు మిగుల విపులముగ వివరించినట్లు రుయ్యక, జయరథు లను వారిసాక్ష్యములు గూడ గలవు. కాని ఇతనిగ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసిన 'నామిసాధు'మాత్ర మితని నత్యంతముగ స్తోత్రము గావించియున్నాడు. తదనుసారము కావ్యమునకు శబ్దార్థములు శరీరము, అలంకారములు కృత్రిమ భూషణములు, రసము సౌందర్యాది సహజగుణముల పుంజము. వామనునివలె రుద్రటుడును భామహ దండి కవులకంటె మరొకపదము ముందుకు వైచెనని ఉపర్యుక్త లేఖనమువలన దేలుచున్నది. ఎట్లనగా, నితడు రసమును బాహ్యవిషయాధీనమైనదానినిగ గాక కావ్యముతో సన్నిహితసంబంధము గల స్వభావగుణముగ గ్రహించి యుండెనని తలపవలయును. కాని 'నామి'కథనమును సమర్థింపగలిగిన దేదియు రుద్రటుని గ్రంథమున గానరాదు. అది గాక అతడు స్వకీయాభిప్రాయ విరుద్ధముగ కావ్యమున కత్యంత ప్రధానములైన యలంకారములను కృత్రిమభూషణములుగ దలచునని యూహించుటకును అవకాశము లేదు.

కాబట్టి ధ్వనిసంప్రదాయము వెలువడక పూర్వము ప్రాచీనసాహిత్య గ్రంథకారులందరు శబ్దము యొక్క బాహ్యరూప నిర్మాణమందే శ్రద్ధ వహించుచు వచ్చిరి కాని, కావ్యప్రాణమనదగిన తదంతః సౌందర్యము గురించి శ్రమ దీసికొని యుండినట్లు గానరాదు. మరియు కాలాంతరమందలి కతిపయసాహిత్య లేఖకులంబోలి వీరలు కావ్యప్రాణమునకు సూక్ష్మాంతఃకరణావయవమనదగిన రసముతో తాదాత్మ్యమునైన గల్పింపరైరి. శైలీనామక పదవిన్యాసాత్మకమైన రీతియే కావ్యాత్మయని వామనుడు వచించెను. కాని ఇతని యభిప్రాయానుసారమే రీతి కావ్యవ్యక్తిత్వమును బ్రకటము జేయునది కాదు. కావ్యమున గుణసంయోగముచేతనో, లేక శబ్దార్థముల సంఘటనవిశేషముచేతనో ప్రతీత మగునట్టి బాహ్యార్థ విషయాధీనమైన సౌందర్యమే రీతి. ఇట్లగుటచే రుయ్యకుడు వచించినలాగు ప్రాచీను లందరు అలంకారములను, బాహ్యవిషయాధీనమైన రీతికిని మాత్రమే ప్రాధాన్యము నొసంగిరి. వీరి మతానుసారము కావ్యమునందు రసము గౌణము కాని ప్రధానము గాదు. ఈ కారణముచేతనే 'ధ్వనికారు' డీపూర్వవాదములను కావ్యలక్షణవివరణమునం దసమర్థములనియు, నసంస్కృతములనియు నిరసించి రసధ్వని ప్రాధాన్యము గల తన సౌందర్యసిద్ధాంతమును బ్రకటము గావించెను.

'ధ్వనికారుడు' సయితము రసధ్వనిని వివరించుపట్టున నాటకసంప్రదాయమునకు జాలవరకు లోనయినట్లు గనుపించును. అష్టరసములలో నొకదాని గాని, గొన్నింటి గాని వ్యక్తపరచుట నాటకముయొక్క ముఖ్య కర్తవ్యము. అట్లగుటచే నాటకకళావిధానమందు మానవీయభావము లన్నియు వేర్వేరుగ వివరింపబడుట కవకాశము కలిగినది. ఇందువలన ఆనందవర్ధన అభినవగుప్తాదులతోపాటు 'ధ్వనికారుడు' రంగస్థలముమీదికి వచ్చు పర్యంతము గల కాలమందే ఈమానవీయభావముల రీతులును, భరతుని రసవిషయకాభిప్రాయములును భరతునివ్యాఖ్యానకర్తలవలననైన నేమి, తదనుయాయులవలననైన నేమి, మిగుల విపులము గావింపబడినవి. ఈ వడువున రసభావములు ప్రాచీనకాలపు నాటకమునుండియు, నాటకవాదమునుండియు గ్రమక్రమముగ గావ్యమునకును, గావ్యవాదమునకును గొనిరాబడినవి.

ఒకవైపున నిట్లు సరలకవిత్వము రసప్రధానముగు కవిత్వముగ బరివర్తనమందుచుండ గ్రంథకారులు వేరొక పదము ముందునకు వైచి రసమును కావ్యసౌందర్యమునకు మూలతత్త్వముగ స్థిరపఱచిరి. ఇందుచే నాటకమందంతకు పూర్వము భరతాదులవలన స్థాపింపబడిన వన్నియు గావ్యమందు బ్రవేశించి దాని విభావనమునంతయు బూర్తిగ మార్చివైచినవి కావుననే అభినవగుప్తుడు "నాట్యాత్ సముదయరూపాద్రసః, నాట్యఏవ రసః, కావ్యేపి నాట్యమానఏవ రసః కావ్యార్థః" అని యుపసంహరించియుండెను. ఇటులే రుద్రభట్టు స్వకీయగ్రంథారంభమున భరతాదులంతకు మూందే నాటకసంబంధమున రసవిషయముల స్థిరపరచియుండినందున దానిపుడు కేవలము దానిని కావ్యమునకు ఘటించుచున్నాడనని వ్రాసెను.

ఈపట్టున గమనింపవలసిన దేమనగా, భరతుని తరువాతి గ్రంథకారు లందరు అతనినే మార్గదర్శకునిగ గైకొని, కొంతవరకు అసంపూర్ణములే యైనను అతని ప్రమాణవాక్యములచుట్టు స్వకీయకల్పనముల నన్నింటిని జేర్చిరి. కాని ప్రాచీనకాలపు తక్కినవిద్వాంసు లందరివలెనే భరతుడును తనకథనములందు సగళతనే కనబరచి యున్నాడు. మరియు నతనికాలమున నీవిషయము పండిత విమర్శనములలోనికి గొనిరాబడి నటులే తోచదు. భరతునిగ్రంథము విషయవిస్తారమందొక విశ్వకోశమువంటిది. కాని యితని ప్రధానవిషయము నాటకము. ఇతని కావ్యవిభావనము నాటకీయము. ఇతని యీపరిస్థితియే వామనుని నాటకరచన యెడల పక్షపాతయుక్తునిగను, అభినవగుప్తుని "కావ్యం తావద్ దశరూపాత్మకం ఏవ" యని స్వీకరించులాగునను ప్రోత్సాహము సలిపియుండవచ్చును.

భరతుని యభిప్రాయానుసారము రచనయందు రసము ప్రధానముగ నుండవలయును. ఇందులకు కారణ మేమనగా, రసముద్వారా ఉత్పన్నమగు అర్థగతి హృదయమునకు దగిలి శుష్కేంధనములలో బడిన నిప్పువలె నొక్కపెట్టున శరీరమంతట వ్యాపించును.

"నహి రసాద్ ఋతే కశ్చి దర్థః ప్రవర్తతే"—అనగా రసహీనముగ కావ్యార్థ ముండజాలదు. భరతు డెక్కువ భాగవిభాగములను తెలుపకపోయినప్పటికి, అనంతర గ్రంథకారుల ఉద్దేశముల కనుకూలముగ కావ్యమునకు ప్రధానావయవములైన విభావానుభావాదులను రసోత్పాదకములుగ గ్రహించియే యుండెనని చెప్పవచ్చును. కాని వీని వికాసప్రసరణక్రమ మెందు నిమిత్త మైనదియు నతడు స్పష్టీకరించి యుండలేదు. రసమునకు మూలాధారము భావము. వాచిక, ఆంగిక, సాత్త్విక అభినయములద్వారా కావ్యార్థము నుత్పాదనము చేయున దేదికలదో యది భావము. ఇది క్షణికము గాక స్థిర మగుచో నప్పుడు విభావానుభావముల మూలమున రసస్థానమును గైకొనును.

"విభావ ఇతి కస్మాత్ ఉచ్యతే; విభావో నామ విజ్ఞానార్థః, విభావయంతే అనేన వాగంగ సత్త్వాభినయా ఇత్యతో విభావః." విభావమన విజ్ఞానము. వాక్, అంగ, సత్త్వాత్మకమైన అభినయమును ఆస్వాద యోగ్యముగ జేయున దేది కలదో యది విభావము. ఇటులే అనుభావము. నానార్థ నిష్పన్న వాగంగసత్త్వకృతాభినయమును అనుభావింప జేయునది అనుభావము. రసము యొక్క తృతీయ మూలతత్త్వము వ్యభిచారిభావము. ఇది రసపుష్టికి దోడ్పడి దానిని బలమైన దానినిగ జేయునట్టి సహకారిపదార్థముల పుంజము. వ్యాకరణానుసారము "వి అభి ఇత్యేతౌ ఉపసర్గౌ, చర గతౌ ధాతుః; వివిధాన్ ఆభిముఖ్యేన రసాన్ చరంతీతి వ్యభిచారిణః" అని వివరింపబడియున్నది. ఈ యవయవములకు రసమునకు నెట్టి సంబంధమో, ఇందు స్వాద మేలాగున గొనిరాబడునో తెలుపు నిమిత్తము భరతుడు కేవలము

"విభావానుభావవ్యభిచారి సంయోగాద్ రసనిష్పత్తిః" అని ఒక సూత్రము లిఖించియున్నాడు. దీనిపై నితడించుక వివరణము వ్రాసియున్నప్పటికి నిందులోని "సంయోగాత్", "నిష్పత్తిః" అను ముఖ్యపదములు అస్పష్టముగ నున్నవనియే చెప్పవలయును. ఈ కారణమువలననే వీని వివరణమును గురించిన వాదవివాదము లనేకము లుత్పత్తిల్లినవి. ప్రతివ్యాఖ్యానకర్తయు దన యుద్దేశానుసారము దీని కర్థము వ్రాయబూనుకొనుటయే రసవిషయమున నిన్ని వాదములు జనించుటకు హేతువు. వివిధములైన సుగంధద్రవ్యముల యొక్కయు, ఓషధుల యొక్కయు మేళనమువ సంసిద్ధము చేయబడు పానీయము లాగున స్థాయిభావము పెక్కు విభావములతో నుపగతమై రసావస్థను బొందునని భరతుడు వివరించియున్నాడు. "రస ఇతి కః పదార్థః ఉచ్యతే, ఆస్వాద్యత్వాత్." అనగా ఆస్వాదయోగ్యమగునది రసము.

భరతునను సరించి స్థాయిభావము రసమునకు* మూలాధారము. ఎనిమిది స్థాయిభావములు, ఎనిమిది సాత్త్విక భావములు, ముప్పది మూడు వ్యభిచారిభావములు గలసిన

* దీనిని నాటకరస మనియే చదువరులు ధ్యానమం దుంచుకొనవలయును. అను.

నలువదితొమ్మిదిభావములకు స్థాయిభావమే యాధారము. ఈవిధముగ భరతునియభిప్రాయములో స్థాయిభావము రసమునకు మూలమనియు, విభావానుభావాదులు తదుత్పత్తికి సహకారులనియు దెలియవచ్చుట తప్ప నిర్ధారితమైన యర్థము తేలుటలేదు. ఈయస్పష్టవివరణమే లోల్లటుని ఉత్పత్తివాదమునకును, శంకుకుని అనుమితివాదమునకును కారణభూతమైనది. వ్యంజితొ, సామాన్యాభిధాయోగాది సాంకేతికములను భరతుడు అసాంకేతికార్థమునందే ప్రయోగించియుండవచ్చును. కాని యివియే అభినవగుప్తుని వ్యక్తివాదమునకును, భట్టనాయకుని భుక్తివాదమునకును హేతుభూతములైనవి.

స్థాయి వస్తుతః విభావానుభావవ్యభిచారిభావముల ద్వారా స్వాద్యావస్థను గొనిరాబడినపుడు రసోజ్జనమగునని యందరు నొప్పుకొనిన విషయమే. వీనిలో విభావానుభావములు మిగుల ముఖ్యములు. వ్యభిచారిభావములు సహకారులు. వీనిపై భరతుడుచేసిన విచారము నిజని యనుయాయులు మరింత విపులమైనదానిగ గావించిరి. ప్రేమ, దుఃఖము, కోపము, భయము మున్నగు స్థిరమానసికావస్థలు కావ్యనాటకములలో స్థాయిభావము లనుపేర బరగుచుండును. వీనిలో నేదో యొకటి గ్రంథముయొక్క ప్రధానవిషయముగ నుండవలయును. అది హారములోని దారమువలె తక్కినభావము లన్నింటిగుండ ప్రసరించుచు, తదనుగుణములైన విషయములవలననే కాక ప్రతికూలములైన వానివలనగూడ పరిపుష్టి నొందుచుండవలయును.

స్థాయిభావములు వానిని జనింపజేయునవియు, నుత్తేజము నొదించునవియు, బలపరచునవియు నగు విషయములు సాధారణముగా ప్రపంచములో గారణకార్యములని పిలువబడుచుండును. కావ్యనాటకములం దవియే విభావానుభావ సంచారిభావములని వ్యవహరింపబడుచున్నవి. ఈ సాంకేతిక పదములను దూరముగ నుంచితిమేని, స్థాయిభావమునకు ఆస్వాదయోగ్యత గలిగించుదాని విభావమనియు, ఆస్వాదము చేయించుదాని అనుభావమనియు, మరింత పరిపుష్టముగ జేయుదాని వ్యభిచారిభావము లేక సంచారిభావమనియు బిలువవచ్చును. ప్రేమను స్థాయిభావముగ గైకొనినచో స్త్రీలు, ఋతువులు అందులకు విభావములు; కటాక్షాలింగనములు అనుభావములు; క్షణికములు, గౌణములు నైన ఆనందోత్కంఠాదులు వ్యభిచారిభావములు. స్థాయిభావముతో నీవిభావాదులకు గల పరస్పర సంబంధమువలన రసమున్భవించునని భరతుడు వక్కాణించి యున్నాడు. కాని యిచట గలుగు ప్రశ్న యేదనగా, వీనికి రసమునకు గల సంబంధ మెట్టిది? రసనిష్పాదన క్రమ మెట్టిది? భరతునివలన ఇందులకు నిర్ధారణ పూర్వకమైన ప్రత్యుత్తరము దొరకదు. కాని యనేక వాదవివాదముల కాస్పదములైన సంయోగ, నిష్పత్తి పదముల వివరణమందే యందలి ప్రత్యుత్తరము ఇమిడియున్నది.

ప్రాచీనకాలమున భరతుని గ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసినవారిలో భట్టలోల్లటు డీవిషయమును విశదీకరింప నలపెట్టియుండెను. అభినవగుప్తుడు భరతగ్రంథముపై వ్యాఖ్యానము వ్రాయుచు లోల్లటుని యభిప్రాయముల గైకొని విమర్శించియుండెను. మమ్మటాది అనంతర గ్రంథకారు లందరు ఆవిషయములనే తమ గ్రంథములందు వ్రాసికొనిరి. హేమచంద్రుడును నీమార్గమునే యవలంబించెను. ఇట్లు అన్యుల గ్రంథములందలి ఉల్లేఖనములవలన దప్ప లోల్లటునిగురించి వివరముగ దెలిసికొనవలె నన్న మనకు వేరు ఆధారములు లేవు. ఇతడు వ్రాసిన గ్రంథము నష్టప్రాయమే. ప్రతికూలవిమర్శకుల గ్రంథములలోని ఉల్లేఖనములవలన నితనిగురించి ఇదమిత్థమని నిశ్చయింప వీలు లేదు. అయినప్పటికి ఇతడు విభావమును రసమునకు గారణముగ స్వీకరించినట్లు దోచుచున్నది.

ఇతనిమతమున రసమునకు అనుకార్యము లేక ఉత్పాద్యమనియు, నిష్పత్తికి ఉత్పత్తి లేక పుష్టియనియు నామాంతరములు. రామాదివ్యక్తులలో ప్రతీతమగు రసము ఆకారవేషాభినయముల వారి ననుకరించునట్టి నటుని యందు ఆరోపితమై సామాజికులకు చమత్కారము గలిగించును. లోల్లటగ్రంథమునకు అభినవగుప్తుడు కావించిన ఈయర్థమును మమ్మటుడును, అతని యనుయాయులు నంగీకరించి, స్థాయిభావము నాయకునితో

సాక్షాత్ సంబంధము కలిగియున్నదని మరింత విస్పష్టము చేసిరి. రామాది ప్రధానవ్యక్తులను కాలముతోడ ననుకరించుటంజేసి యది నటునియందుగూడ నుపస్థితమై యుండునట్లు నిశ్చయించిరి. నటుని యీయనుకరణమే దర్శకుల కాహ్లాదహేతువు. ఇచట రసోత్పాదకగుణము నాయకుని యందుండుట సహజమే. కాని యది నటకునియం దేవిధమున నవతరించును? సామాజికులు తమయందు లేని భావముమూలమున నెట్లు చమత్కారము నొందుదురు అనువిషయములు విస్పష్టములు గావు. కావుననే గోవిందుడు

"తదపేశలం సామాజికేషు తదభావే తత్ర చమత్కారానుభవవిరోధాత్; న చ తద్జ్ఞానమేవ చమత్కారహేతుః, లౌకిక శృంగారాది దర్శనేనాపి చమత్కారప్రసంగాత్" అని లోల్లట వాదమును విమర్శించి యుండెను. మరియు ఉపరివాదమునకు ప్రతిపక్షులైన శంకుక సంప్రదాయకులు ఈసాంకేతికముల యుక్తి యుక్తముగ నాక్షేపించినట్లు అభినవగుప్త హేమచంద్రుల లేఖనములవలన దెలియుచున్నది. ప్రతిపక్షవాదముల సారాంశమేమన, నిమిత్తకారణ నాశనానంతరముకూడ కార్య ముపస్థితమై యుండవచ్చును. రసజీవమన్ననో, విభావము లున్నంతవరకే యుండి యవి లోపించిన నదియు నంతర్ధానమగును. ఇందువలన లౌకిక కార్యమువలె రసమును స్వీకరింప వీలు లేదు. మరియు కారణ, కార్యములు సమకాలికములు గాజాలవు. రసము కార్యముగ స్వీకరింపబడుచో దానియొక్క యాస్వాదము విభావముయొక్క సమకాలమున నుండజాలదు. రస మనునది విభావజ్ఞానము కారణముగాగల కార్యమగుచో రసాస్వాదనకాలమున విభావాదులు గోచరములు గానోపవని విశ్వనాథుడును వక్కాణించి యుండెను. ఎట్లనగా, చందనస్పర్శజ్ఞానమును, తన్మూలమున గలుగు ఆనందానుభవజ్ఞానమును నొకదానివెంట నొకటి ఎంతత్వరితముగ గలిగినను రెండు నేకకాలమం దుండజాలవు.

కావున నటుపిమ్మట భరతగ్రంథమునకు వ్యాఖ్యానము వ్రాసిన శంకుకుడు రసము కార్యమువలె నుత్పన్నమగునది కాక అనుమానింపబడున దని సిద్ధాంతీకరించి యుండెను. కేవలము నాయకునియొక్క భావము నటుని చూపరులకు భ్రమ గొల్పునంతటి చాకచక్యముతో నభినయించునటునియందు నిజముగ స్థాయిభావము లేకపోయినను ఉన్నటు లనుమానింపబడును. ఇట్లనుమానింపబడు భావము స్వకీయసౌందర్యాతిశయమువలన సామాజికులచే నాస్వాదింప యోగ్యమగు విలక్షణచమత్కారమును బ్రాపించును. అదియే స్వాద్యావస్థనుబొందిన రసము కాబట్టి రసజ్ఞానము ఒకవిధమగు జ్ఞాపకానుమానము. భరతుని నిష్పత్తి ఇచట అనుమితి యని వర్ణింపబడినది విభావ రసములకు అనుమాపక అనుమాప్య సంబంధము లేక గమక గమ్య సంబంధము.

ఇట్లు సాధనసాధ్య సంబంధముద్వారా స్థాయిభావ మనుమానింపబడినను, నిది అనుమానార్హమగు ఇతర లౌకికపదార్థములవంటిది కాదు. ఎందుచేతననగా, వస్తుతః కృత్రిమములయ్యు నట్టివిగా నెంచబడని విభావాదుల సంబంధము మూలమున నిది యనుమానింపబడుచున్నది. ఇట్టి విధమగు జ్ఞానము చిత్రతురగన్యాయజ్ఞానమువంటిదని చెప్పుదురు. మరియు నీజ్ఞానము సత్యాసత్య సంశయసాదృశ్యాత్మకములగు నాలుగు జ్ఞానములనుండియు వేరై యుండవలయును.

కాని యీ వాదమును తరువాత వచ్చిన వారిచే నిరసనమే కాంచినది. ఇందుకు ప్రతిపక్షీయుడగు గోవిందుని యభిప్రాయానుసారము ఏదేని పదార్థమును గురించిన యనుమానజ్ఞానము దాని ప్రత్యక్షజ్ఞానమువలె చమత్కారమును బుట్టింపజాలదు. జ్ఞానోత్పాదన కారకములగు సామాన్యలౌకికోపాయముల మూలమున రసము గుర్తింపబడునది కాదు. అతీతకాలమందలి రాముని భావము రంగస్థలమున ప్రదర్శింపబడుచో నది ప్రస్తుతదేశకాలములకు జెందిన జ్ఞానేంద్రియములచే గ్రహింపబడు టెట్లు? మరియు స్థాయికిని విభావములకును సాధ్యసాధన సంబంధము లేదు. ఇవి కేవలము వ్యంజకములు.

కావున లోల్లట శంకుకుల యభిప్రాయములు రెండును దోషయుక్తములే. విభావము రసమునకు గారణహేతువు కాదు. జ్ఞాపకహేతువు కాదు. రసము ఉత్పన్నము చేయబడునట్టి కాని, అనుమానింపబడునట్టి కాని

బాహ్యవిషయాధీన మైనచో అంతర్విషయాధీన మైన స్వాదుభావమును నట్టిభావమే లేని దర్శకులలో నేప్రకారము జనింపజేయగలదు? ప్రేక్షకులందును నీభావముండునని తలచుటకు వీలు లేదు. ఎందుచేత ననగా ప్రేక్షకునికంటె భిన్నమైన, ఉత్కృష్టమైన రామునివంటి యొక శ్రేష్ఠనాయకుని విశిష్టభావము లా ప్రేక్షకుని వలన నెట్లుత్పాదింపబడి యాస్వాదింపబడగలవు? భట్టనాయకుడొనరించిన యిట్టివేయగు ఆక్షేపణముల నన్నింటి నభినవగుప్తుడు తన 'లోచన' మందు వివరించి యున్నాడు.

భట్టనాయకుడు ప్రాచీనవాదములను మాత్రమే కాక ధ్వనిసంప్రదాయము వారి నూతనవాదములగూడ ఖండించి భోగవాద మనుపేర వేరొక విలక్షణవాదమును నిర్వాదీసియున్నాడు. ఎట్లనగా: రసమునునది కార్యమువలె నుత్పాదింపబడజాలదు. కారణములైన విభావాదులు అసత్తులు. వీనినుండి సత్తులగు కార్యములు జనించు టెట్లు? రెండవది, రసము అనుమానింప బడునదియు గాదు. వస్తుత రాముడు దర్శకులయెదుట లేనికారణమున నతని భావములును నట నుండజాలవు. అనుపస్థితమైన వాని ననుమానించుటకును వీలు లేదు. అదికాక, సాధారణుడగు పాఠకునకు గాని, దర్శకునకు గాని రామునివంటి అసాధారణ నాయకుని గుణములతో స్వస్వగుణముల నేకీభవింపజేసికొను టెట్లు? వీని కన్నింటికి సమాధానము వచ్చులాగు: భట్టనాయకుడు, ఆధునవాదుల వ్యాఖ్యానమును బోలి, భోజకభోజ్యసంబంధము ద్వారా విభావాదుల సంయోగమున రసమాస్వాదింపబడునని ప్రతిపాదనము చేసియున్నాడు. ఇతని యభిప్రాయానుసారముగ శబ్దమునకు వృత్తులు మూడు: ౧ అభిధా, ౨ భావకత్వము, ౩ భోజకత్వము. అభిధ మీమాంసక, వైయాకరణులంగీకరించినదే. ఇది కేవలము నామమునకు మాత్రమే కాదు. లక్షణాగ్రహణార్థము దీనికి వ్యాపకార్థముసంగబడినది. భరతుడు భావపదమునకు గావించిన సాధారణ నిర్వచనము నుండి, భావకత్వము వచ్చినదని అభినవగుప్తుడు సూచించియున్నాడు. సర్వసాధారణకరణ సామర్థ్యముగల ఈవృత్తి విభావాదులను, స్థాయిని సాధారణీకృతములసల్పి వ్యక్తిగతధర్మములతో నెట్టిప్రమేయమును లేక సాధారణార్థమును గ్రహింపజేయును. ఎట్లనగా: విభావము సీత ఉన్నదనుకొనుడు. భావకత్వముయొక్క సాధారణీకరణవృత్తివలన సీత కేవల మొకవ్యక్తికి గాక స్త్రీసామాన్యమునకు జెందుటను సూచించును. ఇటులే స్థాయిభావము రామునిప్రేమ, కేవల మతనిప్రేమకే కాక ప్రేమసామాన్యమును వ్యక్తపరచును. భోగి, భుక్తలవివక్షకుండెడు మూడవదియగు భోజకత్వవృత్తివలన సాధారణార్థమునుపయోగింపబడు విభావాదులతోపాటు స్థాయిభావము సైతము సాధారణీకృతిరూపమునందే గ్రహింపబడును.

ఈ ప్రకార ముదయించిన రసాస్వాదము వలన గలుగు ఆనందము సాంఖ్యసిద్ధాంతానుసారముగా లౌకిక సౌఖ్యానుభవ విలక్షణమైన తత్స్వరూపానన్యాలంబనా, సంవిదాకారమగు ఆహ్లాదవిశేష మెయ్యది కలదో దానితో తుల్యమైనట్లు వక్కాణింపబడినది. మరియు నీరసాస్వాదనానందము అనుభవ, స్మరణ జ్ఞానములకు విలక్షణమైనది. ధ్వని విస్తార వికాసాత్మకమైనది. పరబ్రహ్మాస్వాదతుల్యమైన, అవర్ణనీయమైన భోగముతో సమానమైనది. కాబట్టి భట్టనాయక మతానుసారము కావ్యనాటకములలో అభిధా, భావకత్వముల సామర్థ్యముచేత సాధారణీకృతరూపమున ననుభవయోగ్యమై, భోగమువలన నానందదాయకమై, బ్రహ్మానుసంధానతుల్యమగు అలౌకిక మనోహరాస్వాదదశను బొందు స్థాయిభావ మేది కలదో యదియే రసము.

రసమును గూర్చిన యీవాదవివాదము లన్నియు, కావ్యనాటకములకు జెందినవైనను, హిందూదార్శనిక సిద్ధాంతములతో మిశ్రితములై యుండెనని స్పష్టముగ దెలిసికొనవచ్చును. లోల్లటుడు మీమాంసకుడుగ నన్పించును. శంకుకుడు నైయాయికుడు. భట్టనాయకుడు సాంఖ్యసిద్ధాంతానుయాయి. భట్టనాయకుని మతమున బాహ్యవిషయాధీనతనుండి అంతర్విషయాధీనతకు రసపరివర్తనమగుట గమనింపదగియున్నది. ఈవాదముపై ప్రయోగింపబడిన నానావిధ విపులపర్యాలోచనాగ్రంథముల బరికింతుమేని యిది యెంతటి ప్రభావమును వ్యాపింపజేసినదియు వివరము కాగలదు. ధ్వనికార, ఆనందవర్ధనుల నూతన సౌందర్యపద్ధతిని నత్యంత విస్తృతము గావించె

నని ప్రఖ్యాతిబడసినవాడు అభినవగుప్తుడు. ఇతనికి భట్టనాయకుని వాదము మార్గదర్శియయ్యె ననుటలో సందేహము లేదు.

అభినవగుప్తుడు సాహిత్యదర్పణ శాస్త్రములం దసమాన పాండిత్యము గలిగియుండెను. భరతునియొక్కయు, నతనియనుయాయుల యొక్కయు గ్రంథములయం దితనికి అధికప్రీతి. ఈ రెండు కారణములవలన నాటకమందువలె కావ్యమందుగూడ భావాదు లుండవనగుననియు, రసమునకు ప్రధానస్థానమొసంగుననియు, రస సాక్షాత్కారము నాటకమున కెట్లో కావ్యమునకు నటులే యనియు నిశ్చయము గావించుకొనెను. ఇట్టి నిశ్చయముతో ప్రాచీనుల వాదములలోని రసవిషయకములైన కొరవతల నన్నింటిని దూరముజేయుటయే కాక నవీన సంప్రదాయమువారి ధ్వనివాదమునందు రసవాదము నత్యంత కౌశలముతో బొందుపరచి యున్నాడు. ఇందలి యితనికౌశలము నెంత కొనియాడినను దీరదు.

ధ్వనిప్రధాన మగునది ఉత్తమకావ్యము. ఇది రెండు ప్రకారములు. కావ్యమందలి శబ్దములద్వారా ప్రత్యక్షరీతి నర్థమును వెలిబరచునది యొకప్రకారమగు కావ్యము. ప్రత్యక్షరీతి శబ్దములనుండి కాక పాఠకుని యూహాసామర్థ్యమున నర్థప్రతీతి గలిగించునది రెండవది. అప్రతీతమయ్యు ప్రతీతముతో సంబంధము గలిగి వ్యంజనముద్వారా ఆకృతిని బొందున దేదో యదియే కావ్యమునకు సారభూతమైన యాత్మ. అప్రతీతమగునది ప్రధానరసమునకు నిదానమగు టెట్లని తలపోయుట వ్యర్థము. ప్రత్యక్షశబ్దములలో స్వకీయార్థమును వెలిపరనక యూహాబలమున గుర్తించునట్లు ఒకవిధమగు సాంకేతిక భాషలో మాటలాడుచుండు టెల్లపుడు వాడుకలోనున్నదే. ఉత్ప్రేక్షాసహితభాషలో వ్రాయుటయందును. ఉద్దేశముల విశుద్ధరూపకముద్వారా వెలిబరచుటయందును గవులు పక్షపాతము గలిగియుందురు. ధ్వనికావ్యము ఉత్ప్రేక్షాది కావ్యమునకంటె విలక్షణమైనది. ఎంత గూఢముగనున్నను ఉత్ప్రేక్షాది కావ్యము సులభావగాహనమే. కాని వ్యంగ్యార్థ మంత సులభసాధ్యము గాదు. ఇందలి యీగోపనగుణమే దీనిచమత్కారహేతువు. ఎందుచేతననగా, కళాసారగర్భితమగు గోపనము గోపనమెన్నటికి గాజాలదు. శబ్దార్థములవలన గలుగుధ్వనికి ఆపాదింపబడిన యొక విశిష్టధర్మముద్వారా అప్రతీయమానమునకు రూపనిష్పత్తి కలుగుచుండును. శబ్దముయొక్క గాని, భావముయొక్కగాని వ్యంగ్యబలముమూలమున అప్రతీతమగునది భావమో, వస్తువో లేక అలంకారమో కూడనై యుండవచ్చును కాని, యనేకప్రదేశములందు అప్రతీయమానముగనుండునది రసమే. కావున ధ్వనిసంప్రదాయకులు భావాదులను అప్రతీతమునకు మూలాధారములుగ గైకొని రసమును ధ్వనివాదమున కనుకూలించులాగున జేయ బ్రయత్నించిరి. కావ్యమందలి ప్రధానాంశమగు రసము దానంతనది ప్రతీతము కాదు. దానిని మనము ధ్వనింపజేయవచ్చును. కవి యగునతడు విభావాదుల సాహాయ్యమున శబ్దములలో గాని, భావములలో గాని లీనమైయుండు ధ్వనియొక్క సామర్థ్యముద్వారా భావాస్వాదనయోగ్యమైన యొక విశేష, అలౌకిక, ఆత్మావస్థను మనలో నుత్పాదనము జేయగలుగును. తాను వర్ణించుచున్న పురుషుడు ప్రాచీనకాలమం దనుభవించిన యవేగసమును ఇప్పుడుత్పాదనము చేయజాలకపోట వాస్తవమే కాని, దానితో ననేకవిషయముల సమానతను గలిగియుండు తత్ప్రతిబింబ సదృశమైనదానిని జనింపజేయగలుగును. పాఠకుని యాత్మయందలి ఈ ఆనందావస్థయే రసాస్వాదము. పదములందును, వానియర్థములందును లీనమైయుండు ధ్వనిసామర్థ్యమువలననే ఇది జ్ఞాతావస్థలోనికి గొనిరాబడును.

ఇన్నివాద వివాదములకు లోనయిన భరతసూత్రము మీద ధ్వని సంప్రదాయకులు సలిపిన యర్థమేమన, వ్యంగ్య, వ్యంజక సంబంధముద్వారా స్థాయిభావ విభావాదుల సమ్మేలనమున రసము వ్యక్తమగును. భరతుని నిష్పత్తి అభివ్యక్తియని గణింపబడినది. భట్టనాయకుని వాదమును విమర్శింపుచు అభినవగుప్తుడు భావకత్వ, భోగీకరణ శక్తిద్వయమును స్వీకరింపవలసిన యవసరమే లేదనెను. ఈ రెండును రసవ్యంజనయందును దానియంతిమాస్వాదనమగు భావమందును నిమిడియే యున్నవి.

“కావ్యార్థాన్ భావయంతీతి భావాః” అను భరతోక్తివలననే భావకత్వము సూచితమగుచున్నది. ఇది

పుష్పిక పుష్పిక

తలనూనెల్లో శిరోమణివంటిది

# పుష్పిక




పుష్పికవలన కలుగు మనోహరమైన సువాసనవలన మీరు నూతనవికాసమును బొంది సువాసనలతో గూడిన వుద్యానవనమందు విహరించుచున్నటుల తలంచగలరు.

పుష్పిక మెదడుకు చల్లదనమునిచ్చి జ్ఞాపకశక్తిని వృద్ధిపరచి, వెండ్రుకలు నెరయుటను మాన్పి, పొడుగెదుగునట్లు చేయును. ఒకపర్యాయము వాడిన మీకే తెలియగలదు

వెల సీసా 1-కి 0-12-0 అణాలు.

పోస్టేజి ప్యాకింగ్ ప్రత్యేకము.

నూతన, స్వచ్ఛమైన వనమూలికలు, పేటెంట్ యౌషధములు, అన్నివిధములైన వైద్యపరికరములు సర్వకాలములందును దొరకును. వైద్యశాలలకు, వైద్యులకు ఆసుపత్రులకు ప్రత్యేక తగ్గింపుధరల కివ్వబడును.

ఫోటో కెమెరాయున్ను దానికి వలయు సామగ్రిన్ని మావద్ద దొరకును.




**SHIVA SHANKAR & Co.,**
161/1, Harrison Road, Calcutta.

---

# వి చి త్ర త ర జ్యో తి ష ము

జాతకమున్నాసరే, లేకున్నాసరే, పువ్వు, బంగారు, వస్తువు, దేవుడు, వీట్లపేర్లువ్రాసి "ప్రశ్న"యని వ్రాసినచో ప్రశ్నయు, జవాబునువచ్చును. రు. 1. సం॥రఫలితము నెలవారీ రు. 2. జీవితచరిత్ర రు. 5. హోలైఫ్ నెలవారి రు. 25.

శ్రీ మేధా అస్ట్రాలాజికల్ బ్యూరో, కాశీబుగ్గ, గంజాం.

---



# శ్రీ లక్ష్మీ జ్యూలయరి కంపెనీ

## మాన్యుఫాక్చరింగు జ్యూయలర్సు

## అందు డైమండు వర్తకులు, బెజవాడ.

నవరసు బంగారమునకు చాది వెండికి మేలైనమణులకు సుప్రసిద్ధమైన స్థళము.

ప్రొప్రైటరు:—ఎర్నేని లక్ష్మీ నారాయణ చౌదరి.



౧. శృంగారరసము—రాసలీల

# శృంగారరసము

అందు కామము సర్వజనసామాన్య మగుటచేతను, అత్యంతము పరిచిత మగుటచేతను శృంగారము మొదట నిరూపింపబడుచున్నది

'శృంగంహి మన్మథోద్భేద స్తదాగమన హేతుకః, ఉత్తమప్రకృతిప్రాయో రసః శృంగార ఇష్యతే.'

'శృణాతి చరమదశాప్రాపణేన హినస్తి కాముకా నితి శృంగం మన్మథోద్భేదః' చరమదశను ప్రాపింపజేసి కాముకులను హింసింపజేయునది గనుక శృంగము మన్మథోద్భేదము. మన్మథము సంభోగేచ్ఛ; తదుద్భేదము తత్ప్రకాశనము. తత్ప్రాప్తిజన్యము శృంగారము. ఇది శ్యామవర్ణమును, విష్ణుదేవతాకము నగు. రతి స్థాయిభావము.

పరకీయ, అననురాగవతియగు వేశ్య వీరలను వదలి తక్కిన నాయికలు, అనుకూలాదులగు నాయకులు నాలంబనములు. చంద్రుడు, చందనము, తుమ్మెదరొద మున్నగునవి ఉద్దీపనములు. భ్రూవిక్షేపకటాక్షాదులు అనుభావములు. ఔగ్ర్యము, మరణము, ఆలస్యము, జుగుప్స వీటిని వదలి తక్కిన నిర్వేదాదు లన్నియు వ్యభిచారులు. ఇట్టి శృంగారము విప్రలంభ మనియు, సంభోగ మనియు రెండువిధములు. ఉపభోగాభావముచే నొప్పుచు ప్రకృష్టరతివిషయ మగు శృంగారము విప్రలంభము. అదియు పూర్వరాగ, మాన, ప్రవాస, కరుణాత్మకమని నాలుగు విధములు.

ఉపభోగసహభావముచే నొప్పుచు ప్రకృష్టరతివిషయక మగు శృంగారము సంభోగ మనబడును. ఈ సంభోగ మొకటేవిధమున బరగును.

## ఆదిరసము (గీతము) లలితరాగము - రతిలీలతాళము.

సువిమలజలయమునాతటసంగతతరుగణపరివృతకుంజవనే,
కోకిలకాకలినిత్యప్రపూరిత సంతతసురభిసుపుష్పగణే.
వియతి సుధాకర మఖిలకలాన్విత మమలకిరణకృతశుభ్రదిశమ్,
విపినకుసుమచయమాల్యసుశోభిత హరి రవలోక్య మనోజవశమ్.
హృదయ మవేక్ష్య స విహరతిపర్వణి కుచభరనతశీతగోపవధూః,
అభిగత ఇహ నిశి కాంక్షితరాసజ సుఖ ఇతీసుందరవక్త్రవిధూః.
సుహాసనిరాకృతసకలసురాసుర మనుజనికరనిజనేత్రపథః;
సతత మమలకచిహాస్యవిరాజిత వదనవినిర్గతరాగకథః.

## రాసలీల

రంగము—బృందావనమున నొక ఉపవనము.

(కొందరు గోపికలు ప్రవేశింతురు)

మొదటి గోపిక—చెలీ, ఎక్కడనే మనకాంతుడు?

రెండవ—దేవున కెఱుక. నే నతనికొఱకై కదంబవృక్షమువరకు వెదకితిని. దొరకడే నా?

మూడవ—అయిన అతడెక్కడకు పోయియుండును? చెట్లుచేమలు, కొండలుగుట్టలు, అంతట వెదకితిని. కాని అతడేడీ?

మొదటి—మంచిది, చెలీ, అతని కాలిజాడల నేమైన గంటివా?

మూడవ—కంటిని. ఒకటేమారు అదియు నడవిలో. కాలిజాడ అతనిదే, సందేహము లేదు. అతని పాదబింబములను నేనెఱుగుదును కదా! వాటి ననుసరించి కొంతదూరము వెళ్ళితిని కాని పిమ్మట నవి కానరాలేదు. అయితే సఖీ, కొన్ని కోమలపాదచిహ్నములు—స్త్రీలవిగానే యుండును—వాటివెంట కానవచ్చెను. ఎవరివై యుండునే?

మొదటి—అవి యతని హృదయహారిణివై యుండును. ఆమె ప్రయాణముచే బడలినపుడెల్ల నామె నతడు తఱచు మోసికొనిపోవుచుండెనని నా తలంపు.

మూడవ—ఉండును.

నాలవ—ఆ జిత్తులమారి గొనల వంచింప నెంచెనుగ బోలు!

అయిదవ—ఏమి? అయినచో దన వేణుగానముచే నీ సరళహృదయముల హరింప నెవరు కోరిరి? నా భర్తనుకూడ సరకుగొనక నిటువచ్చితిని.

ఆరవ—పాపము! నేను నాభర్తకంఠములకు గంటలుకట్టి వచ్చితిని.

ఏడవ—నేనో-స్తన్యమునకై యేడ్చుచున్న శిశువునువదలి.

ఎనిమిదవ—ఆటకాడి యెక్కడికి పోగలడు? ఒకమారు నాచేతికి దొరికెనా, ఈ బాహులతలచే పెనవైచి నా హృదయమున బంధించివైతును.

(కృష్ణుడు నవ్వుచు ప్రవేశించును)

గోపికలు—(సంతోషముతో) ఇదిగో, ఇదిగో ఆటకాడి వచ్చుచున్నాడు. (వివిధగతుల కటాక్షముల బరపుచు తొందరగా నతనిని పట్టుకొందురు)

మొదటి—ఇంతవర కెక్కడనుంటివి? మా సర్వస్వమును వదలి యిటకు వచ్చినది నీకుగా నేయని యెరుగవా?

రెండవ—మనోహరా! క్షణ మాగుము. నీబింబమును నాహృదయమున హత్తుకొందును. (దారి కడ్డము నిలుచును.)

మూడవ—స్వామీ! దూరప్రయాణముచే కడుబడలితిని. ఇప్పు డించుక యూరటగొందును. (బాహులతల పెనవైచును.)

నాలవ—నాథా! నా జవ్వనము నాహృదయమునకు రాణి. నీవిందులకు లోబడినవాడవు. చెల్లింతువా ఇపుడు కప్పము? ఆలసించితివా, అది యీ బాహులతలచే బలమున లాగికొనును. (అతనిచేతిని పట్టుకొనును.)

అయిదవ—రమణా! దూరప్రయాణముచే దప్పిగొంటిని. ప్రార్థింతును, నీయధరసుధచే దాని నడపుము. (ముద్దిడబూనును.) [తెర.]

# వీ ర ర స ము

కామార్థములు రెండును ధర్మజన్యము లగుటచే ధర్మప్రధానమగు వీర మయిదవది. ఇది హేమవర్ణము, మహేంద్రదైవతము నగును. ధీరోదాత్తనాయకు డిందు వర్ణనీయుడు. విజేతవ్యాదులు ఆలంబనములు. వారి చేష్టలు మొదలుగా గలవి ఉద్దీపనములు. సహాయాన్వేషణాదు లనుభావములు. ధృతి, మతి, గర్వము, రోమాంచము మొదలయినవి వ్యభిచారులు. ఇట్టి లక్షణలక్షితమగు వీరము, దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము, దయావీరమని నాలుగువిధముల నుండును. ఆలంబన మొకటియే యయినను యుద్ధవీరము రౌద్రమునకంటె భిన్నము. క్రోధావిర్భావముచే రౌద్రము, ఉత్సాహావిర్భావముచే యుద్ధవీరము.

### వీరరసము (గీతము) వేలావలీరాగము - వీరవిక్రమతాళము.

కురుసుత, విక్రమ మయి కురు కార్యం, పవనసుత స్త్వాంహంతితవాఽయమ్,
పాలయతి వ గురుయౌవనమద్య, సంసది గురుతరనిజగిర మద్య.
తవ ఖలు నశ్యతి వర్జితసద్భుశం, ద్రుపదసుతాంబరకర్షకలుషమ్॥
ఇద మతికుపితో వదతి సజాతం, దుశ్శాసనహృది పిబతి స రక్తమ్.

## దు శ్శా స న వ ధ

### రంగము—కురుక్షేత్ర యుద్ధరంగము

(పోరాడుచు భీమదుశ్శాసనులు ప్రవేశింతురు)

భీమ—ద్రోహీ! ద్రౌపదిని నిండుసభకు శిరోజములను బట్టుకొని లాగికొనివచ్చి వలువ లొలిచినది నీవేకదా! నిన్ను యమపురి కంప నిదియే యదను చిరకాలమునకు చిక్కితివి. ద్రోహీ! శిక్షింపబడితివి.

దుశ్శా—ఛీ! పశువా! ఇదిగో నిన్ను దెరింతును. (భీమునిపై బాణము వేయును. అతడు మూర్ఛిల్లి భూమిపై నొరగును)

భీమ—(శీఘ్రముగ మూర్ఛనుండి తెప్పిరిలి, గర్జించి దుశ్శాసనునిపై గదతో మోదును. వాడు విలవిల తన్నుకొనును.) పాపీ! నీ దుష్కృత్యములకు ఫల మనుభవింపుము. (బిగ్గరగా) ఓ కౌరవయోధులారా: ఇపు డెచ్చట నున్నారు? రండు, దుశ్శాసనుని గతిని తిలకించుడు. అతని తల నేలపై దొరలుచున్నది. ధైర్య మున్నచో ముందున కంజవేయుడు. రక్షింపు డతనిని. చూడుడు: నా ప్రతిన నెట్లు నెరవేర్చుచున్నానో (దుశ్శాసనుని యురమున కాలుమోపి, హృదయమున బాకుగ్రుచ్చి యందుండి పొంగివచ్చుచున్న క్రొన్నెత్తురును గ్రోలి నాట్యమాడును.) ఆహా! ఇది నా తల్లిపాలకంటె మధురముగ నున్నది. [తెర.]

# కతియవారు ట్రేడింగు కంపెనీ

## జగత్ప్రసిద్ధిగల సర్వజనాదరణీయమైన తలనూనెలు, అత్తరులు

### మీరు కోరిన సువాసనలు మీకు లభించగలవు




### మనోహరపరిమళము గల తలనూనెలు

కుసుమాల్ హెయిరాయిలు (రిజిష్టర్డు):— తలనూనెలలో సాటిలేనిది. సంపన్నులు మెచ్చినది. వెల సీసా 1 కి రు. 1-0-0

వైట్ రోజ్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—గులాబీపువ్వులనిజసౌరభ మిందుగలదు. రోజాపూవుల కాసక్తి గలవారి కామోద మొసగును. వెల సీసా 1 కి రు. 0-14-0

కోకోనట్ హెయిరాయిలు నెం. 777 (రిజిష్టర్డు):—టెంకాయనూనె తలనూనె కుపయోగించునని ప్రతివానికిని తెలియును. కాని ఎట్లు సిద్ధము చేసినచో నది ప్రశస్తమో తెలియును. ఈ 777 నెం|| రులో (రిజిష్టర్డు) చేసిన ఈ టెంకాయనూనె శుద్ధిచేయబడి దుర్వాసనారహితముగా చేయబడి సూక్ష్మసువాసనాసంకలితముగా జేయబడినది. అందుచే అందరిచే మెప్పునొందినది. వెల సీసా 0-14-0

పుష్పమాలతీ హెయిరాయిలు (రిజిష్టర్డు):— మాలతీ పుష్పసువాసనలో అతిమనోహరమై హృదయరంజకమై యొప్పు తలనూనె యిది. వెల సీసా 1 కి రు. 0-14-0

సువర్ణమాలా హెయిరాయిలు (రిజిష్టర్డు):—యిది సర్వజనాదరణీయమైన సుకుమార సువాసనగల తలనూనె. వెల సీసా 1 కి రు. 0-9-0

### సర్వజనాదరణీయమైన పుష్పముల అత్తరులు

ఆటో మధుకర్ నెం. 777:—ఈ అత్తరునందుగల సొగసైన పూలవాసనచే మోహితులై అనేకమంది యీ అత్తరును తమ యభిమాన సౌరభముగా భావించుచున్నారు. ఒకసారి యుపయోగించినచో సర్వదా వరించివలెనను. వెల ½ ఔ. సీసా 1 కి 1-12-0 ¼ ఔ. సీసా 1 కి 1-0-0

ఓటో కుసుమాల్ (రిజిష్టర్డు) పరిమళములం దపూర్వచిత్రములు:—అప్పుడు కోసిన పూవులవాసన యీ అత్తరునందు కలదని సౌరభప్రియు లందరును అంగీకరించిరి. సారా అరఖులతో చేర్చిన యితర అత్తరులను జూచి విసుగుచెందినవారి మనోభీష్టమునకు తగిన అత్తరు. యిది సుకుమారమైన సూక్ష్మసౌరభమును వెదజల్లును.

వెల ½ ఔన్సు సీసా రు. 2-0-0 ¼ ఔన్సు సీసా రు. 1-0-0

నెం. 777 ఓటో జాస్మిన్, ఓటో హీనా, ఓటో రోజ్, ఓటో లిలీబ్లాజం, ఓటో మస్క్, ఓటో నీరోలీ, ఓటో బకూల్, ఓటో సురంగి ప్రతిది వెల ½ ఔన్సు సీసా 1 కి రు. 1-12-0 ¼ ఔ. సీసా 1 కి రు. 1-0-0

పాకింగు పోస్టేజీ ప్రత్యేకము. రెండణాలుచీట్లు పంపినవారికి కోరిన అత్తరులలో ఒకమాదిరి సీసా లేక కోరిన తలనూనెలు ఏ రెంటినైనను మాదిరిసీసాలు ఉచితముగా పంపబడును.

నేడే వ్రాయుడు. దొంగమాదిరులను చూచి మోసపోకుడు. వీనికిబదులుగా వేనినైనను అంగీకరించకుడు. పురాణాగల ఔషధముల దుకాణములన్నింటియందును దొరకును. లేదా,

## కతియవారు ట్రేడింగు కంపెనీ, బొంబాయి (నెం. 4)

మధురలో ఏజంట్లు:—**కాదర్ సాహెబు అండు సన్స్**

రసాస్వాదమయమైన ప్రధానార్థమును సూచించు కావ్యార్థముయొక్క ఉపస్థితివ్యాపనములకు కారణభూతములగు సకల భావములందును అంతర్గతమైయుండు శక్తి. ఇందువలన స్థాయి వ్యభిచారిభావములును స్వయముగ భావములే యగుటచేసి, తదంతర్గత సామర్థ్యము ద్వారా సర్వసాధారణాస్వాద్యమైన కావ్యరసనీయార్థమును బయటకు దీసికొనిరాగలుగును. ఈ విధమున స్థాయిభావముమాత్రమే కాదు, కావ్యము సైతము రసనిష్పాదకమే. కావున భావకత్వము అనవసరము. ఇటులే భోగీకరణ వ్యాపారముగూడ నిరసింపబడినది. ఇతని యభిప్రాయానుసారము రసానుభవమునకు మించిన భోగము వేరేదియు లేదు. దీనికి ఆస్వాదమని కాని, ఆనందమని కాని యర్థమగునో నది యంతకు పూర్వమే స్వీకరింపబడి యుండుటవలన మరల భోగమను నూతన నామకరణమువలన ప్రయోజన మేమియు లేదు. కాబట్టి రత్యాది స్థాయిభావాధారమున జనించు స్వాద్యసారమగు రసానుభవమే కాని భోగమున వేరేదియు గాదు.

మరియు నెక్కడెక్కడ రస ముండునో అక్కడక్కడ తదనుభవానంద ముండుటయు సహజము. అట్టి ఆనందకారకములగు సత్త్వగుణముల ప్రకృతి అంగాంగిభేదముల మూలమున అనంతము, వికల్ప్యము నగుటంజేసి రసాస్వాదము కేవలము వ్యాపారత్రయపరిమితము గావింపబడుటకు వీలు లేదు. కావున భట్టనాయకుని భోగము కావ్యవ్యంగ్యత్వ శక్తివలన జనించు రసాస్వాదమగుటచే దానిని భిన్నవ్యాపారముగ గ్రహింపవలసిన యవసరము లేదు.

అభినవగుప్తుని కథనానుసారము రసప్రతీతి యనగా ధ్వనిసామర్థ్యమువలన రసన-ఆస్వాదము- చర్వణ యని పిలువబడు అసాధారణ స్వాద్యావస్థయందు ప్రకటనగు రసాభివ్యక్తి తప్ప వేరేదియు గాదు. ప్రతీతమగునది రసము కాదు, దాని స్వాదము. ప్రకటమగునది స్థాయిభావము కాదు, పాఠకునియొక్క ఆనందరసమయమైన అంతరవస్థారూపకమగు తత్ప్రతిబింబము. ఆస్వాదము బోధరూపమే కాని ఇతరలౌకిక బోధలకంటె భిన్నమైనది. ఎందుచేత ననగా, నిందులకు ఉపాయభూతములైన విభావాదులు లౌకికములు కావు. రసప్రాదుర్భావమునకు విభావాదు లత్యావశ్యకములయ్యు వీనిని సాధారణకారణములుగ భావింప వీలు లేదు. కారణకార్యవాదము దీనియందు ఘటింపదు. ఫలరూపమగు రసమును దాని యంతర్భాగములైన విభావాదులతో సరిపోల్పదగదు. విభావాదులు వేరు వేరుగ ననుభవింపబడజాలవు. ఈ యంతర్భాగముల కలయిక యగు సంశ్లిష్టియే రసము. దీనిని విడదీయుట సాధ్యముకాదు. ఆస్వాదసమయమున రసముసక్క వేరొండు జ్ఞానగోచరము కాదు. సాహిత్యగ్రంథకారులు దీనిని పానకముతో సరిపోల్చుచుందురు. మిరియములు, పంచదార, కర్పూరము, మరికొన్ని సుగంధ పదార్థముల మేళనమున సంసిద్ధము చేయబడు పానకము ఆ వస్తువు లన్నింటికంటె విలక్షణమైన రుచిని గలిగియుండును. ఇటులే ఫలరూపమగు రసము వివిధాస్వాదముల యైక్యమున నేర్పడును. అది అవిభాజ్యమైనది. ఏపదార్థముల మూలమున నది నిష్పన్నమగునో దానిజాడయైనను మనకు బరిణామరసమున దొరకజాలదు.

స్థాయిభావము రసజ్ఞులైన సామాజికుల హృదయములందు వాసనారూపమున నుపస్థితమై యుండును. పద్యపఠన శ్రవణముచేత గాని, నాటకావలోకనమున గాని, వాసనారూపముగ నుండు స్థాయి సాధారణీకృత విభావాదుల ద్వారా ప్రకటితమగును. ఇచట విభావాదులు సాధారణీకృతము లగునది భట్టనాయక సిద్ధాంతము ననుసరించి కాదు. విశిష్టరీతి గుణాలంకార సహితములగు శబ్దార్థముల వ్యంజకశక్తిద్వారా కావ్యమందును, కుశలాభినయమువలన నాటకమందును నివి సాధారణీకరణ ధర్మము నొందుచుండును. ఇటులే రసమున కాధారభూతమగు స్థాయిభావముగూడ వాసనారూపమున భావకుని హృదయమం దదివరకే యుండి యుండుటవలన నదియు సాధారణీకరణధర్మము నొంది, ఉపర్యుక్త విభావాదుల అభినయ సౌందర్యములతో కలిసి దేశకాల పరిమాణములను దూరముచేయును. మరియు నిది ఏవిశేష పాఠకునకో చెందినది కాదు. కావున నొక విశేషవ్యక్తి వలన నాస్వాదింపబడుచుండినను, తత్కాలమున నేలము

పాఠకునిచేతనే కాక రసజ్ఞులగు నందరిచేతగూడ నాస్వాదింపబడుటచే నిది యీ విధమున సైతము సాధారణీకరణ ధర్మము నొందునని యెంచవలయును. ఇట్టి యీయాస్వాదనమే కావ్యనాటకములలోని రసము.

శాస్త్రీయములగు నీసాంకేతిక వాక్యముల వదలుదుమేని, ఈయర్థము నిట్లు గ్రహింపవచ్చును. మనుష్య హృదయమందొక సూక్ష్మమైన భావవిషయకవాసన ఉండియుండును. దానియొక్క స్వభావానురూపములైన సంగతులుగల కావ్యమును దేనినైన జదివితిమేని లోపల నడగియున్న ఈభావము పైకి పొంగివచ్చును. విశ్వాత్మకమైన సహానుభూతిచే మనమును దానిలో నొకరమై నిజముగా నట్టియవస్థలో నుంటిమనియే భావించుకొందుము. ఇట్టి ప్రకారమగు భావనమే కావ్యానందపారమగు రసమనబడు ఆస్వాద్యావస్థను బ్రాపించును.

ఇచట వాసనా, సాధారణీకరణధర్మము లుండుట ముఖ్యావసరము; అనగా ప్రేమ యనిన నెట్టిదో యెరుగనివారు, తత్కారణమున వాసనాశూన్యులగువారు, మానవస్వభావముల గుర్తెరుగనివారు కావ్యరసము నెప్పుడును గ్రోలజాలరు. వాసన నైసర్గికమని వచింపబడియున్నది కాని విద్యానుభవముద్వారా దీనిని బడయవచ్చును. సాహిత్యగ్రంథకారులందరు వైయాకరణ, మీమాంసకులకు రసాస్వాదనశక్తి యుండదని పరిహాసము జేయుచు "రసికఏవ రసాస్వాదే యోగ్యః" అని నిర్ధారణము గావించియున్నారు. రసము నాయకునియందు గాని, నటునియందు గాని యుండు బాహ్యార్థవిషయాధీనమైనది కాదు. పాఠకుని రసికతయందలి హెచ్చుతగ్గులనుబట్టి ప్రతీతమగుచుండును. కావున కొంతవరకు శిక్షాసౌందర్యవిభావనములు, రసికత, సౌహార్దము మొదలగునవి దర్శకునియందుండి తీరవలయును. అట్టియతడె సూక్ష్మరూపమున కావ్యమంతట వ్యాపించియుండు అలౌకికరసప్రత్యయము ననుభవింపగలుగును. విమలప్రతిభాశాలియే తదాస్వాదమున కధికారి.

ఆత్మయొక్క విలక్షణావస్థ యనదగిన ఈరసము కావ్యమందు వ్యంజనాబలముననో, లేక ధ్వనిసామర్థ్యము వలననో సృష్టింపబడుచున్నది. తరువాతి తరువాతి గ్రంథకారులు దీనిని మరింత యభివృద్ధిపఱిచిరి. వైయాకరణులు, దార్శనికులు ఊహించినలాగిది అభిధ కాదు, తాత్పర్యము కాదు, లక్షణ కాదు, ప్రత్యక్షము కాదు, అనుమానము కాదు, స్మరణము కాదు. పర్వణాపర్యాయముగ నీయభివ్యక్తి "వీతవిఘ్నప్రతీతి" అనగా విఘ్నము లేని ప్రతీతి యని 'అభినవగుప్తుడు' వక్కాణించియుండెను. ఇతనియభిప్రాయమునే జగన్నాథ, ప్రభాకరులు మిగుల బలపఱిచియున్నారు. కావున రసప్రతీతి యనునది విభావాద్యుపాయములచే సకలవిధ సందేహములనుండియు, విఘ్నములనుండియు దూరము గావింపబడిన విలక్షణమైన ప్రతీతి. ఇందుచే విభావాదులు విఘ్నాపసారకములనియు బిలువబడుచుండును. సకల విఘ్నరహితమైన ఈ రససంవిత్తి చమత్కార నిర్వేశము, రసన, ఆస్వాదము, సంపత్తి, లయము, విశ్రాంతి యని యనేక పేరుల బరగుచున్నది.

ఆస్వాదమయమైన, చర్వ్యమాణైక ప్రాణమైన రసతత్త్వము సామాన్య జ్ఞానోపాయముల మూలమున నవగతము కానిదగుటచే నలౌకికము. దానిలో గలసియున్న పదార్థములకంటె భిన్నముగ కేవలము రసము మాత్రమే గోచరముగు నొక విలక్షణాస్వాద మగుటచే విగలితవేద్యాంతరమనియు, వేద్యాంతర స్పర్శ శూన్యమనియు దీనిని వర్ణింతురు. రసాస్వాదసమయమున వేరొండు గోచరము కాదనుటయు సంగతమే; అనగా బ్రహ్మైవధ్యానమునలయమైపోయినమానసికావస్థనుంబోలి ఇతర స్పర్శజ్ఞానము లేని యానందము. దాని జ్ఞానము, నదియు నొకటే. దానిస్థితినుండి దానిని వేరుచేయ వలనుపడదు. అది ఇట్టిదని నిర్ణయించుటకు గాని, విశదీకరించుటకు గాని, దానికొక పేరు పెట్టుటకు గాని శక్యముకాదు. రసభావమును స్థాపించునది కేవలము సహృదయుని యాస్వాదము. అందుచేతనే ఇది సకల సహృదయ హృదయసంవేదన సాక్షికమని ఖ్యాతి గాంచినది. "సకలహృదయసంవాదభాజా ప్రమాత్రా గోచరీకృతః" అని మమ్మటుడును వర్ణించియున్నాడు.

ఇట్టి యీరసాస్వాదమునకు చమత్కారము ప్రాణము. ఈ చమత్కారము చిత్తవిస్తారరూపక మగు విస్మయపర్యాయమని విశ్వనాథుని కథనము. సమస్త అలంకారములకు సారమును, నాధారభూతము నగునది కవియొక్క ప్రతిభాశక్తి. ఈశక్తివలన నొకవిశిష్టచమత్కార ముదయించును. ఇట్లు సకలాలంకారములకు సారభూతమగు చమత్కారము రసమునకుగూడ సారమని గణింపబడినది. తదీయ నిరంతర మననమున అలౌకికాహ్లాదరూపముతో నది అనుభవసాక్షిక మగుచుండును.

అటుతరువాత రసాస్వాదానందమును బ్రహ్మానుసంధానజాతదైవికానందముతో బోల్చి కావ్యమును ధార్మికముగ బరిణమింపజేయుటచే నిది పరమావధిను బొందెననుట స్పష్టము. విశ్వనాథుడు దీనిని స్ఫుటరీతి విశదీకరించియున్నాడు. "సత్త్వోద్రేకమున జనించునదియు, అఖండమును, స్వప్రకాశానంద చిన్మయమును, వేద్యాంతరసంబంధశూన్యమును, బ్రహ్మసాక్షాత్కార తుల్యమును, అలౌకికచమత్కార ప్రాణవంతమును, వస్తుతదీయసాక్షాత్కార పృథక్కరణాయోగ్యమును, పాత్రులు, బుద్ధిమంతులు నగు ప్రమాతలచే నాస్వాదింపబడనర్హమైనదియును ఏది కలదో యదియే రసము. ఇట్టియానందము ననుభవింపగల ప్రమాత యోగితుల్యుడు; భక్తజనసదృశుడు. పుణ్యప్రభావముచేతనే మనుజు డీయానందము నొందగలుగును."

"పుణ్యవంతః ప్రమిణ్వంతి యోగివ ద్రససంతతిం."

ధ్వనిసంప్రదాయకులచే స్థాపింపబడిన రసవాదములోని ముఖ్యాంశము లివియే. ధనంజయుడు మొదలుకొని జగన్నాథునివరకుగల తరువాత వచ్చిన గ్రంథకారు లందరు నీనూతన వ్యాఖ్యను స్వీకరించి దీనినే మరింత విపులము గావింప బ్రయత్నించిరి. అనుభవపూర్వకముగ రసవిభావమును వివరించుటయే కాక దీనిని ధ్వనివాదములో లీనమగునట్లు చేసి కావ్యమున కనుకూలించులాగున నొనర్చిరి. అది మొదలుకొని రసవాదము ధ్వనివాదముతో తన్మయావస్థను బొందినది. తరువాత దీని బ్రతికూలింప నెవరికిని సాధ్యము కాదయ్యెను. ధ్వనివాదమును రూపుమాప నెంచిన మహిమభట్టునకును రసవాదమును స్వీకరింప వలసియే వచ్చెను. విశ్వనాథుడు రసవాదమును మరింత యభివృద్ధిపఱుచుటకై యత్నించియుండెను కాని జగన్నాథుడు ఇతనివాదముల నన్నింటిని ఖండించియుండెను. పెండియు నితడు ఎనిమిదిప్రకారములగు వేరువేరు రసప్రతిపాదక వాదముల నెలకొల్పి సమగ్రకావ్యమునకు రసమే ముఖ్యసారమని గ్రహింప వీలులేదని పక్కాణించెను. ఈ కారణముచేతనే ఇతడు "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః" అని కావ్యలక్షణ నిర్వచనము గావించెను. ఆనందదశానుసరణము లేక ప్రకటము గాని రసమే కావ్యమున కొక విలక్షణరమణీయతను గలిగించునని శాస్త్రకారు లందరు స్వీకరించిన విషయమే. ఇటులే మమ్మట ప్రతిపాదితములైన ధ్వనివాదసిద్ధాంతములును తరువాత నభివృద్ధిని గాంచవయ్యెను.

సంస్కృతకావ్యములం దేమి, నాటకములం దేమి, ఎక్కువగ వాడబడినది శృంగారరసము. దీనిస్థాయిభావము విశ్వమోహనమగు కారణమున లేఖకు లందరు దీనిని సమస్తవిధముల విస్తృతము గావించిరి. ఇందులకు ప్రతిఫలముగ శృంగారరసపూర్ణమైన యొక మహాగ్రంథజాలము మనకు లభించినది. వీనియన్నింటిలో మిగుల ప్రాచీనమైనదియు, ప్రసిద్ధి గాంచినదియు నగు గ్రంథము రుద్రభట్టుని శృంగారతిలకము. భరతు డాదిగా గల గ్రంథకారులచే నంతకు బూర్వము నాటకసంబంధమున జర్చింపబడిన రసము కావ్యవిషయమున బ్రయోగించుట యనునది శృంగారతిలక ప్రతిజ్ఞార్థములలో నొకటి. దీని తరువాత భోజుని శృంగారప్రకాశము. ఇది కవియొక్క స్వభావానుసారము విపులమగురీతి భావాంతర్గతమైన ప్రత్యేక అంశమున కనేక ఉదాహరణములతో నిరువది అధ్యాయములకు తక్కువ గాకుండ నిర్మింపబడిన గ్రంథము. అనంతర మిట్టివే అగణితములైన గ్రంథములు వెలువడినవి. వీని యన్నింటిలో శృంగారమే ప్రధానరసము. ముందు రచింపబోవువానికి మార్గదర్శకము లగుటయే వీని నిర్మాణమునకు ముఖ్యోద్దేశము. వీనిలో శారదాతనయ నిర్మిత భావప్రకాశము, సింగభూపాలుని రసార్ణవము, భానుదత్తుని రసమంజరి, రసతరంగిణి అను గ్రంథములు ముఖ్యముగ పేర్కొనదగినవి.

అంతను బూర్వమే అపరిమితముగ నభివృద్ధి నొందిన ఈ రసమునకు విచారాత్మక మైన నూతన ప్రసంగమును జేర్చు గ్రంథము వీనిలో నొకటియైనను లేదు కేవలము శృంగారము విభావానుభావ వ్యభిచారిభావముల విస్తృతవివరణములతో జర్చింపబడినది. ప్రసంగవశమున నాయికానాయకులయొక్క నానావిధావస్థలు, భావములు మితిమీరి వర్ణింపబడినవి. ప్రాచీననాట్యకళా సంప్రదాయములకు అనుకూలముగ నుండులాగు నానాప్రకారహావభావలాలిత్యోద్వేగాది సంపన్నులయిన నాయికానాయకులను, వారి సహచరులను లెక్కలేని తరగతులక్రింద విభజించి వర్ణింపవలెనన్న వీరికి మహానందముగ నుండెడిది. ఈ గ్రంథముల నవలోకించుటవలన విదితములగు వీరల సూక్ష్మదృష్టిని, వీరల గ్రంథవిభజన సామర్థ్యమును మనము కొనియాడ వలసినదే కాని నిరసింప వీలు లేదు. గ్రంథములు చాలవరకు ప్రాచీనకాలపు పండిత మర్యాదలతో నిండియుండినను, వీనిలో నిశ్చయాత్మకములైన సంగతుల వెల్లడింప వీరలు నిర్దుష్టప్రయత్నముల సలిపియుండిరని వెల్లడి కాక మానదు. భిన్నభిన్న మనోవికారానుబంధములతోడ్పాటు గల స్థాయి ఒకమనోవృత్తియాధారమున రసపరిణామ మందునని సిద్ధముచేయుటకై సాహిత్యకారులు మనోవికారముల నన్నింటిని మిగుల పరిశ్రమపూర్వకముగ విభజించిరి.

అనంతరము రూపగోస్వామి రచించిన ఉజ్జ్వలనీలమణియందు రసవిచారమున మరొక నూతన పరివర్తనము కలిగినది. ఉజ్జ్వలమధురరసముపై గల వైష్ణవాభిప్రాయానుసార మిందు రసము వర్ణింపబడినది. ఉజ్జ్వలమధురరస మనిన శృంగారరసము. ఎందుచేతననగా, భరతుడు దీనికి ఉజ్జ్వలపదమును వాడియుండెను. "మధురాఖ్యో భక్తిరసః" అని యుండుటవలన నిచట నిది భక్తిరసాంశముగ బ్రదర్శింపబడినది. వైష్ణవాభిప్రాయానుసారము శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మాధుర్యములని భక్తి ఐదుప్రకారములు. ఉజ్జ్వల మనుపేర నొప్పు ఈకడపటిరసము ప్రధానమైన దగుటచే భక్తిరసరాజమనియు విఖ్యాతి నందియున్నది. ఇందలి రసముయొక్క స్థాయిభావము కృష్ణరతి, అనగా కృష్ణునిపై ప్రేమ. దీని ననుభవించువాడు భక్తుడు కాని పండితుడు కాడు. రాధాకృష్ణుల శృంగారకథలనుండి శ్లోకముల నుదాహరించుచు రూపగోస్వామి యిందు నాయికానాయక స్వభావములు, వారి మనోభావములు, భావోద్రేకములు లోనగువానిని జిత్రించియున్నాడు. కృష్ణుని ఆదర్శనాయకునిగ గైకొని వ్రాయబడిన వైష్ణవమతగ్రంథ మిది. కాని కృష్ణునివిషయమై వ్రాయబడినవన్నియు సామాన్యలౌకికనాయకునియందు ఘటింపవనిమాత్రము నిశ్చయింపబడినది.

అను: వేలాల సుబ్బారావు.

---

## అనుభోగము

అ. వెం. రంగారావు గారు

౧

డుల్లిపోయిన కుసుమంబు-మళ్ళి రాదు
చిందిపాఱిన మదిరంబు-దిక్కబోదు
సృష్టి నీకోసమే యని-తుష్టిజెంది
అనుభవింపుము మిత్రుడా!-యార్తిలేక
కాలమెప్పుడొక్కరీతినే-గడచిచనదు.

భామతి

క్షవివరేణ్యులు మీయశోగానములను
నవ్యపదబంధముల జేయునాడుగాని
అఖలశాస్త్రవిశారదు లైనవారె
వేడి మీకడ జదివెడునాడుగాని,

మాన్యభావముతో బహుమతులతోడ
నరపతులు మిమ్ము దర్శించునాడు గాని
కలుగనేలేదు సంతోషగరిమ మీకు:
ఇప్పుడింత హర్షోత్కర్షమేల నాథ?

వాచస్పతిమిశ్రుడు

అర్ధఘటికక్రింద నవసితంబైనది
బ్రహ్మసూత్రములకు భాష్యవివృతి
పరమపురుషుకృపను ప్రారీప్సితగ్రంథ
మంతరాయ రహితమై చెలంగె.

ప్రణతిసూత్రకార బాదరాయణమౌని
చంద్రు దివ్యపాదజలజములకు;
చేతు వందనంబు (శ్రీ)శంకరాచార్య
వర్యు దివ్యపాదవనజములకు;

వరుస విడువకుండ వ్యాఖ్యానకర్తలౌ
యతులచరణములకు నతు లొనర్తు;
బ్రహ్మవాదులైన పండితోత్తములను
భక్తిపూర్వకముగ బ్రస్తుతింతు.

బ్రహ్మవిద్యకన్న పరవిద్య యున్నదే
సకల దుఃఖతరణ సాధనంబు!
నేను వివృతిమిగుల నిస్పృహబుద్ధితో
జేసినాను పరమశివుని కృపను.

భామతి

మీరు దర్శనవ్యాఖ్యలమీద మున్ను
విశదముగ వ్రాసినట్టి యా వివృతులెల్ల
సంస్తుతింపరె తత్తదాచార్యవరులు
తమతమ మతానుసారముల్ తథ్యమనుచు

వాచస్పతిమిశ్రుడు

విమలశాస్త్రదృష్టి విద్వజ్జనంబుల
వెలయజేయుబుద్ధి వివృతులేను
ముప్పదేండ్లనాడు మొదలిడి యీనాటి
వరకు నేకనియతి వ్రాసినాడ.

అఖిలదర్శనమ్ము లవలోడనముచేయ
శాస్త్రహృదయలబ్ధి సంఘటిల్లె.
గ్రంథరచనసేయు కాంక్ష యీ నాటితో
సఫలమయ్యె; కృతులుచాలు నింక.

విహితకృత్యములను విధివిధానమ్ముగా
సలుపుచున్నవాడ శ్రద్ధతోడ.
శాంతితోడ నింక సకలమ్ము త్యజియించి
ప్రవ్రజింతు నేని పరమశుభము.

భామతి

సకలమవగత మౌ మహాశయులు మీరు
అజ్ఞురాలను నేను: సాహసము బూని
భర్తృభాషణమున కిట్లు ప్రతివచనము
నిచ్చుచున్నందులకు క్షమియింప దగును.

విధివిధానమ్ముగా మీరు విహితకర్మ
లాచరించుచు నున్నట్టు లనుటచేత
ఉండు గార్హస్థ్యవిధులలో నొక్కకొరత
చేసినారని దృఢముగా చెప్పగలను.

గురుకుల పరిశ్రమమ్మున కొన్నియేండ్లు
ప్రవచనమ్మున కొన్నియబ్దములు, గ్రంథ

రచనతోడను కొన్ని వర్షములు గడచె;
వెడలె మీ కాలమంతయు విద్యలోన.

శాస్త్రములయందు వ్యసనమ్ము సముచితమ్మె
కొంతవర; కైన నింతటి ఘోర మెరుగ!
ప్రబలవిద్యాపిశాచి ప్రప్రథమమందె
అతితరంబుగ మిమ్ముల నాక్రమించె!

ఏమి భుజియించుచుందురో ఎరుకలేదు
ఏమి ధరియించుచుందురో ఎరుకలేదు
ఈతపస్విని గతియేమొ ఎరుకలేదు
ఏమివిద్యాప్రభావమో ఇది మహాత్మ!

కాలమంతయు విద్యల గడపినారు
కలుగనేలేదు సంతానకాంక్ష మీకు
భార్య యనుమతిలేకుండ ప్రవ్రజింప
దలచు టెట్టిది యనపత్యధర్మవేత్త!

వాచస్పతిమిశ్రుడు

బాష్పమోచనంబు బలహీనతాచిహ్న
మింత జేల వనుచు నెంచనైతి
ఈఋణమ్ము విడువు మికనైన సంతాన
ముదయ మొందకున్న కొదువలేదు.

భా మ తి

చాలులెండు, మీకు సంతాన వాంఛయే
లేదు మానసమున లేశమైన!
ఆడుదాని కుండ దంత వైరాగ్యంబు
వంధ్యనన్న మాట వాస్తవంబు.

వాచస్పతి మిశ్రుడు

పుత్రసంతానకామమ్ము పాడమలేదు
పూర్వమెన్నండు; గతమును పోవనిమ్ము.
ఇప్పుడైన ప్రయోజన మేమియుండు?
ఉభయులకుగూడ యౌవన ముడిగిపోయె.

నీవు సహధర్మచారిణీ, నిశ్చయముగ
ఉత్తమపతివ్రతవు: లెక్క కొక్కనాడు
గాని యించుక లోపమ్ము కలుగకుండ
శ్రద్ధతో నాకు శుశ్రూష సలిపినావు.

ధీరురాలవు తక్కిన స్త్రీలకట్లు
వస్తుసంతతిపై నీకు వాంఛలేదు
తగునె యింతటివెర్రి సంతతి యనంగ?
కొడుకు లున్నంతమాత్రాన గొప్పయేమి?

భా మ తి

గొప్ప కాకయేమి! కొడుకులు జనియించి
మిగుల యోగ్యులనుచు మెలగునపుడు
ఇంత దొడ్డసుతుల నేతల్లి కన్నదో
యనుచు లోకు లామె నభినుతింత్రు.

వాచస్పతి మిశ్రుడు

యశమె భవదీయవాంఛిత మైనయెడల
నిలుచు విశ్వజనీనమై నీ ప్రతిష్ఠ
ఈదినమ్మునె ముగియించి నట్టి
వివృతి నీపేర లోకాల వెలయజేతు.

భా మ తి

నాకు కీర్తివలదు! నలువురి నోళ్లలో
బడగ నీక నన్ను బ్రదుకనిండు!
ఒరులనోట బడక యుష్మత్పదాంబుజ
సేవచేయుచున్న శ్రేయ మొదవు.

వాచస్పతి మిశ్రుడు

నాకృతికి పూజ్యమైన నీనామధేయ
ముంచినాడను లోకమం దొప్పగాక
భామతివ్యాఖ్య మిశ్రుని భార్యపేర
సకల వేదాంతవాదులు సన్నుతింప!

# పుణ్యప్రేమము

విశ్వనాథ సత్యనారాయణగారు, M. A.

౧

సుభద్ర పసుపుపచ్చని మనిసి. ఆజాను బాహువు. కన్నులు చెంపకు చేరెడేసి. వక్షోజఘనములు పురఃపశ్చాత్ప్రసృప్తరజతగిరి నితంబములు. ఆమె జడచుట్టిన శిరోజభారము గిరినితంబాగ్రలంబి, నల్లగా తుమ్మెదలు ముసరిన తేనెపట్టు.

ఈ సౌందర్యవతి తెల్లనిపట్టుచీర తాల్చినప్పుడు శరన్మేఘశకలవాహన యగు శచీదేవి; ఆకుపచ్చచీర తాల్చినపుడు శ్రావణమునాటి పచ్చనిపచ్చికబయళ్లతోడి పుడమిపడతి. ఇంకొక రంగుచీర యామె కట్టనే కట్టదు. ఇది యామె బహిస్సౌందర్యము.

ఆమె యంతస్సు చందనాగరుకస్తూరికా పరిమళితము; ప్రాతశ్శిరీషకుసుమకోమలము. ఆ మనస్సులో నామె చదివిన భారతభాగవతముల వాసన గుప్పున కొట్టుచుండును. అలంకారశాస్త్ర మామె నేత్రనాళముల యందు తరంగలు తరంగలుగా ప్రవహించుచుండును. ఒక్కమాటలో, నామె రసమూర్తి.

ఈ సౌందర్యాధిదేవతాత్వము, ఈ రసాకృతిత్వము నన్నని వలిపపు చందురుని కిరణములు వోని దారములు తీసి సుభద్రాదేవి తన ప్రాణపతి కృష్ణరాయనిచుట్టు తళతళ లాడు సాలీనిగూ డల్లినది.

కృష్ణరాయలు సాలుకు నాలుగువేలాస్తి యప్పగించిన తల్లి తండ్రుల కొక్కడే గారాలకూచి. యఫ్. ఏ. చదువుచు ప్రథమసహాయనిరాకరణపునాళ్లలో మానివేసినాడు. తరువాత సంస్కృతాంధ్రములయందు పరిశ్రమ చేసి పాండిత్యముకన్న రసజ్ఞత్వ మెక్కువ సంపాదించినాడు. యౌవనమున నా శచీదేవికి తగిన శతమఖుడు; ఆధారణీదేవికి తగిన హృషీకేశమూర్తి.

వారి దాధునికనాగరకతానిలయమ్ములైన పట్టణముల కెడమైన యొకపల్లెటూరు. సుభద్రకు ఆధునికనాగరకత యన్నచో పచ్చగడ్డి వేసిన భగ్గు మనును.

'పచ్చగడ్డి వేసిన భగ్గు మను' నన్న యీ నానుడి యామె వైముఖ్యమునందలి తైక్ష్ణ్యమును మాత్రమే చెప్పును గాని యామె స్వభావమునందలి యర్ధచ్ఛాయకూడ తగులదు. ఒకనాడు పితృకార్యవేళ కృష్ణరాయ డుచ్చరించిన హూణశబ్దములయందు సుభద్ర సూచించిన ప్రణయశాసనముకారణముగా నత డామె యెదుట నప్పటినుండి హూణభాషాశబ్ద ముచ్చరించడు.

ఇంక వారిప్రేమకథ విచిత్రమైనది. ఒకరి హృదయపుహారలలో నొకరు తూరినట్లు వారొకరుద్దేశించిన పను లొకరు తెలుపుకొనకయే గ్రహింతురు. చేయుదురు. వారి కంటి

ఓవరలలో, బొమలకదలికలలో, అవయవవిలాస చాలనములలో వారి కొకరి కొకరి యెడందలు గోచరించుచుండును. విచిత్రముగ వా రొకరి కొకరు సంబంధించినంతవరకు వారి హృదయములు వారి సర్వావయవత చ్చాలనములనిండి నిబిడీకృతమై యితరులయెడ వారిహృదయములు హృదయస్థానములనుండి రేఖామాత్ర మైన కదలవు.

వారిరువురకు వారివారి ప్రేమలయొక్క నైశ్చల్యనైర్మల్యములయందుమహాభిమానము.

అక్షయసంవత్సరాషాఢశుక్లమున నొక నాడు సుభద్ర క్రొత్తగా పుట్టింటినుండి వచ్చినది. పరిష్వంగత్వర కల యాదంపతుల కానాటి ప్రొద్దెంత యాలస్యముగ క్రుంకవలయునో యంత యాలస్యముగ క్రుంకినది. డాబామీద పరుపు వేసి విరియబూసిన మల్లెలు మొగ్గ దగ్గరనుంచి త్రుంచి తెచ్చి ప్రక్కపై వెదజల్లి, సుభద్ర మడికట్టుకుని వంటచేసి పతికి భోజనము పెట్టుచుండెను. అంతలో మేఘములు నల్లగా నాల్గుదిక్కులు క్రమ్మి యింద్రుని రథపుశాయమే కూడిపడ్డ ట్లురుమసాగెను. సుభద్ర యత్త గారు 'నేను వడ్డించెదను. నీవు పోయి డాబా మీది ప్రక్క తీసుకుని ర'మ్మన్నది. సుభద్ర కదలలేదు. గంట ముప్పావుగంట మేఘములు కొన్ని పోవుచు, మరల కొన్ని మూగుచు, మధ్య మధ్య చినుకులు తపతప రాలుచునే యున్నవి. పై నన్నమాట యత్తగారు నాలుగుసారు లన్నది. సుభద్ర మాటాడలేదు. కృష్ణరాయలుకూడ నొకసారి 'ప్రక్క యెత్తుకు రారాదా!' అనెను. చిక్కని పెరుగుగడ్డ వెండిగిన్నెలో పడిన చప్పుడున కామాట యామెకు వినంబడలేదు.

కొంతసేపటి కొక ఫూలరంగనివంటి గాలి షికారు బయలుదేరి మొగిళ్ల తనకాల జిమ్ము కొంచు పోయెను. రాత్రి జామున్నర ప్రొద్దు పోయిన వేళ నొక యవ్యయానంద నిమేషమున 'ఆకాశము నిర్మేఘముగ నున్నది. చంద్రుడు డాకాశమున గూడ ప్రకాశించుచున్నా' డన్న భర్తమాటకు సుభద్ర తనలో నది తన ప్రేమనైర్మల్యఫల మనుకున్నది

సుభద్ర నమస్తములైన ఫలములతో నోమునోచినది కాని పనసపండ్లతో నోచలేదు. ఆ మఱుసంవత్సర చైత్రమాసములో పనస పండ్లతో నోము నోత మనుకున్నది. డబ్బిచ్చి కృష్ణరాయలు మనిసిని భీమవరము పంపించినాడు. వాడు తిరిగి తిరిగి యింటికి ఊరకే వచ్చెను. ఎవరో ఒక పెద్ద రాజుగారి కుమార్తె పెండ్లియట. భీమవరం, నర్సాపురం, తణుకు, మారుటేరు, పాలకొల్లులలో నెక్కడను పండ్లు దొరకలేదు. రెండునెలలకు ముందుగనే యా రాజుగారు బజానా లిచ్చి పండ్లన్నియు తన వశము చేసికొన్నాడని వార్త తెచ్చెను. రేపు పూర్ణిమ. సుభద్ర ముత్తయిదువలను పిలిచెను. జయంతుని పెండ్లినాటి శచీదేవివలె తిరుగుచున్న యామె యీ వార్త విన్నంతనే నిర్జీవి యయిపోయెను. ఇంట నందఱు విచార కబళితముఖులై యుండనే యున్నారు. ఇంతలో

# చిరకాలమునుండి బాధించుచున్న మూత్రవ్యాధులకును గణ (గనేరియా) వ్యాధికిని క్రొత్తగాకనిపెట్టబడిన దివ్యౌషధము.




## గనోకిల్లర్ (రిజిష్టరుడు)

ఈయౌషధము శ్రేష్ఠతమము. ఇంగ్లీషు మందులను దేశీయములగు ఔషధములను పుచ్చుకొనినను గుణము కలుగనియెడలను, యింజక్షనులవలనను వాక్సినులవలననుగూడ లాభము లేకపోయినయెడలను కడపటిప్రయత్నముగా మా గనోకిల్లరునుగూడ పుచ్చుకొనిచూడుడు. పెక్కుయేండ్లనుండియున్నను లేక క్రొత్తగా కలిగినను ఏరకము శెగసంకటమైనను మఱెట్టి మూత్రవ్యాధులైనను స్త్రీలకైనను పురుషులకైనను గనోకిల్లరు తప్పక కుదుర్చును. మూత్రము ధారాళముగా వెడలును. మూత్రముపోవుచున్నప్పుడును కలుగుమంట తగ్గిపోవును. మూత్రనాళము నందలి వాపు తీసిపోవును. శెగవ్యాధి (గనోకోకసు) వలన మూత్రము బొట్లుగా పడుట, మేహరోగమువలన మూత్రద్వారమునుండిపోవు తెలుపు, యూరెత్రిటిసు, ప్రోస్టాటిటిసు, సిస్టిటిసు, లుకోరియా, మున్నగువ్యాధులన్నియును స్త్రీలకును పురుషులకునుగూడ గనోకిల్లరువలన కుదురును. వీర్యము (పెసను) పోవుట, స్త్రీలు గర్భిణులుగానున్నపుడు కలుగు మూత్రవ్యాధులు మున్నగునవిగూడ దీనివలన కుదురును. 50 మాత్రలుగల సీసా ఖరీదు రు. 3-0-0 వీ. పి. చార్జి ప్రత్యేకము. ఒక్కసారి 3 సీసాలు తెప్పించుకొనిన వీ. పీ. చార్జి మేమే భరించెదము.

అడ్రసు:—డాక్టర్ డి. యన్. జస్సాని, 137 కికావీధి, గులాల్‌వాడి, బొంబాయి 4.

Tel. Add. "GONOKILLER" Dr. D. N. JASANI, 137 Kika Street, Gulalvadi, Bomday, 4.

మద్రాసు సిటి ఏజెంట్లు దాదా అండు కంపెనీ, 52, నైనియప్పనాయకవీధి, మదరాసు.

---

స్వల్పధర ! ఫల మధికము !! పూర్తి తృప్తి !!!

100 కి 100 గురు సంతృప్తిచెందియున్నారు




## లోకామయహర కస్తూరి మాత్రలు

పిల్లలుమొదలు ముసలివారివరకు అందరి మందము, మలబద్ధము, పడిశెము, దగ్గు, గూరలు, శీతలముచే కాళ్లులాగుట, కడుపుబ్బరము, కడుపునొప్పి, పక్కలయందునొప్పి, ఆహారజీర్ణకాలమందు తలనొప్పి, చలిజ్వరము, జ్వరము, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజా ఇంకను అనేకవ్యాధులను గుణపరచును. స్త్రీలు ప్రసవించిననాడు, స్నానమునాడు (కస్తూరికి బదులుగా) ఈ మాత్రలు 4-5 ను, 2-3 తమలపాకులలో నమలి మ్రింగవలెను. సాంక్రామికరోగులతో నుండవలసినవారు, దినము 1-2 మాత్రలను సేవించిన ఆరోగ్యదృఢాంగు లగుదురు. ఈమాత్రలసీసాతోగల అనుపానపత్రమును చూడుడు. 300 మాత్రలు గల సీసా 1 కి 4 అణాలచొప్పున ప్రతిషాపులోపలను దొరకును. పోష్టుమూలకముగా 6 సీసాలు రు. 1-8-0, 12 సీసాలు రు. 2-12-0, 25 సీసాలు రు. 5-3-0.

సారస్వతాసవం :—మెదడుకు బలమును కలిగించి, జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును గావున, మెదడు దుర్బలమువలన గలిగియుండు సమస్తవ్యాధులను పరిహరించి నరములకు మంచిత్రాణను, రక్తవృద్ధిని కలుగజేయును. సంగీతపాఠకుల కంఠస్వరమునకు మృదుమధురత్వము నిచ్చును. పాడను పాడను ఉత్సాహము నింపును. బలహీనలైన స్త్రీలకు నెత్తినడుము (నెత్తినోరు చాల మెత్తగా వుండుటవలన) మాట్లాడను నడువనుకాని పిల్లలకు సంజీవివంటిది.

6 ఔన్సుల సీసా 1-కి రు. 1-0-0. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

## శ్రీ సీతారాఘవ వైద్యశాల, మైసూరు.

కృష్ణరాయని స్నేహితు డొకడు భీమవరము నుండి యేబది పనసపండ్లు బండిమీద వేసికొని వచ్చినాడు. అందరు నాశ్చర్యపోయిరి.

వెనుక నొకసారి కృష్ణరాయలు తన స్నేహితునితో తన భార్య పనసపండ్లతో వ్రతము చేసికొనవలె ననుకొనుచున్నది. పండ్లు తెచ్చిపెట్టెదవా-యని యడిగెను. అత డాచోట పలుకుబడి కలవా డగుట, రాజుగారి వద్దనుండి యీపండ్ల కనుమతి పొంది యీ వేళకు తెచ్చెను.

వాడిపోయిన కాకరపాదు వానపడినంతనే పూలతో, పిందెలతో కలకలలాడినట్లు మరల నిల్లంతయు నుత్సాహపూరితమైపోయెను.

ముత్తయిదువలకు వాయనమిచ్చి దొడ్డిలోనికి దేనికో పనిమీద పోయిన సుభద్రతో గిత్తలకు జనపకట్ట వేయుచున్న కృష్ణరాయలు 'నా ప్రేమ నిష్కలుష్యమిట్టిది. తలవనితలంపుగా పనసపండ్లు వచ్చినవి.' యనెను. ఆ మాట కొక్క మెదబంటి చూపుతో బదులు తీర్చి సుభద్ర లోనికి బోయెను.

'నాయనా! మీ కడుపున కాయ కాచినచో చూచి పోవలయును రా' యను తల్లిగారి చాలసారు లన్న మాటలతో కొడుకుకోడండ్ర మొదలలో తమ ప్రేమకు బహిశ్చిహ్నము చూడవలె నన్న కోరిక సుభద్రలో నదిమిన సిగ్గులో కృష్ణరాయనికి నవ్వినమాటలో పొడసూపీ పొడసూపక యొకొక్కసారి తళుకు తళుక్కు మనుచుండును. ఆ యేడాది యంతయు నట్లే గడచినది.

## ౨

ఆ యేడాది వెళ్లినతోడనే యేసూ చల్లని వర్షర్తువుతోనే క్రొత్తయేడాది మొదలు పెట్టినట్లు, శ్రావణము నూతన భావములతో జెలరేగెను. ఉబ్బువాన కురిసి వెలిసిన పెద్ద యెత్తైన మబ్బు నల్లని నీడలలో దూరపుచెల్లు పొరిపోలె నున్న నల్లని కన్నుబొమ్మలు కలవాని చూపువలె నవ్యక్తగంభీరముగ నుండెను. దొడ్డిలోని గుజ్జునేరేడు లొత్తుగా కాచి నేరేటిపండ్లు, పూర్వ మెప్పుడో వేదములు ముచ్చిలికొనిపోయిన యాగాన భగవంతుని యాదిమత్స్యగర్భమైన గుడ్డు బహూకృతమైన ట్లుండెను. నల్లని వర్షర్తువు దొంగవాని వలె గదులలో దూరి పగలే ప్రభ సాగించెను.

ఆ చీకటిలో సుభద్ర తమయింటిగదిలో గూర్చుండెను. అచ్చట వెలుతురు గుడ్డిగా నున్నది. కలవారి యింటికోడలు చూలు నిలిచిన పండుగ చేసి సెనగలు పేరంట మిచ్చిన తరువాత నామె కట్టిన క్రొత్తచీరతో, పెట్టిన కాటుకతో, రాచిన పారాణితో, వృథా కుపితమైన శర్వాణివలె నామూల కూర్చున్నది. కృష్ణరాయలు లోనికి వచ్చి యామెను చూచి మందహాసము చేసెను. ఆమెకును నవ్వు వచ్చెను. వచ్చిన నవ్వాపుకొని మొగములో నున్న కోపమే నిలిపెను. ఇంతలో నెవరో గదిలోనికి వచ్చుటచే నకారణ మప్రగల్భమైన

యీ కోపమును రాయలు తీర్చ వీలు చిక్కలేదు.

రోజులు కడచిన కొలంది నామె మన స్సతనికి మిక్కిలి పరిచితమే యయ్యు శరీర మపరిచితి నధికము చేసికోదొడంగెను. కోపమయీ కాని ముఖలక్షణములతో, సమార్ద్రవపరిహ్వృతభర్తృపరిష్వంగప్రయత్నములతో నేడవనెల దరిసెను. పుట్టినింటికి తీసికొనిపో వచ్చిన యన్నగారి వెంటబోవుట కేమియు నిష్టము లేకయు వెళ్లుచున్న సుభద్ర కౌగిలి యారునెలలకు కృష్ణరాయనికి తటస్థించెను. కాని యది యుభయులయు బాష్పముల తడిచేతవలె వెంటనే జారిపోయెను.

గబగబ నేదో పని యున్న ట్లింటిలోనికి పోవుట, మరల వాకిలిలోనికి వచ్చుట, యీ పని సేయుటతోడనే కృష్ణరాయనికి రెండు నెలలు గడచినవి. 'నాయనా! ఒకసారి పోయి చూచి రారా' అన్న తల్లిమాట తల్లికే మిగిలినది. సంకల్పవికల్పముల నడుమ గతాగత కారియైన యతడు భార్యను చూడనేలేదు.

వసంతకాలము వచ్చెను. అది వసంతము సొగసు కాబోలు, ఎండవేడిమి తాగలేక కూసిన కోకిలల కూతలలోనే మాధుర్యము వెల్లివిరిసినది. ఎండ పిందెలు, ఎండపూవులు కూడ రుచి హెచ్చినవి, పరిమళించినవి. ఎట్లయిన నేమి? వసంతకాలము ప్రాణము హాయి యనిపించినది.

సుభద్రకు గర్భకార్శ్య మల్లుండగా, పతి తన్ను చూడ రాలే దను చింతాకార్శ్య మెక్కువయినది. 'ఇప్పుడు నాతో నేమిపని' యనుకున్నది.

ఏరోజున కారోజున ప్రొద్దున లేచి పోద మని కృష్ణుని యూహ. ప్రొద్దున లేచిన వెంటనే యథాస్థితి జాడ్యము.

ఒకనాడు ప్రొద్దున కృష్ణరాయలుగారి వంటయింటిదగ్గర కాకి కూయ మొదలిడెను. అతనితల్లి 'కాకమ్మా కాకమ్మా! కబురు చెప్పు. మాతల్లి నీళ్లాడెనా లేదా' అని సోదె యడిగినది. కాకి గల్లున గంతు వేసి కూసి యెగిరిపోయినది.

కాకి యిట్లా వెళ్లినది, అట్లా కబురువచ్చినది. సుభద్ర 'చిన్ని మగవానిఁ గనె నఁట.' శాంతి తగిలెనట. కృష్ణరాయని వికల్పజాడ్యము వదలినది. కాని 'శాంతి' వికల్పస్థాన మాక్రమించినది.

శాంతి యింటికడనే చేసికొనుటకు నిశ్చయించి యిరువదియొకటవనాటికి సుభద్రను తీసుకుని వచ్చిరి. మూగిన యూరి యాడవారందరు వారిదారి వారు పోయినతరువాత కృష్ణరాయలు సుభద్ర నేకాంతముగా గలసికొనెను. పతి కౌగిలించుకొనబోయెను. కాని సుభద్ర యొక నిశితమగు చూపు చూచెను. అందుచే నా కౌగిలింత జరుగునప్పటికి చాల సేపు పట్టినది. శాంతివేళ నూనెలో తండ్రి కొడుకుల మొగముల రెండు నీడ లొకేసారి

చూచిన సుభద్రకు వారిపోలిక మరింత వ్యక్తమయ్యెను. కొన్నాళ్లు గడచెను.

ఒకనాడు సుభద్ర కూర్చుండి యేదో కుట్టుచున్నది. కృష్ణరాయ లేదో చదువుకొనుచున్నాడు. పిల్లవాడు నిద్రపోవుచున్నాడు. సుభద్ర కుట్టునాపి తల యెత్తి, 'అయితే మీరు నేను మావాళ్లి యింటివద్ద నుండగా నొక్కసారి యయినను రాలేదుకదా!' అనెను.

అతడు పుస్తకమాపి యామెవంకఁ జూచెను. ఆమె చూపులలో ప్రశ్న యట్లే యుండెను. అత డేమి సమాధానము చెప్పుటకును తోచక, 'నీ వొక యుత్తరమైనను వ్రాయలే దేమి?' యనెను.

'నేను వ్రాసినచో నింట నెవ్వరైన చూడరా' అనెను.

'ఏమి చూచినచో?' అని కృష్ణరాయలు ప్రశ్నించెను.

సుభద్ర దానికి బదులు చెప్పక మరల తనపని తాను చేసికొనుచుండెను. అత డామె వంక చూచుచునే యుండెను.

ఆమె తల యెత్తకుండ ఇట్లన్నది: 'ఆ రోజులలో నే ననలే బలహీనముగా నున్నాను. మీరు రాలేదన్న దిగులుచేత నన్నమే సయించునది కాదు. మరీ చిక్కిపోతిని. నా బలహీనత కుర్రవాని బలుపుకు చెరుపు చేయునన్నారందరును.'

కృష్ణరాయలు కుర్రవానివంక చూచినాడు. రెండునెలల పిల్లవానికి రెండువందల నగలు పెట్టిరి. అతడు వారి మాటలకు తనకు సంబంధము లేనట్లు నిద్రపోవుచునే యుండెను.

మరి కొంతసేపటికి సుభద్ర 'మీకు నామీద ప్రేమ లేదు' అన్నది. ఆమె కాపురమునకు వచ్చి నాలుగేండ్లయినది. ఇట్టి మాట యామె నోటివెంట నెన్నడు రాలేదు. తరువాత నొక్కనిముసము నిశ్శబ్దత.

మరునిముసమం దిద్దరు నీళ్లు నిండిన కన్నులతో నొకరి నొకరు చూచుకొన్నారు. ఆమరు నిముసమం దొకగాటపు కౌగిలింత. ఇంతలో కుర్రవాడు లేచి కనులు విప్పి చూచెను.

సుభద్ర పిల్లవానిని తీసికొని, 'ఇదిగో నా ప్రేమచిహ్నము' అని కుర్రవానిని పతి కిచ్చెను. అతడు పసివానిని గట్టిగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకుని, 'నా ప్రేమచిహ్నమును వీడే' యని యామెకు మరల నందిచ్చెను.

అదివర కాపుణ్యదంపతుల హృదయము లొకరి వొకరి హృదయములలో నుండుచుండెను. ఇప్పు డవి రెండును చేరి పసివానిలో ప్రవేశించెను. సుభద్రకు భర్తృప్రేమ యంతయు పసివానిలో తోచుచుండెను. కృష్ణరాయలకు భార్యాప్రేమ యంతయు పిల్లవానిలో దోచుచుండెను.

ఒకరోజున సుభద్ర అన్నది, 'మీకు నామీదకన్న నబ్బాయిమీదనే యెక్కువ ప్రేమ' అని.

కృష్ణరాయలు అన్నాడు 'నాకు అబ్బాయే నువ్వు. నీకు అబ్బాయే నేను.'

ఆముగ్గురిమధ్య మూడు కౌగిలింతలతో ప్రస్తావన ముగిసినది.

## 3

పసిపిల్లవానికి ఆరు ఎనిమిది పదినెలలు వచ్చినవి. పిల్లవానికి తలంటిపోసి, యాముదము రాచి, కనులకు కాటుక పెట్టి, మొగాన చుక్క పెట్టి, తొట్టెలో పండుకొనబెట్టి యూచినపుడెల్ల సుభద్ర వానిని చూచి భర్తయందలి తనప్రేమ యంత యకల్మషమని, స్వచ్ఛమని యూహించుకొనుచుండును. వాడు తనవద్ద పాలు త్రాగుచున్నప్పుడెల్ల తనజీవితసర్వస్వము తనప్రేమలో ప్రవహించుచున్న దనుకొనుచుండును.

పిల్లవానియెడల నామది మారి నిద్ర మేల్కన్న తరువాత వానికి నగలన్నియు పెట్టి భర్తచేతికి ప్రతిదినము మధ్యాహ్నము దాటి యిచ్చినపుడెల్ల కృష్ణరాయలు భార్యయందలి తనప్రేమ కుఱ్ఱవానిలో మూర్తి కట్టిన దనుకొనుచుండును. వానిని తాను లాలించినంతసేపు తనజీవితము తనప్రేమకై వినియోగించుచున్నానని యతఁ డనుకొనుచుండును.

పిల్లవానికి పన్నెండు నెలలు గడచినవి. పుట్టినరోజు పండుగకు సుభద్రాపతి పెండ్లియంత హడావిడి చేసినాడు. పిల్లవానికి ఆనాడు బంగరుమువ్వల మొలత్రాడు, మెడలో పులిగోరు, కాళ్లకు గజ్జెలు, చేతులకు రెండు మురుగుల జతలు పెట్టి కుర్చీలో కూర్చుండబెట్టుకుని, సెనగలు, కానులు కలిపి దిగబోసి, పేరంటాండ్రందరు పాటలు పాడిన తరువాత సుభద్ర కంఠమెత్తి,

'బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామజఘనాయ దిగంబరాయ,
శార్దూలదివ్యనఖభూషణభూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే'

అని శ్లోకము పాడెను.

అంతలి మృదుభావతరంగపరంపరచే సుస్నిగ్ధమై సుసంస్కృతమైన యామె హృదయము కరిగి యామెలోని భక్తిభావము, పిల్లవానియందలి యనురాగము, తన ప్రేమమయ జీవితనిగూఢరహస్యము నన్నియు కలిసి యవ్యక్తమయిన యొక స్రోతోరూపము తాల్చి యామె కన్నులవెంట జాలుగా ప్రవహించెను.

నిశ్శబ్దులై తక్కినస్త్రీ లామె వంక జూచి కొంతసేపటివర కామె హృదయ మెరుంగక యామె నోదార్చ వచ్చిరి. 'శుభవేళ కన్నీ రేల' యని కొందరు, 'ఆమె మనస్సులో నేమున్నదో' యని మరికొందరు జానపదవైఖరి ప్రదర్శించిరి. ఆమె మనస్సౌకుమార్య మెవరికి దెలియలేదు. ఆ రాత్రి పిల్లవాడు పోరు పెట్టి యేడ్చినాడు. తల్లియు, ముత్తవ తల్లియు తల్లడిల్లిపోయినారు. కచ్చికదృష్టి, ఏకుదృష్టి తీసిరి. పోరు మానలేదు. ముత్తవతల్లి చివర కుప్పు కూడ తీసి నూతిలో వేసెను. రాత్రి రెండు జాములు దాటువరకు పిల్లవాడు చేతిలో నిలువలేదు. అప్పటికి కొంచె మరకూర్కె. మరల

దెల్లవారుకడ నేడువ మొదలుపెట్టెను. కొంచెము పడిసెము పట్టెను.

మూడురోజులవరకు పిల్లవా డదే నలతగా నున్నాడు. నంబి పూజారి మంగలులు ముగ్వురు వచ్చిరి; చూచిరి. ఏమో మాత్రలిచ్చిరి. ఏమియు నయము లేదు. సుభద్ర ప్రాణములు గుప్పిడిలో బట్టుకున్నది. కృష్ణరాయలు తెలతెలపోయినాడు.

నాల్గవనాడు పిల్లవానికి భారము చేసినది. ప్రొద్దు క్రుంకువేళకు ‘మగత’ కప్పినది.

ఇంట శోకదేవత ప్రవేశించినది. చుట్టకాల్చి నొసట నంటించిరి. ఉల్లిపాయ నమలి ముక్కులలో నూదిరి. బ్రహ్మజెముడ కురసము పోసిరి. పిల్లవాడు గుక్క తిప్పుకున్నట్లే తిప్పుకొని తల్లితండ్రులతో విడాకులు పుచ్చుకున్నాడు.

కృష్ణరాయని నెత్తిన పెద్ద పర్వతము పడినది. సుభద్ర యొడ్డులేనిసముద్రములో నీదుచున్నది.

మూన్నాళ్లు కడచినవి. భార్యాభర్తలొకరి నొకరు చూచుకొనలేదు. ఈ మూన్నాళ్లును శిశుమృతిదుఃఖమే వారి హృదయములయందు నిండియున్నది.

నాల్గవనాడు సుభద్ర స్నానము చేయుచుండగా పొరుగమ్మ యొకావిడ వచ్చి, ‘వాడెవ్వడు, మీ రెవ్వరు? మీరు వాని కేదో ఋణ మున్నారు. వాని ఋణము వాడు తీర్చుకొని పోయినా’ డని యోదార్చినది. సుభద్ర కామాటతో పుత్రదుఃఖము శాంతించినది. మరల కొంత సేపటి కామె తన హృదయపరీక్ష చేసికొన్నది. పుత్రదుఃఖముచే నిండియున్న తన హృదయములో జూడరానంత మేర యొడమై యందు తాను తనపతి యెడల ద్రోహినన్న భావము కాలుపెట్టినది. ఈ భావము గడియగడియకు వృద్ధిపొంది ప్రొద్దుగ్రుంకువరకు నామెహృదయమంతయు నిండిపోయినది.

రాత్రి పడ్డది. ఎంత చెప్పినను సుభద్ర భోజనము సేయక పండుకున్నది.

రాత్రి రెండుజాములు దాటినది. అందరును నిద్రపోవుచున్నారు. దొడ్డిలో చీరకొంగు పరుచుకుని పండుకున్న సుభద్రయు, వాకిట నుత్తరీయము పరుచుకుని పండుకున్న కృష్ణరాయలు తక్క తక్కిన జంగమజగత్తంతయు జడమైనది.

ఇరువురి హృదయము లొక్కరీతిగా మండిపోయినవి.

ఇరువురిమనస్సు లొక్కరీతిగా నూహించినవి.

ఇరువురియాత్మ లొక్కరీతిగా నిలిచినవి.

‘నా ప్రేమ నిష్కల్మష మైనచో మా పుత్రు డేల చనిపోవును? నేను నాకు తెలియని దేదో దోషము, నాభార్య—(లేక) భర్త యెడల చేసితిని. అయ్యయ్యో! ఆ పవిత్రాత్మకు నాయందు సంపూర్ణముగా ప్రేమ లయింపచేసిన యీ మనోహరమూర్తికి నేనెంత ద్రోహము చేసితిని! మా శిశువునందు

నా ప్రేమ యకల్మషత, స్వచ్ఛత సంపూర్ణముగా గోచరించిన దనుకొంటినే. ఆ ప్రేమచిహ్నా మిట్లు నీరూప మగుటకు నా ప్రేమలో నేదో కల్మష ముండియుండవలెను. నా ప్రేమయే నిష్కల్మష మైన నా ప్రేమ చిహ్నమైన మా శిశువున కీస్థితి రాదు.'

కొంత సేపు వారి యిర్వురిమనస్సులొక్కసారిగా నిలిచిపోయినవి.

తెల్లవారుజాము కోడి కూసినది. తూర్పు చుక్క పొడిచినది. మరల వారియూహ లిట్లు సాగినవి.

'తెల్లవారబోవుచున్నది. ఇంత ద్రోహము చేసిన నేను నా ప్రియురాలిని—(లేక) ప్రియుని ఎట్లు చూతును. ఏ మొగము పెట్టుకుని యతని—ఆమెను పలుకరింతును. నే నా మొగముమీద నాచూపులు నిలుపలేను. ఈ నా దోషమునకు నిష్కృతిలేదు. నా యీదోషగత ప్రేమము నిర్దోష మగుట యెట్లు? నేను మాత్ర మా మొగము మరల చూడలేను. చూచినచో నాహృదయ మొక్కసారిగా సహస్రధా శకలిత మగును. నేను చూడలేను. ఏ మొగము పెట్టుకుని చూడగలను?'

ఇద్దరి కనుగొనలనుండి బాష్పములు కురిసెను. హృదయములు గంటకు వేయిసార్లుగా గొట్టుకొనెను.

మరల వ్యథాకులితులు, నిర్వాక్కులు, నిరాదృతశరీరసుఖులు నగు నా దంపతులకు మూన్నాళ్లు గడచినవి.

సుభద్ర నోదార్చుటకు పుట్టింటికి తీసికొని పోదుమని యామెతల్లియు, నన్నగారు ననిరి. కృష్ణరాయనితో చెప్పిరి. దుఃఖము, నిరాశ పెనవేసికొని లజ్జ యుబికిన స్తంభ మతని శరీర మునందు తోచి యతడు నిరుత్తరు డయ్యెను. తనయొడలు, తనమనస్సు తా నెఱుగని స్థితిలో సుభద్రను పుట్టింటికి తీసుకొనిపోయిరి. సుభద్ర పుట్టినింట మూడునెల లుండెను. ఆరునెల లుండెను. ఎప్పటి కప్పుడు సద్యోమృతపుత్ర విరహిణివలె నుండును గాని మార్పు లేదు. ఊరివా రందరు వచ్చిరి. రోజు రో జూరార్చిరి. పతియెడల తాను చేసిన ద్రోహమున కని యామె దుఃఖించుచున్నదని వారికి తెలియదు. వారి యోదార్పు మాటలు కారణ మెరుగని వైద్యమువలె నిరర్థకము లయ్యెను. అంతకంత కామె కృశించిపోవుచుండెను.

ఇంటివద్ద కృష్ణరాయలు హూని యైనాడు. నవ్వుచు త్రుళ్లుచు నుండునాతడు కొడుకు చావుతో మారిపోయినా డనుకున్నా రూరివా రందరు. అత డెవ్వరితోడను మాటాడడు. క్రమక్రమముగా వ్యవసాయ మెత్తివేసెను. పొలము కౌలున కిచ్చెను. వాకిట బశువులే లేవు. 'నాయనా! కోడలిని తీసుకు రావురా' అని తల్లి యనును. అతడు కూర్చున్నవాడు లేచి వాకిలిలోనికి పోవును. తల్లి యూరివారిచేత ప్రస్తావింప జేసినది. కృష్ణరాయలు వినుచుఁ దలాడించెను.

ఎన్నాళ్లయిన నింతే యని యన్నగారు సుభద్ర నొకనా డత్తవారింటికి తీసుకుని

వచ్చెను. సుభద్ర యింటికి వచ్చునప్పటికి కృష్ణరాయ లూర లేడు. అప్పటికి పదిరోజుల క్రిందట శ్రీశైలమునకు పోయెదనని చెప్పి వెళ్లినాడు.

సుభద్ర యిచట నొక నెల యుండెను. ఆమెకు క్షయవ్యాధి పుట్టెను. శచీదేవికి శవాకృతి వచ్చినది. భూదేవి పూచికపుల్ల యైనది. మరల నన్నగారు తీసికొని వెళ్లినారు.

ఆమె వెళ్లిన పదిరోజులకు కృష్ణరాయ లింటికి వచ్చినాడు. గడ్డము పెరిగి పిచ్చవాని వలె నున్నాడు. సుభద్రజబ్బుసంగతి తల్లి యతనితో చెప్పెను. కృష్ణరాయలు గడపలోని వాడు గడపలో నుంచియే యత్తవారింటికి పోయినాడు. పాప మతనికి సుభద్ర చూపు మాత్రమే యందినది. అతనిని చూచినపుడు సుభద్రకు కన్నులలో నీరు తిరిగి యవ్యక్తముగా నీమాటలు నోట వచ్చినవి. 'నా ప్రేమలోని నాకు తెలియని కాలుష్యమువలన నీ కొడుకు పోయినాడు. క్షమింపుము' అని ఆమె చేతు లెత్తి నమస్కరించపోయినది. చేతులు రాలేదు. మరునిముస మామెలో చైతన్యము లేదు. కృష్ణరాయలు 'అయ్యో! నా తప్పు కాని యది నీ తప్పు కాదు' అని విరుచుకుని పడిపోయెను.

కొన్నాళ్లకు వారాణసీఘట్టమున నొక పురుషుడు, నొక స్త్రీయు, నొక మృతశిశువును పాతిపెట్టుచుండిరి. ఒక బాలసన్న్యాసి దారివెంట పోవుచు నచట నిలిచి చూచుచుండెను. వారతని చూచి, 'స్వామీ! ఏమట్లు చూచెదరు' అని యడిగిరి. సన్న్యాసి 'యీ శిశువు మీ శిశువేనా' అనెను. వా రగు ననిరి. 'మీరిద్దరు భార్యాభర్తలా' యని సన్న్యాసి మరల ప్రశ్నించెను. వారు 'చిత్త' మనిరి. సన్న్యాసి 'ఓయీ! శిశువులు దీర్ఘాయువు లగుటకు తల్లితండ్రుల ప్రేమ నిష్కల్మషమై యుండవలెను. ఆ నిష్కల్మషత యెట్లు పాలించవలయునో మనకు తెలియదు' అని ఛరాలున నడచి పోయెను. వారు తెల్లతెల పోయిరి.

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారులసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేద లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

మేనేజరు, 'భారతి.'

# పురాస్మృతి

కొల్లూరు ధర్మారాయ కవిగారు, B. A.

శ్యామ వియత్తరంగిణిని జాబిలిదోన మునింగె, గాఢని
ద్రా మదిరాప్రమత్తత నిలాతల మెల్ల మృతించె, నింక నా
శ్యామలదేవి! మందపవనాంచలమట్లరుదెంచి యీరహో
యామినిలోననే యిముదునట్లొనరింపుము వేయిజన్మముల్.

చుక్కలు జాఱువేళ నిడుచూడ్కుల నాకసమంతఁ జూతు, నో
టక్కరిచిన్నదాన! మగుడన్ బఱతెంతువు నీ వటంచు, నే
చక్కని జూడ నీయడుగుజాడయుఁ దోఁచదు, పాలబాటలో
నెక్కడ డాఁగినావొ వచియింపుము నీరవకాంతిగోళముల్.

ఎందఱికోసమో పరితపించిన నాహృదయంబు నేఁటి కా
క్రందనమేని లేని యొకగాటపుటూరుపుతోన నిల్చె, నీ
కెందలిరాకుమేనునకు కీలల కౌఁగిలి సోఁకినంత నా
డెందము చీల్చికొంచు వెడలెన్ వినువీథికి రక్తబాష్పముల్!

నీవు హిమాలయంబున ఘనీభవమొందిన మంచురాలపైఁ
బోవు వసూధినీతరఃణిపోలిక నీజలదాలచాటునన్
జీవనరాగగీతి వెదఁజిమ్ముచు నాకొఱ కేడ్చి యేడ్చి, ని
ద్రావివశమ్ములైన కనుదమ్ముల మూసితె మానవాళిపై?

నిదురకలంత మబ్బుతెలినీడలమాటున పొంచి వచ్చి నా
హృదయము తట్టిపిల్తు రెవ, రీనడిరేయి హిమంపుఁజేత నా?
బెదరుతనాల చీఁకటుల పెంజిలికూఁతురుతో దహించి బూ
డిద యయి పోయె నావలపుడెందము! లే వొకమాఱు ప్రోఁతయున్.

ఈగాఢాంధవిషాదరేఖ తలపూ, వీధ్వాంతకల్లోల వ
ల్లీ గోళాకృతి సింహపీఠి, యిటుఁ బాలింతున్ వినిద్రాస్థికా
రాగారంబుల వీడిపోయిన రహస్యప్రేమభిక్షార్థలన్,
సాగింతున్ తుదిదాఁక నీప్రణయసంస్పందంబు నీతంత్రిపై!

తెరతెరలై మొయిల్లిసుకతిన్నియ లట్టులు జాడజాడలై
తెలుఁగని చైత్రమాసపుచదల్, తుది లేని రహస్సుషుప్తిలో
నొరగిననీకునై పఱచియుంచిన వేలుపుపానుపేమొ, నీ
వరిగినధూమరేఖ నడయాడెడి, నల్లనిత్రాఁచుపోలికన్.

# ప్రేమ గుడ్డిది

పి. వి. సతిగారు, B. A., L.L.M., M.R.A.S.

హిందూకన్య పెండ్లికథ—అంటేనే విశేష మేమిన్ని లేదన్నమాట. పిల్లలకు మాకు పతిభక్తి వెన్నతో బెట్టింది. పతియే మాకు దైవం. వారికోసం యేమి చేయమన్నా చేస్తాం.

నేను కవిని గాను; కథలు వ్రాయలేను. వ్రాయగలిగితే బాగనే యుండును. అప్పుడొక చక్కనికథ రచించేదాన్ని. కాని యింతకే నా తృప్తి. ఒకటిమాత్రం నిశ్చయం. నా భర్తను సంతోషపెట్టడమే నాకు పరమావధి. నేనీ కథను వ్రాస్తే వారికెంతో ఆనందం.

విలాసపూరు కలెక్టరుకచేరిలో నా తండ్రికి గుమాస్తాగిరి. ఆయనకు ఐదుగురుబిడ్డలు. అందరిలో పెద్దదాన్ని నేను. మా నాయనకు నెలకు నూరురూపాయలు జీతం. సంసారం నిర్వహించడం యెంతకష్టమో మీరే ఊహింపవచ్చు. మేమందరము పసివాళ్లంగా ఉండేటప్పుడు యెట్లాగో సమర్థించేవాడు నాన్న. కాని పిల్లలము బడికి పోవడం ప్రారంభించేసరికి ఋణగ్రస్తుడు కావలసివచ్చింది. మా తాతగారి ఆస్తినంతా అమ్మి ఖర్చు పెట్టేశాడు. దివాలాస్థితికి వచ్చాము.

మా కష్టాల కదే అంకురార్పణము. నాకు పదునాల్గోయేడు దాటింది. పెండ్లి కావాలి. హిందూబాలికకు పెండ్లంటే బోలెడు ఖర్చు. మంచి వరశుల్కం యీందే యెవ్వరూ కన్నెను పెండ్లాడరు. మానాన్న డబ్బు తెచ్చి పెట్టలేడు. దేవుడు నన్ను కరుణించి సృష్టించలేదు. చెప్పుకోదగ్గ సౌందర్యం నాకు లేదు. పిల్లతండ్రి యెంత ధనికుడైనా, పిల్ల యెంత విద్యావతి యైనా, సౌందర్యము లేనిదే ప్రయోజనము లేదు. ప్రతిపిల్ల అందంగా ఉండాలని కోరుతుంది. అందంగా చూపట్టనైనా చూపట్టాలి. భాగ్యవంతుల పిల్లలు పౌడర్లద్ది, నగలు దాల్చి, వెలగల చీరలు కట్టి, వోమాదిరి చూపట్లమని త్రోసుకపోతారు. మాకంటే డబ్బు లేదాయె.

నాన్న నాలుగేండ్లు వెదకాడు, మంచి జీతం సంపాదించే వరుడు దొరుకుతాడేమో నని. ఎవడూ దొరకలేదు తుదకు గుమాస్తా సైతము నన్ను పరిగ్రహించ నన్నాడు. విసుగు పుట్టిపోయింది నాన్నకు. కానీ, నేనేమి చేయడం! ఎక్కడినుంచి వస్తుంది నాకందం? దేవుడు పెట్టినతీరు అనుభవించక తీరదు.

నాకూ పెండ్లిజేసుకోవలెననే యిష్టం. ఎవణ్ణి చేసుకోడమనేది నాకంత ముఖ్యంగా తోచలేదు. నాకు పెండ్లయితే నాన్న, అమ్మ సంతోషిస్తారు. కాని నేనప్పుడెవర్ని పెండ్లి చేసుకోకపోవడం నా భాగ్యమే. లేకపోతే నా జీవితపు పెన్నిధి నాచేతిని మించిపోయేది.

* * * *

మా పొరుగున ఉండేవాడు రావుబహాదూరు దేశముఖుగారు. పొరుగేమిటి, వారి తోటల్లో ఒక చిన్నయిల్లే మే మద్దెకు పుచ్చుకున్నాము. రావుబహాదూరు వకీలు. మంచి సంపాద్యం గలవారు. అతని కూతురు శాంత నాకంటే రెండేండ్లు పెద్దది. మే మిద్దరం చిన్నప్పటినుంచి స్నేహంగా ఉండే వాళ్లం. బాల్యములో భాగ్యాభాగ్యభేదం లేదుగదా.

శాంత మెట్రికులేషన్ పరీక్ష ప్యాసయింది. బొంబాయిలో విల్సను కాలేజీలో ప్రవేశించింది. విలాసపూరు కామె వచ్చినప్పుడల్లా నేను వెళ్లి చాలాసేపామెతోటి గడపే దాన్ని. ఒక సంవత్సరం దాటేసరికి నా కామెలో మార్పు కన్పించింది శాంత భాగ్యవంతుని పిల్ల, చదువుకున్నది కూడాను. దాని కర్థం నా కప్పుడు గోచరమైంది. నేనూ నా దృష్టిని మార్చుకున్నా. నేను రూపంలేని బీద పిల్లనని మరచిపోయే దెట్లా? నిజానికి, శాంత చాలా చక్కనిపిల్ల. అద్భుతమైన చక్కదన మని చెప్పాలి. పిల్లను పిల్ల మెచ్చుకోకూడదు గాని నేను శాంతను మెచ్చుకోక తప్పింది గాదు.

దినకర రావు—ఏమంటున్నాను! కాని కథ సాగనీ—శాంతకు సహపాఠి. ఇతని పిన తండ్రి వాసస్థలం పునహాపట్టణం. దినకర రావు నితడు దత్తు పుచ్చుకొంటాడని వదంతి. బి. ఏ. ప్యాసు కాగానే సీమకు పోయి ఐ. సి. యస్. పరీక్షకు చదువవలెనని దినకర రావును గూర్చి పినతండ్రి నిశ్చయం. దినకర రావుకు శాంతకు చెలిమి యెక్కువ కావడం రావు బహాదూరునకిష్టం. వేసవిసెలవులకు రావుబహాదూరు యింటికే వచ్చేసేవాడు దినకర రావు. శాంతకు ఆరోజుల్లో మహదానందం. వారి ముచ్చట్ల కంతం లేదు. వాదప్రతివాదాలు నిత్యకృత్యం. నిజంగా యెంతో సుఖంగా వుండేవారు శాంతాదినకర రావులు.

నే నేదో పూర్వాచారాలు పాటించే పిల్ల నవడంచేత, శాంత దినకరరావుతో అంత స్వాతంత్రించి ఉండడం నాకు నచ్చేది కాదు. అది అనుచితమని నా తలంపు. శాంతతో నేనీవిషయం హెచ్చరించే సరికి, శాంత అన్నది,—

"వేణూ, దినకర రావును నేను ప్రేమిస్తున్నా, అతను నన్ను ప్రేమిస్తున్నాడు. నేను ఆయనకు నిశ్చితమన్న మాటే. మా నాన్న కిదంతా తెలుసు. మా డిగ్రీలకోసరం వేచి యున్నాము. ఎందుకు మేము మరి చనవుతో ప్రవర్తించకూడదూ? ఏమిటి నీయాక్షేపణ? చెడ్డపిల్లవుగా వున్నావు"

శాంత చెప్పిన సమాధానం నాకు నచ్చలేదు.

దినకర రావును నేను చూచింది రెండు మార్లే. నీతిపరుడును, చూపరిగాను కనుపట్టాడు నాకు. ఇతన్ని పెండ్లాడితే శాంత సుఖపడదని నే నప్పుడే అనుకొనేదాన్ని. కారణం నాకు బోధయ్యేది గాదు. కారణం లేకనే కొన్ని

కొన్ని భావాలు మన కుదయించడం సామాన్యము. ఇప్పుడు నాకు గ్రాహ్యమవుతున్నదా విషయం.

దినకరరావు కలెక్టరీ చేయవలెనని పినతండ్రి కోరిక. కాని దినకరరావు ప్రొఫెసరు కావలెనని నిశ్చయించుకొన్నాడు. శాంత కది సమ్మతి కాదు. అతడు గొప్ప జీతాలు పొంది ధనం చేకూర్చి, కొద్దికాలం కొద్దిధనం దేశసేవకు వినియోగింపవచ్చు ననిఆమె యభిప్రాయం. దినకరరావు వొప్పుకోలేదు. శాంత కెదురుమాట గిట్టదు. ఆమెకు కోపం వచ్చింది. దినకరరావు ముఖంకూడ చూడ్డ మానేసింది. ఆ సమయంలో నేనచట వుండడం తటస్థించింది. పరుగెత్తి వెళ్లదామన్నంత చీకాకు వేసింది నాకు.

దినకర రావు నావంక తిరిగి, "వేణూ, నేనేమి చేయాలో చెప్పు. సివిల్ సర్వెంటునై విస్తారం ధనం గడించడమా, లేక నాజీవితాన్ని విద్యావ్యాప్తి కర్పించడమా? ఉద్యోగిగా దేశాన్ని కొలవడం తప్పని కాదు నేను జెప్పేది, కాని విద్యకు జీవితాన్నర్పించడం అంతకంటే యెంతో మేలని నాయభిప్రాయం. నీకేమి తోస్తుంది" అన్నాడు.

"వేణూ, యేం చెప్తావో చెప్పు. నీవు మాకు తీర్పరివి. తీర్పు మా తగాదా" నన్నది శాంత.

నాకేమీ తోచలేదు. కలతపడిపోయింది నామనస్సు. అదరుతూ, బెదరుతూ పెదవులు కదలించి ఒక్కవాక్యం చెప్పేటప్పటికి కష్టమైపోయింది: "మీరు మీజీవితాన్ని విద్య కర్పించాలిసిందే". అప్పటి నాచిత్తప్రవృత్తి, నా గగుర్పాటు నాకు తప్ప మరెవ్వరికి గోచరం లేదు.

"ఎంతమాట! వేణు నాపక్ష మంగీకరించింది" అన్నాడు దినకరరావు.

"అవునవును" అన్నది శాంత, కొంచెము మంటతో. "ఈవిషయంలో మీకు వొద్దిక కుదిరింది గనుక నీ వామెను పెండ్లాడొచ్చు. దేశసేవ దేశసేవనే. నీ పచ్చరుకు తగిన తోడవుతుంది యీమెకూడా." అంతటితో చివుక్కున లేచిపోయింది శాంత.

భగవానుడా, యేమి టీచిత్రం! ఇరువురిని రంజింపజేస్తామనుకొన్నానే, యిదా ప్రతిఫలం!

ఇది వుదయం జరిగిన విశేషం. సాయంత్రము మళ్లా దినకరరావు, శాంతా మోటార్లో షికారుపోతూంటే చూశాను. నామనస్సెంతో కలత తేరింది. చివరకు దినకరరావు, శాంత వివాహం చేసుకోడం నిశ్చయించుకున్నారు. అదిన్నీ తొందరలోనే. తమాషా పట్టిస్తామనుకొన్నా నేను. తరువాత శాంతను కలుసుకోగానే, "శాంతా, ఉదయం దినకరరావుతో అలా తగవులాడితివే, యేలా మరచిపోయినావు సాయంత్రానికే" అని అడిగాను.

"అవును వేణూ, నేనదంతా మఱచిపోయినా" అన్నది శాంత, అయిష్టంతో.

"భేదాభిప్రాయా లెన్ని వున్నా నేను దినకరరావును ప్రేమిస్తున్నా. మే మిద్దరమూ ఏక మన్నమాటే. అయినా, ఒకమాట చెప్తున్నాను — మేము కూర్చొని మాట్లాడే టప్పుడు నీవు ప్రక్క నుండడం యేమీ బాగా లేదు. అది అకార్యమని నీవు గ్రహించాలి."

ఇది విని నిర్ఘాంతపోయినా. శాంతకు నామీద ఈర్ష్యా? నే నేదో బీదపిల్లను; రూపం లేనిదాన్ని. చక్కని శాంత, లక్ష్మి ప్రసన్నురాలు, నాపై అసూయ బూనుటా! నా కారాత్రి నిద్ర పట్టలేదు. పూర్తిగా చలించి పోయినా దీనితో. "మీ కిద్దరికి వాద్దిక కుదిరింది గనుక నీ వామెను పెండ్లాడొచ్చు"—ఈ మాటలు శాంత పల్కినవి నాచెవులలో విన బడుతునే వున్నాయి. నామనసులో నిలిచి పోయినాయి. అవి ఒకకాలానికి నిజమవుతా యని కల గనలేదు నేను.

* * * *

సంవత్సరం గడచిపోయింది. దినకర రావు విద్యాశాఖలో చేరి జాతీయోద్యమానికి తోడ్పడదామన్న మొదటిపట్టు వీడలేదు. బి. ఏ. డిగ్రీ పుచ్చుకోగానే, సీమకు పోయి ఐ. సి. యస్. పరీక్షకు కూర్చోవలె నన్న భావాన్ని పూర్తిగా విసర్జించాడు. భారత సేవాసమితిలో చేరి గ్రామపునరుద్ధరణకు కంకణం కట్టుకున్నాడు. రావుబహాదూరు కిది బొత్తిగా సరిపడ లేదు ఆ యన కు కోపం వచ్చింది. డబ్బు పంపేది లే ద ని బెదరించాడు దినకరరావును. ఇత డేమీ చలించలేదు. నవనాగరికతలన్నీ వదిలి గ్రామాల్లో స్వదేశీప్రచారం ప్రారంభించాడు. రావుబహదూరుకు, శాంతకు యింతటితో విరక్తి పుట్టింది. అతనితో సంబాధం పూర్తిగా మానుకొన్నారు. అంతకుపూర్వం, రావుబహాదూరుగారి గృహా న్నలంకరించిన దినకరరావు ఫొటోలన్నీ అదృశ్యమైనాయి. దినకరరావు నామో చ్చారణ సైతము తనముందు పనికి రా దన్నాడు రావుబహాదూరు.

సెలవులకు శాంత విలాసపూరుకు వచ్చి వుండగా నే నామె నడిగా ను, "శాంతా, దినకర రావుపై ఇంత నిష్కరుణ వూనినా వేమి? గాఢ్ఢిగా అతణ్ణి ప్రేమించా నన్నావుగదా" అని.

"కాదు వేణూ, నే నెప్పుడూ అతన్ని ప్రేమించలేదు. అతడు నన్ను ప్రేమించా నన్నాడు. నేను అల్లే అనుకున్నాను. అంతే కాని యీవిషయ మిప్పుడు త్రవ్వకోడం నా కిష్టంలేదు" అని జవా బిచ్చింది శాంత.

తరువాత దినకరరావునుగూర్చి నాకేమీ తెలియ రాలేదు. ఆరునెలలు దాటినవెనుక ఇంపీరియలు మెడికల్ సర్వీసులో నున్న డాక్టరు ఓక్ గారిని వివాహమైంది శాంత. రావు బహాదూరు ఉచ్చపదవిలో నుండెను మరి. ఇంపీరియలు సర్వీసులో లేని అల్లుడు పనికిరాడు. ఓక్ గారిని "బాపూసాహెబ్" అని పిలిచేవారు. అతడు కురూపి. కాని ఐ. యం. యస్. గదా! ఇం కేమి కావాలి?

* * * *

నాకు యిరువదో యేడు గడుస్తూంది. ఈ సంవత్సరా లంతా మానాయన వరుణ్ణి వెదకడంతో విసిగిపోయాడు. కడకు దొరకినాడు వరుడు. అమ్మ పెండ్లికార్యానికి హడావిడిగా పనులు సాగించడం మొదలెట్టింది. మేము వరుడింటికే పెండ్లికి పోయేటట్టు తీర్మానం. మా నాయన యెవరికిన్నీ తెలిపినాడు గాదు వరు డెవరైందిన్నీ. గడచిన ఆ రేండళ్లోనూ మున్నో సంబంధాలు విఫలమైనాయి. అందుకని యీ సారి రహస్యంగా దాచేడు. వరు డెవరో తెలిసికోగోరుతాను నేనూ. ఒకటి రెండుసార్లు నాన్న నడుగుదా మనుకున్నా. కాని అది అసంగత మేమో నని మరల ఊరకున్నా. ఎట్లో మా నాయనకష్టాలు గట్టెక్కుతున్నాయి. అంతే నాకు కావలసింది.

ముహూర్తపురోజు సమీపిస్తుంది. ఒక దినం ముందుగా ఉదయం రైలులో మా వూరి నుండి బయలుదేరినాము. మేము సోనగావని కెళ్లాలి. ఇంతకూ పెండ్లివాళ్లము నలుగురమే. ఎందుకు నాపెండ్లికి వైభోగం! పెండ్లి నా విధి. దాన్ని జరిపించడం నాన్న కర్తవ్యం.

సాయంత్రానికి సోనిగావని చేరినాము. ఆవ్వూరిపటేలు యిరువదిబండ్లతో వచ్చినాడు స్టేషనుకు. మే మొక గుంపెడు వస్తా మనుకున్నాడేమో. నలుగురమే అయ్యేటప్పటికి అతనిముఖం చిన్నవోయింది. పటేలుతోటి వచ్చిన ఆవ్వూరివారుమాత్రం మాకన్నీ సౌకర్యాలు చేకూర్చారు. మమ్ము చూడడం వాళ్లకానందంగా ఉంణ్ణింది. వాళ్లకు వదినెగాబోతాగా నేను.

"నేను చెప్తున్నా, దాదాసాహేబ్" అని మొదలుపెట్టాడు పటేలు. "దినకరరావు అదృష్టవంతుడు......" అని యింకా యేమో చెప్పబోయేసరికి మా నాయన వేరే మాటల్లోకి దించాడు.

"దినకరరావా? ఏ దినకరరావు? పూర్వపు దినకరరావేనా ఇతడూ?" ఈ ప్రశ్నలన్నీ బయస్కోపుమాదిరిగా నా మనసులో స్ఫురించాయి. ఇతను ఆదినకరరావే అయితే... యెంత భాగ్యం? కాని రూపం లేని, చదువు రాని నాలాంటిపిల్ల నతడు పెండ్లాడడ మెట్లా?"

మేము సోనగావని చేరినాము. దినకరరావు పెండ్లని ఊరిలో ఆబాలగోపాలము సంతోషిస్తున్నారు. ఊరిస్త్రీ లందరూ, కళ్లుకపట మెరుగని ఆ'కుంబీ'లందరూ, పెండ్లిఊరేగింపులో పాల్గొనేవారే. మరుదినం ఉదయం నేను దినకరరావు ధర్మపత్నినైనా. కాని, యెవ రీదినకరరావు? ఇరవైయేండ్లదాన్ని సిగ్గుపడటానికి కారణము లేదు గాని, మొఖమెత్తి చూడలేకపోయినా అతణ్ణి. చివరకు కండ్లెత్తి చూచేటప్పటికి, యేమిదృశ్యం! దినకరరావు పూర్వపు దినకరరావే. శాంతనువివాహమాడదలచినవాడే. కాని, పాపము కండ్లు లేవు. ఈ గ్రుడ్డిమనిషిని పెండ్లిజేసుకోడం నా కిష్టమేనా? పెండ్లిజేసుకోడం యిష్టమే కాని, కండ్లు లేవని అపరిమితమైన దుఃఖముకూడాను.

అయినా అత న్నిప్పటికిని ప్రేమిస్తున్నా. ప్రేమ గ్రుడ్డిది. ఆరాత్రంతా నాకు కంటి తడి ఆరలేదు. ఏడుపు ఊరట కూర్చేదిగదా.

నా పెండ్లి కాగానే నా తలిదండ్రులు విలాసపూరుకు పోయినారు. నేను నా భర్త తోకూడ కాపురం చేస్తున్నా. భర్త నాకు తన కథంతా చెప్పేడు: — సివిల్ సర్వీసుకు ప్రయత్నించలేదని పినతండ్రికి దనకర గావుపై ద్వేషం కల్గింది. తన ఆస్తినంతా దూరబంధువుకు వ్రాసి యిచ్చి పరమపదించాడు. నాభర్త గ్రామోద్ధరణభారము వహించాడు. అతడు సొనగావని చేరి యిచట నివాసం యేర్పరచుకున్నాడు. ఊరిబడిని స్వాధీనంచేసుకొని బాలబాలికలకు చదువు చెప్పడం ప్రారంభించాడు. గ్రామస్థులకంతా ఆరోగ్యపద్ధతులు, వ్యవసాయములో క్రొత్త క్రొత్త మార్గాలు బోధించాడు. నాభర్త గ్రామస్థుల కెంతో ప్రీతిపాత్రుడైనాడు.

ఒకదినం ఊరిలో నిప్పంటుకుంది. గుడిసె వొకటి తగలబడుతూన్నది. మూడేండ్ల శిశు వందులో నిదురిస్తున్నాడు.

ఎవరికిని లోపలికి పోవడానికి ధైర్యం చాలలేదు. నాభర్త గుడిసెలోనికి జొరబడి శిశువును బయట వేసినాడు. కాని తనయొడలంతా దగ్ధమైంది. కండ్లు పోయినాయి ప్రాణం దక్కడమే మహాద్భాగ్యం.

అతడు గ్రామోద్ధరణకు తన జీవితా న్నర్పించవలె ననుకొన్నందున పెండ్లి తలపెట్టనాడు కాదు. పెండ్లంటే ఖర్చు అని అతని మతము. కాని కండ్లు పోయిన తర్వాత తనకు మనిషిసహాయం అత్యవసరమయి పోయింది. సొనగావని వా రందరూ పెండ్లి జేసుకోమని యితన్ని నిర్బంధపెట్టేరు. తన్ను ప్రేమించి జాగ్రత్తగా చూచుకోగల పిల్లను పెండ్లాడడం భావ్యమేనని అతనికికూడ తోచింది. అపుడు నన్ను స్మరించుకొని నాతండ్రికి జాబు వ్రాసినాడు. నాతండ్రికి కావలసిందిన్ని వరుడే. అందుచేత తత్క్షణమే ఒప్పుకొన్నాడు.

"కాసీ, వేణూ, యిటు చూడు. నే నిన్ను మోసం చేయదలచుకోలేను. నేను గ్రుడ్డివాడననీ,నీ వొప్పుకుంటేనే పెండ్లిజేసుకుంటానని, నీ తండ్రికి జాబులో వ్రాశాను. చెప్పినారా యీ విషయం నీతో?" అని అడిగినాడు. నా భర్త.

"లేదు. నాకేమి చెప్పలేదు. ఏమి వ్రాశాడు బదులు నాయన?" అని నేనడిగాను.

"నీవు నన్ను పెండ్లాడడానికి సంపూర్ణముగా సమ్మతిస్తున్నావని వ్రాశాడు. వేణూ, దాపరిక మెందుకు? నిజం చెప్పు. నన్ను పెండ్లాడినందువల్ల నీజీవితం పాడయిపోయిన దని తలచవా?"

"కానే కాదు. మీ ధర్మపత్ని నైనందుకు గర్విస్తున్నా. ప్రజాసేవకై మీ దృష్టి కోల్పోయినారు. నాభర్తను జూచి నేను గర్వపడుతున్నా. మీ కృషి కంతకు నేను బాసటగా నుండుట కేయభ్యంతరమూ లేదు. విశ్వసించండి నన్ను" అని నేను పలికేసరికి అతని

నేత్రములనుండీ హర్షాశ్రువు లేకధారగా ప్రవహించాయి.

"కానీ, నీవు నన్ను నిజంగా ప్రేమిస్తున్నావా?" అన్నాడు నా భర్త, కళ్ల నీళ్లు తుడుచుకొంటూ.

"మీకు సందేహ మెందుకు? నేను మిమ్ము గాఢంగా ప్రేమిస్తున్నా. శుద్ధిగా ప్రేమిస్తున్నా ననవలసింది."

ఇంకా యేమో చెప్పబోయినా గాని, నోట్లోనే నిలిచిపోయింది మాట.

"మీరు నన్ను తిరిగీ ప్రేమిస్తున్నారా?" అని కొంచెం నవ్వుమాటగా అడిగేను. "నేను చదువురానిదాన్ని. ఇటువంటిమూఢురాలు మీభార్య కావడం మీ కిష్టమేనా?"

"కాకేము? నీవంటిపిల్ల కన్నులు విచ్చుకొని నన్ను శుద్ధిగా ప్రేమింప గలిగితే శుద్ధి వాడు శుద్ధిగా నిన్ను ప్రేమించలేడా? ప్రేమ శుద్ధిదిగదా!"

ఈలాంటి సంభాషణలు మాకు పరిపాటే. అనేక మైనప్పటికి ప్రతిసంభాషణకు యేదో వింతచోద్యము కలదు. మా కెప్పుడూ విసుగు పుట్టదు. పగలు నేను ఊరిపిల్లలకు చదువు చెప్పతాను. రాత్రి నా భర్తగారి కొరకు గ్రంథపారాయణం. వారు చెప్పే వ్యాసాలు నేను వ్రాసి పత్రికలకు పంపుతా. పత్రికలకు వ్రాసినందుకు మాకు కొంత ఆదాయం. పల్లెటూరివారు విద్యావిహీను లైనా, అతన్ని శుద్ధిగా ప్రేమిస్తారు. ప్రతి విషయానికి సోదనికి బలె, యితని దగ్గరకు వచ్చి యితని అభిప్రాయం పొందుతారు. నాభర్తగారి ప్రయత్నమువల్లనే ఊరిలో నొక స్వదేశీవస్తువుల దుకాణమున్నూ, సహకారసంస్థ యేర్పడినాయి. గ్రామజను లొకచోట చేరి వార్తలు తెలిసికొనేటందు కొక గ్రంథాలయము స్థాపించాడు. మాకు డబ్బు యెక్కువ లేనందున భాగ్యవంతులము కాదు. కానీ, సౌఖ్యమే భాగ్య మైతే మాది ఐశ్వర్యమే అనాలి. ఈ సౌఖ్యానికి మించి నే నేమీ కోరను. నా శుద్ధిభర్తను శుద్ధిగా ప్రేమించడమే నాజీవితేచ్ఛ. ప్రేమ శుద్ధిదిగదా!

(మే-జూన్ నెలల 'త్రివేణి' ఆంగ్ల పత్రికనుండి)

అనువాదకుడు: గు. వెం. సు.

 అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

## ఓడరేవు—(బాపట్ల తాలూకా)

ధనధాన్యలక్ష్ము లందముగ నృత్యములాడ నొప్పారుచుండెడి దోడరేవు
ఎగుమతుల్ దిగుమతు లెసకమెసఁగుచుండ నుజ్జ్వలం బయ్యెడి దోడరేవు
ఓడబేహారుల మేడల మిద్దెల నొప్పగచుండెడి దోడరేవు
పలుదేశముల వస్తువుల దింపుకొని యూళ్ల కొసఁగుచు నుండెడి దోడరేవు
అంచు వృద్ధులు నిచ్చ వల్లించుచుందు - రిపుడు సున్నపుబెత్తిక లిటికలాల
తునుకలపు నాదులుం దప్పఁ గనఁగఁబడదు - నీవిభవ మక్కటా! ఓడరేవుపురమ.

అంచితంబైన కారంచేడుగ్రామంబు ధనికులతోడ నిండినది యగుట
చీరాల పేరాల చిన్నపూరిండ్లలో నేతమగ్గంబులు నిండియుంట
నేటపాలెము జాంద్రపేటయు రంగులయద్దకంబులకుఁ బ్రఖ్యాతిఁ గనుట
వేదశాస్త్రశ్రౌతవిద్యలకు వెదుళ్లపల్లి స్వైరవిహారభవన మగుట
నీబజారులలోపల నీయంగడుల - నీమహాహర్మ్యములయందు నెగడియుండు
హెచ్చుబేరములకు సాక్ష్య మిచ్చియుండె - నీవి చెడియుంటి విపు డోడరేవుపురమ!

## కొత్తపట్టణము—(ఒంగోలు తాలూకా)

సందు లేకుండంగఁ జంద్రకూచంబులు, పాతినగోడలరీతిఁ జూడ
ఇటికతాతునుకల నిసుక సున్నము పోసి, గట్టిచేసిన వేదికలను జూడ
వెడలు పెక్కువ గాఁగఁ బెంచికట్టినజీర్ణములగు గోడలపునాదులనుజూడ
పలురకంబులముండ్లుగల చెట్లపొదలఁగప్పట్టు మహావరణములఁ జూడ
నీవు నిస్తులవస్తుసమృద్ధి మనుట, - నీవు ధనపుఁబాంతరలతో నిండియుంట
చూపఁ అస్మృతిసరణికి వచ్చుచునెయుండు - బ్రతికి చెడి యుంటివో క్రొత్తపట్టణంబ

# కరుణరసము

మూడవది హాస్యవిరోధి యగు కరుణము. ఇష్టనాశమునవో, అనిష్టప్రాప్తివలననో ఇది జనించును. కపోతవర్ణమును, యముడు దైవతము నగును. శోక మిందులకు స్థాయి. మృతాది యాలంబనము. తద్దాహాదికావస్థ లుద్దీపనములు. దైవనింద, భూపాతము, రోదనము మొదలగునవి దీని యనుభావములు. వైవర్ణ్యము, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, స్తంభము, ప్రలాపము, ఇవియును. నిర్వేదము, మోహము, గ్లాని, శ్రమము, విషాదము మొదలయినవి వ్యభిచారులు. ఇట్టికరుణము వేరు, కరుణవిప్రలంభము వేరు. ఇందులకు స్థాయి శోకము; కరుణవిప్రలంభమునకో స్థాయి రతి.

### కరుణరసము (గీతము) రామకిరీరాగము - ప్రత్యంగతాళము.

ఆర్యతనయ హృది తవ కిమిదం స్థితిః హహాకదాపి న జానే,
క్వచిదిహ జగతి నఖిలు భవత్ప్రియ మహ మకరవ మితి జానే.

ఏకశ ఇహ మమ తపనకులోజ్జ్వల నికటీభవగుణసింధో,
దర్శయ నిజముఖమోషధిపతిరుచి మాత్రిసమాకులబంధో.

వీక్ష్య తవాఽఽస్యవిధుం లలితం ప్రమితా ఏషా చిర మతికష్టా,
దాశరథేర్దయితారుదతీఖలు నమ్రముఖాశుభదిష్టా.

ఇత్థం విలపతి దేవరలక్ష్మణభాషితమతిశయఘోరమ్,
శ్రుత్వా చిగదిననిజవననివసతి రూప ముధైర్యప్రకారమ్.

## సీతాపరిత్యాగము

### రంగము—వాల్మీకి తపోవనము.

[సీత కూరుచుండియు, చెంతలక్ష్మణుడు నిలుచుండియు ప్రవేశింతురు]

సీత—అన్నా! లక్ష్మణా! ఇట్టి ప్రశాంతిధూములు నన్నానందింప జేయజాలకున్నవదియేల? ఆకస్మికమగు నాయాసము నన్ను వేధించుచున్నది. నా హృదయము మిగులబరువెక్కినట్లున్నది. అన్నా! మరల నాకుడికన్నదరుచున్నది. ఈశకున మేమయియుండును! ఏదేని అనర్థమును సూచింపదుకదా! ఏమో నాప్రాణేశుని పట్ల ఎట్లు పరిణమించునో తెలియదు. ఛీ! అతని సరసను వదలుటలో తొందరపడితిని. నామనస్సు దిగులుపడుచున్నది. (కన్నీళ్లుగార్చుచు) నాప్రాణేశుని పదనకమలమును ఇకనెన్నటికిని చూడబోనేమో!

లక్ష్మ—(అధోముఖుడై విట్టూర్పును.)

సీత—ఎందుకంత చింతిల్లుచున్నావు? మన కేమయిన ననర్థములు సంభవించెనా? మాటలాడవేల?

లక్ష్మ—అమ్మా! ఏమని పలుకుదును? ఓదురదృష్టమా! నేనట్టి దారుణశాసనమును నెరవేర్పవలయు ననియా నీత లంపు? (తలమోదుకొనును.)

సీత—లక్ష్మణా! వగచెదవేల? చెప్పుమునాయనా, నా జీవితేశుని వృత్తాంత మేమి? అతనికి కుశలమేకదా! (లక్ష్మణుని చేతిని పట్టుకొనును) వేడుకొందును, చెప్పుము. నీ చూపులు నన్ను కలచివైచు చున్నవి.

క్ష్మ—(తనలో) అట్టి దారుణవార్త నే నెట్లెరిగింతును? కాని గతియేదీ? (బిగ్గరగా) తల్లీ ! ఆ క్రూరకర్ము నింట చిరకాలము వసించితివను కారణమున వారు నీ శీలమును సందేహించుచున్నారు. ఇందులకు రాజుగారు— (విరమించును.)

త—ఏమిచేసెను? చెప్పుము, వేడెద—నన్ను వదలెనా?

క్ష్మ—తల్లీ ! అవును. నిన్నీయాశ్రమమున వదలిరమ్మని నాకనుజ్ఞనిడెను.

త—(దిగులుతో) ఏమీ? నన్నుపరిత్యజించెనా అంతటి ప్రేమగలవాడు? కాని నన్నుపరిత్యజింపనేల? ఏమియు నెరుగనిదానను, నిరపరాధను నన్ను వదలినాయశస్సును కళంకితము జేయనేల? నిష్కారణమగు నాయపవాదము నతడు నమ్మెనా? అయ్యో! అగ్నిపరిశుద్ధనయితినే. ఇంకను సందేహములకు తావేద? లేదు లేదు; నే నతనిశరీరము నాత్మయు నని అతనికి బాగుగదెలియును. తనప్రజల సంతోషపరచుటకే ఇటు లాచరించియుండును. అతనిని నిందించి యుపయోగములేదు. (నిట్టూర్చును) అయ్యో! నే నిందులకే జన్మించితినా? నాయట్టి దౌర్భాగ్యవతి మరియొకతె ప్రపంచమున గలదా? దురదృష్టమా! నన్ననవరతము దుఃఖింపజేయనెంచెదవా? దుఃఖసముద్రములో మునిగి కృశింపజేసితివే గాని యెన్నడును ఒకక్షణమేని యానందము ననుభవింపజేయవైతివికదా! శివధనుస్సును విరిచి నాహృదయేశుడు నాపాణిని గ్రహించినప్పుడు రాణినై ఇక సుఖముల ననుభవింతునని తలంచితిని. కాని నా దురదృష్టము. సింహాసనము నెక్కబోవు సమయమున నానాథుడు అడవికి పోవలసివచ్చెను. నేనును వెంబడించితిని. కాని యేదియెట్టున్నను అతని సహవాసమున అడవియందును స్వర్గసౌఖ్యము ననుభవించితిని. అదియు రావణుడు సన్న్యాసివేషమున వచ్చి నన్నపహరించుకొని పోవునంతవరకు. అతని యావాసమంతయు నంధకారావృతము. అపుడు నేను బ్రతికియు చచ్చినట్లేయుంటిని. నాకాంతుని యెడబాటున నే పడిన యిక్కట్టులు తలంచిన దిగులగుచున్నది. కాని యతడెన్నియో యిడుములబడి నన్ను తప్పించెను. సముద్రమునకు సేతువుకట్టి లంకజొచ్చి యుద్ధమున నతనిని మట్టువెట్టి నన్ను విడిపించెను. మరల మేము కలసికొంటిమి. ఇకనైనను ఆనందమున దినములు గడుపుదుమని తలంచితిమి. కాని యా యదృష్టదేవత యింకను తృప్తిపడలేదని యెవరికెఱుక. భాగధేయమా! యీ మహాదుఃఖసముద్రమున నన్ను మరల ద్రోయనెంచితివా? (ఆగును) అన్నా! వ్యసనములకును, కష్టములకును నేను వెరవను. అడవిలో నెన్నియో యిడుములబడితిని. (ఏడ్చును.) కాని, ఋషికన్యలు నాపరిత్యాగమునకు కారణమడుగుచో నేనేమని యుత్తరమిత్తును? అయ్యో! నా శీలమున వారు సందియపడుదురు. వారియెదుట బ్రతుకుటెట్టులు? ఛీ!—లక్ష్మణా! నేను గర్భవతినై కాకుండిన యెడల గంగలో నురికియుందును. నా జీవితేశుడు మాత్రము నాకై పరితపింపడా? ఏమో యెంత యంగలార్చుచున్నాడో? కాని యెంత దుఃఖించి యేమి ప్రయోజనము? నాథా! నాకై వగవవలదు. లక్ష్మణా! తొందరగ వెడలుము. అతని నోదార్చుము. ఎన్నటికి నతని నొంటిగ నుండనీకుము. ఒంటరిపాటు దుఃఖము నినుమడింపజేయును సుమా! నా ప్రేమ నతనికి తెలుపుము. అత డాచరించిన దంతయు ధర్మ్యమని చెప్పుము. ప్రజల తృప్తిపరచుట రాజధర్మముకదా! నన్ను జీవితాంతము వదలినను మరువవలదని చెప్పుము. వత్సా! అతని సౌఖ్యమునకును, యెడబాటే యెఱుగని లోకమున మా యిరువురియాత్మల కలయికకును నే నిచ్చట దైవమును ప్రార్థించుచుండెదను. [తెర]



3. కరుణరసము—సీతాపరిత్యాగము



౬. హాస్యరసము—కాలనేమిదంపతులకలహము

# హాస్యరసము

శృంగారానంతరము తదనుగామి యగు హాస్యము. శ్వేతమును ప్రమథదేవతాకము నగు. హాస మిందులకు స్థాయిభావము. ఈ హాస మాఱు విధములు—స్మితము, హసితము, విహసితము, అవహసితము, అపహసితము, అతిహసితము, ననునవి. ఉత్తమనాయకులకు స్మితహసితములును, మధ్యములకు విహసితావహసితములును నీచులకు అపహసితాతిహసితములు నుపయోగింపదగును. ఈషద్వికాసినయన హాసము స్మితము; స్పందితాధరము [illegible]ల్లక్ష్యదంతము నగునది హసితము; మధురస్వరము విహసితము; శిరఃకంపసహిత మవహసితము: సాస్రా[illegible]పహసితము; విక్షిప్తాంగ మతిహసితము—వికృతాకారవాక్చేష్టు లగువా రిందుల కాలంబనము. తచ్చేష్టలు [illegible] లుద్దీపనములు. అక్షిసంకోచవదనస్మేరతాదు లనుభావములు. నిద్ర, ఆలస్యము, అవహిత్థ మున్నగునవి వ్యభిచారులు. ఇట్టి హాస్యము ఆత్మస్థ మనియు, పరస్థ మనియు రెండు తెరగులు. తనయందున్న విభావములచే తనకే గలుగునది. ఆత్మస్థము; పరునియందుండు విభావములచే గల్గునది పరస్థము.

హాస్యరసము (గీతము) శంకరారాగము - ఉదీకుణతాళము.

పవనతనయ మతిశయవీర్యం, యద్యహమపహన్తుమిహ ఉన్నతరణకార్యమ్.
లక్ష్మణాయ జీవనఘన ముగగత మభిదాతుమ్,
పతితాయ శరేణ రావణసుదితేన నిహన్తుమ్.
దాస్యతే ఽర్ధరాజ్య మవద దితి రజనిచరేశః,
పరిపూరయతు మనోగత మభిలాషము మేశః.
కింతు యత్ర తిష్ఠతి నను తాపహ మనునయేయమ్,
మయదానవతనయా మమ హృదయస్య హరేయమ్.
దీర్ఘరజ్జు మేవ కురుత ఇతివచన ముదిత్వా,
సహిరావణమాతులః కిలధరణీపరిమిత్వా.
పీడనాయ తోలయతి నకఠినబహుకరీం తమ్,
దయితా నిజబాహునా పతిమభినింద్యతిశాంతమ్.

## కాలనేమి దంపతుల కలహము

### రంగము—లంకలో నొకభాగము.

[కాలనేమి తనయింటిముందు కూర్చొని ప్రవేశించును]

కాలనేమి—(సంతోషముతో) అదృష్టమునకు మనుష్యుడు వినోదపాత్రము. అది కటాక్షించెనా, అతనికి కొరత లేదు. కాని యిది సామాన్యులయెడనే సత్యము. నేనుమాత్ర మామె కటాక్షమునకు గాని, కోపమునకు గాని అతీతుడను. నాది బృహస్పతినక్షత్రము. అతడుగూడ సౌభాగ్యమున నన్ను మించడు. దేవతలకు గురువుగా నున్నను అతడు కుటీరములో కాలము వెళ్లబోయవలసినవాడే. నేను నేడొక కుటీరమున నుందును. రేపు మాగధులు స్తోత్రము చేయుచుండ, అప్సరసలు చామరములచే వీచుచుండ నొక దివ్యప్రాసాదమున రత్నఖచితసింహాసనమున నుందును. ఆజ్ఞతప్ప నురేమియు చేయను. దేవతల నందరిని నా యధీనత నుంచుకొందును. వారు నాయాజ్ఞకయి వేచి యుందురు. ఉందురేమి? అప్పుడే తయారుగ నున్నారు. ఆహా! ఏమి నాయదృష్టము! ఏమి సంతోషము! పరవశతచే పిచ్చియెక్కుచున్నది. ఒక అర్ధరాజ్యమే! చక్కపగము! సామాన్యవిషయము కాదు! (నవ్వును.) విభాగ మెటుండవలెను తెలియునా, వెంట్రుకంతకూడ భేదములేక న్యాయ్యముగ నుండవలెను. (నేలపై లంకపటము గీచును.) ఇదేలంక యనుకొందము. ఈభాగము నాకుండవలయును. ఇది రావణునికి. వాడు నాపాదములబడి 'మామా! నా కింకొకింత వదలుము.' అని పలుమారు ప్రార్థించినను నేను వినను. ఇక రాజ్యము విభజింపబడినటులే. నేను రావణునంతటివాడను. ఏవిధముగను వాడు నన్ను మించ జాలడు. నాకొకటియు, వానికి పదియునోరు లుండెను. అందు విశేష మేమియు లేదు కడుపతనికియు నొకటే, నాకు నొకటియే. అతడు పదినోర్లతో తినుదానిని నేనొకదానితోనే తిందును. (పరధ్యానమ్మున నులికిపడును) ఓహో! సింహాసనమున నెవిగ గూర్చొన దొలుత నభ్యసింపవలయును. లేదా, దుర్మార్గపు ప్రజలు చక్కగ సత్కరింపరు. (సింహాసనమున కూర్చొన్నటులు ఒక చీపురుకట్టను కుడిచేతదీసికొని వింత

తీరున నంతఃపురశిఖరమున నిల్చును.) కాదు—ఇట్లుకాదు. (ఉనికిని మార్చును) అవును, ఇట్లే. చూచితివా నా రాజత్వ మెట్లు ప్రకాశించుచున్నదో? (నడచును) మంచిది. ఇపుడు రాజువలె కొంతపరిక్రమింతము. (అహంకారమున వెనుకకు అంగవేయును) నా ముందును, నా వెనుకను రక్షకు లున్నారు. నన్నిపుడు సమీపింప నెవరికేని ధైర్యము కలుగునా? (ఉల్లాసముగా నవ్వును) నా శయ్యాభాగిని కింకరయై నీ వృత్తాంతము తెలిసియుండునని తలంచెద. వినుటయే తటస్థించెనేని ఆమె అప్పుడేమిచేయునో తెలియదు. సంతోషాతిరేకమున చనిపోవునేమో అని నాకు భయము కలుగుచున్నది. లేదు, అట్లు తలంప వీలు లేదు. ఆమె నా భార్యకదా! నిరుపమమగు నా మానసప్రభావమున నామెకును భాగము కలదుగదా! ఆమె యొటకేనిపోయి యుండును. తిరిగివచ్చినప్పుడు ఇదంతయు నామెకు తెలియగలదు. వెంటనే ఆమె రాణివలె నా సరసకు రాగలదు. కుల మెట్టులున్నను ఆమె యదృష్టమంత చెప్పదగినదిగాదుసుమా! లేనిచో నావంటిభర్తను పొందగలుగునా? కాని యిప్పుడు కాలమును వ్యర్థముగ గడుపుటకు వీలులేదు. ఇదిగో ఈ గడ్డిమోపునుండి యొక త్రాడు పేనెదను. రేపుదయమునకు కావలయును. రాజ్యమును కొలుచుటకు రావణుడు త్రాటినడిగినా, వెంటనే వాని ముఖమున వేయుదును. మంచిది. (త్రాటిని పేన నారంభించి మూల్గును.)

(కాలనేమిభార్య ప్రవేశించును)

భా—ఒరీ, ఇక్కడ నేమిచేయుచున్నావు?

—(తనలో) నే నిపుడు మాటలాడను. ఒకమారు పిలిచినంతనే పలుకుట రాజుల కుచితముకాదు.

భా—నిన్ను తగులబెట్టా! మాటయేలేదే? నీకేమి చెవుడా?

(మరల మూల్గును.)

భా—తెలివిమాలినవాడు వానిని చూడుడు. పాప మతనిభార్య ఇత్తడికడియములతో కాలము పుచ్చుచుండ నతడు సంతోషమున పొంగిపోవుచున్నాడు. ఛీ! నీ సంతోషము పాడుగాను!

—రమణీ! శాంతము. నీ అదృష్టము పండును—లేదు—అది యిప్పుడే పండినది. ఆపాడు ఆభరణముల నన్నిటిని తీసివేయుము. నేనేమి చేయుచున్నానో నీకు తెలియలేదా?

భా—ఆడేమి? నీవొక త్రాటిని పేనుచున్నావు! నీవు దానితో నురిబోసుకొనెదవా? అయినచో గడ్డితో నెందుకు పేనెదవు? జనపనారతో గట్టిముగా పేనుము.

—రమ్మా, సంగతివినుము. లక్ష్మణుడు శక్తితాకుడుచే తన్నుకొనుచున్నాడు. హనుమంతుడు సంజీవికై గంధమాదనమునకు వెడలుచున్నాడు. అతడు రేపుదయమునకు పూర్వమువచ్చెనా, లక్ష్మణుడు జీవించును. రావణుడు వినయముతో నొప్పుచున్నాడుకదా—'మామా, నీవేలాగుననైనను హనుమంతుని చంపినను, లేక ఈరాత్రి కతనిని మైమరపింపజేసి యతని యుద్దేశ్యమును భంగపరచినను నిశ్చయముగా లక్ష్మణుడు మరణించును. భ్రాతృవాత్సల్యమున రాము డితనిని వెంబడించును. సీత నాసొత్తగును. ఇదియే సంభవించెనేని మనమిరువురము రాజ్యమును పంచుకొందుము' అని—నేను నాప్రకారమే చేసితిని. నిశ్చయముగ నతడీ వేళకు ఆమాయలోబడి గతించియుండును. ఓ! అతడింక నా పర్వతమునకు పోగలుగునని తలచెదవా? లంకను కొలుచుటకు త్రాడుపేనుచున్నాను. రేపు నాసగముతో నేను రాజుకాగలను. ఏమి సుదినము!

భా—(సంతోషముతో) అట్లనా? అయినచో నేను నీరాణిని.

—(సంతోషముతో) అంతేనా? నాతోపాటు సింహాసనమున కూర్చొనియుందువు.

(నాట్యము సల్పుదురు.)

భా—మంచిది. నీవు రాజువు, నేనో, నీరాణిని. కాని నా యాభరణముల మాటయేమి?

—ఓహో! నీ యాభరణముల మాటయా? దానికికూడా ఏర్పాటులు జరిగినవి. నీకు ఆపాదమస్తకము ఉచితమగు నాభరణములచే నలంకరింప రావణుడు ప్రమాణముచేసియున్నాడు. నిజముగా వాటి భారమున నీవు నడువజాలవు.

భా—ఆహా! ఆలాగా? (నవ్వును) అగునో, నీదౌర్భాగ్యపు టాభరణములను తీసివేయుదును. (ఇత్తడిసొమ్ములను విసరిపారవేయును) కాని, మండోదరిసొమ్ములలో నాకు పాలులేదా?

—తెలివిమాలినదానా! ఆభరణములు మాత్రమేనా? ఆమెయే నా భాగమునకు వచ్చును.

భా—(ఆగ్రహమును కావించి) పశువా! నీమేనల్లునిభార్య, మండోదరిని భార్యగా గైకొనజూచెదవా? నీ పాడెగట్ట (ఆమె చీపురుకట్టను దీసికొని చావమోదును.) [తెర.]

# ఒక యువకుని సంఘసంస్కారము

ఏ. శేషగిరిరావుగారు, M. A., L. T.

౧

"యువకులే దేశము నుద్ధరింపవలయును. ఈ నాటి యువకులే మున్ముందు దేశోద్ధారకులు కాగలరు. రాజకీయవిషయములందును, సాంఘిక విషయములందును, ఆర్థికవిషయములందును యువకులు శక్తివంచన లేకపాటుపడవలయును. ముఖ్యముగా సాంఘిక విషయములు యువకులపై నాధారపడి యుండును. యువకులు పూనుకొనినచో మనదేశములో నుండు దురాచారములన్నియును సదాచారములుగా మారును. బాల్యవివాహములును, వృద్ధవివాహములును అడుగంటును; దేవదాసీల వడుపువృత్తి మాయమగును; కులములకు, మతములకు గల కొట్లాటలు కృశించును." ఇట్లు దేశోద్ధారకుడు విశాఖపట్టణయువజనసంఘపు వార్షికోత్సవసందర్భమున గంభీరోపన్యాసము గావించెను. మేము యువజనసంఘసభ్యుల మగుటచే శ్రద్ధాభక్తులతో అధ్యక్షుని యుపన్యాసమును విన్నాం. "ఉపన్యాసములతోను, తీర్మానములతోను మన కర్తవ్యము సమాప్తము కాదు. ప్రతియువకుడును తనగుండెమీద చేయి వేసికొని, 'నేను దేశమునకును, సంఘమునకును ఏమి చేసితిని' అని ప్రశ్నించుకొనవలయును" అని అధ్యక్షుడు పలికినప్పుడు మాలో చాలమందికి ఆవేశము, సిగ్గు కూడా కలిగింది. క్రియకు దిగవలెనని నిశ్చయించుకొన్నాం.

అధ్యక్షుడు సాయంకాలం బండిలో పయనమగుచుండుటచే సభ ఆరుగంటలు కాకపూర్వమే ముగింపబడింది. అధ్యక్షునితో కొంతమంది యువకులు రైలుస్టేషనుకు పోయేరు. దారిలో ఒకచిన్న మేడపై పదునారుసంవత్సరముల బాలిక యొకతె నిలిచిచూస్తూంది. ఆమెపలుచని శరీరం కొంచెం ఎఱ్ఱగాను, కొంచెం పచ్చగాను అస్తమించే సూర్యునివెలుగులో ప్రకాశిస్తూంది. ఆమెకురులు ఆ నాడే అభ్యంగస్నానమొనర్చెనని నలుదెసల చెదరి చాటుచున్నాయి. వాటిని దువ్వి సగమువరకే వాలుజడ నల్లి అనంట గులాబిరంగు పట్టుపేలికను (Ribbon) కట్టింది. ఆభరణములాట్టే లేవు. తెల్లని మెడలో మూడుపేటల వాచీగొలుసుమాత్రం కనబడుతూంది. చేతికి రెండు మూడు జతల బంగరుగాజులు, ఒకవ్రేలికి వజ్రపుటుంగరము, కర్ణముల తమ్మెట్లు నాజూకుగను వెదజల్లుచున్నాయి. ఆమె తాంబూలం ఉమ్మేందుకు పైకి వసారాలోకివచ్చి యువకుల కలవరము విని వారిని చూస్తూ పిల్లగోడవద్దఆట్టే నిలిచింది. తెల్లనిపైటచెరగు కాస్త పొగరుచుండగా నామె సద్దుకొంటూంది. అందరి యువకులదృష్టి ఒక్కుమారుగా ఆమె పైకి ప్రసరించింది. అందరిదృష్టికి ఒకసారి తాళలేక కాబోలు, ఆమె ఒక అడుగు వెనుకకు వేసింది. యువకులలో కలవరము కొంచెము హెచ్చింది. గుసగుసలు, పకపకలు అయినతరువాత వీధి మళ్లేరు;— అధ్యక్షుని సాగనంపి యింట చేరేరు.

మాలాడ్జిలో నలుగురమే ఉండేవారం: నేను, వెంకటరావు, ప్రసాదరావు, చలపతి. నేను, చలపతి ఇంటర్మీడియేటు చదువుతూ ఉండేవారం. వెంకటరావు, ప్రసాదరావు మెడికలుస్కూలులో చదువుతూ ఉండేవారు. వాళ్లు బంతాటకూడా బాగా ఆడేవాళ్లు. బడిలో బంతాటపందా లొస్తే వెంకటరావుదే గెలుపు. వాడు బక్కపలుచనిపొడుగరి. తెల్లని శరీరం. ఉంగరాల జుట్టు క్రాపింగు. సూటు, కళ్లద్దాలు. వాడు మంచి నాజూకుగా ఉండేవాడు. కొద్దినెలలలో డాక్టరు కాబోతాడు గనక మేమందరం డాక్టరు అని పిలిచేవాడుక. ఇరుగుపొరుగులు అతనిదగ్గరకు వైద్యానికి రావడం కూడా కలదు.

ఆనాడు భోజనమైనాక చదువు కట్టిపెట్టి బీచికి బయలుదేరేం. మళ్లా ఆ మేడప్రక్కనుంచే వెళ్లుతున్నాం. రాత్రి 9గంట లయింది. మేడనుంచి అమృతతుల్యమైనతీగల నాదం, దానితో మిళితమైన సన్ననిగాత్రం వినబడుతున్నాయి నడకజోరు కొంచెం తగ్గించేం. ప్రక్కనున్న కిల్లీదుకాణాని కెళ్లి కిల్లీలు కొన్నాం. ఒకళ్లిద్దరు సోడాలు

పుచ్చుకొన్నారు. "మామకూతురు బాగా పాడుతుంది రోయి" అన్నాడొకడు. "సంసార్లలో ఇంతబాగా పాడేవాళ్లుంటారా?" అన్నాడు మరియొకడు. "మామకూతురుని సంసారిని చేస్తే ఉంటా" రన్నానేను. "అవును" అన్నాడు డాక్టరు. "ఈమె వృత్తి విడిచి వివాహము చేసుకొనేటట్టు మన మేల ప్రబోధము చెయ్యకూడదు?" అన్నాడు డాక్టరు, కొంచెమునే పూరకుని. "ఉద్దేశానికి సంతోషించేం కాని అప్పుడే ఆలస్యం అయిపోయిందని నా అభిప్రాయం, అంతే కాక, యువకులకి సాధ్యం కాదేమో అని నాభయం" అన్నాను. "ఎందుకు సాధ్యం కాదో చూదాంగాదూ" అన్నాడు డాక్టరు. "నువ్వే ప్రబోధన మొదలెట్టేలాగుందే" అన్నాడు ప్రసాదరావు. "ఎందుకు కూడదు? మీరందరు అవివాహితులు, నేను వివాహితుడను. అంచేత నాకు భయం లేదు" అన్నాడు డాక్టరు. "నువ్వూ మాతోటి సమానమే యిప్పటికి" అన్నాడు ప్రసాదు. "అంత మనోబలం లేదనుకున్నావా?" అన్నాడు డాక్టరు.

ఇంతటిలోకి సముద్రపొడ్డుకు చేరేం. ఇసుకలో కూర్చున్నాం. మాలో మేము కొంచంసేపు ముందు చేయదగిన కార్యా లేవని ఆలోచించుకున్నాం. మాకు కొంత దూరాన్ని యూరోపియను కన్య లిరువురు చేరి నృత్యము నభ్యసించుచుండ చూచేం. అంతట హైందవనృత్యము పైకి మాధోరణి మరలింది. హిందూ స్త్రీలును, పురుషులునూ ప్రాచీనకాలమునందు నృత్యము నభ్యసించిరని ప్రస్తుతకాలమందు గూడ హైందవనారీమణులును, యువకులును నృత్యము నభ్యసించి ప్రాచీనఔన్నత్యమును పునరుద్ధరింపవలయునని తీర్మానం చేసేం. స్త్రీ పురుషులు యూరోపియనులవలె కలిసి నృత్యముచేయుట మనదేశమునకు యుక్తము కాదని కూడ తీర్మానించేం పిమ్మట మెల్లిగా వసతి గృహము చేరేం.

ఆనాటిరాత్రి నా కంతగా నిదుర పట్టలేదు. తేనీరు అలవాటు లేని నాకు ఆనాడు దానిమహిమ తెలిసింది. వెంకటరావుకు గూడ బాగుగ నిద్ర పట్టలేదని తోచింది. కాని పలుకరించినా అతను సంభాషణకు దిగలేదు. ఆనాటిసాయంకాలమునుండి అత నేదో దీర్ఘాలోచన చేయుచున్నట్లు కనుపించేడు.

మరునాటి సాయంకాలము సముద్రపుటొడ్డుకు షికారుకు బయలుదేరేం. డాక్టరు తాను వేరే పనిమీద పోవలెనని మాతో రాలేదు సాయంకాల మారున్నర అయింది. డాక్టరు బట్టలు వేసికొని బయలుదేరేడు. ముంగటి మేడ దగ్గరకు వచ్చి ఒక్కనిమిషము నిలిచి ఇటు అటు చూసేడు. విద్యార్థులు గాని, ఉపాధ్యాయులు గాని అగపడలేదు మెల్లిక్కేడు. కొంచెం గుండెకొట్టుకోడం ప్రారంభించింది. వీధిగుమ్మం దాటేడు. చావడిలో ఎవరూ లేరు. నడవగుమ్మం తలుపు చేరవేసి ఉంది. కొంచెం చప్పుడు చేసేడు. లోపలనుంచి ఎవరని ప్రశ్న వచ్చింది. "లోపలికి రావచ్చునా?" అన్నాడు. నలువదిసంవత్సరముల యువతి యొకతె కొంచెము తలుపు తెరచి, "తమరా, డాక్టరుగారా? దయచేయండి" అని హాలులో ఒకకుర్చీవైపు చూపించింది. డాక్టరుకి కొంచెం ఆశ్చర్యం కలిగింది. హాలులో ఒకకుర్చీలో కూరుచున్నాడు. డాక్టరు చాలా ధైర్యముగలవాడు. అయినా ముఖాన్ని కొంచెము చెమటలు గ్రమ్మేయి. ఏలాగో ప్రారంభించాలని నిశ్చయించి, "నేను డాక్టరును కాను. ఇంకా విద్యార్థి నే, అయినా ఆసంగతి నీకు ఏలా తెలిసింది? వైద్యునకుండవలసిన పరికరము లేవీ నావద్ద లేవే?" అన్నాడు. "తమరు మమ్మల నెప్పుడు చూడకపోయినా మిమ్ములను అనేకసారులు మావీధిని వెళ్లుచుండగా చూసేను. తమ వైద్యనిపుణతను గురించికూడా వింటున్నాం. ఇంతకాలానికి మాగృహము పవిత్రమైంది." అన్నది. "మీగృహము పవిత్రము కావాలనే వచ్చేను. మీ అమ్మాయికి వివాహము ఏల చేయకూడదు?" అన్నాడు డాక్టరు. అంత కొంచెం నవ్వుతూ, "మా అమ్మాయికి వివాహంచేస్తే మీవంటివారిని ఆదరించడం ఎట్లు" అన్నది. "నేను అట్టి ఆదరణ బడయుటకు రాలేదు. మీ అమ్మాయిని ఈవృత్తి నుండి తప్పించి మర్యాదగా అందరివలెనే సుఖజీవనము చేయునట్లు ప్రబోధించుటకు వచ్చే"నన్నాడు. "తమరు సెలవిచ్చినది సర్వసమ్మతమే—గాని, మాకులమునకు గల చిక్కులు మీరు గ్రహించాలి. మా అమ్మాయికి వివాహం

చేస్తే మరున్న మాన్యం కాస్తా పోతుంది. రెండవది, నా గతి ఏమిటి? నన్ను, తమ్ముడిని పోషించే బాధ్యత యిటు పైని దానిమీద వేయాలని ఆలోచిస్తున్నాం. మూడవది, మాకులంలో వారికి ఎంతబుద్ధి ఉన్నా, ఎంత విద్య యున్నా, ఎంతసౌందర్యం ఉన్నా, మంచిసంబంధం దొరకడం ఎట్లు? ఇంతకు మీఉద్దేశమే నెరవేరునేమో. ఈమధ్య పిల్లలు ఊళ్లేలుతూఉంటే మాపిల్ల నేను ఎంత చెప్పినా, ఎవరు వచ్చినా మాటాడకుండా ఉంది. ఏమేనా అంటే నాఒంట్లో బాగులేదంటుంది." అన్నది. కొంచెం సేపూరకుని, "మీపిల్లకు ఏమిజబ్బు?" అన్నాడు. "ఏమో?" అన్నది. "మీపిల్లను నేను చూడవచ్చునా?" అన్నాడు. "అంతకంటే కావలసిన దేమిటి బాబూ! మీరు డాక్టరు కూడాను. మాఅదృష్టం బాగుంటే మీచేతిమందు కల్పనైనా దానికి నింపాదిగా ఉంటుందేమో!" అంటూ మేడమీదికి తీసుకెళ్లింది.

డాక్టరు కాళ్లు కొంచెం తడబడుతున్నాయి. మేడ ఎక్కేరు. వసారాలో ఒక వాలుకుర్చీమీద పండుకొని సన్నుతాంగి ఒక నవలాగ్రంథం చదువుతూంది. "ఇదుగో, డాక్టరుగారొచ్చేరు, చూడు" అన్నది తల్లి. తుళుక్కుపడి లేచి ఒకప్రక్కకు నిలిచి నమస్కరించింది సన్నుతాంగి. ఇరువురును ఒక్కనిమిషము ఒకరి నొకరు చూచుకొన్నారు. డాక్టరు పిమ్మట కుర్చీలో కూర్చున్నాడు. "అమ్మాయికి అన్నహితవు లేదు. గుండెలలో భారం అంటుంది" అని డాక్టరుతో చెబుతు, "డాక్టరుగారు చెయ్యి చూస్తారు. ఇటు రా" అంది తల్లి పిల్లవైపు తిరిగి. సన్నుతాంగి డాక్టరు సన్నిధి చేరి చేయి ఇచ్చింది. ఆమెనాడి పరిశీలించునపుడు కొంచెము ఆయన చేయి వణకినట్లు తోచింది. డాక్టరుదృష్టి చేతిపై నున్నపుడు ఆమె డాక్టరు ముఖమును పరికించేది. డాక్టరుదృష్టి ఆమె ముఖముపైకి మరలుసరికి ఆమెదృష్టి మరియొక దిక్కునకు మరలింది. "మాకు చేతినాడి అట్టె తెలియదు. స్టెతస్కోపుతో చూడవలెను. కాని ఎంతకాలమునుండి ఇలా వుంది?" అని తల్లిని చూచి డాక్టరు ప్రశ్నించేడు. "పిల్ల పెద్దదైనప్పటినుండి, అనగా ఆరునెలలనుండి" అన్నది. మరల కొంచెముసేపూరకుండి డాక్టరు "నొప్పి ఎప్పుడు కనపడుతుంది?" అన్నాడు. తల్లి కూతురువైపు చూచి, "చెప్పు" అన్నది. "రాత్రి ఎనిమిది గంటలకు భోజనమైన వెనుక కనుపడును." అన్నది సన్నుతాంగి. కొంచెముసేపు ఆలోచించి "భోజనమైనపిదపా? మధ్యాహ్నముంటుందా?" అన్నాడు. "లేదు, రాత్రిమాత్రం" అన్నది. "నేను రేపు ఆవేళకు వచ్చి చూడవచ్చునా?" అన్నాడు డాక్టరు. "అంతకంటేనా? మీకు శ్రమయిచ్చుచున్నాము" అన్నాది తల్లి. "నా శ్రమ కేమి కాని, నేను వచ్చినకార్యం విషయమై బాగా ఆలోచించి రేపు మీ అభిప్రాయము చెప్పగలరా?" అంటూ డాక్టరు లేచేడు. "చిత్తం" అంటూ తల్లి కూడా ఆయనతో మేడ దిగింది. మేడ దిగి వీధిగుమ్మము దగ్గరకు వచ్చి డాక్టరు కొంచెము సంకోచిస్తూ మెల్లిగా తలుపు తీసి, బ్రతుకుజీవుడా అని వీధిలో పడ్డాడు. వెంటనే అన్నివైపుల చూసేడు. తనకు తెలిసినవారెవ్వరూ లేరు. ఒక్కసారి మేడవైపుకు దృష్టి ప్రసరింపజేసేడు. సన్నుతాంగి తనవైపే చూస్తూండడం కనిపెట్టేడు. మనస్సులో ఒకవిధమైన ఆందోళన పుట్టింది. హోటలుకు వెళ్లి రెండు మెతుకులు నోట వేసికొని ఇల్లు చేరేడు.

## ౨

మరునాడురాత్రి ఎనిమిది కాకుండానే స్టెతస్కోపు తీసుకొని డాక్టరు బయలుదేరేడు. ఏదో రోగిని చూచుటకు వెళుతున్నాడని మేమెవరము ప్రశ్నింపలేదు మేడయిల్లు చేరేడు. గుండెలు బాగా కొట్టుకోవడం మొదలుపెట్టేయి. 'నేనుచేయుచున్నదానిలో తప్పేమియు లేదో'యని మనస్సుకు సమర్థించుకొని ముందరిగుమ్మం దాటేడు. నడవతలుపు చేరవేయబడి యుండగా, అక్కడనే సిద్ధముగా నున్న సన్నుతాంగి తల్లి లేచి, "తమరా! దయచెయ్యండి" అని చెబుతూ ఒక హరికేను లాంతరు చేతబుచ్చుకొని మేడమీదకి దారి తీసింది.

డాక్టరు ఆందోళనము కొంచెం హెచ్చింది. ఎవరైనా తనను లోపల ప్రవేశించుచుండగా చూచిరేమోయను అనుమానము. ఈ విషయము తోటివిద్యార్థులకు తెలిసిన తనను ఎట్లు పేళనచేయుదురో అనకున్నాడు.

మరల తాను చేసినదానిలో తప్పేమియూ లేదే అని సమర్థించుకున్నాడు. తోటివిద్యార్థి నెవరినైన ఏల తోడు తేనైతినని విచారించేడు

ఇంతలో మేడపై కెక్కగా వసారాలో ఎవరును లేరు. ప్రక్కనున్న గదిలోనుండి టేబిలు లేంపునీలిచిమ్నీలోనుంచి పల్లగా వెలుతురు నలుదెసలు ప్రసరింప జేస్తూంది. గది విశాలమైనదే, రెండు తలుపులు, రెండు పెద్ద కిటికీలు, కిటికీలకు తెల్లని పలుచని వలసుడ్డలు; తలుపులకు కూడ ఆకుపచ్చని పువ్వులగుడ్డకర్టెనులు బహు అందముగా రెండువైపులకు విడదీయబడి ఉన్నాయి. ఒక ప్రక్క విశాలమైన సీమమంచం వుంది. దాని ప్రక్క నొక నిలువుటద్దము, ఆయద్దమున కెదురుగా నొక చిన్న బల్ల గలదు. ఆబల్లపై నొక వెండిపళ్లెములో తాంబూలద్రవ్యములున్నాయి. గదిరెండవవైపున ఒకవిశాలమైన సోఫా, ఒకవాలుకుర్చీ, ఒక అందమైన చేతులు లేని కుర్చీ ఉన్నాయి. నాలుగైదుపటాలు తెల్లనిగోడ నలంకరిస్తున్నాయి. అందులో రెండు సౌందర్యవతుల పటములు, ఒకటి అడవులలో దిమ్మరులేళ్ల పటము, మరొకటి మురళీకృష్ణునిపటము. గదిమధ్యభాగము ఒక మెత్తనితివాసిచే కప్పబడింది.

సన్నుతాంగి నిలువుటద్దం యెదుట నిలిచి చీర సవరించుకొంటూంది. ఆమె తొలిరోజుకన్న చాలా శ్రద్ధతో అలంకరించుకొనినట్లు కనపడ్డాది. ఆమె తెల్లనిచీర ఆనీలిదీపపుకాంతిలో అతిమనోహరంగా ఉంది. ఆమె కావిరంగుపొట్టిచేతులజాకట్టు శరీరమును ప్రతిబింబిస్తూన్నట్లుంది. కంఠము నలంకరించు బంగరు గొలుసుయొక్క తళుకు కంఠముపై ప్రసరించి దానియందమును ద్విగుణము గావిస్తూంది. తల బాగా దువ్వబడియున్నను, వసులుచాలు జటు అగుటచేతను, ఉంగరములజుట్టగుటచేతను కాబోలు కర్ణముల పైభాగము కొంచెము జుట్టుచేకప్పబడింది. ముంగురులుకూడా గాలిచేత ఎగిరి వాటి అందము, మృదుత్వము చాటుతున్నాయి. చెవులకమ్మలతళుకు చెక్కిళ్ల ప్రాకుతూంది.

డాక్టరు గదిలోకి ప్రవేశించుటకు సంకోచిస్తున్నాడేమో అన్నట్లు గదిగుమ్మందగ్గర కొంచంసేపు నిలిచేడు. ఇంతలో సన్నుతాంగి చిరునవ్వుతో ఆయనకు నమస్కరించి ఒకప్రక్కకు నిలిచింది. దానితల్లి ఆసోఫావైపు గనపరస్తూ "అలా దయచేయండి" అంది. డాక్టరు కూర్చున్నాడు. "నేను చెప్పవలసినదేదో చెప్పేను. అమ్మాయి 'నృత్తి చెయ్యాను, పెండ్లి ఆడను' అంటూంది. దానికి కొంచెం పిచ్చికూడా ఎత్తుతూందేమోఅని నాకు అనుమానంగా ఉంది. తమరు పరిశీలించి యేం చేసినా నాకు ఇష్టమే. క్రిందతలుపులు తీసివచ్చేను. ఇప్పుడే వస్తాను. తమరేదో ఆలోచించండి" అని చెబుతూ సన్నుతాంగితల్లి క్రిందికి వెళ్లింది.

ఆమె గది దాటి వెడలుసరికి డాక్టరుకు పాతాళలోకంలోకి పడ్డట్లు అనిపించింది. అట్టి సందిగ్ధస్థితిలో డాక్టరెప్పుడు చిక్కుకోలేదు. ముఖము చెమట పట్టింది. జేబులోని తెల్లని మడతరుమాలు విప్పి ముఖము తుడుచుకుంటున్నాడు. "చాలా ఆయాసపడినట్లున్నారు, విసరుదునా?" అని సన్నుతాంగి ఒక జపానువిసనకఱ్ఱ తీసింది. "అక్కరలేదు" అన్నాడు డాక్టరు. "ఏమి?" అంటూ దగ్గరకు వచ్చి విసనకఱ్ఱతో ప్రక్కను నిలిచింది. "జబ్బుగానున్న దానివి, నీవు ఏమి విసరగలవు?" అన్నాడు. "నాకు ఇప్పుడు జబ్బు లేదు" అన్నది. డాక్టరుకు కొంచెము ఆశ్చర్యము, అనుమానము కలిగింది. రెండునిమిషాలు పరికించి, "అయితే ఎప్పుడు జబ్బుంటుంది?" అని ప్రశ్నించేడు. "మను వుండేది. కాని ఇప్పుడేమీ లేదు. ఇటుపైని ఉండదేమో" అంటూ డాక్టరుముఖమువైపు చూస్తూ ఊరకుంది. డాక్టరుకు ఆమాటలలో ఏదో అర్థం అయింది. కాని అనలేదేమో అని అనుమానం. లేక అట్లు అభినయం చేసేడు. "ఇప్పుడు లేకపోవడం సంతోషమే. కాని ముందుకూడా ఉండదని ఎలా చెప్పగలవు?" అన్నాడు. "ఏమో నాకు తెలియదు. ఈదినమువలెనే ముందుకూడా ఉంటుందేమో అనుకున్నాను. అయినా చేయి చూస్తే మీకే తెలుస్తుంది" అంటూ చేయి అందిచ్చింది. చేయిపట్టుకొని ముఖమువైపు చూస్తూ ఒకనిమిషం ఊరకున్నాడు. నాడిచూడడానికి గాజులు అడ్డొచ్చేయి. డాక్టరే వాటిని కొంచెం పైకి ఉంచేడు. రెండుమూడు నిమిషములు నాడి పరిశీలించి చేయి వదలేదు. రెండునిమిషములు

ప్రక్కకు చూస్తూ ఊరుకొని, "నాడిపరీక్షవలన నా కేమీ బోధపడలే"దంటూ, "మీఅమ్మ ఇంకను రాలే దేమీ?" అన్నాడు. "ఎందుకు?" అన్నది. "ఎందుకూ లేదు. కొంచెం దాహంగా వుంది; మంచినీ రిస్తుందని" అన్నాడు. అంత సన్నతాంగి వసారాపై కెళ్లి, "అమ్మా, ఒక లైమ్ జూసుబుడ్డి తే" అంది. డాక్టరు "అక్కరలేదు, మంచి నీరు చాలును" అన్నాడు. "మీరు బ్రాహ్మణులు మీకు మంచినీ రిస్తే మాకు పాపం" అన్నది సన్నతాంగి కొంచెం చిరునవ్వుతో.

## 3

తల్లి లైమ్‌జూసు సీసా తీసికొని వచ్చి, "డాక్టరు గారు భోజనం చెయ్యగానే తాంబూలమైనా వేసికో కుండా మనింటికి వొచ్చారు. అంచేత వారికి దాహ మవు తూంది. కాస్త నాలుగాకులు మడిచి ఇవ్వనే తప్పనుకు న్నావా? ఆ మాత్రపు మర్యాదైనా ఎవరికీ చూపించని పాపాన్ని పోదు బాబూ,మాపిల్ల" అంటూ అక్కడ సీసా పెట్టింది. సన్నతాంగి ఒక శుభ్రమైనగాజు గ్లాసు తెచ్చి అందులో ఆనీటిని పోసి డాక్టరుకి అందిచ్చింది. "నన్ను చూస్తే మాపిల్లకి మరీ ఒళ్లుమంట. ఏలా దారికి తీసుకు వస్తారోమీదే భారం" అంటూ తల్లి మేడదిగింది. పిమ్మట సన్నతాంగి తమలపాకుల పళ్లెం తెచ్చి డాక్టరుగారి దగ్గర టీపాయీమీద చతికిలపడ్డాది. "నాకు తాంబూలపాకు లక్కరలేదు; నేనందుకు రాలేదు" అన్నాడు డాక్టరు. "మీ రందుకు వచ్చేరని నేనుమాత్ర మనగలనా? నాకోసం ఇంత శ్రమపడుతున్న మిమ్మల్ని మర్యాదచేయడం నావిధి; తప్పా?" అన్నది. "తప్పు లేదు గాని అనవసరం" అన్నాడు డాక్టరు కొంచెం సంకోచిస్తూ. "మీకు తమల పాకులు వేసుకోడం అలవాటు లేదా?" అంది. "అలవా టుకేం గాని, నేను వచ్చిన పని వేరు" అన్నాడు. "సరేను లెండి; తమలపాకులు వేసికొంటూ మీరు చెప్పదలచిన విషయం చెప్పవచ్చు" అన్నాది. "ఆ విషయం గురించి మీ అమ్మ నీతో చెప్ప లేదా?" అన్నాడు. "చెప్పింది. కాని వృత్తిధర్మమే మంచిదని బోధించింది". "నీఅభిప్రా యం ఏమిటి? మీవృత్తిధర్మం మంచిదనే తోస్తుందా?" అన్నాడు. "అట్లా తోస్తే నాకు జబ్బే లేకపోయివుం డును. కాని ప్రస్తుతం నే నేమి చెప్పడానికీ తోచకుండా వుంది" అంటూ ఊరుకుంది.

ఇంతలో గంటలు వినపడ్డాయి. వెంకటరావు తన ముంజేతిగడియారం చూసుకున్నాడు. పదిగంటలైంది. "సరే, నాకు వేళవుతూంది. రెండు, మూడు రోజుల్లో నీ మనోనిశ్చయం చెప్పగలవా?" అన్నాడు. "తమరు రేపే వేళకు దయచేస్తే చెప్పగలననుకుంటాను. మీకు శ్రమ ఇస్తున్నందుకు క్షమించాలి" అంది. డాక్టరు "సరే" అంటూ లేచేడు. మెల్లిమెల్లిగా మేడమెట్లు దిగేడు. "డాక్టరుగారెళుతున్నారా" అంది తల్లి. "రేపు మళ్లా వస్తా" అన్నాడు. వీధిగుమ్మం దిగి ఒకసారి మళ్లా మేడ వేపు చూసేడు. సన్నతాంగి మేడమీంచి తనకేసే చూస్తూంది. మనస్సులో ఆందోళన హెచ్చింది. నాలుగు వైపుల చూసి ముందుకు నడిచేడు.

దారిలో ఒకసహోధ్యాయి ఇంటికెళ్లి అతనివద్ద నొకపుస్తకము తీసికొని తన వసతిగృహమును చేరేడు. "డాక్టరికి రాత్రి షికార్లు ఎక్కువగుతున్నాయే" అన్నాడు ప్రసాదరావు. "మాతో చెప్పకుండా నాట కానికెళ్లే వనుకున్నాం. ఏమిటి కథ?" అన్నాను నేను. డాక్టరు పరధ్యానంగా కొంచెంసే పూరకొని, "అబ్బే పుస్తకానికెళ్లేను; దారిలో కొంత బాతాఖానీ తగిలింది." అన్నాడు. కాస్త టీ పుచ్చుకుని చదువు ప్రారంభించేడు. కాని చదు వేమీ జరగలేదు. టీ పుచ్చుకున్నా నిద్రవస్తూం దంటూ పక్క వేసేడు. దొర్లడం చూస్తే నిద్రపట్టినట్టు లేదు. తను చేస్తున్నది మంచిపనా, చెడ్డపనా అని ఆలో చన పుట్టింది. తనకు చేసినమర్యాదలను తిరస్కరించడం ఏలాగ? అనుకున్నాడు. వైద్యుడు రోగిని పరీక్షించడం లో తప్పేమీ లే దని నిశ్చయం చేసుకున్నాడు. కాని రాత్రి ఒంటరిగా అచటికి పోవడం తప్పని తలచేడు. ఆ మరునాటిరాత్రి ఎవరినైనా తనతో తీసికొనిపోవాలని నిశ్చయం చేసేడు. కాని ఎవరు వస్తారు? తనపాటి మనో నిశ్చలత వారి కెవరికి ఉన్నట్టు లేదు. ప్రారంభంలో నే తన ఉద్దేశాన్ని హేళనచేయుటకు దిగినవారు ఇప్పుడు మరీ

చేస్తారే? అంచేత తానొక్కడే పోక తప్పదు. రాత్రి కాకుండా ఉంటే బాగుండుననుకొన్నాడు. కాని పగలు తనకు తీరుబాటు లేదు. తెల్లవారగానే దుస్తులు వేసికొని ఆసుపత్రికి పోవాలి. మధ్యాహ్నం కాలేజీకి పోవాలి. సాయంకాలం మీటింగులు, లెక్చర్లు. అంతే గాక నలుగురు చూస్తూండగా భోగంయింటికి ఏకార్యానికైనా వెళ్ళడం యుక్తం కాదనుకున్నాడు. అంచేత ఆమరునాడుకూడా రాత్రి తానొక్కడే వెళ్ళాలనుకున్నాడు. పోనీ, తన ఉద్యమాన్నే అంతటితో చాలిద్దామా అనుకున్నాడు. కాని అంతసౌందర్యము, విద్య, లావణ్యము గల స్త్రీని, కాదు-పసిగాయను, విద్యావిహీనులును, జంతుసమానులు, అందవికారులును అగువారలపాలు చేయడానికి మనసొప్ప లేదు.

౪

ఆమర్నాడు మెడికల్ కాలేజీ సంవత్సరోత్సవం. వెంకటరావు సిల్కునూటు, సీమచెప్పులు, దొరటోపి సహితంగా బైసికిలెక్కి సన్నతాంగి మేడవీధిగుండా ఉదయం ఏడుగంటలకు కాలేజీకి వెళుతూ మేడవైపు చూసేడు. ఆమె మేడమీదనుండి డాక్టరువైపే తదేక దృష్టితో చూస్తూంది. చిరునవ్వు ముఖంపైని వెలుగుతూంది. డాక్టరుకి కొంచెం సిగ్గు వేసింది ఎవరైనా చూస్తున్నారేమో అని నాలుగువైపుల చూసేడు. ఏదో ఆలోచిస్తూ ఆసుపత్రికెళ్ళేడు.

సాయంకాలం మీటింగు అయిన పిదప లాడ్జికొచ్చేడు ఆరుగంటలకే. ఆరాత్రి వైద్యవిద్యార్థులచేత నాటకశాలలో నాటకము ప్రదర్శింపబడుతూంది. అందులో ఒక చిన్నపాత్ర వెంకటరావు ధరిస్తున్నాడు. ఆసంగతి మరచి మర్నాడు వస్తానని సన్నతాంగితో చెప్పేడు. తాను నాటకశాలను ముందుగా పోవలసిఉండడంచేత వెంటనే దుస్తులు మార్చి, భోజనం చేసి ఏడుగంటలకే సన్నతాంగి ఇంటికొచ్చి తలుపు తట్టేడు. ఆయన జోడు చప్పుడును గ్రహించి సన్నతాంగి స్వయంగా తలుపు తీసింది. 'తాను ఆనాటిరాత్రి రావడానికివీలు లేదని చెప్పడానికొచ్చే'నన్నాడు, లోపలికడుగు పెట్టకుండానే. "సాయంకాలం కాగితాలు పంచిపెట్టినప్పుడే మీకీవాళ తీరుబాటుండదనుకున్నాను. నేను మీ నాటకానికి రావాలంటే టిక్కెట్టే దొరికింది కాదు" అని ఊరుకుంది. డాక్టరుకి ఒక కాంప్లిమెంటరీ టిక్కెట్టిచ్చేరు కాని అప్పటివరకు ఆమాట మరిచేడు. ఆటిక్కెట్టు జేబులోనే వుంది. ఆమెకు దాని నివ్వడంలో తప్పేమి? అనుకున్నాడు. "నాదగ్గర టిక్కెట్టుంది, కావాలా?" అన్నాడు. "నేను అట్లా రావచ్చునా?" అంది. "ఫరవాలేదు, ఇంద" అని టిక్కెట్టు యిస్తూ, "రేపు ఏడుగంటలకి వస్తా, వివయ మాలోచించేవా?" అన్నాడు. "మీ సెలవు ఏలాగైతే ఆలా చేయడానికి సిద్ధంగా ఉన్నా" అంది. "సరే, రేపు" అంటూ వెళ్ళేడు.

వెంకటరావు ధరించినపాత్ర బాగానే ఉంది. సహజంగా కంఠం మంచి దవడంచేతను, సభాపిరికితనం లేకపోవడంచేతను, చదివిన నాలుగైదు పద్యాలలోను ఒకటి రెంటికి "వన్సు మోరు"లుకూడా పడ్డాయి. అతడే సెక్రటరీ అవడంచేత నాటకం ముగింపుకు పూర్వం తమకు సహాయం చేసి తోడ్పడ్డవారికి వందనాలర్పిస్తూ చిన్నఉపన్యాసం ఇచ్చేడు. కరతాళధ్వనులు మ్రోగుతున్నప్పుడు, నాటకం మధ్యనుకూడ రెండుమూడుసార్లు డాక్టరు స్త్రీలకేసి దొంగచూపులు చూసేడు. తనవైపే సన్నతాంగి చూడ్డంగ్కని పెట్టేడు. నాటకమయింది. ఎవరింటికి వారు చేరేరు.

౫

ఆనాడు శనివారం. ఉదయం అందరం అభ్యంగస్నానం చేసేం. మధ్యాహ్నం పండుకున్నాం. సాయంకాలం రోజూకంటె ముందుగా సముద్రపొడ్డుకు బయలుదేరేం. డాక్టరుకూడా వచ్చేడు. ఏడుగంటలయేవరకు సముద్రపొడ్డునే ఉన్నాం. డాక్టరు తొందర చేసినా మేము లేవలేదు. అప్పుడు మెల్లిగా ఇంటికొచ్చి, దుస్తులు మార్చి హోటలు కెళ్ళేము. డాక్టరు అజీర్ణంగా ఉందని హోటలుకు రాలేదు. దాసీని కొంచెం పాలు కాచి తెమ్మన్నాడు.

ఏడున్నర అయింది. అందరూ భోజనానికెళ్లేరు. వెంకటరావు ముఖం కడుక్కొని, పట్టుఖండువా పైని వేసికొని, చేతికఱ్ఱ తీసికొని బయల్దేరేడు సన్నుతాంగి ఇంటికి. మేడక్రింద స్లిప్పరుచప్పుడు కాగానే సన్నుతాంగి స్వయంగా వచ్చి మేడమీదికి తీసుకెళ్లింది. ఇంట్లో మరెవరూ లేనట్టు కనపడ్డాది. వాలుకుర్చీమీద కూర్చుని, రెండు నిముషా లూరుకుని "మీఅమ్మ యేదీ?" అన్నాడు.

"ఎందుకు? ఏం కావాలి?" అన్నాది. "ఏమీ అక్కర లేదు. ఊరికే అడిగేను." అన్నాడు. "ఊరి కెళ్లింది. పదకొండుగంటలబండిలో వస్తుంది." అన్నాది. "ఒంటరిగా ఉండడానికి నీకు భయం లేదూ?" అన్నాడు. "మీ రుండగా నాకేం భయం" అన్నాది నవ్వుతూ. "నన్ను పదకొండు గంటల దాకా ఉండ మంటావా?" అన్నాడు. "ఉండకూడదా?" అంది. కొంచెం సంశయిస్తూ, "ఉండొచ్చును కాని మరెవరూ ఇంట్లో లేరూ!" అన్నాడు. "దాసీది క్రింద ఉంది" అన్నాది. "సరే" అంటూ, "మరేమి టాలోచించేవు" అన్నాడు. "మీ సెలవు యేలాగైతే అలా చేస్తాను" అన్నాది. "అయితే నువ్వీవృత్తి మానివేయాలి" అన్నాడు. "నేను ఇప్పటికి ఏవృత్తిలోను లేను" అన్నది. "నిజమేనా?" అన్నాడు కొంచెంఆతురతతో. "డాక్టర్లుమాత్రం కనుక్కోలేరా?" అన్నది సన్నుతాంగి కొంచెంకోపంతో. "అట్లయితే ఈ వృత్తిలోకి నువ్వు దిగకూడదు" అన్నాడు. కొంచెం ఆలోచించి. "సరే, తర్వాత?" అన్నది సన్నుతాంగి. "తరువాత వివాహంచేసుకుంటావు!" అన్నాడు కొంచెం ఆశ్చర్యంతో. "కాని, ఎవరిని?" అన్నాది. "నీ యిష్టమెచ్చిన వారిని" అన్నాడు. కాని సమాధానం బాగులేనట్టు తనకే తోచింది. తాను అవివాహితుడయియుండిన ఎంత బాగుండును అనుకున్నాడు. చిన్న నిట్టూర్పు విడిచి చేరబడ్డాడు. సన్నుతాంగి కొంచెం సేపు తలవంచి ఊరుకుని, "నన్ను క్షమించి, నా ప్రశ్నలకు జవాబు చెబుతారా?" అన్నది. "చెప్పకేం" అన్నాడు. "మీకు వివాహ మైందా?" అన్నాది. "అయినట్టే" అన్నాడు. "మీ రామెను ప్రేమించే వివాహం చేసుకున్నారా?" అన్నాది. "కాకేమి?" అన్నాడు కొంచెం విసుగుదలతో. "క్షమించాలి. మీవంటివారు అనృతం పలకరని నానిశ్చయం. మీలోనైనా, ఇష్టం వచ్చినవారిని వివాహం చేసికోడానికి వీలవుతుందేమో తెలిసికోడానికడిగేను." అన్నాది. వెంకట్రావు కొంచెం సేపూరుకొని, "నాభార్య ఇంకా కాపరానికి రాలేదు. అప్పుడు ప్రేమించగల ననుకుంటాను" అన్నాడు. "మీ రిప్పు డెవరినీ ప్రేమించలేరా?" అని ప్రశ్నిస్తూ దీనంగా ఆయన ముఖావలోకనం చేసింది. "ఎట్లు ప్రేమిస్తాను? అది తప్పు గాదా?" అన్నాడు కొంచెం సంకోచిస్తూ ముఖం దించుకొని. "ప్రేమ భగవత్స్వరూపమనీ, దాన్లో తప్పు లుండజాలవనీ వెంకటచెలంగారు వ్రాస్తున్నారే! ప్రేమపూరితములు కాని వివాహాలు మావృత్తితో సమానమే అంటున్నారు కూడాను. అట్టి వివాహాలు మీకే సందర్భం కాకపోతే మా లెక్కేమిటి?" అన్నాది. "బాల్యవివాహాల్లో అవి సందర్భం కాకపోయినా, రజస్వలానంతరవివాహాల్లో అవి సందర్భం అవడం సహజం కదా" అన్నాడు. "ఆమాట నిజమే కాని, బాల్యవివాహములనూలాన్ని రజస్వలానంతరవివాహాల్లోకూడా అట్టివి సందర్భం కాకపోవచ్చు" నన్నాది. "ఎట్లా?" అని ప్రశ్నించేడు. కొంచెంసిగ్గును అభినయిస్తూ, "మీవంటివారిని నావంటిది ప్రేమిస్తే తిరిగి మీవంటివారు ఆమెను ప్రేమించలేకపోవుటే" అన్నాది. "ప్రేమించ లేకపోవుట కాదు గాని...ఎట్లు?" అని ఊరుకున్నాడు. "నిజంగా మీకు నామీద ప్రేమ ఉందా?" అని ప్రశ్నిస్తూ చిన్న చిరునవ్వుతో దగ్గరకు వచ్చి, భుజంమీద చెయ్యి వేసి ముఖంకేసి వంగి చూస్తూంది. అప్పుడు "లేక కాదు కాని..." అని యేమో చెప్పబోతూ, భుజంమీద నున్న చేయి తీయబోతూ, అట్లే ఆచేతిని తనచేత రెండునిముషములు పట్టుకొని, తనకు తెలియకనే చిన్ననిట్టూర్పు విడిచి చేయి జారవదలేడు. "మీరు నన్ను ప్రేమించేరు. నేను మిమ్ములను ప్రేమిస్తున్నాను. ఇప్పుడు మనకేమి టడ్డు?" అన్నాది. "అట్లు ప్రేమించడం తప్పేమో?" అన్నాడు. "తప్పేమిటి? ప్రపంచకములో సామాన్యజనులకు తప్పుగానే కనపించవచ్చు. నిజంగా తప్పే అయితే మీవంటివారిలో అట్టి ప్రేమే జనించదు. భగవంతుడు మీకోసమే నన్నింత

కాలం అప్పుచేసినట్టున్నాడు. భగవంతుని ప్రేరణే లేక పోతే మీరు మాయింటికి కెందుకొస్తారు?" అన్నాది. "కావచ్చును." అన్నాడు. కాలు జారింది, మరి లేవలేదు.

పదకొండుగంట లేసేరు. వీధితలుపు చప్పుడయింది, డాక్టరుకి తెలివివచ్చింది. తానే ప్రపంచములో వున్నది గ్రహించేడు. సన్నతాంగి క్రింది కెళ్లి తలుపు తీసింది. తల్లి వెంటనే భోజనానికి సిద్ధమైంది. డాక్టరు మేడ దిగి వీధిలో కెళ్లేడు. ఏలాగో లాడ్జి చేరేడు. అందరు చదువులు ముగించి అప్పుడే పండుకున్నారు. ఎక్కడి కెళ్లేవంటే "ఎక్కడికీ లే" దంటూ పండుకున్నాడు.

౬

వెంకట్రావు మరునాటినుంచీ తనకు లాడ్జిలో చదువు జరుగలేదనీ, మరొకసహాధ్యాయితో చదువు తానని చెప్పి భోజనం కాగానే లాడ్జికి రావడం మానేసేడు. సన్నతాంగి ఇంటికి సమీపంగా ఉన్న ఒకసహాధ్యాయితో చదువు పెట్టేడు. తొమ్మిది పదిగంటల వరకు అక్కడ చదువు సాగనిచ్చి, తరువాత ఒకటి రెండు గంటలు సన్నతాంగి ఇంట కాలక్షేపం చేసి, పదకొండు పన్నెండుగంటలకు లాడ్జి చేరేవాడు.

ఇలాగ రెండు మూడురోజు లైంది. అమూడో రోజు డాక్టరు లోపలి కెళుతూంటే సన్నతాంగితల్లి "డాక్టరుగారూ, ఏమైనా పది రూపాయలు సర్దుబాటు చెయ్యగలరూ, మళ్లా కావలిస్తే రెండురోజుల్లో దాఖలు చేసుకుంటాను" అన్నది. "సరే, దాని కేమి" అంటూ డాక్టరు తనజేబులో ఉన్న పర్సు తీసి, ఆసొమ్ము ఇచ్చి మేడమీది కెళ్లేడు.

# భారతజనని

యమున రాగము

ఓ భారతజననీ!
విహాయసవీథీ విహారిణీ!
స్వాతంత్ర్యకిరణ స్వర్ణారుణ
కంకణకటక కలాపినీ!
భవదాశ్రిత వినయహృదయ
ప్రవిమలానురాగ మేమొ!
ఉదయాచల సానూజ్జ్వల
పదపాటల తేజ మేమొ! ఓ!
తావక సేవకజనతా
వికసిత చిత్తామోద మొ!
ప్రాభాతానిల శీతల
పద్మాంచల పరిమళమో! ఓ!
కవి గాయక వైతాళిక
కంఠ క్రమగాన మేమొ!
దశదిశాంత నవశకుంత
దివ్యైకామృతమో! ఓ!
ఇదె స్వతంత్రభరత శాంత
సమయ సమరశుభోదయమొ!
ఇదె జగతీకల్యాణోత్సవ
తాండవ కలకలమో! ఓ!

శ్రీ కృష్ణశాస్త్రి

---

# త్రిమూర్తుల పరీక్ష

శ్రీమతి జ. రామాబాయమ్మగారు

సరస్వతీనదీతీరమున నొకనాడు మునీశ్వరులందరు ఒక్కచో గుమిగూడి, త్రిమూర్తులలో నెవ్వ రధికు లని విమర్శింప జొచ్చిరి. బ్రహ్మ యని కొందరు, విష్ణువని కొందరు, ఈశ్వరుడని కొందరు తర్కింపజొచ్చిరి. ఇదమిత్థమని నిశ్చయించుటకు ఎవ్వరికిని స్ఫురించ



శ్రీమతి జ. రామాబాయమ్మగారు.

లేదు. చివరకు పరీక్షించిన గాని తెలియదని రూఢిపరుచుకొని మునీశ్వరులలో ముఖ్యుడగు భృగుమహర్షిని త్రిమూర్తులను పరీక్షింపబంపిరి. అంతట భృగుమహర్షి తిన్నగా సత్యలోకమునకు బోయి సభలోనున్న బ్రహ్మను చూచి, అతని గొప్ప తెలియుటకై వందనము చేయక నిర్లక్ష్యముగ నిలువబడెను. అందువలన బ్రహ్మకు మిగుల కోపము వచ్చెను. 'నేను ఎల్ల లోకములను సృష్టించువాడను. నాయందు గౌరవము చూపక, వందనమైన ఆచరింపకున్నాడు' అనుకొనెను. ఇంతకు నాతడు తనకొడుకగుటవలన కోపము వచ్చినను శాంతము వహించెను. భృగువును బ్రహ్మకు ఆగ్రహము వచ్చుటను గుర్తించి ఏమియు పలుకక వచ్చిన త్రోవనే పోయెను.

అక్కడనుండి శంకరుని మందిర మగు వెండికొండకు పోయెను. శివుడును, దుర్గయు ఆ గిరిపై విశ్రమించి యుండిరి. పరమశివు డీ మహామునిని గాంచి భ్రాతృస్నేహమున కౌగిట చేర్చునని మనస్సున సంతోషపడి, అమితోత్సాహముతో ఎదురేగెను. కాని రుద్రుని యందలి సత్త్వగుణము నెఱుగగోరి ఆయనను గౌరవింపక యూరకుండెను. సహజముగనే కోపస్వభావము గల యీశ్వరుడు ఈ యగౌరవమును సహింపజాలక కాలాగ్నిరుద్రుడై కన్నుల నిప్పులు రాల భయదాకృతి దాల్చి, శూలముతో ఆ తాపసముఖ్యుని హృదయమున బొడువబోవ, అర్ధాంగియగు పార్వతీ రమణి తోడనే అడ్డువచ్చి తనవిభునికి నమస్కరించి, 'నాథా! నిష్కారణముగా నీ తాపసోత్తముని చంపుటకు సిద్ధపడితిరి. ఇది యేమి

న్యాయము ? ఆదిదేవు లగు తమకు తెలియని యంశ మున్నదా!' యని వినయముతో పార్వతి మృదువుగా నుడివెను. అంత నీశ్వరుడు కోప ముడిగి శాంతు డయ్యెను.

తరువాత అమ్మునినాథుడు అక్కడ నిలు వక వైకుంఠపురమునకు జనెను. అచట నఖిలైశ్వర్యముతో నొప్పియున్న మేడయందు మృదువగు హంసతూలికాతల్పమున విష్ణు దేవుడు ప్రియయగు లక్ష్మియు దానును సరస సల్లాపములతో, విలాసవిహారములతో సుఖించు చుండెను. అపుడు విష్ణుదేవుని బరీక్షింప గోరి వచ్చిన భృగుమహర్షి యాతని వక్షఃస్థలమున తనపాదముతో ఒక్కతన్ను తన్నెను.

తన్నుటయే తరవాయిగా, సర్వేశ్వరుడు పానుపు దిగి వచ్చి ఆముని పాదములపైబడి నమ స్కరించి, 'యో పరమతపోధనా'! ఇట మీరు వచ్చుట యెఱుగకయున్న నాతప్పును మన్నించ వేడెదను. నన్ను కరుణించి దివ్యమణులతో ప్రకాశించుచున్న ఈ బంగారుసింహాసనమున కూర్చుండి నేను చేయు సపర్యలను గొనుడు. మీ మృదువగు పాదకమలము నా యుర మున దాకి యెంత నొచ్చెనో కదా! మునీం ద్రా, భవదీయపాదాబ్జహతి నా భుజాంతరము నకు అలంకారం బయ్యె. మీ రాక మాకు శుభదాయకము. నేను ధన్యుడ నైతిని' అని యనేకవిధముల మృదుమధురాలాపంబుల పొ గడి మిగుల ప్రీతితో రమారమణి బంగారు చెంబుతో తెచ్చిన నీట కాళ్లు కడిగి భక్తితో ఆజలమును శిరమున ధరించెను.

ఆహా! ముక్కోటి దేవతలకు అధినాథుడును, సర్వాంతర్యామియు నగు చక్రపాణి లక్ష్మి కెంత నుండ వక్షఃస్థలమున తన్నిన భృగు మహర్షిపై ఇసుమంతైనను కినుక బూనక యెన్ని యో పూజలు చేసెను. ఏమి శాంతము! ఆ భగవంతునకు తప్ప ఎవ్వరి కంత శాంత ముం డును!

అమ్మునివరుండు లక్ష్మీనాథు సంభాషణం బులకు చిత్తమున చాలసంతోషించి, ఆయనంత కల్యాణగుణనిధిని ఎంతయు పొగడి, యానంద బాష్పధారలు కన్నులు నిండిరా దద్భక్తిపారవ శ్యంబున ఏమియు పలుకనేరక యాదేవు నను మతిని బొంది మరలి, సరస్వతీతీరంబున నున్న మునులదగ్గరకువచ్చి వారలతో తాను పోయిన విధమును, తనమనస్సున దోచిన త్రిమూర్తుల విధంబును ఎరుకపరచి, వారిస్వభావములను సవివరముగ వర్ణించెను. వా రంతయు సావ కాశముగ విని ఆశ్చర్యమనస్కులై తమసందే హమును వదలి చిన్మయాకారుడు, శ్రీసతీశుడు, అనుపముడు, అనవద్యుడు, అఖిలకల్యాణగుణా కరుడు, ఆదిమధ్యాంతరహితుడు నైన పుండరీ కాక్షుడే త్రిమూర్తులలో నధికుడని నిశ్చయించి నిత్యము నా హరిపదకమలములనే కొల్చుచు నవ్యయానందాంబుధి నోలలాడుచుండిరి.




## అనేక శతభాండాని

శ్రీమతి పి. లక్ష్మీబాయమ్మ గారు

ఓవూళ్లో ఓబ్రాహ్మ డుండేవాడు. ఆ బ్రాహ్మడిపెళ్లాం చాలా గడుసుది. ఎప్పుడు చూసినా మొగుణ్ని తిట్టిపోస్తూ, మెటికెలు విరుస్తూ, సాధించి చంపుతూవుండేది. ఈ బాధ పడలేక ఒకరోజు తప్పినా సరేగదా అనుకొని, ఇంకోవూరు వెళ్లి ఓ మొరుగున్న బ్రాహ్మడింటికి పోయాడు ఇంత లోనే ఆఇంటావిడ మంచినీళ్ల కెళ్లుండి వచ్చింది. అరుగుమీద కూర్చున్న బ్రాహ్మణ్ణి చూసింది. ఇంట్లో కెళ్లి యిక మొగుణ్ణి సాధింపు మొదలుపెట్టింది అది విని వెంటనే మొగుడు యింట్లోకి వెళ్లి 'ఒసే, ఒసే యివాళ మన యింటికి ఇంకోఆయన భోజనానికి వచ్చాడు. నీవు తిడుతూవుంటే ఆయన ఏమన్నా అనుకుంటాడు. ఇవాళ తిట్టకు. నేనుమాత్రం వంద తిట్లు తిట్టినా వూరుకో' అని బతిమాలుకున్నాడు. 'సరే' నని ఒప్పుకుని 'వంద తిట్లకు మాత్రం వూరుకుంటాను. తర్వాత వూరుకోను' అంది. 'సరే' నన్నాడు.

తర్వాత ఆవిడ వంటచేసి ఇద్దరినీ స్నానం చేసి రమ్మంది. స్నానంచేసి వచ్చి సంధ్యావందనం, బొట్టెట్టుకోటం మొదలుపెట్టినప్పటినుంచి, ఆయింటాయన పెళ్లాన్ని తిట్టడం మొదలు పెట్టాడు ఎన్నితిట్టినా వూరుకుంటుందిగదా అన్నధైర్యంమీద. 'వందతిట్లకే కదా నేను ఒప్పుకుంది' అని పెళ్లాం ఏంజేసింది మొగుడు తిడ్తున్న తిట్లని లెక్కపెట్టటం మొదలెట్టింది. ఇంతలో వడ్డన అయింది. ఇద్దరు బ్రాహ్మలూ భోజనానికి కూర్చొని భోంచేస్తూ, 'పులుసు తేవేమే? ఏం జేస్తున్నావు? గాడిదా' అని తిట్టాడట. దీంతో వందతిట్లు దాటి ఒకటి ఎక్కువ అయింది. ఆవిడ ఆపాళంగా పులుసు కుండ పట్టుకొచ్చి మొగుడునెత్తిన పెడేల్ మని పగలేశి, 'వందతిట్లదాకా వూరుకున్నాను. పైగా ఇంకోటి ఎక్కువ తిట్టావు. మరీ నా పులుసుకుండ బద్దలైపోయింది. కుండఖరీదు ఇస్తావా లేదా?' అని తిట్టడం మొదలెట్టింది. ఇదంతా చూస్తూ పక్కనేకూర్చున్న బ్రాహ్మ

డు తెల్లబోయి చూసి 'ఓయి బాబో! ఇదెక్కడి పెళ్లాం! నా పెళ్లామే మంచిది!! ఇదివరకు ఎన్ని వందలకుండలో నా నెత్తిమీద పగిలినా కుండ ఖరీదు ఇమ్మని నన్ను అడగలేదు.* అనుకొని 'అనేకశతభాండాని భిన్నాని మమమస్తకే, అహో గుణవతీ భార్యా, భాండమూల్యం నయాచతే.' అనే శ్లోకం చెప్పుకుంటూ చెంబూ, బట్టా చంకనబెట్టుకొని తిరిగిచూడకుండా ఇంటికి పరుగెత్తాడు. కథ కంచి కెళ్లింది. మనం ఇంటి కొచ్చాం. విన్నవాళ్లకు వీసెడు, చెప్పిన వాళ్లకు చాటెడు బంగారం.

# పాతమ్మ — కొత్తమ్మ

ఓలేటి సీతారామమూర్తిగారు

మంచి భాగ్యవంతుడైన ఒక గృహస్థుండేవాడొక పట్నంలో. అతని కో భార్య. ఆభార్యతో తనివితీరక ఆ గృహపతి మఱియొకభార్యను చేసుకొన్నాడు. పెద్దభార్యను 'పాతమ్మ' అని, చిన్నభార్యను, 'కొత్తమ్మ' అని పిలుస్తూవుండేవారు నౌకర్లు.

కొన్నాళ్లకి కొత్తమ్మకొక చక్కని మగబిడ్డడు జన్మించేడు. పాతమ్మకి బిడ్డలులేరు. అయినప్పటికీ ఆమె సవతిబిడ్డనే తనబిడ్డగా భావించుకుంటూ ప్రేమతో చూస్తూఉండేది.

కొంతకాలానికి ఆ గృహస్థుకు జబ్బుచేసి ఆయన స్వర్గం చేరేడు.

ఆ ఆస్తంతాకూడా కొత్తమ్మకొడుకుకే పోవడం పాతమ్మకి కిట్టిందికాదు. తనకుకూడా ఒకబిడ్డడుంటే ఎంత బాగుండును అనిపించింది. కొత్తమ్మపై అసూయకలిగింది అది సుఖంగా కొడుకుతోఉంటే నేను ఒంటిగా ముష్టిబ్రతుకు బ్రతకడమా అనుకుంది.

మరునాటినుంచి పాతమ్మ ఆ బిడ్డని చంక విడవకుండా ఎత్తుకోవడం మొదలుపెట్టింది. రోజులుగడిచింది. కొత్తమ్మ బిడ్డదగ్గరి కొస్తే 'ఒద్దు—ఇప్పటినుంచీ మఱినువ్వు నాకొడుకును ముట్టుగోవద్దు' అంది పాతమ్మ. కొత్తమ్మకు ఆశ్చర్యం అయింది.

అంతే ఆ బిడ్డనుగూర్చి తగవులాడుకున్నారు కొత్తమ్మా పాతమ్మానూ. 'నాకొడు' కని కొత్తమ్మ, 'నాకొడు'కని పాతమ్మ ఆ గ్రామాధికారివద్ద తగవుపెట్టారు. గ్రామాధికారికి గట్టిచిక్కే తటస్థించింది. ఆ బిడ్డడు ఎవరికొడుకని నిరూపణచేయడం? ఆలోచించి ఆయన మంచి ఉపాయం చేశాడు. ఆ బిడ్డ నడ్డంగా రెండుచెక్కలుచేసి ఒక్కొక్కచెక్క ఒక్కొ-

* 'వందలకొలది కుండలు నా తలమీదపగిలాయి కాని కుండల ఖరీదుమాత్రం అడిగేదికాదు. అబ్బో! (నా) భార్య ఎంతగుణవతి.'

కర్త కిస్తానన్నాడాయన. పాతమ్మ అపరిమితానందం పొందింది. తన సవతిబిడ్డ అంత మొందునుకదాఅని అల్లే చేయమంది. కొత్తమ్మ నిలువునా నీరైపోయింది. "బాబూ, ఎవరికొడుకయితే ఏం? బిడ్డడు బ్రతికి బాగుంటే చాలు. ఆవిడకే ఇచ్చేయండి నాముద్దులబిడ్డను" అన్నది. ఆ బిడ్డడు కొత్తమ్మకొడుకే అని, గ్రామాధిపతి నిజం తెలుసుకున్నాడు. బిడ్డను కొత్తమ్మకి ఇప్పించేడాయన. పాతమ్మ బుద్ధితెచ్చుకొని కొత్తమ్మ కాళ్లమీదపడింది క్షమించమని. కొత్తమ్మ ఆమెను లేవదీసింది. అప్పటినుంచి వాళ్లిద్దరు ఎంతోప్రాణంతో మెలగుతూవుండేవారు.

## నాకేం పట్టింది?

ముద్దా విశ్వనాథం గారు (కవితాసమితి)

మన ముత్తాతల తాతలకు తాతల కాలంలో నేపాళదేశానికి గొప్ప నిర్వాహకుడైన రాజుండేవాడు. మహానిపుణుడు. చేరువ రాజ్యాలలో ఏ ప్రభువుకి కాస్త సలహా కావలసినా మన రాజుదగ్గరికి తుర్రున పరుగెత్తుకు రావలసిందే. ఈ 'చాకచక్య' మహారాజులుంగారి ప్రఖ్యాతి లోకంలో మూలమూలలకూ వ్యాపించింది.

అయితే, ఇంత నిపుణుడైన రాజుగారి రాజ్యంలోకూడా దద్దమ్మలు లేకపోలేదు.

"నాకేం పట్టింది-గాళ్లు" ప్రజలో విరివిగా ఉంటూవచ్చారు. ఈసంగతి 'చాకచక్యుడు'పసిపట్టి, ఆబద్ధకపుపీనుగలకు సరియైన మాత్ర సమయోచితంగా వెయ్యాలని నిశ్చయించాడు.

మనరాజుగారి పట్నానికి వెళ్లే రోడ్డు, కొండలమధ్యనుంచి వుంది. ఒకనాటి నిశాసమయాన్న 'చాకచక్యు'డు ఈ ప్రదేశానికి వెళ్లి, సరిగ్గా బళ్లునడిచే రాదారిలో పల్లం ఒకటి తవ్వాడు. తరువాత తన జేబులోనుంచి ఒక చిన్నసంచీతీసి ఆకన్నంలో పెట్టాడు. ఆపళంగా ప్రక్కనుంచి పెద్దఱాయి వకటి దొర్లించుకొని వచ్చి ఆరంధ్రం కప్పివేశాడు. ప్రత్యేకం పరిశోధించితే తప్ప ఱాతికింద కన్నం వున్నదని ఎవ్వరూ అనుమానపడ్డానికి అవకాశం లేదు.

మర్నాడు ప్రొద్దున్న ఒక రయితు తన పొలంలోకి పెంటతోలుకొని ఆదారిని పోవడం తటస్థించింది.

"ఛశ్! ఎంతబద్ధకస్తులు, ఇక్కడి మనుష్యులు! రోడ్డుకి సరిగ్గా మధ్యను వుందికదా, పెద్దఱాయి; కాస్త అవతలికి వత్తిగించకూడదూ! ఈమాత్రం పనికి ఏడుస్తారు, 'నాకేం' అని సోమరిపోతు వెధవలు. అందుకనే దరిద్రం యిల్లా పీడిస్తూంది మనదేశాన్ని" అని మూలుగుతుంటూ, అష్టకష్టాలుపడి బండిని కొండదరినుంచి వొత్తిగించి తోలుకుపోయ్యాడు.

మరి కాస్సేపటికి ఒక సిపాయి వచ్చాడు ఆదారిని. ఈల వేసుకుంటూ అడుగులు తూచినట్లు వేస్తూ మాంచి హుషారుగా నడుస్తూన్నాడు. ఆయనగాడికి ఊర్ధ్వదృష్టి కాని 'సంతోష దేవత' అతన్ని క్రిందకుచూడ నివ్వటం లేదు. తిన్నగా ఱాతిదగ్గఱకు వచ్చేటప్పటికి కాళ్లు చేతులు పారజాపుకొని పడ్డాడు. కాస్సేపటికి సణుగుకుంటూ లేచి కాళ్లుదులుపుకొని ప్రజల నిర్లక్ష్యానికి తిడుతూ తన దారిని వెళ్లిపోయాడు.

తరువాత కనుచీకటివేళకు పరదేశాన్నుంచి కంచరగాడిదెలమీద సామానులు వేసుకొని కొందఱు వర్తకులు ఈదారిని వచ్చారు. ఱాయి చూశేటప్పటికి, వాళ్లకు చిరాకెత్తింది. అందులో వకడు ఉండబట్టలేక, "ఇదేటోయ్! తమాసగుంది, ఈ రాజ్యం. పెద్దరాయి దారిలోవుంటే సూడనట్టే వూరుకున్నారు. దిక్కుమాలిన పెజ" అంటూ గొణగడం ఆరంభించాడు. సరే, ఎవడిక్కావాలి, వెధవగోల! వ్యాపారస్థులందఱు ఎవడిమట్టుకు వాడు, కొందఱు ఱాతికి ఈప్రక్కనుంచీ, మరి కొంద ఱాప్రక్కనుంచి తప్పుకొని వాళ్లదారిని వాళ్లుపోయారు.

ఈ మోస్తరుగా కాలం గడచిపోతూంది. ప్రతీవాడు మరోడిని నిందించడమేకాని ఒక్కడూ ఆఱాయి ఎత్తి ఆవలవైచిన పాన్నిపా పోలేదు. ఒకటి, రెండు, మూడు-వారాలు గడిచాయి. ఱాయిమట్టుకు యథాస్థానంలోనే వుంది. ఇట్లా వుంటూండంగా, ఒకదినం మహారాజు దండోరా వేయించాడు, 'ఆ సాయంకాలం ఱాయిపడివున్న చోటికి ప్రజంతా రావలసిందనీ, తనుకూడా అక్కడికి వస్తాననీ.' సకాలానికి జనసమూహం కూడింది.

"నాప్రి నాయనలారా! ఈ ఱాయి ఇక్కడ పెట్టింది నేనేను. ఇంతమందిప్రజలోను ప్రతీవాడు మరొకడు తియ్యలేదని తిట్టేవాడే కాని, ఇరవైరోజులనుంచీ ఒక్కడికైనా ఆ ఱాతిని తొలిగిద్దామని బుద్ధి పుట్టలేదుకదా!" అని ప్రభువు వాళ్లని మందలించాడు.

అంత, రాజు స్వహస్తంతో ఱాయి ఎత్తేటప్పటికి, అక్కడ ఒకగొయ్యి, దానిలో చిన్న సంచీ, ఆ సంచికి ఒకచీటి కనబడ్డాయి. చీటి మీద "ఇది ఈ ఱాయి ఎత్తినవారికి" అని వ్రాసివుంది.

ఆసంచి మూతివిప్పడంతోనే గలగల మని కాసులు రాలినాయి. అందఱు తెల్లపోయారు. అంతటినుంచీ, ఆ రాజ్యంలో ఏ చిన్నపనియైనా, వీడు, వాడు అనే విభేదం లేకుండా తక్షణం కార్యం నిర్వహించడమే కాని, రెండోవాడికి అవకాశం వదిలితేవొట్టు.

# పురిపిట్టకథ

శ్రీ నరసింహస్వామిగారు

అనగనగా ఒకఊళ్లో ఒక రాజుండేవాడు. ఒకనాడు వేటకెళ్లి తిరిగొస్తూండగా మంచి ఎండగా ఉండడంచేత ఒక వెలగచెట్టు క్రింద చతికిల పడ్డాడు. చెట్టు కేమైనా పళ్లున్నాయేమో అని బుర్రెత్తి చూచేటప్పటికి ఒక పురిపిట్ట ఆచెట్టుమీద పళ్లుతింటూంది. దాన్ని చూచి "పురిపిట్టా పురిపిట్టా! నాకో పండిస్తావా" అన్నాడు రాజు. "వేడిదికావాలా? చల్లంది కావాలా?" అంది పురిపిట్ట. "ఎండగా ఉంది చల్లటిదే యి"య్యన్నాడు రాజు. ఒక మాంచి పండుకోసి దానిలో గుజురంతా తినేసి ఆ రాజు నెత్తిన పడేటట్టు పెంకును పడేసింది.

ఇది చూచిరాజుకి కోపం వచ్చింది. వేటకాళ్లచేత ఆపిట్టని పట్టించి తెచ్చి బురదలో కుక్కేశాడు. కుక్కేసి "పురిపిట్టా! పురిపిట్టా! ఎలా ఉన్నావు?" అన్నాడు. "వెలగచెట్టెక్కాను వెలగపళ్లు తిన్నాను. రాజునెత్తిన పెంకడేశాను. బురదగుంటలో బురబురలాడుతున్నా"నంది. "అన్నముండా, యింకా బుద్ధి రాలేదా?" అనుకొని రాజు ఏటావల చాకిరేవుంటే ఆ చాకలాళ్ల పొయిలో పడేశాడు. "పురిపిట్టా! పురిపిట్టా! ఎలా ఉన్నావు?" అన్నాడు. "వెలగచెట్టెక్కాను వెలగపళ్లు తిన్నాను. రాజునెత్తిన పెంకడేశాను. బురదగుంటలో బురబుర లాడేను. చాకలాళ్ల పొయ్యిలో చలి కాచుకుంటున్నా" నంది. వెంటనే దాన్ని తీసి ఒక తాత దడి అల్లుతూంటే ఆ దళ్లో పడేసి "పురిపిట్టా! పురిపిట్టా! ఎలా ఉన్నావు?" అన్నాడు రాజు. "వెలగచెట్టెక్కాను వెలగపళ్లుతిన్నాను. రాజునెత్తిన పెంకడేశాను. బురదగుంటలో బురబురమన్నాను. చాకలాళ్లపొయిలో చలి కాచుకున్నాను. తాతతో దడల్లుతున్నా"నంది. మరీ మండిపడి దాన్ని తీసికొనిపోయి ఒక అవ్వ పిండిదంపుతూంటే రోటిలోపడేసి "పురిపిట్టా! పురిపిట్టా! ఎలాఉన్నావు" అన్నాడు. "వెలగచెట్టెక్కాను వెలగపళ్లుతిన్నాను. రాజునెత్తిన పెంకడేశాను. బురదగుంటలో బురబుర లాడేను. చాకలాళ్లపొయిలో చలికాచుకున్నాను. తాతతోదడల్లాను. అవ్వతో పిండి కొడుతున్నా"నంది.

ఇంక ఇలాచేస్తే లాభంలేదని వంటవాణ్ణిపిలిచి పురిపిట్టని ఇచ్చి కూరచేసి వండి తనకి పెట్టమన్నాడు. ఆ వంటవాడు ఆ పిట్టని ఒక చిన్న బుట్టక్రింద మూతబెట్టి వంటింటికి పోయేసరికి ఆ పిట్ట మెల్లిగా తప్పించుకొని అటక మీదకెళ్లి దాగుంది. వంటవాడు తిరిగి వచ్చేసరికి పిట్టలేదు. రాజు చంపేస్తాడుగదా అని ఒక ఊరపిచికని పట్టితెచ్చి కూరవండి రాజుకి పెట్టాడు.

రాజు ఆకూర పురిపిట్టమాంసంతోవండిందే అని సంతోషంగాతింటూ "పురిపిట్టా! పురిపిట్టా!

ఎలాఉన్నావు" అన్నాడు. "వెలగచెట్టెక్కాను. వెలగపళ్లుతిన్నాను. రాజునెత్తిన పెంకడేశాను. చాకలాడిపొయిలో చలికాచుకున్నాను. తాతతో దశల్లాను. అవ్వతో పిండికొట్టాను. ఇప్పుడు రాజునోట్లో మన్నుకొట్టాను" అని పురిపిట్ట తుర్రుమని ఎగిరిపోయింది. కథ కంచికీ, మనమింటికీ.

---

## ఉపాసన

డాక్టరు గుళ్లపల్లి నారాయణమూర్తిగారు, L. M. & S.

౧

పరభృతామలమృదుగానస్పర్శచేత
నవవసంతప్రత్యూషాంగనాశరీర
మమృతకరు రశ్మి సోకిన యంత నబ్ధి,
స్వాతివానకు ముక్తాప్రసూతలంబు
కరణి, నీకృపాకలితవీక్షణముచేత,
దేవి! పులకితం బగును నాదేహవల్లి!

౨

లలితమాకందమును జేరులతను బోలె,
సరసిజాప్తుని బాయని ఛాయ వోలె,
దివము వెనువెంట బడు నిశాదేవి బోలె,
పుష్పగర్భస్థమగు తేనెబొట్టు వోలె,
అమ్మరొమ్ములో నున్న స్తన్యంబు వోలె
భవదధీనమై నాప్రేమ పాయకుండు!

౩

మబ్బు లల్లిన నల్లకంబళుల జీల్చి,
ఇరుల జెండాడు చంద్రుని కరములట్లు,
నింగి కెగయు నగ్నిశిఖల క్రుంగ ద్రోసి
చల్లదనము ఘటించు వర్షంబుపగిది,
సఖియ! నేజల్పు సర్వాపచారములను,
భవదమలహాస మంతరింపంగ జేయు.

౪

మూలముఖ త్రుంచిన గులాబి మొక్క రీతి,
మాత గోల్పోయిన శిశువుమాదిరిగను,
సౌరభము దొరంగిన పుష్పచయము భంగి,
వరుని బాసి కుందెడు చక్రవాకిలీల,
జలమునుండి పైబడిన మత్స్యంబుమాడ్కి,
అల్లలాడునో నాప్రణయాంకురంబు?
ప్రేయసీ! నీ కొసంగిన ప్రేమమాల
నెద నలంకరింతువో? కృశియింపఁ జేతొ?



ఫెంగు యుషియాంగుగారు

క్రైస్తవమతము నవలంబించి నిరాడంబరముగ నుండు సేనాధిపతి



మార్షలు చాంగు షులియాంగుగారు

మంచూరియా గవర్నరు. తాను కొన్న విమానముచెంత నిలిచియున్నారు.



టి. వి. సూంగుగారు
నాంకింగు ప్రభుత్వపు ఆర్థికమంత్రి



చియాంగు కాయి షేకుగారు
నాంకింగు ప్రభుత్వాధ్యక్షుడు



సేనాధిపతి దుస్తులలో నున్న
ఫెంగుయుశియాంగుగారు
షాంటంగు రాష్ట్రాధిపుడు



మంచూరియా సేనలు పెకింగు నగరమును ఆక్రమించుట

# నేటి చీనాదేశము

జయంతి వెంకట కిరీటిరావు గారు

చీనా దేశములోని ప్రస్తుతపరిస్థితులు ఆ దేశాభివృద్ధిని కోరు ప్రతివారికిని ఆందోళన కలిగించక మానవు. అనేకసంవత్సరములు పాటుపడి నిరంకుశప్రభుత్వమును అంత మొందించి ప్రజాపరిపాలనను స్థాపించిన కీ. శే. డా॥ సనుయటు సేనుగారి కాలమునా డైనను లేని స్థిరత్వము, శాంతియు రెండేండ్ల క్రిందట కుదిరి యుండెను. కుమింగుటాంగు అను జాతీయ పక్షము వారిచే చియంగుకాయిషేకు సేనాని ఆధిపత్యమున 1928 సం. జూను మాసమున నాంకింగు ప్రభుత్వము స్థాపింపబడిన పిదప నిట్టి చిక్కులు వచ్చునని ఎవ్వ రూహించి యుండ లేదు. ఇంగ్లాండు, అమెరికా మున్నగు విదేశ ప్రభుత్వములు గూడ చీనా జాతీయప్రభుత్వమును గుర్తించి, తమ వ్యాపారములను తమ దేశీయులను సంరక్షించుటకు నూతనప్రభుత్వము సమర్థత గలదని యెంచి, తమకు గల ప్రత్యేకాధికారసౌకర్యములను (Extra territoriality) వదలుకొనిరి. సమర్థత గల పరిపాలకవర్గ మేర్పడుటచే జాతీయప్రభుత్వ మెట్టి నిరోధము లేక నిర్వహించునని తలంచబడెను. రెండేండ్లారీతిగ గడచిన పిదప తిరిగి ఈయంతః కలహములు చెలరేగుట కేమి కారణమో యీ రెండేండ్ల చరిత్రాంశములను గమనించినచో తెలియగలదు.

అదివరకు చీనా ముఖ్యపట్టణముగ నుండిన పెకింగు నగరమును వశపరచుకొని నాంకింగు నగరమును కేంద్రముగ నొనర్చిన పిమ్మట జాతీయవిప్లవోద్యమమునందు యుద్ధపర్వము ముగిసి శాంతిపర్వము ప్రారంభ మయ్యెనని యెంచబడెను. నాంకాంగు ప్రభుత్వమువారు కేంద్రప్రభుత్వమును దృఢపరచిన పిమ్మట, జాతీయైక్యమునకును, పరిశ్రమల యభివృద్ధికిని పాటుబడిరి. వివిధ రాష్ట్రప్రభుత్వములను పూర్తిగ లోబరచుకొని, వ్యాపారమార్గములను రహదారులను నిరంకుశ సైన్యాధిపతుల వశము నుండి తప్పించిన పిమ్మట గాని దేశీయాంతర్భాగములం దుండు గనులను, వ్యవసాయములను అభివృద్ధిపరచుటకు వీలు లేదు. వారీవిషయమున కృషి చేయుచున్నపుడు వివిధ రాష్ట్రాధిపతులవలన కలుగుచున్న ప్రతిబంధకముల ఫలితముగనే నేడీ విశాలచీనాదేశమును కల్లోలపరచునట్టి యుద్ధము మరల సంభవించినది. ప్రస్తుత ప్రభుత్వమునందు స్వల్పమగు లోపములు లేకపోలేదు. కాని వాటిని సహించి జాత్యైక్యమును పెంపొందించు ఔదార్యగుణము స్వార్థపరులగు యుద్ధనాయకులకు లేకపోయెను.

### కలహకారణములు

నాంకింగుప్రభుత్వసంస్థాపనము జరిగిన వెన్వెంటనే జాతీయపక్ష కేంద్రసంఘనమా

వేశము జరిగెను. కేంద్రప్రభుత్వము ఆ నగరమున నెలకొల్పబడినను ఇదివర కాయా రాష్ట్రములందున్న యుద్ధనాయకులే ఆయా రాష్ట్రముల గవర్నరులుగ నుండిరి. వారందరును చియంగుకాయి షేకుగారిని కేంద్రప్రభుత్వాధ్యక్షునిగ ఎన్నుకొనియుండిరి. వారికి సహాయము జేయు వివిధశాఖామంత్రులుగూడ ఆ సభలో నెన్నుకొనబడిరి. ఆర్థికశాఖ మంత్రియగు టి. వి. సూంగుగారు (చియంగుషేకు గారి బావమరది) ఆర్థికవిషయము లందు బహునిపుణుడు. ఈతడు వ్యయము తగ్గించు నుద్దేశముతో కొన్ని సూచనలు గావించెను. సైనికవ్యయము 3600 లక్షల డాలరులనుండి 1920 లక్షలకు తగ్గించెను. (ప్రభుత్వమువారి మొత్తము రాబడి 4500 లక్షలు.) అదివరకే దేశమంతయు యుద్ధములలో మునిగితేలి నందున వ్యాపారము లన్నియు సన్నగిల్లి ప్రజలుధనాభావముచే బాధనొందుచున్నందున వ్యవసాయపరిశ్రమలు మున్నగు ప్రజోపయుక్తమగు కార్యములకై రాబడిని వినియోగించుటకు మంత్రిగా రుద్దేశించిరి. సభలో నా తీర్మానము ఆమోదించబడెను. మితవ్యయ సూచనగ కొందరు సైనికులు ఉద్యోగము నుండి తొలగింపబడిరి. కేంద్రరాష్ట్రప్రభుత్వముల మధ్య రాబడి పంపకము విషయమున ప్రభుత్వమునకును రాష్ట్రాధిపులకును ఆర్థిక సభలో ఒడంబడిక కుదురలేదు. దక్షిణమున హాంకో, కాంటను రాష్ట్రములు తమ రాబడి యంతయు తామే యుంచుకొనదలచినవి.

ఉత్తరభాగపు సైన్యాధిపతులగు షాంషి రాష్ట్రాధిపుడు యన్ షిషానుగారికిని, ఫాంటంగు నాయకు డగు పెంగుయుషియాంగుగారికిని, సైన్యములు తగ్గించు సూచన నచ్చకుండెను. తమ సైన్యములను తగ్గించి, చియంగు సేనాని తన సైన్యముల నభివృద్ధిచేసికొన దలంచుచున్నాడని వారు భావించిరి. మరియు కేంద్రప్రభుత్వమువారు జర్మనీనుండి యుద్ధనిపుణులను తెప్పించుట మరింత అనుమానాస్పదమయ్యెను. చియంగుషేకు గారు, కేంద్రప్రభుత్వమును దృఢపరచుటకై జర్మనీనుండి యుద్ధనిపుణులను రప్పించుటయేగాక, అమెరికానుండి అర్థశాస్త్ర నిపుణులనుగూడ రప్పించియుండిరి. రాజకీయ విషయములందు సలహానిచ్చుటకై ఆంగ్లేయుడగు సర్ ఫ్రెడరికువైటుగారిని నియమించిరి. ఈసదుద్దేశము లన్నియు రాష్ట్రాధిపుల అనుమానములు పెంపొందించెను.

విదేశీయులతో సంపర్కము కొనసాగించుట జాతీయపక్షములో అతివాదవర్గమునకు అనిష్టముగ నుండెను. ఈ వర్గమునకు నాయకుడు వాంగుచంగువేగారు. వీరు అసలు జాతీయపక్షస్థాపకులలో నొకరు. చీనాజాతీయపక్షప్రజాపరిపాలనస్థాపకు డగు కీ. శే. డా. సనుయటుసేను గారి యనంతరము తత్పక్షనాయకత్వము వహించిన దీతడే. చియంగు షేకుగారి రాజీ పద్ధతులు నచ్చకుండినందున వీరును ప్రతికూలురతో చేరిరి. మరియు చియంగుప్రభుత్వమువారు అతివాదు లందరు కమ్యూనిష్టులని పేరిడి వారిని శిక్షించుచుండిరి.

ఇంతేగాక షాంగే నగరమునందలి భారత జాతీయపక్షకేంద్రస్థానముపై దాడి వెడలి అచటి భారతజాతీయపతాకము నూడబెరికి బ్రిటిషుసామ్రాజ్యకాంక్షకు దోహదమొసగిరి. బ్రిటిషునౌకలు యాంగ్ట్సీనదిపైని దిరుగుచు చైనీయులపై తుపాకులు కాల్చుచుండ నాంకింగు ప్రభుత్వమువారు ఎట్టి ప్రతీకారము చేయక మిన్నకుండిరి. నూతనప్రభుత్వభూమిశిస్తువిధానము చైనారయితులకు అనుకూలముగ లేకుండెను. అందుచే నానాటికి ప్రభుత్వముపట్ల అసంతృప్తి హెచ్చుచుండెను.

ఆర్థికసభ జరుగుటకు పూర్వమే ఊహాను రాష్ట్రమున రాష్ట్రీయ కష్టములు సాధించు విషయమున ప్రభుత్వమువారు యుద్ధముచేయ వలసి వచ్చెను. అచట ప్రబలియున్న అతివాదపక్షమువారు ఓడించబడిరి. హూనను గవర్నరు తెరిమివేయబడెను. హాంకౌ నగరము చియంగుషేకుగారి వశమయ్యెను. హాంకౌనగరముగూడ తన కొసంగబడు నని ఆశించిన ఫెంగుహుషియాంగుగారికి ఆశాభంగ మగుటచే అతని ద్వేషము మరింత హెచ్చెను.

యుద్ధముజరుగుచున్న సమయమునందే గతవత్సరము మార్చినెలలో జాతీయపక్షమూడవవార్షికసమావేశము జరుపబడెను. ఈ సభకు రప్పింపబడిన జిల్లాప్రతినిధులు 205 మందిలో కేంద్రప్రభుత్వస్థానమునుండియే 151 మంది వచ్చుటచే, యీ సభ కేవలము అతివాదుల నోడించి కేంద్రప్రభుత్వమువారు చేయునదెల్ల వల్లె యనిపించుటకు సమావేశపరుపబడిన దని యెంచియుండిరి. ఈసభానంతరమే వాంగుచింగువేగారు "రీఆర్గనైజేషనిస్టు" అను క్రొత్తపక్షమును, నాంకింగుప్రభుత్వమునకు ప్రతికూలముగ స్థాపించియుండిరి.

పక్షములు

పైన పేర్కొనబడిన కారణములచే కేంద్రప్రభుత్వమునకు ప్రతికూలవర్గ మెట్లేర్పడెనో అందున్న నాయకు లెవ్వరో తెలియగలదు. ప్రతికూల నాయకులలో వాంగుచింగుగారితోబాటున్న తక్కిన యిరువురగూర్చి వివరములు యించుక తెలిసికొనవలెను.

(1) యన్‌షిషానుగారు—వీరు కొంత కాలము జాతీయప్రభుత్వమునందు దేశీయాంగ మంత్రిగ నుండిరి. ప్రజాపాలనప్రారంభము నుండియు (1911) షాంసి రాష్ట్రమునందు ఆదర్శనీయు డగు పరిపాలకుడుగ నుండెను. సైనికమితవ్యయమునకు యీతడనుకూలుడే గాని ఫెంగుగారి ప్రోత్సాహమువల్లను యితర కారణములచేతను, కేంద్రప్రభుత్వమునకు ప్రతికూలుడై, గత ఏప్రిలుమాసమున చీనాదేశపు సర్వసేనాధిపతి బిరుదమును తనకు తానే వహించి కేంద్రప్రభుత్వముపై దాడి ప్రకటించెను.

(2) ఫెంగు యుషియాంగు గారు—వీరు క్రైస్తవమతస్థు లనబడుదురు. సైన్యాధికారి యైనను సామాన్యునివలె నిరాడంబరజీవి యగుటచే ప్రజల నెక్కువగ నాకర్షించువాడు.

ఈతని వశమునందు మంచి నిపుణత గల సైన్యము గలదు. ఎనిమిదేండ్లనుండి చీనా యుద్ధములందు ముఖ్యపాత్ర వహించుచుండెను. కొద్దిమాసములు మాస్కోనగరమున నుండుటచే కమ్యూనిష్టుపక్షానుకూలుడుగ కొందరు భావించెదరు. వీరు తిరుగుబాటు సైన్యమునకు ఉపనాయకు లైరి.

ఈ ముగ్గురు ప్రతికూలనాయకులు గాక మంచూరియా పాలించు చాంగుషు లియాంగు గారు (కీ. శే. చాంగ్ ట్సొలినుగారి కుమారుడు) బలవత్తర మగు నాయకుడు ఉత్తర భాగమున గలడు. ఈతని చేతిక్రింద మూడు రాష్ట్రములు గలవు. ఈతనితండ్రి ఆదినుండియు జాతీయపక్షవిరోధిగ నున్నను, నాంకింగు ప్రభుత్వము స్థాపింపబడగనే యీతడు దానిని గుర్తించి తన రాష్ట్రమున జాతీయపతాకమును నెలకొల్పెను. కాని రాష్ట్రపాలనయందు కేంద్రప్రభుత్వమున కెట్టి యవకాశ మొసంగక సర్వస్వతంత్రుడుగ నుండును. ఈతను శత్రు వర్గములో చేరలేదు. ఇరుపక్షములవారును యీతని సహాయమునకై యాశించుచున్నారు. చివరకీ కూరి పోరాట మడంచి శాంతి నెలకొల్పుట కతడే సమర్థుడని తలంచబడుచున్నది.

సరిహద్దుకలహములు

నాంకింగు ప్రభుత్వమువారు గతవత్సరము తూర్పుచీనా రైల్వే విషయమున రషియాతో పోరు సాగించినపుడే* కలహకారణములు ప్రారంభ మయ్యెను. జాతీయప్రభుత్వమింకను బాగుగ నాటుకొనక పూర్వమే బలవంత మగు రషియాతో పోరాటమునకు దిగుట చియంగుషేకు గారి సాహసకృత్యమే యనవచ్చును. రైల్వేవిషయమున గల భేదాభిప్రాయములను సవరించుకొని, అంతకుపూర్వముండిన ఒడంబడికల ప్రకారము చీనా రషియా దేశపు ప్రతినిధులు గతసంవత్సరాంతమున వేరొక ఒడంబడికయందు సంతకము చేయుటతో రషియాతో తగవంతరించెను. కాని, దీని ఫలితముగ మంచూరియాలో కేంద్రప్రభుత్వముపట్ల అపోహలు జనించెను. అచ్చోట రషియాభయము హెచ్చయ్యెను.

జపానువారి వశమునందున్నట్టి ట్సినాను ఫూ నగరమును, వారు నాంకింగు ప్రభుత్వముతో గావించిన ఒడంబడిక ప్రకారము విడువవలసివచ్చెను. కాని చియంగుషేకు గారు రషియాతో తగవునందు నిమగ్నులై యుంటచే జపానువారు వెంటనే విడువకుండునట్లు రహస్యముగ నేర్పాటుజేసెను. వెంటనే జపాను వారు విడచిపోయినచో ఆప్రాంతమున నాయకుడైన ఫెంగుగారా నగరము నాక్రమించి యుందురు. ఈరీతిగ తనను వంచించుటచే ఫెంగుసేనాని క్రోధ మతిశయించెను. ఇరుపక్షములవారికి ద్వేషము పూర్తిగ పెరిగెను. ఎల్లరిచే పూజనీయుడగు కీ. శే. డా. సనుయటుసేను గారి సమాధిఉత్సవమునకుగాను యుద్ధము

* ఈ పోరాటము గూర్చి శుక్ల సం. కార్తికమాస భారతి సంచికయందు "చీనా రషియాల వైషమ్యము" అను వ్యాసమును చూడనగును.

వాయిదా వేయబడెను. అది పూర్తియైన వెంటనే నాంకింగు ప్రభుత్వమువారు ఫెంగు యూషియాంగుని గవర్నరుపదవినుండి తొలగించి, ప్రభుత్వవిరోధిగ ప్రకటించిరి. షాంసి నాయకుడగు యన్‌గారు వానికి తోడ్పడకుండజేయుటకై, చియంగుషేకుగారు పెకింగు నగరమునకు స్వయముగ బోయెనుగాని లాభము లేకుండెను.

యుద్ధము ప్రారంభమయ్యెను. గత మే మాసమున తీవ్రముగ కొనసాగెను. ఉభయులు ముఖ్యనగరముల నాక్రమించుటకు యత్నించుచుండిరి. చంగ్షనగరమును ప్రభుత్వమువారు వశపరచుకొనిరి. టీనుస్టీను రేవుస్థానమునందలి కస్టమ్సు కార్యాలయమును యన్‌గా రాక్రమించిరి. గతనెల మొదటివారమున ఫెంగు, యన్ లిరువురును సమిష్టిగ ఉత్తరభాగమున పెకింగు నగరమున ప్రతికూలప్రభుత్వమును స్థాపించిరి. విదేశీయులీయుద్ధమునం దేరికిని తోడ్పడరాదనియు, విదేశీయుల ప్రాణధనములకు తగు సంరక్షణ యొసగబడు ననియు ఫెంగుగారు ప్రకటించిరి. నాంకింగుప్రభుత్వము వారి సేన 2,300,000 యుండుననియు, విరోధులసేన 500,000 మాత్రమే యుండుననియు వదంతి. కాని చీనాలో సైనికుల సంఖ్య యెన్నడు స్థిరమైనదికాదు. విశేషసైన్యమును త్వరలో సమకూర్చబడుచుండును.

ఇట్టి సమయమున ముందేమి జరుగునో ఊహించుట సాహస మగును. అంతవరకు తటస్థముగ నుండిన మంచూరియాధిపుడగు ఛాంగుషులియాంగుగారు, ఉభయపక్షములను యుద్ధము ముగించి రాజీపడవలె ననియు, లేనిచో యీసూచన నంగీకరింపనివారిపై దాడి సల్పెద ననియు ఉభయులకు సందేశ మంపెను. యన్‌గారు యీ సూచన నంగీకరించిరనియు, మంచూరియా సేనలకు పెకింగు నగరమును వశపరచి రనియు, యిటీవల వార్తలు దెలుపుచున్నవి ఛాంగుషిలియాంగుగారు టీనుస్టీను రేవునందలి కస్టమ్సు కార్యాలయమును మిలిటరీవారి వశమునుండి తప్పించిరి. వీరు అడ్డపడుటవలన వైషమ్యములు అంతరించుననియు యేదోవిధమున రాజీకుదురు ననియు ఆశింపవచ్చును. అటుగాక వీరుగూడ శత్రుపక్షముతో చేరినయెడల, యిక చీనా దుర్దశకు అంతముండదు. ముందేమి జరుగునో చూడవలసియున్నది.

### ప్రభుత్వమువారి కృషి

ఫెంగు యన్ లిరువురును చియంగుషేకుగారి పరిపాలనయందలి స్వల్పలోపములను సహింపనేరక, వారికి తోడ్పడుటమాని, స్వార్థపరులై తామే పరిపాలనాధికారము వహించు నుద్దేశముతో యుద్ధమునకు గడంగిరి. వారి తిరుగుబాటు, నాంకింగుప్రభుత్వమునందు లోపములున్న వనుటకు నిదర్శనమగునే గాని, తమ సమర్థతను రుజువుచేయ నేరదు. ప్రస్తుతపరిస్థితులలో జాతీయపక్షప్రభుత్వమును మించిన యోగ్యతగలపక్షము వేరొండులేదు. ఇందున్న

సభ్యులందరును ఉన్నతాదర్శములతో పని జేయుచున్నారని నిస్సందేహముగ చెప్పవచ్చును. అదివరకు కొన్ని సంవత్సరములనుండి యుద్ధములు ప్రబలుటచే దేశములో పరిశ్రమలడుగంటి కాటకములు తరుచాయను. యుద్ధము ముగిసిన పిదప పనిలేని సైనికులు క్షామపీడితులైన ప్రజలకు సహాయపడుటచే కొన్నిచోట్ల దోపిడి బందిపోట్లు హెచ్చయ్యెను. ప్రభుత్వసేనలు ఉత్తరమున యుద్ధము చేయుచుండ దక్షిణదేశమున యీబాధ మిక్కుటముగ నుండెను. ఈ బందిపోటు లన్నియు రషియా కమ్యూనిస్టుల ప్రోత్సాహమువలన జరుగుచున్నవని కొందరందురు కాని అది సత్యదూరము. జాతీయప్రభుత్వమునకు వ్యవధి కలిగినచో, సముచితమగు ఆర్థికస్థితిననుసరించి పరిశ్రమల నభివృద్ధి చేసి, దేశ సౌభాగ్యమును పెంపొందింపగలదు. అప్పుడు యీ దోపిడులు అంతరించగలవు.

పదేండ్లనుండి ఎడతెగని పోరాటములందు పాల్గొనుచున్నను జాతీయప్రభుత్వమువారు ప్రజోపయుక్తము లగు కార్యము లెన్నేని యొనర్చియుండిరి. ఆరోగ్యవిషయము లందు శిశుసంరక్షణ, స్త్రీవిద్యలందును చాల నభివృద్ధి కలిగెను స్వదేశీ యుద్యమము బాగుగ వ్యాపించెను. షాంగాయి నగరము లందలి ప్రభుత్వోద్యోగు లెవ్వరును విదేశవస్త్రములను ధరింపరాదని, కుమింగుటాంగు పక్షము సభలో తీర్మానించబడెను. విదేశవస్త్రముల ధరించువారిపై పన్నుగూడ విధింపవలె నని ఒక సూచన గావింపబడెను. ప్రజాభిప్రాయము గూడ బాగుగ పెంపొందుచున్నది. కావున ప్రస్తుతజాతీయపక్షప్రభుత్వ మొక్కటే చీనా దేశమున కనుకూలమగు ప్రభుత్వముగ కన్పట్టుచున్నది. ఈ ప్రభుత్వమునకు చియంగుషేకు సేనానియే ఆయువుపట్టు. ప్రస్తుతసమరమునం దీతడు అధికారపదవినుండి తొలగింపబడు చో, అతనితో బాటు ఆర్థికవేత్త యగు టి వి. సూంగుగారుగూడ తొలగుదురు. ఇపుడున్న పరిపాలకవర్గమును మించిన దిశముందు వచ్చుట దుర్లభము

విపరీతపరిస్థితులందు తీవ్రప్రతిబంధకముల దాటి కొన్ని వత్సరములు పరిపాలనానుభవము కల్గుటచేతను, విదేశప్రభుత్వముల సానుభూతిని బడయుటచేతను, చియంగుకాయి షేకుగారి ఆధిపత్యమునందున్న పరిపాలకవర్గమే విజయ మొందినచో చీనాదేశ సౌభాగ్యము పెంపొందగలదు

# తొలకరి

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

ప్రావృణ్మేఘవినీలకుంతలకలాపంబుల్ విడఁ బార లీ
లావేశంబు, సనూత్నధర్మరచనోల్లాసంబు దీపింప నా
నావర్ణద్యుతు లార నీధరణిపై నాట్యంబు గావించు సం
ధ్యావిద్యావతి కంజలించెద జగద్రక్షాక్రియాశీలకుఁ.

అమరజీవన మీధాత్రి కవతరింప-ధర్మరతిమై తపస్సును ధారవోసి
దివిని భూమిని రెంటి సంధింపవలయు గృషికులోత్తమ నీవ భగీరథుఁడవు!

అవ్యయదివ్యభావమకరాలయజీవన మార గ్రోలి, యీ
దివ్యకళావికాససముదీర్ణత మేదిని దాండవింపగా
శ్రావ్యగభీరనాదమధురంబుగ మేఘము సంచరించుచో
నవ్యయుగోదయంబు గగనంబున దోచు గదయ్య కర్షకా!

మొత్తములై పయోదములు మ్రోయ, తటిల్లతికల్ నటింప ను
వ్వెత్తుగ దిగ్దిగంతరమహీవలయంబు చలించులీల ముం
చెత్తు సువృష్టితోడ నవజీవన మెల్లెడ మేల్కొనంగ లో
కోత్తరమేఘవిప్లవమహోద్యమ మియ్యది హాయి గొల్పెడిఁ.

జీవకళ తొల్క తొలకరించిన నభంబు-శోభ గనుగొని తన్మయస్ఫూర్తి జెలగ
భావగగన, మవినాభావభావబంధు-రములు, తలపోయ బాహ్యాంతరప్రకృతులు!

నలుపగు మబ్బుబట్ట భువనంబుపయిఁ ముసుగుఁ ఘటించి పై
జిలుకు; మహేంద్రజాలసువశీకృతసర్వజనాంతరంగు డి
మ్ముల నవమేఘమంత్రజలకున్; జడమా పుడమిన్ వినూతనో
జ్జ్వల బహువర్ణరూపమయప్రాణివితానము లుద్భవింపగఁ.

నిండె నభఃస్థలంబు నవనీరదకోమలనీలకాంతులఁ
నిండె మహీతలంబు కమనీయలతాతరుగుల్మరాజితో
నిండు జలంబుతోడ రవళించెడు వాహినులుఁ దటాకముల్
నిండుతనంబ యెల్లెడల నిండుకొనెన్ దొలివాన కారునఁ.

పచ్చని కాల్వగట్లొరసి పారెడు నెర్రని క్రొత్తనీటిపై
నుచ్చలితంబులై దొరలుచున్న వవే చిరునవ్వు మోములం

దచ్చుపడఁగ తరంగనిచయంబులు క్రొన్నురువుల్ సెలంగగా
నచ్చట నచ్చటన్ సుషు లోంకారముగా తిరుగుఁ ధ్వనించుచుఁ.

నీలమేఘ దర్శనమున నెమ్మివోలె-నాడుచున్నది పురి విప్పి యఖిలజగము
పైరుపచ్చలతో పుష్పపల్లవముల-తోడ పలురంగులొలయు వస్తువులతోడ.

నూతనమై కనంబడు ననుక్షణముఁ నినువీథి మారుతా
నీతవిభిన్నమేఘరమణీయత రాకృతు, లీమహారసో
పేతవిచిత్రనాటక మిదే గతి యెన్ని యుగాంతరంబులఁ
బాతరలాడుచుండునో యెవం డెరుగంగలడోయి కర్షకా!

అనవరత నూతనములైన హావభావ-విలసనము లెల్లెడల వెల్లివిరియు గాని
ప్రాతదన మెచ్చటను కాన రాదు జగతి-గృతయుగమునుండి యేది లెక్కింపబడునో?

లాస్యకేళీవిలాసకోలాహల మగు-ప్రకృతినానాభిధానరూపములలోన
భావమే లేని దొకటి నిర్జీవమైన-దొకటియును గానరాదు కదోయి మనకు!

అనృత మిది యనుటయే యసత్యంబ కాదె-జడమనుచు బలుకు టరయ మృషావచనమె
దుఃఖమయ మందు రది సహేతుకము కాదు; సచ్చిదానందలీలారసాఢ్య మిదియు!

ఎవరితీసున వారన్వయించుకొందు-రంతియే కాని యెవ డీయనంతసృష్టి
కావ్యమున కెల్ల నేకవాక్యంబు సేయు-నింతకును దీని పరమార్థ మేదో! సఖుడ!

దీనినె నమ్మినావు, కృషిదీక్షయె నెమ్మది నిల్పినావు, పో,
కానగరాని దానికొరకై నడుకానల కేగబోవు; మే
లోనరపుంగవా! కృషికులోత్తమ! యెప్పటికైన నీనిజం
బే నిను గాచు నిక్క మిది వేయివిధంబుల జాటిచెప్పెదఁ.

ఆకోమలశ్యామలాకార మానంద బాష్పకణంబుల బ్రతిఫలింప
ఆదివ్యమేఘనినాదంబు హృత్కుహరాంతరంబుల బ్రతిరావము గన
ఆరసోజ్జ్వలితనాట్యానందకేళికి తను వెల్ల నుప్పొంగి తాండవింప
ఆ యనిర్వాచ్యామృతానంద మొలసి జీవాత్మకు రసతన్మయత్వ మొనర
నమ్మహాశక్తి కాభిముఖ్యము వహించి-యొక్క క్షణకాల మిరువుర మొక్కరముగ
దేశకాలాదిబంధముల్ ద్రెంచివైచి - యెగిరిపోవుద మానందగగనమునకు.



కీరత జోతి ఉజారీ ధరై నృప ఆసన బేఠ్యో(?) బిరాజత నీకే,
భాట పఢే బరదావత ఆగే సునే జసకో హరషావత హీకే,
స్యామసరీర సుబధికే ధీర సజే తన భుషన భావత నీకే,
దీపగ రాగకీ రాగనీ జానియ కానరో మోహత హే అబనీకే.

[జయపుర చిత్రము: దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసుగారి యనుమతిని.]

## రాజ్య విస్తరము

కర్నూలు నవాబులు, పదునేడవ శతాబ్దారంభమునుండియు దక్షిణాపథము రాజకీయకల్లోలములలో కొంతవడి ప్రాముఖ్యము నొందిరి. కందనూలు నవాబులనిన, వారు నేటి కర్నూలుమండలము నంతయు పాలించలేదు. అటుల ఒక విజయనగరరాయలు తప్ప మరెవరును మండలమునం దంతటను తమ రాజ్యమును విస్తరింపజేయలేదు. తొలుత పశ్చిమ చాళుక్యులు సహితము మండలమునకు తూర్పుభాగమును మాత్రమే పాలించిరి. పడమటి సీమలో కొంతభాగము దేవగిరి యాదవుల స్వాధీనములో నుండెను. అదేవిధముగ కాకతీయాంధ్రులుకూడ నేలిరి. ఒక్క విజయనగర సామ్రాజ్యమహావృక్షము మాత్రము మండలమంతంతటను మూలమూలలకు పాదుకొని మహమ్మదీయదండయాత్రలకు సహితము చెక్కుచెదరక నిలిచెను. కందెనవోలినవాబులు ఒక్క కందనూలుపురమును, పరిసరగ్రామముల మాత్రమే జహగీరుగ పొంది పాలించిరి. వారి తీక్ష్ణత మాత్రము రేనాటి సీమవరకు (నేటి కోవెలకుంట్ల, శిరువెళ్ల తాలూకాలు) ప్రాకెను. అందునుండి వారి రాజ్యవిస్తీర్ణత కొలదిగ నుండినను, వారి సహాయముపై మాత్రము ఢిల్లీ మొగలాయిసామ్రాజ్యమును, అటుపిమ్మట హైదరాబాదు ప్రభుత్వమువారును నిరంతరమును ఆధారపడియుండిరి.

## చరిత్రాంశములు

మొత్తముమీద పదునేడవ శతాబ్దారంభమునుండియు ౧౮౩౯ వ సంవత్సరమువరకు, సుమారు ౨౪౦ సంవత్సరములు పదుగురు నవాబులు కందనూలుజహగీరు నేలిరి. తొలుతనుండియు ఒకే వంశమువారు పాలించలేదు. అటుల పాలించుటకు ఆంధ్రదేశములోని రాజకీయకల్లోలములు అడ్డు తగిలెను. ఒక్క ప్రభుత్వము స్థావరముగ నుండుటకు వీలు లేకపోయెను. ౧౫౬౫ వ సంవత్సరమున, సుప్రసిద్ధమైన తళ్లికోట యుద్ధము విజయనగరహిందూ సామ్రాజ్యమును తుత్తునియలుగ విచ్ఛిన్నము చేసి, ఒక దక్షిణాపథమేగాదు, భారతరాజకీయ చరిత్రప్రవాహమునే వేరు మార్గమున మరలించెను. కందనూలు మండలములో తూర్పు భాగము గోల్కొండనవాబుల భాగమునకును, పశ్చిమభాగము బిజాపురు పాదుషాలకును వచ్చెను. వారు పదునారవ శతాబ్దాంతము వరకు వారివారి భాగముల నాక్రమించుటకు చేయు ప్రయత్నములతోనే సరిపోయెను. పశ్చిమభాగము మారుమాటాడక లోబడినను బిజాపురప్రభుత్వము నామమునకు మాత్రమే యుండెను. ఆర్వీటి రామరాజు బంధువులే

పాలించిరి. తూర్పు భాగమున గోల్కొండ నవాబు లంత సులభముగ లోబరచుకొనలేక పోయిరి. కంభం, కొండవీడు ప్రాంతముల పాళెగాళ్లు వేలకొలది సైన్యములచే కొంతకాలము పోరాడిరి గాని, కడపటికి చేయున దేమియు లేక లొంగిరి. గోల్కొండ నవాబులు శిరువెళ్ల, చెన్నూరు, నంద్యాల, ముసలిమడుగు ప్రాంతముల లోబరచుకొనిరి.

పదునారవశతాబ్దాంతమున బిజాపురపు సామంతుడగు అబ్దులు వాహాబు ఖాన్ కందనూలుదుర్గము నాక్రమించి, రామరాజు మనుమడైన గోపాలరాజును కందనూలు దుర్గపు ఉత్తరపుద్వారముగుండ తరిమివేసి, దేవాలయముల మసీదులుగ మార్చి, ఇస్లాం మతోద్ధారణకు కంకణము గట్టి నిలిచెను. అతని పిమ్మట అతని సోదరుడు రాజ్య మధిష్ఠించెను గాని ౧౬౮౭ వ సంవత్సరము గోల్కొండ, బిజాపురపు రాజ్యములు ఇంపీరియలు ప్రభుత్వములో చేరిపోయెను. కందనూలు జహాగీరు డక్కనుభాగమున కంతయు సుప్రసిద్ధి జెందిన దావూదుఖానుకు ఇనాముగ నివ్వబడెను. అప్పటినుండియు కడపటివరకు దావూదు ఖాన్ వంశీయులే కందనూలు రాజ్యము నేలిరి. దావూదు ఖాన్ సోదరుడైన ఇబ్రహీము ఖాన్ నిష్పక్షపాతముగ రాజ్య మేలి, ఇంపీరియలు ప్రభుత్వపు హుకుమును జవదాటక, ఆసఫుజాతో పోరి, ౧౭౨౪ వ సంవత్సరమున చక్కరకేళి యుద్ధమున వీరశయన మలంకరించెను. ఇతని తరువాత, చరిత్రప్రసిద్ధికి వచ్చినది ఇతని మనుమడైన హిమ్మత్ బహద్దూరు ఖాన్. ఇతడు హైదరాబాదు ప్రభుత్వము కొరకై పోరుచున్న నాజరుజంగు పరమున పోరి, కడపటికి ఆకల్లోలములలో ప్రాణముల పోగొట్టుకొనెను. ఇటుల పదునెనిమిదవ శతాబ్దమంతయు కర్నూలుమండలమున కూడ తక్కిన ప్రాంతములలోవలెనే అరాజకము బయలుదేరి ప్రజాసామాన్యజీవనమునకు తీరనిభంగము కలిగించెను. ఇటులనే కడపటి నవాబగు గులాము రసూలు బహద్దూరు రాజ్య మధిష్ఠించు నాటికి కంపెనీప్రభుత్వము ఈ ప్రాంతములలో నాటుకొని యుండెను. ౧౮౦౦ సంవత్సరమున నైజాము కంపెనీప్రభుత్వమువారితో చేసికొనిన ఒడంబడికల ప్రకారము 'దత్తమండలములను' కంపెనీ కిచ్చివేసెను. నాటినుండి కందనూలు నవాబులు సహితము తొలుత నిరాకరించినను సంతోషముతోనే కప్పము చెల్లించుచుండిరి. గులాము రసూలుఖాన్ సహితము కప్పమును తప్పనివిధిగ చెల్లించెను.

## కడపటి నవాబు

నవాబు గులాము రసూలు బహద్దూరు ౧౮౨౩ వ సంవత్సరమున కందనూలు పీఠమెక్కెను. కంపెనీప్రభుత్వముతో చాలస్నేహభావముతోనే యుండెను. గులాము రసూలు కొంతవరకు పిచ్చివాడుగ నుండెనని కంపెనీ కమిషనరులే ఒప్పుకొనుచున్నారు. కందనూలు దుర్గమంతయు మందుసామగ్రితో నించి యుంచెను. శిరువెళ్ల, బేతంచర్ల, గని గ్రామములలోకూడ యుద్ధపరికరముల సంసిద్ధముగ

నుంచుట కుత్తరు వొసంగెను. ఇదంతయు కంపెనీవారికి తెలిసి యుద్ధసన్నద్ధుడై యున్నాడని తలంచి కమిషను నేర్పాటు చేసిరి. నవాబు కమిషనరులకు తగు మర్యాదలచేసెను. దుర్గమును సోదా చూడవలయునని కమిషనరులు కోరిరి. నవాబు మారుమాటాడక దుర్గమును వారి స్వాధీనముచేసి, హంద్రినదయొడ్డున నున్న జొహారాపురమునకు పోయెను. ఈవిషయము లలో కందనూలు కడపటి నవాబు మామ అయిన నాందార్ఖాన్ ఫిర్యాదు చేసినటుల నేటికిని ప్రజలు వాడుచున్నారు. ఎటులైన నేమి, కందనూలునవాబులలో కడపటివాడు పదచ్యుతు డాయెను. ఆతడు చేసిన నేరము లేమి? నవాబు కంపెనీ ప్రభుత్వమునకు రాజద్రోహ మేమి యొనరించెను? వారి వంశమునకే జహాగీరుకు గల హక్కును తీసివేయుటలో న్యాయాన్యాయముల విమర్శించుటకు పూర్వము నవాబుల పరిపాలనసూత్రములు కొంత పరికించవల యును.

### పరిపాలనసూత్రములు

నవాబుల పరిపాలనవిధాన మిది యని స్పష్టముగ చెప్పుటకు పరికరము లంతగ కానరావు. నవాబు మనవర్ఖాన్ ప్రభుత్వపు రికార్డులన్నియు కల్లోలములుగ నుండుట జూచి యేమియు చేయుటకు తోచక, ఏనుగులమీద నిండు ప్రవాహమున నున్న తుంగభద్రనదికి తోలించెను. కందనూలు హిందూ మహమ్మదీయుల పరిపాలనచరిత్ర మంతయు తుంగభద్ర నదిలో కలిసిపోయెను అయినను వారి పాలన మందలి విశేషములనుండి పరిపాలన మెటులుండినది యూహించుటకు వీలగుచున్నది.

కంపెనీ కమిషనరులు నుడివిన ప్రకారము ఈ అరాజకస్థితికి నవాబులుమాత్రమే కారకులు గారు. అటుల చెప్పుట పొరపాటు. ఒక కందనూలుమండలమే గాక, తెలుగుదేశ మంతయు నిరంతరము పోరాటములకు లోనయ్యెను. దక్కనుభాగ మంతయు మైసూరుమహారాష్ట్ర యుద్ధములతో సరిపోయెను. ఎప్పటికిని నవాబులనుండి లక్షలకొలది పేషుకషును ఎవరో ఒకరు లాగువారలే. నజరానాలకు మితి మేర లేకపోయెను. అటు లున్నపుడు నవాబులకు మాత్రము ధన మెచటినుండి వచ్చును? శివాజీ లక్షలకొలది ద్రవ్యము తీసికొనెను. హైదరాలీ పీల్చి పిప్పిచేసెను. నైజాము హుకుములకు అంతు లేకపోయెను. ఇంతియ గాక, నవాబులు నిరంతరము సైన్యముల బంపి యుద్ధములో సహాయము చేయవలసియుండెను. అందునకు విధి లేక కొందరును, సహజ క్రౌర్యముచేత కొందరును ప్రజల పీల్చిరి. ఊరక చరిత్రవిశేషములను గుర్తెరుంగక అంతయు నవాబుల తప్పే అనుట సత్యదూరము. నవాబులలో వివేకులును, అవివేకులును గలరు. ఇబ్రహీము ఖానును, గులామురసూలు సోదరుడైన మనవార్ ఖానును అతి శాంతముతో పాలించిరి. మొత్తముమీద నవాబు పాలనలో మండల ఆర్థికపరిస్థితు లన్నియు అడుగంటి పోయెను. పన్ను నియామకము లేవియు లేకపోయెను.

పన్నుల నియమించుటకు గ్రామాధికారులే దొర లైరి. గ్రామముల నరాసరి గుత్తకిచ్చు ఆచారము కడపటి నవాబులకాలములో ప్రబలెను. నవాబుకు గ్రామాధికారులే జవాబ్దారీగ నుండిరి. పంటలు పరిపూర్తిగ నుండు నపుడు నవాబుసైన్యములు ధాన్యము కబళించుచుండిరి. నంద్యాల ప్రాంతమున ఈవిధముగ జేయ గ్రామజనులు వ్యవసాయమునే రెండు మూడు సంవత్సరములు చాలించినటుల రికార్డులు గలవు. నర్నూరు గ్రామమున నవాబు గుఱ్ఱము చనిపోవుటచే గ్రామస్థులనుండి ౫,౦౦౦ రూపాయలు వసూలు చేసెను. అయితే కొందరు నవాబులు హిందూ దేవాలయముల కున్న పూర్వపు ఇనాముల నిచ్చి ప్రజల కృతజ్ఞతకు పాత్రు లైరి. ఇతరపరిపాలనసూత్రము లెటు లుండినను, పోలీసుపాలనమాత్రము శ్లాఘనీయముగ నుండినటుల కమిషనరులు వారి రిపోర్టులలో వ్రాయుచున్నారు. దొంగతనములు చాల అరుదుగ నుండెను. ఖజానా ద్రవ్యమునుకందనూలునుండి హైదరాబాదుకు ఏలాటి సంరక్షణయే లేక గంపలతోనే పంపుచుండిరి. చోరీలు జరిగిన గ్రామములు దొంగలను పట్టించనియెడల వారినుండే దొంగసొత్తు విలువను వసూలుచేయుచుండిరి. ఈ విధమగు పోలీసుపాలనము గ్రామరక్షణమున పూర్వపద్ధతు లవలంబించుటవలననే యని కమిషనరు లొప్పుకొనుచున్నారు.

నవాబువంశీయులకు ఇది తగిన శిక్షయేనా? నవాబు గులాము రసూలు ఖాన్ బహద్దూరు జహగీరును పోగొట్టుకొనుట కేరాజద్రోహమును చేయలేదు. మందుసామగ్రిని అచ్చటచ్చట సమకూర్చినది నిజమే కాని యుద్ధసన్నద్ధుడగు నవాబు సైన్యమునకు తగుశిక్షణ నివ్వక యుండునా? నవాబు ఉన్మత్తుడై యుండు చిహ్నాలు కానవచ్చెనని కమిషనరులే ఒప్పుకొనుచున్నారు. కడపటి నవాబు సైన్యమును సముద్రయాత్ర పంపి వారికి జీతమునకు బదులుగ గుడ్డలు, గడ్డి ఇవ్వవలయు నని యుద్దేశించి యుండెనట. కోళ్లకు వజ్రములు ధరించడము, ఒకసారే తానే మహమ్మదని ప్రకటించడము, ఇదంతయు ఉన్మాదము కాక మ రేమన వలయును?

కమిషనరులు కందనూలుకు పోయిన వెంటనే వారిని తగు మర్యాదలతోనే గౌరవించెనని కమిషనరులే యిట్లు వ్రాసిరి:

"కోటద్వారమునుండి నవాబు నగరము వరకు వీధుల కిరుప్రక్కల సైన్యములు బారులుదీరి యుండి మాకు నమస్కృతు లొసంగిరి. మేము దివానుఖానను సమీపింపగనే నవాబు కొంచెముదూరము మా కెదురుగ నడచి వచ్చి మా చేతులు పట్టుకొని ఉచితాసనముల కూర్చి గౌరవించెను. అటుపిమ్మట ఖరీతా ఇవ్వ నవాబు చాల గౌరవవినయములతో నందుకొనెను."

నవాబుపైన వచ్చిన నింద లన్నియు నిరాధారములని తేలెను. కంపెనీ డైరక్టరులు కూడ నవాబుపై సానుభూతి నిట్లు చూపిరి:

"నవాబు దోషిత్వమును పూర్తిగ రుజువుచేయు సాక్ష్యము లేక, అత్యంతము గమనింపదగు నేరము స్థిరపడక, ఎట్టి తీవ్రచర్యలు కావించుట కును తీర్మానము కాబోదు."

అటు లుండియు నవాబును పీఠమునుండి లాగివేసిరి. తొలుతనుండి ఇండియా గవర్నరు జనరలుగారు ఇచ్చిన వాగ్దానములు గాలికి విడిచిరి. నిర్దోషియైన నవాబునే గాక వారివంశీయుల సహితము కంపెనీ ప్రభుత్వమువారు ఊరక బెరికిరి.

౧౮౨౮ వ సంవత్సరమున అమహర్స్టు ప్రభువు గులాం రసూలుకు వ్రాసిన ఈ క్రింద లేఖనుండి తెల్లమగుచున్నది:

"నీవు బ్రిటిషుప్రభుత్వమునకు అనుకూలముగ బండారుల' రాజ్య-పరతుల' గౌరవించెద ననియు, అటుల చేయుట నీ రాజ్యపాలనకు స్థిరముగ తోడ్పడుననియు, అందువలన నేను మీ తండ్రితోను, సహోదరునితోను ఉండినటులనే మిత్రభావముతో మెలంగవలయు ననియు అభిప్రాయపడుచున్నాను. నేను నీరాజభక్తిని సంశయింపక, నీరాజ్యాభివృద్ధికై నీవు స్వతంత్ర హక్కులతో నిరాటంకముగ నీరాజ్యము చిర స్థాయిగ నుండునటుల జేసికొనిమ్మనట్లును కోరుచున్నాను. నీకు చూపిన ఆదరణ నీకు వంశపారంపర్యముగ నుండగలుగునట్లును ఇచ్చగించుచున్నాను."

గవర్నరుజనరలుగారి వాగ్దానముల ప్రకారము గులాము రసూలు అనర్హుడైనను, అతని వంశీయులు సహితము చేసిన నేరమేమియు లేక పోయినను జహాగీరును పోగొట్టుకొనుట న్యాయమెన్నటికిని కానేరదు. గులాము రసూలు ఫ్రాన్సిస్ దుష్పరిపాలనకు అతని వంశీయులు రాజ్యమును కోల్పోవలయునని మెప్పుటను లేదు. రాజద్రోహము రుజువు కాలేదు. అటు లున్నపుడు నవాబువంశీయులకు కడపటికి మంచి పెన్షనుకూడ లేకపోవుట అన్యాయము. వారికి నవాబు బిరుదములుకూడ లేవు. ఇప్పటికిని నవాబు వంశీయులు గలరు. వారికి ప్రభుత్వగౌరవము లేవియు లేవు. నామకార్థము అత్యల్పమైన, గౌరవహీనమైన పెన్షనును మాత్రమిచ్చుచున్నారు. పాడుపడిన నవాబులనగర మంతయు వారిస్వాధీనములో నుంచుట అదృష్టమే. ఎటులైనను, ప్రభుత్వమువారు వారి వంశీయుల గౌరవమునకును, పదవికిని తగు మర్యాదల చేయక తప్పదు. వారికి తగుబిరుదముల నిచ్చి, పెన్షనును అధికము చేసి, వారి పుత్రులకు విద్యావిశేషములకై తగు ఏర్పాటుచేయుట ప్రభుత్వమువారి తప్పని విధియై యున్నది.*

* ఈ నవాబుల తాలూకు కోటలోని శిథిలములయిన భాగములు మొదలయిన వాని ఛాయాచిత్రములు శుక్లసంవత్సర పుష్యమాస భారతియందు కలవు. ... ... —సంపాదకుడు - భారతి.

# ఒకశరద్రాత్రి

దివాకర్ల వేంకటావధాని గారు

పొంగి పొరలిన యనురాగమునకుఁ గొంత - మొదటియుద్ధతి తగ్గనో? పూరుషుండు
నలసియుండియొ? పారవశ్యమ్మొ గాని - కాంత యొడిలోనఁ గాంచె సుఖప్రసుప్తి.

హద్దుపద్దులేక హృదయంబునఁ బుట్టెడు భావసంసక్తితో
నిద్దురవోవుచున్న ప్రియు నెమ్మొగమ్ముఁ దిలకించుచుండె న
మ్ముద్దియ నిర్నిమేషయయి; పూర్ణశశాంకుఁడు తొంగితొంగి వా
రిద్దరివంకఁ గన్గొనఁగ నెంచి తొలంగుచునుండెఁ గ్రమ్మఱన్.

అదియు శరత్కాలమగుట దిగ్విజయంబు జరుపు చంద్రునిసాంద్రకిరణ సమితి
సౌరభంబును జిమ్ము సరసప్రసూన సంకులమౌచు నొప్పు నికుంజభూమి
ప్రాంతప్రవద్ధునీ శీతల మధురవాఃకణలవహారియౌ గంధవహుఁడు
విజనస్థలంబౌట విశదమై వినవచ్చు మహితనదీగాన మధురిమంబు
నిన్నియునుగూడ నేకమై యింతియొక్క - గాఢరాగమ్ము పై కుబుకంగఁ జేసె
నదియుఁ జూడ్కులలో లీనమౌచు నతని - మోహనం బగు నెమ్మోము ముంచివైచె.

పిల్లతెమ్మెరలచే విడివడ్డ ముంగురుల్ సవరించు పలుమార్లు సంభ్రమమునఁ
జిరునవ్వు పెదవులఁ జెలఁగియాడుచునుండ నెమ్మొగమ్ము తదేకనిష్ఠఁ జూచుఁ
జేతఁ గనుల్మూసి చెక్కిలి ముద్దాడి మోహమ్మున మరొక్కముద్దు వెట్టు
నల్లన మొగమెత్తి యంజలి ఘటియించి కన్గొనుచుండు నాకసమువంక
హృదయమునఁ జేయివేయుచుఁ బదిలమైన - రాజ్యమిది నాదియన్న గర్వము వహించు
సమ్మహానంద సామ్రాజ్య మనుభవించు - నామె కీభూమియే స్వర్గమయ్యె నచట.

దీపంబు నత్తెత్తి తిలకించు బాలుఁడు క్షీరముం గ్రోలెడి చిన్నబిడ్డ
అభ్యాగతులఁ బేర్మి నర్చించు గృహమేధి భగవంతు దరిసించు భక్తవరుఁడు
జయలక్ష్మి చేపట్టి చనుదెంచు వీరుఁడు ధనరాశి లెక్కించుకొనెడు లోభి
పంచమస్వర మెత్తి పాడుగాయకమణి కావ్యము నిర్మించు కవివరేణ్యుఁ
డనుభవించెద రానంద మతిశయముగ; - వలచి వలపించి మనసార విలిచికొనిన
సుప్తిలో నున్న ప్రియమూర్తిఁ జూచువారి - ముదముతో సాటిగాని దయ్యది తలంప.

# స్వరకల్పన

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు

ఈ వ్యాసము గతవ్యాస మంత పట్టముగా నుండ వీలులేదు. నేనా వ్యాసములో వ్రాసిన వాటికి ప్రతివాదములును, వాటికి నా జవాబులును మాత్రమే ఇం దుండును. కళాభిమానులు కొంచెము ఓపికతో కడముట్ట చదివి సత్యాసత్యములను నిర్ణయింప ప్రార్థితులు.

స్వరచిహ్నములకూడికలలో రంజకత్వము లేదని నేనంటే కొందరు కాదంటున్నారు. రంజకత్వము లేదంటే మచ్చునకైనా లేదని నా యభిప్రాయము కాదు. కొంత కలదు. కాని ఆరంజకత్వానికి స్వరచిహ్నముల సమ్మేళనము మాత్రము దారి కాదు. ఇదట్లో వివరిస్తాను. వారనేదేమంటే, "మూడవకాలపు స్వరకల్పనలో రంజకత్వము లేక పోవచ్చును కాని రెండవకాలపు కల్పనలోనూ, మొదటికాలపు కల్పనలోనూ రంజకత్వము లేదనడము కళ్లు మూసుకొని చూడడమే"నని. సరే మన మీ వాదమును పరిశీలింతాము. తాళ మనగా కాలమును కొల్చుట. ఆవృతము లనునవి కాలమునకు కొలతలు. దూరమునకు గజములు, మీటర్లు, మూరలు కొలతలైనట్లు తాళమునకు ఆవృతములు కొలతమానములు. ధ్రువతాళము, మఠ్యతాళము, ఆదితాళము అను వేర్వేరు తాళములకు వేర్వేరు కాలపరిమితి గల యావృతములు ప్రమాణములు. అనగా, ఆవృతము లన్నిటికీ ఒకే కాలముండదు. ఈకాలము కొన్ని సమమైన భాగములు చేసినారు. ఈభాగములను క్రియ లందురు. ఒక్కొక్క క్రియలో నాలుగక్షరముల నిమిడ్చి పాడుట "మొదటికాలపు పాట"యని పిలువబడును. క్రియకు ఎనిమిదక్షరముల నిమిడ్చిపాడుట "రెండవకాలపు పాట" [ఇప్పుడొక్కొక్క యక్షరమును పలుకుట కున్న కాలము మొదటికాలములోని యక్షరమున కున్న కాలములో సగమే]. క్రియకు పదహారక్షరముల నిమిడ్చి పాడుట "మూడవకాలపుపాట." కృతిగానము సామాన్యముగా రెండుకాలముల పాటకే వీలు. కాని స్వరకల్పన గాయకుని శక్తి ననుసరించి పై కాలములను చేస్తూంటుంది. మూడోకాలపుపాటలో క్రియలో పదహారక్షరములు రావాలి. కాబట్టి అక్షరమునకే గాక, ఆయక్షరము నంటియుండే నాదమునకు అట్టే కాల ముండదు. రెండోకాలపు పాటలోని యక్షరమునకు మూడోకాలపు అక్షరమునకు రెండింతల కాల ముంటుంది. కాబట్టి ఇప్పుడు మూడోకాలపు పాటలో ఒక్కొక్షరమునకు గల కాలమును ప్రతి యక్షరమునకు గమక మమర్చుటకు వాడవచ్చును. మొదటికాలపుపాటకు ఇంతకంటె ఎక్కువకాలముంటుంది గమక ప్రయోగానికి. కాబట్టి గమక మెక్కువైన కొద్ది పాటమాధుర్యము ఎక్కువవుతుంది. అయితే గమకానిదా, స్వరచిహ్నముల సమ్మేళనానిదా మాధుర్యము? స్వరకల్పనలోనున్న కొంచెపు మాధుర్యము గమకానిదే. ఆగొప్ప స్వరకల్పనకు తగిలించి స్వరకల్పనలో మాధుర్యమున్న దనడము కాకరకాయ కూరలో దట్టముగా బెల్లము కూటించి కాకరకాయకూర తియ్యగా ఉంటుందనడమే.

మరికొందరు గడుసు వాద మారంభించారు. వారనేదిది: గాత్రముతో పాడితేనేకదా నీకు ఇది స్వరకల్పన, ఇది అకారము అని తెలుస్తుంది? జంత్రముమీదనయితే ఆసంగతి తెలియుదే? ఎవరైనా జంత్రగాయకులు కృతితో స్వరకల్పన చేసి, నీకళ్లు కప్పడానికి మాత్రము, 'ఏమండోయి! మీరు వాదించినట్లుగానే నేను స్వరకల్పన చేయడము మానివేసి, కేవల మకారకల్పనే చేస్తున్నా'నని చెప్పి నమ్మించితే, స్వరకల్పనే కూడదని వాదించిన నీకు—సికరానికి—ఓటమి రాలేదా?"అని. సరే. మీరూహించినట్లే అన్నీ జరిగితే ఓటమి నాదే. ఇందులో వ్యతిరేకమున్నది. ఈవాదము నెదుర్కొనుటకు ముందు నావాదసారము కొంచెము పొందుపరుస్తాను. "సంగీతమునకు భావరాగములు ప్రధానము. స్వరకల్పనకు—'సరిగ' మొదలైన స్వరచిహ్నములతో కూడి భావస్ఫూర్తి గల

గమకసమ్మేళనమును ముక్కలుచేయుటవలన—భావభాగములో చోటులేదు. కేవలము నాదప్రధానమైన రాగము నకు కేవలశాస్త్రరూప మొసంగి జగన్మోహనకరమగు సంగీతకళను దిగదీయుటచే రాగభాగములో చోటు లేదు. తాళము సంగీతగతిని నిర్ణయించుటేకాని స్వతః రంజించు శక్తి గలిగినది కాదు. కాన కళాప్రదర్శనమున కాలవాల మగు సంగీతసభలలో 'స, రి, గ'లు వినబడుట కళకు శుభావహము కాదు" అని నావాదము. దీనిని మనస్సులో పెట్టుకొని పైయాక్షేపణను పరిశీలిస్తాను.

జంత్రముమీ దంతా స్వరకల్పనే కాని "స, రి, గ" లు వినబడవు. వాటి నంటియుండే నాదమే వినబడుతుంది. స్వరముల సమ్మేళనములలో మేళవింపుంటే సరి, అది రాగభాగములాగే కనపడుతుంది. అందువల్ల రంజకత్వానికి లోటు రాదు. రంజకత్వము లేదనే కదా స్వరకల్పన మానమని నేను వ్రాయుడము? గాత్రముతో స్వరకల్పన చేస్తే రంజకత్వము కనబడదు. గాత్రము మీద షడ్జమునకు రూపము 'స' యనే యక్షరముతో కలసిన నాదము. జంత్రముమీద నాదమే. కేవలనాద మగు జంత్రకల్పితస్వరము భాషాచిహ్న సహిత మగు గాత్రకల్పిత స్వరముకంటె నెక్కుడు రంజకత్వము కలిగియుండును. జంత్రము మీది యకార కల్పనకూ, స్వరకల్పనకూ గల సామరస్యము గాత్రముమీద లేదు. స్వరమూ, అకారమూ ఒకటేయవుట వల్ల జంత్రవాద్యము కటువుగా నుండదు. మరొకసంగతి. జంత్రము మీద సమర్థుడైన గాయకుడు కృతితో కలిపి మనగాయకులు వాడే కల్పనలాంటిది పలికించు నను కొనుడు. దానిని పురస్కరించుకొని స్వరకల్పనవాదులు "అదిగో! చూడండీ. స్వరకల్పన బాగుండ దన్నారు ఎలాగున్నది?" అని నన్ను గేలిచేస్తే, "హాయి! చూడండీ, ఎంత బాగున్నదో అకారకల్పన? దరిద్రపు స్వరకల్పనతోటి మనప్రాణాలు తీయడ మెందుకండీ మీరు?" అని నే నంటాను. రెండింటికీ భేదనిర్ణయము సాధ్యము కాదు. కాబట్టి జంత్రముమీద చెల్లుతుందని గాత్రముమీద చెల్లదు స్వరకల్పన.

"అయితే జంత్రముమీద కృతులు వాయించేటప్పుడు స్వరకల్పన చేయవచ్చునని ఒప్పుకున్నారా?" అంటే, "పద్రిస్సనిధ, రిస్సనిధ" మొదలుగాగల స్వరములు గాత్రముతో పాడకపోతే సాగుపులైపోతాయా?" అని అడ్డుకర్ర వేస్తారు మునపటి వ్యాసపాఠకులు. మనవి చేస్తాను. అంతకు ముందొక సంగతి మనవిచేయవలసియుంటుంది. నే నీవ్యాసాలు ఏవ్యక్తిమీదనో ఉన్న ఏవగింపువల్ల వ్రాయలేదు. కళాభ్యుదయము మనసులో పెట్టుకొనే వ్రాశాను. కాబట్టి పాఠకులుకూడా అట్టి మనస్సుతోనే చదివి తోచిరీతిని కళకు మేలు చేస్తే ధన్యుడను. ఏదో క్రొత్తనాదము లేవదీసి దానిని సమర్థించుకోడానికి వితండవాదాలు పృష్టిస్తున్నాడని మాత్ర మెంచవద్దని ప్రార్థన........ఎంతతేడా లేకపోయినా స్వరకల్పనకీ అకారానికీ జంత్రముమీద, గాయకులు కృతులకు జోడించే స్వరములకూ అకారకల్పనకూ తేడా లేకపోలేదు. "రఘువంశసుధాంబుధి చంద్ర" అను కృతిని తీసుకోండి. కీర్తన వాయించి వాయించి, "సారిస-గారిప-రీసమదాగని..." అనే చిట్టస్వరము వేస్తున్నారు గాయకులు. ఇది స్వరమని తెలిసిపోతుంది. ఇట్లే "నీమది చల్లగ నను బ్రోచుట..."లో "పదప సాస-పదనిదపమ..." అనేది స్వరమని తెలిసిపోతుంది. అలాగే "శృంగారలహరే."లో "సా, రిసనిపసనిపమ గమపా" అనేదీని. ఇవి కృతి సాహిత్యముతో సరిపోవు. తన్మయత్వముతో హృదయానందము వెలువరించిన త్యాగరాజాదు లివి పాడినా రనుట అబద్ధము. ఇవి పూర్తిగా రాగము లా పాడినవా రెవరూ లేరు. పాడినా అసహ్యముగా నుండు నేమో కూడా? ఇక "పద్రిస్సని"ధాదులనుగూర్చి. ఇవి వాయిస్తూన్నప్పుడు జంత్రము ప్రవాహములా గుండదు. తీగల మీద (వీణగాని ఫిడేలు గాని అయినట్లయితే) ఇవి వాయిస్తూన్నప్పుడు వ్రేలు జరగదు. ఒక్కొక్క యక్షరమూ పలికించేటప్పు డొక్కచోటనే యుంటుంది వ్రేలు. హార్మోనియము వాయించేవారు గమకస్ఫూర్తి చూపవలసి వచ్చినట్లయితే నొక్కిన మెట్టుకి ప్రక్కనున్న మెట్టును వణకింపడము చేస్తూంటారు. "పద్రిస్సని" ధాదులు వాయించేటప్పు డిది యనవసరము. సాధా

రణముగా మనగాయకులు పాడే స్వరకల్పన పాడిగా నుంటుంది. అందువల్ల వాటిప్రక్కన వాయించే మద్దెల వేర్వేరుగా వినబడుచప్పుళ్లతో కూడి అంద ముగా నుంటుంది. స్వరకల్పన పాడిగా నుంటేనే గాని దాని ననుసరించి నడిచే మద్దెలలో ఘాత లెక్కనగా నుండవు. స్వరకల్పనలో సభికుల మెప్పు బడయుదమని యెందు గాయకులు మేళవింపు కూర్ప యత్నింపరు. అనగా అక్షరమో, (జంత్రముమీదనైతే) నాదమో ప్రత్యేకముగా కాక పదివాటితోటే కలిసి జతకూడే ట్లు పాడరు. మేళవింపు లేకపోతే ఇది తెలియడ మెంతసేపు? పాడిగా నుండే కల్పన లెక్కడేరా బాగుం డవు. బాగుండని పాడిసమ్మేళనాలనిసరించే నాతగా దా. మేళవింపున్న కల్పనలు జంత్రము మీద రాగము లోని భాగములనలెనే కనబడతాయి. రాగముతో నాకు తగాదా లేనే లేదు.

శాస్త్రమునకు సభలలో చోటు లేనే లేదని నేను వ్రాశాను. దీనికి ప్రతివాదముచేయరాని కేడమున్నది. తక్కిన కళలలో శాస్త్రము లేదా? కవిత్వము తీసి కొండి. రామాయణాది యుద్ధగ్రంథములలో కేవలము గద్య రూపమున నుండిననే బాగుండి పద్యరూపమున నుంటే బాగుండని పద్యములు లేవా? అక్కడి పద్యములను "కవితాకళ"లోని భాగము లనవచ్చునా? ఇక్కడ కేవల శాస్త్రరూపమైన రచన కళావేశము గురించి చలామణి యాటలేదా? అనగా కవితలో శాస్త్ర మున్నదికదా? సంగీతములోని స్వరకల్పనమాత్రము "ఇది శాస్త్రము; దీనిని సభలలోనుండి తప్పించవలె"నని వాదించుట కూడు నా? అని మీ రనవచ్చును. కవితలో పద్య మెట్టిస్థాన మాక్రమించుచున్నదో సంగీతములో స్వరకల్పనకూడా సరిగా అట్టిస్థానమునే యాక్రమించినచో పైవాదమునకు బలముంటుంది. అట్లున్నదా యనియే మనము తర్కించ వలెను. స్వరకల్పనమూ, ప్రతిపద్యమునకూ సామరస్యము కలదా? లేదు. యుగంధరమంత్రి పిచ్చివాడై చెప్పిన "అండజభీముడం డ డ డ..."అనే పద్యానికీ స్వర కల్పనకీ పోలిక ఉన్నది. ఏమంటారా? అది కేవల స్వరచిహ్నముల సమ్మేళనము; ఇది కేవలభాషాచిహ్న ముల సమ్మేళనము. సరి, కేవలగణప్రాసబద్ధమైన కవితను తీసుకోండి.

"ఒకరు యిచ్చిన కేట్లాగు నుంచుకొనక
పారవేయుట ఘోరమా పాతకంబు."

(ఒక కేట్లాగుమీది పద్యం.)

దీనికీ, జీవము లేని రాగభాగమునకూ పోలిక కలదు. ఇది సలక్షణమైనను వెగటు పుట్టించే కవిత. అదీ సలక్షణమే. ఒక రాగమునకు గల స్వరముల సమ్మేళనమే. కాని అదీ వెగటే కలిగిస్తుంది. ఈ రెంటికీ పోలిక యున్నది. కాని జీవము లేని కవితను స్వరచిహ్నముల సమ్మేళనముతో పోల్చడము కాని పని. గురులఘువులు స్వరచిహ్నముల వంటివి. వాటికి కొంత నిర్ణీతపథ మున్నది. స్వరచిహ్నము లకుకూడా ఆరోహణావరోహణక్రమము నిర్ణీతమే. గురులఘువుల ననుసరించు నక్షరములు స్వరస్థానముల వంటివి. భాష రాగము; భావము జీవము. కవితలో కేవలము ఏవో గురులఘుసమ్మేళనము లుండవు. అట్లుండి ననే కవితలో కేవలశాస్త్ర మున్నదనిచెప్పవీలు. కాబట్టి కవితలో కేవలశాస్త్రము లేదు. ఇట్లే చిత్రకళలోని పుర వీథుల చిత్రములు, వాస్తుశిల్పములోని సామరస్యము (Symmetry) కేవలశాస్త్రములు కావు. వృత్త సంయోగమువల్ల శాస్త్రరూపమున గోచరించిన బొమ్మ పద్మరూపమున శిల్పకళ యైనది. Perspective రూప మున క్షేత్రగణితమైనదే పురవీథిరూపమున చిత్రకళ యై నది. సామరస్యము గణించుటవల్ల లత (design)యైన (లత కేవలము శాస్త్రమేయని యొప్పుకొన్నను) బొమ్మ గోపురరూపమున వాస్తుశిల్ప మైనది. అస్థిశాస్త్రము కేవలశాస్త్రమే, శిల్పకళ కాదు. స్వరకల్పన కేవల శాస్త్రమే, రాగము కాదు.

ఆఁ, రాగము శాస్త్రము కాక మరేమి? అని కొంద రంటారు. శాస్త్రమో, కాదో తేల్చేముందు రాగ మెట్లేర్పడినది యని తెలుసుకొనుట యావశ్యకము. దీని నటుంచి రాగము శాస్త్రమే అనుట కేది యాధారమో గమనింతము. స్వరప్రస్తారసాగరము చూస్తే "సరిగమ పధనిస-సనిధప మగరిస" యను నది మాయామాళవ

గౌళరాగమని గోచరించును. అనగా ఆరోహణములో 'స' తరువాత 'రి', 'మ' తరువాత 'ప' వచ్చి, అవరోహణములో 'ప' తర్వాత 'మ', 'ని' తర్వాత 'ధ' ('ని' తర్వాత 'ధ' వదలి 'ప' పాడరాదు) వచ్చి, యిట్లే వరుస తప్పక చేసిన ప్రస్తారము మాయామాళవగౌళరాగమని యర్థము. ప్రతిపక్షులవాద మిది. రాగముయొక్క శరీర మింతశాస్త్రానుసారియే; మరి రాగమును శాస్త్రము కాద నుట సమంజసమా- యని మనము రాగమును శాస్త్రమని కాని, కాదని కాని యనరాదు. అసలు రాగ మెట్లేర్పడి నది? ప్రథమగాయకు డగు పరమేశ్వరుడు, లేదా నాద కళాది యగు పరమపురుషుడు రాగము నెట్లు సృష్టించి యుండును? పాటయైన తర్వాత నాదము సప్తస్వరము లయ్యెనా? లేక సప్తస్వరములే నాదజన్మమున కాధార భూతము లయ్యెనా? "ప్రణవనాదము సప్తస్వరములై పరగ"నని త్యాగరాజు గానముచేసియుండినాడు. సరే దాని కేమి. ఏ యాధారమును ఊతగొనకయే మనము నాదకళాదిని దర్శింపబోదము. పగలెల్లను కష్టపడి సాయంకాలము పొట్ట నిండ భుజించి ఆరుబయట వెన్నెలలో వెల్లకిల బరుండు చాకివాడేమి సేయును? ఉదయము నశే లేచి పశువులను తోలుకొనిపోయి సాయంత్ర మింటికి తోలుకొని వచ్చు గొల్లపిల్లవాడు చెఱువులో నీరు గేద మీద కూర్చుండి చేసేపని ఏమిటి? పట్నములో పాటు పడి సాయంత్రము తిరిగి యిండ్లకు బోవు కూలెత లేమి చేయుచు పోవుచుందురు? తల్లి పిల్ల నెత్తి ముద్దాడునపు డేది బయల్వెడలును? పాటయని తజ్ఞులజవాబు. ఆనంద సమయములలో సహజావేశముయొక్క ఫలితము పాటయే. నాగరికునికికూడ ఆనందసమయములయందు గానము సహజగుణమై రాగమురీతిని పరిణమించును. పాట మానవుని ప్రథమావస్థ నుండికూడ నుండియుండుననుట నెవ్వరు కాదనరు. నాగరికుడు పాడుతూ పాడుతూ రాగరూపమున పాడిగి యుండుననుట యతిశయోక్తి కాదు. ఆనంద సమయములలో మానవుడు తీసిన కూనిరాగముల స్మృతియే రాగమని నాయుద్దేశ్యము. ఈరాగము పాడగా పాడగా కొంత తేడా వచ్చినట్లు గోచరించినది ప్రథమ గాయకునికి. ఇక్కడ రాగము మారియుండవలెను.[1] ఏమిటి మారిందో కనుగొను యత్నమునందు స్వరములు, వాటిచిహ్నములు, తాము పాడేకళలస్వరములు, వాటిని బట్టి తమరాగపోకడ వారికి తెలిసినది. సరే, ఇట్లే మరో రాగము. ఏడ్పులో సింహేంద్రమధ్యమరాగములోని కళ లున్నాయని బరంపురం గాయకులు రాజమహేంద్ర వరపు ఉపన్యాసములో చూపినారు. ఇట్లు కొన్ని రాగము లేర్పడిన పిమ్మట, ఒకరాగములో కొన్నిస్వరాలే, ఒక నిర్ణీతవిధి ననుసరించి వాడబడుతున్నాయని వారు గ్రహించినారు. పిమ్మట స్వరముల సమ్మేళనపురీతి మార్చినట్లయితే పైరాగములవంటివే పెక్కురాగము లేర్పడగలవని వెల్లడిచేసినారు. కాబట్టి, పైవిధము సరియైనదే యని ఒప్పుకొంటే[2], రాగము కళ అవుతుంది. రాగాలాపన సంగతేమిటి? ఆలాపనము శాస్త్రాధారముగానే విస్తృతమౌనుకదా? అందువలన ఆలాపనము శాస్త్రము కాదా? అని అడగవచ్చును. రాగాలాపన శాస్త్రము ననుసరించి జరగడము నిజమే. కాని అది శాస్త్రప్రయోగము కాని పూర్ణముగా స్వరకల్పనవంటి శాస్త్రము కాదు; పద్యము వంటి శాస్త్రము. శాస్త్రమునకు చోటు లేదని నావాదము కాని శాస్త్రప్రయోగమునకు (application) లేదని

1. ఇది కేవలము గగననిర్ణయపుస్వరూపముకాదు. నాయెఱుక నొక కుఱ్ఱవాడు సావేరిరాగ మాలాపనచేయుచు "స రి గ మ ప మ గ రి" యను సమ్మేళనమును రాగరూపమున వెలువరించి "అన్నా తప్పింది రాగ"మనడము చూచాను.

2. ఈవాదమున కాధారములు: పాట ముందు, స్వరములు చూడడము తర్వాత అనేవిషయము. సంగీతము ఒక్కసారిగా నరులకు దేవతలవల్ల ప్రసాదింపబడక, మానవునిచేతనే కొంచెము కొంచెము తెలియబడిం దనే విషయము. నావాదము కాదనేవారు ఈరెండు విషయములనూ తిరస్కరించవలెను.

కాదు. కళ చాలమట్టుకు శాస్త్రానుసారమే.[3] మొత్తానికి పట్టిశాస్త్రమునకు సభలలో చోటుండరాదని నా యాశయము. తక్కిన కళలలో పట్టిశాస్త్రము లేదు సంగీతమున కెందుకీ రొష్టు?

చాలమంది గాయకులు మరో వాదము చెప్పుతున్నారు. "విద్వాంసునికీ ప్రాకృతగాయకునికీ తేడా ఉండును. ఈ విషయము సభలను వినడానికి వచ్చిన వారికి తెలియుడ మెలాగు? ప్రాకృతగాయకునికి మించి తనకు గల సంస్కారము సభ్యులకు చూపడము కోసము సభలలో పండితులు స్వరము వాడుతున్నారు. లేకుంటే, సాధకము వల్లకాక వినికిడివల్లనే రాగాలూ, కృతులూ నేర్చుకొన్న ప్రాకృతునికీ, సాధకబలమువల్ల సంగీతము నేర్చుకొన్న విద్వాంసునికీ గల తేడా కనిపెట్టడమునకు సభ్యులకు సాధ్యము కాదు. అందువల్ల ఒక్కొక్కప్పుడు పండితునికి కాక ప్రాకృతునికే గౌరవ పురస్కారములు లభించడమూ, పండితులు విషణ్ణులై తిరిగి పోవడమూ జరుగుతూంటాయి. తన విద్వత్తునకు తగిన పురస్కారము లభించక పోయినప్పుడు, సభ్యులు తెలివి తక్కువచేత తనకంటె హీనసంస్కారుని ఎక్కువవాడనే యభిప్రాయముతో గౌరవము చేస్తూన్నప్పుడు, పండితుని ఆఖరు యత్నమేమిటి? కేవలము విద్వత్తునకే కాని వినికిడికి సాధ్యము కాని స్వరకల్పన చేసి తన విజ్ఞానమును ప్రదర్శించు టేకదా? ప్రాకృతునికీ భాగము తెలియదు కాబట్టి అతడీపని చేయలేడు. ఇందుమూలమున ప్రాకృతపండిత భేద మేర్పరచడానికీ, పండితులకు గౌరవపురస్కారములు లభించడానికీ వీలు కలుగుతూన్నది. అంతే కాని స్వరకల్పన నేమానమంటే పండితపామర భేదముండదు. పెద్దగొంతుంటే సరి, ప్రాకృతుడు గొప్ప విద్వాంసుల పాటనైనా వినబడనీయడు. ఉదాహరణము నాటకగాయకుల గ్రామోఫోనుపాటలు. బిళహరి, మోహన; శ్రీరాగము, కన్నడ, కలిపి-వండేసి పద్యాలు పెట్టిచ్చేస్తే సరి అందరూ కొనుక్కొని అనుకరించేసి గాయకు లయిపోతున్నారు. ఏ కిల్లీకొట్టుమీద చూచినా, ఏ బండీవాడి నోటిని విన్నా, ఏ విద్యార్థి గదికి వెళ్లినా ఈ పాటలే. మహా మహా పండితుల కైనా యీ పాటి ఆదరము లేకపోతోంది."[4] అని వారి వాక్యముయొక్క సారము. ఈ వాదమంతా ఇసుకకట్టే. రెండు పనులు చేస్తే వీరు స్వరకల్పన కరీతిగా నిచ్చేదన్న పడిపోతుంది. ఒకటి, పండితగాయకునికీ పామరగాయకునికీ తేడా స్వరకల్పన కాదని చెప్పడము. రెండు, వారి భేదము కనిపెట్టడమునకు వీ లేదో కనుక్కోవడము. ప్రతిపక్షుల ఈ వాదమునకు నేను ప్రశ్నపరంపరచే జవాబిస్తాను. పండితపామరులకు స్వరకల్పనేనా తారతమ్యము? పండితులే కావలెనా స్వరము వాడడానికి? పామరులు స్వరకల్పనపద్ధతి[5] తెలుసుకుంటే చేయలేరా? గానపండితులు స్వరమునే తమ పాండిత్యమునకు చిహ్నముగా నుంచుకొన్నారా? త్యాగయ్య స్వరకల్పన చేయడమువల్ల నాతడు గానపితామహుడైనాడా? స్వరకల్పన బాగుగా చేతనయితే సరి, అతనిని పండితుడనవచ్చునా? లేకపోతే వినేవారా దోషులు? గానములో ప్రధానమేది? మాధుర్యమా? స్వరకల్పనా? ఈ ప్రశ్నలకు జవాబు లిచ్చుకుంటే తేల్తుంది నిజము. పండితపామరుల భేదము నిరూపించడానికని మానవునికీ మానవునికీ గల తేడా ఏదైనా సరేనా? ఏమిటి, పనికొస్తుంది? లేక సంగీతానికి, అనగా పాటకి గల తేడా చూడాలా? స్వరకల్పన కూడా పాటయేనా? సంగీతమేనా? సంగీతములో స్వరకల్పనైతే కవిత్వములో ఏమిటి గొప్ప వాడికి దాఖలా? ఏకాక్షరకవిత్వమా? బంధకవిత్వమా? మహాయమకమా? శ్లేషయా? ఏమంటే, పదిమంది కవుల భావాలిరికించి పద్యము వ్రాస్తే కుకవికి పురస్కారము వస్తుంది. పండితపామరులకు తేడా ఉండదు. కాబట్టి పండితుడే కాని పామరుడు చేయలేని యమకశ్లేషబంధకవిత్వాలు

3. కాదంటారు కళాభిజ్ఞులు. శాస్త్రము మొట్టమొదట కళనుండియే యేర్పడినది. రాగములనుండి స్వరములు, వాటిచేరిక తెలియబడినవని యింతకు ముందు చెప్పినాను. తరువాత శాస్త్ర మేర్పడినది. దీని ననుసరించి క్రొత్తరాగములు కనుగొనబడినవి. కాని త్యాగయ్యవంటి నిర్మలభక్తిపరుల కీ శాస్త్రజ్ఞాన మనవసరము. వారి భక్తి పారవశ్యమే వారికి దారిచూపును.

4. ఈ తప్పు గాయకులది కాదు. అసంస్కారులైన ప్రజలదే. వారేమి చేస్తారు? ఒకరు వారు పాడిన తప్పుపాటనే మెచ్చుకుంటే, ఈ ప్రచారానికి వారు బాధ్యులెలా గవుతారు?

5. పద్ధతి కేవలము రీతి. ఒక రెలాగున చేస్తారో తెలుసుకోడము.

వెలిగిస్తే, చివరికవులలాగ అతడే పూజ్యుడవుతాడు. కవిత్వమయింది. చిత్రకారుడి కెలాగ? కాలితో సుద్ద పట్టి బొమ్మ వ్రాయడము కాబోలు. శిల్పి ఈ మతానుసారము జీలుగబెండు విగ్రహములు చెక్కవలెను. వాస్తుశిల్పి పేకముక్కల మేడలు కట్టవలెను కాబోలు. వాహ్వా, ఏమి అతిలోకకళాసృష్టి! ఈ సృష్టిని చూచి విశ్వామిత్రుడు తల వంచుకోవాలి. పండితు డిలాంటి కళాప్రదర్శనాలు చేస్తే కళాకన్య ఝుడిసి, ఈ పేకముక్కల మేడలలో జీలుగుబెండు విగ్రహముల ముందు, బంధకవిత్వములను స్వరకల్పనసహితముగా పాడలేక పారిపోయియుండును; ఏమంటే, కళలోని పాండిత్యమును శాస్త్రరూపమున వెలువరించవలసివచ్చుటవల్ల.

'పోనీ, ‘పండితపామరులకు భేదము వీరు చెప్పే స్వరకల్పనేనా? అదేనా నిజమా?’ అని తర్కిద్దాము. స్వరకల్పనకారుడు చేసే బ్రహ్మవిద్య యేదో కనుక్కోడానికి ముందు తాళమునుగురించి చెప్పవలసి యున్నది. తాళమునకు ఆవృత మను కాలము మానము (unit). ఆవృత మనగా కొంతకాలము. దూరమునకు క్రోశములు, ఫర్లాంగులు, మీటర్లు కొలతమానములైనట్లు తాళమునకు వేర్వేరు కాలముల పరిమితి గల్గిన ఆవృతములు కొలతలు. ఈ ఆవృతముల కన్నిటికీ క్రియలు సామాన్యప్రమాణములనవచ్చును. కృతి పల్లవి, అనుపల్లవి, చరణము అని మూడు భాగములు. ఇవన్నీ కొన్నిపూర్ణావృతముల కాలపరిమితిని గలిగి యుండును. ఉదాహరణముగా “గజాననయనుచు సదా భజన సేయరాదా?” యను కీర్తనను తీసుకొందాము. పల్లవిలోను, చరణములలోను సామాన్యముగా స్వరకల్పన చేయుచున్నారు గాయకులు. పల్లవిలో స్వరకల్పన చూడండి. మామూలుగా పాడేటప్పుడు పల్లవి ఒకమారవగానే రెండవమారు పాడడానికారంభిస్తారు. స్వరకల్పనకారు డట్లు చేయక పల్లవిలో నొకమాట పూర్తికాగానే స్వరకల్పన నారంభించి ఆమాటనందు కొంటుంటాడు. “ఇందువదన మా రంగస్వామి” యను కృష్ణప్పగారిపల్లవి చూడండి. ఆయన “ఇందువదన” అని తర్వాత “మారంగస్వామి” అని పాడుకాలములో స్వరములు వాడి తిరుగ పల్లవికి వచ్చుచుండును. ఈస్వరములు వాడడములో చిత్రమున్నది. [క్రియకు మొదటి కాలములో నాలుగు రెండవ కాలములో ఎనిమిది, మూడవ కాలములో పదహారు స్వరచిహ్నములు పడుచుండును.] ముక్తాయింపులను బిగింపు లన్నవి. ముక్తాయింపునకు మూడు స్వరసమ్మేళనా లుంటవి. మొదటి సమ్మేళనము “సరిగమప” యని యుంటే, రెండోది “రిగమపధ”యనీ, మూడోది “గమపధని”యని యుండును. మూడు అయిపోయిన తర్వాత పల్లవి యందుకొనుట అలవాటు. ఈమూడు వేస్తూవుంటే మద్దెలగానికి చురుకైన దరువులు గట్టిపడును. ఇవి సామాన్యముగా మూడో కాలములో నుండును. లేకుంటే బిగింపుండదు. ముక్తాయింపులు తెగ వాడినట్లయితే పాటకుడు చాలా గొప్పవాడని పేరు పొందుతూన్నాడు. ఆదితాళమునకు ఎనిమిది క్రియలు. క్రియకు ప్రథమ కాలములో నాలుగక్షరముల కాల మున్నది. అనగా నాదితాళపు ఆవృతమునకు మొత్తము ముప్పది రెండక్షరములు పడవలెను. ఇదే రెండో కాలములో పాడినట్లయితే మొత్త మరవయినాలుగక్షరములు పడును. మనము మాప్పుట కొక ముక్తాయింపు కట్టుదము.

షడ్జము దగ్గరనే ఆరంభింతాము.

| | |
|---|---|
| సారీగా(అ) | ఏడక్షరముల కాలము. |
| సరిగమప | ఐదక్షరముల ,, |
| రీగామా(అ) | ఏడు ,, ,, |
| రిగమపధ | ఐదు ,, ,, |
| గామాపా(అ) | ఏడు ,, ,, |
| గమపధని | ఐదు ,, ,, |

మొత్తమీ ముక్తాయి ముప్పదియారక్షరముల కాలమువరకు వచ్చినది. ఆవృతమగుట కింకా ఇరవయిరెనిమిదక్షరము లున్నవి, (ఇది కృతియారంభించడానికి ముందు వ్యవధి లేకుంటేను.) ‘వ్యవధి’ లేక ‘జాగా’ ఉన్నట్లయితే, ఈ వ్యవధిన్నీ ముప్పయిరెండక్షరములూ కలిసిన కాలముంటుంది. ఈ కాలములో నేవైనా సరే స్వరచిహ్నములు వాడవచ్చును. వరుసమాత్రము తప్పకూడదు. అనగా ‘స’ తరువాత ‘రి’ గాని, ‘ని’ గాని రావలెను. కాబట్టి పై ముక్తాయి వాడడానికి ముందు ఈ ముప్పయి

రెండక్షరములూ వేసి తర్వాత ముక్తాయి వేయవలెను. పై ముప్పయిరెండక్షరాలలోను ఆఖరక్షరము '3' గురియుండవలెను.) లేకపోతే ముక్తాయిని 'సా' అని మొదలు పెట్టినప్పుడు వరుస తప్పుతుంది.) ఇది యొక్క ముక్తాయి. దీనిని కట్టుటకు సంగీతజ్ఞానమును దేని నుపయోగించినాము? అన్నీ లెక్కలే. పండితునికే సాధ్యమా యిది? ఇలాంటి ముక్తాయిలు ఎన్నైనా కట్టవచ్చును. కొంచె మలవాటు (ఈ యలవాటు సంగీతజ్ఞానముతో కూడుకొన్నది కాదు) చేస్తే సరిగా పాడుట నేర్వవచ్చును. ముక్తాయింపు పెద్దదైతే జాగారు వచ్చుకష్టము తగ్గును. కాన ఇందు సంగీతకళాజ్ఞాన మనవసరము. ఎన్నైనా సరే, నే నిప్పుడు కట్టినట్లు కావలసినన్ని ముక్తాయింపులు కట్టుకోవచ్చును. కాబట్టి పండితపామర భేదము స్వరకల్పన కానే కాదు.

సరే, ఇది యిటుండనిండు. పండితపామరులకు తేడా ఏది? రాగము తీసుకొనుడు. పండితునికి సాధకము వల్ల పామరునికంటె ప్రావీణ్య మలవడదా? అలవడకపోతే, ఈ గానపండితు లెందు కలా రోజూ సాధకము చేస్తారు?— ప్రశ్నలీమాత్రము చాలు. ఇంక అసలు తేడా చూతాము. కృతులు ఒకరు పాడుతూండగా విని నేర్చుకొన్నా, తేడా లంటాయి. ఒకరి దగ్గర నేర్చుకొన్న కీర్తనను వారివలె పాడడము విద్యార్థి వశము కాదు, తాను ప్రత్యేకముగా కృషి చేస్తే తప్ప. అందువల్ల చిట్టాపల్లనే తెలిసికోవచ్చును, పండితుడో కాదో. నిరావళి ఆనందముగా పాడలేడు పండితుడు కాకుంటే. కేవలము శ్రమపడతాడు ఎంతసేపైనా. ఆకారము ఎక్కువగా ఉండ వచ్చును. హాయి ఉండదు. పండితుడైతే సాధకబలమువల్ల ఏకళ బాగుంటుందో గ్రహించి, దానిని కృతులలో నిమిడ్చి హాయి కూర్చుతాడు. పామరుని వెంతసేపూ చిలుకపలుకులు. విశాఖపట్టణములో ఏలాగున ఏకృతులు పాడినాడో, కాకినాడలోకూడా ఆకృతులే ఆలాగునే పాడతాడు. రాగము తీసుకోండి. నాటకకత్తుగా పాడడానికీ, సంగీతకత్తుగా పాడడానికీ తేడా కద్దు. పామరునిలో నాటకకత్తు ఎక్కువ కనపడుతుంది. అనగా రాగము త్వరగా సాంతమవుతుంది. ఒకకళ వచ్చిందా అంటే, దాని తరువాత అంతకన్న కొంచెము రాణించేకళ రాదు. దానినుండి రాగాంతమునకు దగ్గరైన కళ పడుతుంది. పరికొంచెము విపులముగా చెప్పుతాను. పండితుని సాలీడుతో ఒకవిషయములో పోల్చవచ్చును. సాలీడు కప్పునుండి క్రిందికి గూడు అల్లవలెనని క్రిందికి జారును. అల్లిక తెగితెగి అల్లేప్పుడు మరికొంచె మెక్కువగా నల్లగలుగును. తరువాత మరికొంచెము. ఇలా కొంతసే పయిన తరువాత పూర్తిగా నల్లును. పండితుడు రాగము కొంత అల్లి మరల మొదటికివచ్చి మొదటికంటె మరికొంత ఎక్కువ పాడి, ఇట్లు చాలసేపయిన పిమ్మట రాగము సాంతము చేయును. పామరుని పాట బట్టలనేతవంటిది. దారమూ దారమూ అతికినట్లు కళల నొక దానికొకటి తగిలించి రాగము లాగేస్తాడు. ఈతని ఆలాపనలో ప్రస్తార ముండదు. ఒకసారి ఒకసమ్మేళనము పడితే మళ్లీ దానితోటి సంబంధమే లేని మరొకకళ పడుతుంది. పడిన కళయే మళ్లా పడుతుంది. ఏమంటే పామరుడు పాడే కళలలో బాగుండే కళ లెన్నో ఉండవు. అందుచేత ఏమంచికళయో ఒకటి— తోడిరాగములో "మగనిసద సా" వంటిది—దొరికితే దాన్నే పదిసారులు త్రిప్పి త్రిప్పి కొట్టవలసివస్తుంది. పండితునికీ కక్కుర్తిపని యావసరముండదు పామరునికి సంగీత మొక తటాకము; పండితునికో మహాసముద్రము. అత డెంతసేపు గంటాలు పడినా యీదినదూరమే యీదవలెను. ఇత డోపిక యున్న జాలు, యోజనము లీదగలడు.

"భరమైతోచు కుటుంబరక్షణకుగా ప్రాల్మాలి చింతన్ నిరంతరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థవ్రాతాదరవాటుల్ తెగి కొట్టు" కు కవివలెనే పండితగాయకుల ననుకరించే పామరుడు "తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచాతుర్యక్రియావిరహుండై" కొరత పడవలసినదే. కుకవులను గాని, పామరగాయకులను గాని ఏరుటకు తజ్ఞులు కావలెను కాని ప్రతివారూ సమర్థులు కారు. వీరు తెలివితేమిచే పండితుల నెఱుగలేకున్నచో నాదోషము వినేవారిదే. "కుశాస్త్రైః స్వైః కుపరీక్షకై ర్న్నుణయస్తై రర్ఘతః పాలితాః."

అసలీ స్వరకల్పన ఏమిటి? "స,రి,గ,మ" యనున వెట్లేర్పడినవి? ఆరుస్వరములును మొదటి దానినిబట్టి యేర్పడుటవల్ల షడ్జమని దానికి పేరువచ్చినది. ఋషభమువలె ధ్వనించుటచే ఋషభమనీ, ఇట్లే తక్కినవీ యేర్పడినవి. వీటిముందున్న యక్షరములే "స,రి,గ,మ,ప,ధ,ని"లు. ఇవి కేవలము చిహ్నములు. రాగరూపమున అనగా నాదరూపమున వెలువడేభావమునకు 'స,రి,గ'లు అడ్డు. ఏమందురా? భావ మేమో చిత్తగించండి. భావములను చిహ్నరూపమున వెలువరించేది భాష. ఈచిహ్నములు దేశభాగములను బట్టి భేదించును. (అందువలననే పలుభాషలు పుట్టినవి) మనము "స,రి,గ,గ, ..ని" అంటే ఇంగ్లీషువారు "సో,లా,డీశో, మాఫాసీ" లన్నారు. స్వరకల్పన నుండవలెననేవారి పైయక్షరములలో కల్పన జరిగితే ఏమంటారు? మీ 'స,రి,గ'లే పవిత్రములా? స,రి,గలే వాడడాని కేమిటి వాటియాధిక్యము? అంతేనా అంటే అంతే. అంతటితో ఫైసల్. చిహ్నములతో కొట్లాడితే యింతే. తెల్లవాణ్ణి చూచి "రావోయి, ఇలాగ" అంటే వస్తాడా? చేయి యూపితే వస్తాడు. ఇది చిహ్నమే. అయితే నేమి? మొదటిదానికన్న మెరుగు. అలాగే కేవలము ధ్వనిరహితమై హృదయానుప్రమగు నుత్సాహమునకు, లేదా భక్తికి,చిహ్నము నాదము. రమ్మన్న చేయి యూపునువలె నందరూ దీని నర్థము చేసుకుంటారు. కాబట్టి నాదరూపమై జనాకర్షకముగ నుండు సంగీతమును పాడుచేసి భావరహితమును నేయునదె స్వరకల్పన చేయడమంటే.

ఇటువంటి స్వరకల్పనను గాయకు లెందుకు చేస్తున్నారు? ౧. రాగరూపాన్ని వెలువరింపవలసిన కళలను స్వరరూపమున వెలువరించి బరువు తగ్గించుకొనుటకు. ఇది గానకళాభివృద్ధికి భంగకరము. రాగవైశాల్యము క్షీణించుటకు దాయి. కుకళాభివృద్ధికి తావలము. ౨. కాలక్షేపము కొరకు గాయకులనైదేసి గంటలు పాడమంటే వారు కాలక్షేపపూర్వకమైన స్వరకల్పన చేయకుండలేరు. రాగము పాడగా పాడగా తలనొప్పి వచ్చేదనీ, స్వరకల్పన చేస్తే అట్లుండదనీ ఒకగాయకుడు చెప్పినాడు. స్వరకల్పన చేయుట మొకసారి పట్టుబడిన దంటే గంటలు గంటలు వేయ వచ్చునట. (ఇదికూడ గాయకులమాటయే.) అందుచేత కృతి త్వరగా కానిచ్చేసి స్వర మందుకుంటే కాలము జరిగిపోతుంది. అకారరూపమున శ్రమ యిచ్చు గానము స్వరకల్పనరూపమున విశ్రాంతి నిస్తుంది. కాని ఈ విశ్రాంతి కళకు నష్టకారి. కాబట్టి బ్రతుకుటకు దీనికి హక్కు లేదు. గానసభపరిమితిని మూడుగంటలకు తగ్గించితే ఈ విశ్రాంతి కవసర ముండదు. ౩. ఇది యొక ప్రజ్ఞయను నపోహచేత. మొదటికాలములో "రాగకళ"లను నిబిడముచేసి పాడుట గొప్పయనీ, పైకాలములో ముక్తాయింపులు కట్టుట గొప్పఅనిన్నీ వారి యభిప్రాయము. రాగకళకు పిశిష్టార్థము లేదు. ఫలానిది రాగకళ కాదని చెప్పడ మెవరికీ సాధ్యము కాదు. పై పెచ్చు, బస్కీలు తీయుడ మెటువంటి ప్రజ్ఞయో ఇదీ అటువంటిప్రజ్ఞయే. ఆశ్చర్యపడకండి. దానిలోనూ పోయిందేమీ, దీనిలోనూ లేదు. క్రిందికీ పైకీ ఊగుతూండగా చూచిన ఉత్సాహమే ప్రత్యేకస్వరములకు గమకములు చేర్చి పాడినప్పుడు కలుగుతుంది. ఇది శరీరబలమునకు సహాయకారి. అది గొంతు తిరగడానికి సహాయకారి. సాధకము చేస్తేనే కాని రెండూ సాధ్యపడవు.

ఈ మధ్య నొక వకీలు మిత్రులు "మీరు తీవ్రముగా వాదింపడము మొదలుపెట్టుతున్నారు. మీ వాదమును పండితు లెవరూ లక్ష్యపెట్టరు. పామరగాయకులు, అంటే నాటకపాటకులు, స్వరకల్పన చేతకానివారూ, ఎవరైనా స్వరకల్పనెందుకు చేయలే దంటే, 'మేము స్వరకల్పనవారము కాము"ని మీ వెనుక జేరి ఆ రొష్టునంతా మీమీద పడవేస్తారు. అంతకితప్ప లాభము లేదు. కాబట్టి మీరు రాజీకి రావాలి. ప్రతికృతిలోను స్వరము వెయ్యక కేవలము పల్లవిలోనే స్వరము వేస్తే మీరు ఒప్పుకొనవలెను." అని తీర్పు చెప్పినారు. ఇది న్యాయమా! నా ప్రక్క నశక్తులు చేరనీ సశక్తులు చేరనీ, నేను వెనుకకు చూడను. నామాట లొకరికైనా నచ్చి స్వరకల్పనయొక్క సత్యస్వరూపము వ్యక్తమైతే నాశ్రమ వ్యర్థము కాదు. కాని జీర్ణించిన వ్యాధిని నిర్మూలించునప్పుడు, పాపము, చాలాకాలమునుండి యున్నది. అంతా పోగొట్టడము మంచిది కాదు. పూర్తిగా నశించేటట్లు

చేయవద్దు అనడము ధర్మమా? రాజీలు కేసులకే గాని అన్నిటికీ పరిపడవు. స్వరాజ్యానికీ పానిసత్వానికీ, వ్యాధికీ ఆరోగ్యానికీ, ధర్మానికీ అధర్మానికీ, సత్యానికీ అసత్యానికీ, నాస్తికత్వానికీ ఆస్తికత్వానికీ మైత్రి ఎలాగు? యుక్తులు ప్రతీచోటా పనికివస్తాయా? కళా విషయములో జాలీ జంకూ పనికిరాదు.

కాబట్టి, యో కళాభిమానులారా! అవసరమని తోచితే మార్పు జరిగి తీరాలి. ప్రాచీనాచారమని పేరు పెట్టి కళను పాడు చేస్తున్నారు ఛాందసులు. కాదం టారా? సత్యమును బయట పెట్టండి. ఉద్ధతుల మధ్య పేదలై నా బోటి వారొకరిద్దరు కలము పారవేసినా నష్ట ముండదు. కాని వ్యాఘులు నిర్మూలించకుంటే ఆధి తప్పదు. ఈమధ్య నొక ప్రఖ్యాతగాయకులు నీకే పాటి సంగీతము వచ్చునన్నారు. నాకేమీ రాదు మహా ప్రభో, విద్వాంసుడనని నేనీ వ్రాత వ్రాయలేదు. విద్వాంసు లందుకుంటారు గదా యని వ్రాసినాను. ఎవరేనా ప్రతిఘటించి స్వరకల్పనను సమర్థించ గలిగితే కళకు వారు చేసే సేవ ఇంతని చెప్పరాదు *

---

# హెచ్చరిక

జి. జామువ గారు

ఘనఘనాఘనము చీకటిమేడ వెలిగించు మెఱుముదివ్వెల నూనె తఱుగలేదు
పవలు రాతిరి తీరుబడిలేక ఘోషించు తోయధీశునిగొంతు రాయలేదు
ఇనబాలకుని దినమ్మును గర్భమున బూను పొడుపుదిక్సతికాన్పు లుడుగలేదు
ఋతురాజు ధారుణీసతికి సొమ్ములుపెట్టి కులికించుపని మానుకొనగలేదు
విశ్వనిర్మాత చల్లని వీక్షణమున - నేటికిని గెంపుచాలు గన్పింపలేదు
మూర్ఖలోకమ, దినమెల్ల ముగియలేదు - దీపమున్నది హృదయంబు దిద్దుకొనుము.

విసువుగొనలేదు సృష్టికి విశ్వభర్త-పాలపాపల జన్మల మూలకమున
తెలుపుచున్నాడు శాంతి సందేశములను - విశ్వమా, ధర్మమును కూడబెట్టు మిపుడ:

నమ్మకము లేని నీజీవమున కవధి - గుండె గడియారమున దాగియుండునోయి!
లెక్క ముగిసిననాట జాలించుకొనును-త్వరపడుము మూర్ఖ, ధర్మ నిర్వహణమునకు.

నాటుము విత్తనం బొకటి నాలుగునాళ్లకు మొక్కయై మహీ
పాటన మాచరించుకొనివచ్చును ధర్మము దప్పకుండ, నీ
వేటికి ధర్మముం దొలగి తేను పరాత్పరు నాన కొంచెముక్
దాటనటంచు బల్కెడు విధంబున దోచుగదా నతాంగమై?

సృష్టి తనధర్మమును నిర్వహించునన్న-నీశ్వరుని మానసకమలంబు తృప్తిగొనదు
భక్తికిరణంబు నీలోన బ్రజ్వలింప - బరమపితకంట మోదబాష్పములు నిండు.

---

* ఈ వ్యాసరచనకు ప్రోత్సాహకరము లగు గ్రంథపత్రికాదివాఙ్మయమును, విలువ లేని సలహాలను ఇచ్చిన గానపండితులకు వినయపూర్వక వందనము లాచరించుచున్నాను.

—వ్యాసకర్త.

## మద్యపాన నివారణ ప్రచారము





౬. భయానకరసము—హిరణ్యకశిపువధ



౭. బీభత్సరసము—వసా గంధా రుధరప్రియుల శవభోజనము

# భయానక రసము

భీతాభయప్రదానసారమగు వీరమునకు తరువాత నారవది భయానకరసము. ఇది కాలదేవతాకము, కృష్ణ వర్ణము నగు. భయ మిందులకు స్థాయి. భీతిజనకము లగు వికటదర్శనాదు లాలంబనములు. భయంకరములగు వాని చేష్ట లుద్దీపనములు. వైవర్ణ్యము, గద్గదస్వరము మొదలగునవి అనుభావములు. అపస్మారము, సంభ్రమము, మృత్యువు మొదలగునవి వ్యభిచారులు. ఇది స్త్రీనాయకము, నీచనాయకము, బాలనాయకము నగును.

భయానకరసము (గీతము) మల్లార రాగము – ఢేంకికా తాళము.

స్తంభిత ఇహాఖిల దనుజకలాధమ వసతి హరి ర్యదితవ కుమతే,
బహిరేవ్యతి స తదా ఽ పృథుసైవహి కమలాపతి రిహ పరినిహతే.

ఇతికథనపరం దనుజాధిప మాత్మీయతనయ మభికుపితమ్,
విగ్రహ మహహ హిరణ్యకశిపు మిహ నాశయతి హరిముఖేన యుతమ్.

హరి రఖిలభయం నయనత్రయయుక్తం ఖరఖరకరప్రతిభమ్,
అర్ధం నరివ పరిదర్శ్య తదసురజప్రీతివితరమధినీలనిభమ్.

## హిరణ్యకశిపు వధ

రంగము—హిరణ్యకశిపు నాస్థానము.

[నరసింహుడు కూర్చొనియుండును, కొంతదూరమున హిరణ్యకశిపుడు నిలుచుకొని యుండును]

హిరణ్య—ఏమిది? ఏమిది? ఇచ్చట నేమున్నది? ఆహా! ఏమాశ్చర్యము! ఏమి భయంకరాకారము! ఎటులు వచ్చినది? ఎందులకు వచ్చినది? ఖడ్గమున దన్నితినో లేదో, స్ఫాటికస్తంభమునుండి మనోవేగమున నవతరించెను. ఏమి, నన్ను సంహరింప దేవదేవుడే యీయాకారమును బూనెనా? నాఒడలంతయు జలదరించుచున్నది. రక్తమంతయు చల్లవారినది. ఇపు డేమి చేయుదును? నాఖడ్గమున నెదిరింతునా? ఎట్లెదిరింతును? నాచేతులు పడిపోయినవి. పారిపోవుటకుకూడ వీలులేకున్నది. నా పాదములు భూమిపై నాటబడినటులున్నవి. ఏమి విపరీతాకారము! ఆహా! ఏమిభయంకరారవము! భూమియేకంపించిపోవుచున్నది. హా! నన్ను చంప వచ్చుచున్నది. చచ్చితిని! దీనిబారినుండి తప్పించువారెవరు? ఇంతకు ముందు భయమన నేమో యెరుగను. ఇప్పుడు నాకేమిగతిపట్టినది? ఒడలంతయు చల్లబడి కంపించిపోవుచున్నది. చచ్చితిని, చచ్చితిని. అదిగోవచ్చుచున్నది. అదిగో, అదిగో! (నరసింహుడు హిరణ్యకశిపుని పైకురికి యతనిశిరమును రెండుగ చీల్చివైచును)

[యవనిక దిగజారును.]

# బీభత్సరసము

ఏడవది బీభత్సము. ఇది నీలవర్ణము గలదియు, మహాకాలదైవతకము నగు. జుగుప్స యిందులకు స్థాయి. దుర్గంధమగు మాంసము, రుధిరము; విణ్మూత్రాదులు ఇందుల కాలంబనములు. దుర్గంధము, కృమిపాతము మొదలగు నవి యుద్దీపనములు. నిష్ఠీవనము, ఆస్యవలనము, నేత్రనిమీలనము మొదలయిన వనుభావములు. మోహము, అపస్మారము, ఆవేగము, వ్యాధి. మరణము ఇత్యాదులు వ్యభిచారులు.

బీభత్సరసము (గీతము) పుళిందకా రాగము - జయమంగళ తాళము.

హతమానుషగణపరిపూరిత ఇహసంగరభూతలతః,
ఏహి రుధిరప్రియ రక్తమపరిమిత మవిరత మాపిబ తూర్ణగతః.
స్రోతో నిఃహతి శోణితసంభవ మహహ విఫల మితి భావయతీ,
రాక్షసయోషి దుపాగతనిజపతి మభిముఖ మాప్తవతీ.
పత్యాసహా చిర మత్తి యథాస్పృహ మధుప పిబతి సమరాంగణతః,
అస్థిసమూహా మశేషరుధిర మపి సహసిత మేవ తితః.

వసా గంగా రుధిరప్రియుల శవభోజనము

రంగము—యుద్ధానంతరపు కురుక్షేత్రరంగము.

వసాగంధా ప్రవేశము.

వసా—(సంతోషమున నాడుచు) హే! ఏమిభయంకరయుద్ధము! నేలయంతయు రక్తసిక్తమయిపోయినది. వేనకువేలు శవములు నేల దొరలుచున్నవి. ఏమి సుదినము! ఇంకను ఈయుద్ధము వేయివర్షములు సాగినచో బాగుండును. ఏనుగుల మస్తిష్కములు కుప్పలుకుప్పలుగ పడియున్నవి. ఓ! కడుపార భుజింతును. ఆహా! ఏమి చక్కని వాసన! ఇది నాయాకలి నినుమడింపజేయుచున్నది. వీని నన్నిటిని తనివిదీర భుజింతును. (ఆగును) ఏడీ నాగుసిరప్రియుడు? రక్తమాంసములు వాసనపట్టినపిదప వాటి నతడిచ్ఛగించునా? వెంటనే అతనిని పిలతునుగాక. అతడు నిదురపోవుచున్నచో ఈ పదార్థములు రుచిని గోల్పోవును. (బిగ్గరగా) ఓరుధిరప్రియా, రుధిరప్రియా! రమ్మ, రమ్మ తొందరగా. ఇదిగో నీకుగా ప్రీతితోనుంచిన భోజనము.

(రుధిరప్రియుడు భుజముపయి నొక క్రుళ్లిన శవము నుంచుకొని ప్రవేశించును)

రుధిర—ప్రియురాలా! ఎక్కడ నున్నావు? ఇదిగో నీకొక క్రుళ్లినశవము. దీనితో నీయాకలిని పోగొట్టుకొమ్మ. ఇదియొక చచ్చిన యేనుగుక్రింద పడియుండెను. చక్కగా క్రుళ్లినది. చూడుము. పురుగులు గుంపులు గుంపులుగా దీనిలో చొరబడుచున్నవి. చక్కనిరుచి!

వసా—ఏదీ? ఏదీ అది? (ఆత్రముతో నాశవము ను దీసికొనును)

రుధిర—మంచిది, క్రుళ్లినమాంసమునకై నీకింతకోరికయా?

వసా—ఓ! నీవెల్లప్పుడు క్రొత్తమాంసమునే భుజింతువు. క్రుళ్లినమాంసమును నవిమాడనవకాశమేదీ? మాంసము క్రుళ్లినగాని రుచికరముగ నుండదు. దానిపై నీకోరిక లేనిచో నీక్రొత్తరక్తమాంసముల నారగింపుము. మరల రేపు యుద్ధము జరుగును. అప్పుడు మంచి విందు దొరకును. సందేహము లేదు.

రుధిర—అలాగా? రేపు మరలనా? ఆహా! (ఆడును)

[తెర]

# హిందూదేశ పారిశ్రామికసమస్యలు

## ప్రపంచ ఆర్థికదుస్థితి — హిందూదేశమున కెట్లు నష్టము?

చావలి వెంకట హనుమంతరావు గారు, M. A., F. R. E. S.

౧

ప్రస్తుతకాలములో ప్రపంచమందన్ని దేశములందును గొప్ప ఆర్థికదుఃస్థితి ప్రబలుచున్నది. వ్యావసాయిక పారిశ్రామిక దేశములను విభేదములేక ప్రతిదేశమందును నిరుద్యోగ సమస్య మితిమీరుచున్నది; వర్తకవ్యాపారములు సన్నగిలినవి. ఈ విపరీతపరిస్థితులకు కారణముల నారయవలసిన యావసర మిప్పుడు లేదు. కాని అట్టి పరిస్థితు లున్నవనియు, హిందూదేశముకూడ ఈదుఃస్థితికి ఇతరదేశములవలెనే పాల్పడుచున్నదనియు గ్రహించుట ముఖ్యము.

ప్రపంచమందంతటను పైన చెప్పబడిన పరిస్థితి వర్తకపు వస్తువుల ఖరీదు తగ్గిపోవుట వలన కలుగుచున్నది. వ్యావసాయిక దేశములందును, పారిశ్రామికదేశములందునుకూడ అవసరముగ కోరబడినవాటికంటెను, అనగా అమ్మకపు బేరమున్న వానికంటె చాల ఎక్కువగ వస్తువులు తయారగుచున్నవి. వస్తువులెక్కువ తయారగుటవలన ధరలు తగ్గిపోవును; ధరలు తగ్గిన పరిశ్రమాధికారులకు లాభము తగ్గిపోవును; లాభములు తగ్గుటవలన పరిశ్రమలు మందగించును; దానివలన ఫ్యాక్టరీలలో పనిచేయువారి సంఖ్య తగ్గిపోవును. వర్తకవ్యాపారము క్షీణించుటవలన ఏదేశమునందు తయారుకాబడిన వస్తువులు ఆదేశమునందే నిలువయుండిపోయి ఎగుమతులలో తగ్గుదల కన్పట్టును. ప్రపంచదేశములందలి ఎగుమతి దిగుమతుల పట్టీని పరీక్షించిన ప్రతి ముఖ్య పారిశ్రామిక దేశమందుకూడ ఈవిషాద పరిస్థితు లున్నట్లు గ్రహించనగును. అమెరికా సంయుక్తరాష్ట్రములలో పోయిన సంవత్సరమునకన్న ఈ సంవత్సరమున ఎగుమతులు నూటికి 22.6 వంతునను, దిగుమతులు 29.9 వంతునను తగ్గిపోయినవి. అట్లే ఇంగ్లండులో ఎగుమతులు 16.4% వంతునను, దిగుమతులు 10.2% వంతునను తగ్గిపోయినవి. ఇట్లే ఇతరదేశములందుకూడ ఎగుమతి దిగుమతులలో క్షీణదశ కాన్పించుచున్నది. ఎగుమతులెప్పుడు క్షీణించునో అప్పుడే దిగుమతులుకూడ క్షీణించితీరును. ఎందువల్లననగా, ఎగుమతులెప్పుడును అంతర్జాతీయ వర్తకవ్యవహారములలో దిగుమతులవలననే తీర్చబడునుకాని సొమ్ముచేత కాదు; వర్తకవ్యాపారము తగ్గుటచేట వస్తువులు క్రొత్తవి తయారు చేయవలసిన అవసరము లేక పరిశ్రమలు క్షీణించి ఆయాదేశముల ఆర్థికస్థితి దుస్తరమగుట కవకాశము లేర్పడుచున్నవి.

## ౨

ఈ పరిస్థితులు హిందూదేశమందు కూడ ప్రబలుచున్నవి. మన దేశపు ఆర్థికస్థితి ఇప్పుడున్నంత పాడుగ గడచిన 25 సంవత్సరములలో నెప్పుడును ఉండియుండలేదు. దేశమందలి పరిశ్రమలు పడిపోవుచున్నవి; వర్తకవ్యాపారము సరిగా సాగుటలేదు. మన దేశపు ఔన్నత్యమునకు మూలకారణముగ నుండుచువచ్చిన విదేశముల కెగుమతులు తగ్గిపోయినవి. ప్రభుత్వమువారు కరెన్సీని రోజురోజునకును ప్రకృతి విరుద్ధమగు పద్ధతులపై తగ్గించుచు ఆవిధముగనే వస్తువులఖరీదుల నెక్కుడుచేయుటకు ప్రయత్నించుచున్నారు. మన దేశపు ముఖ్యమగు ఎగుమతి సరకులు జనపనార, ప్రత్తి; ఈ రెండింటియందును వ్యాపారము సన్నగిలినది. జనపనార వ్యాపారములో 10 కోట్ల రూపాయిలింతవరకు నష్టము వచ్చినదనియు, ప్రభుత్వమువారు దానిఎగుమతి ఎక్కువయగునట్లు ఎగుమతిసుంకములను తగ్గించవలెననియు, ఆ వ్యాపారమునందు యాజమాన్యము వహించిన కొంతమంది ఈమధ్యనే ప్రచురించిరి. ప్రత్తి వ్యాపారముకూడ అట్లే యున్నది. మన దేశపు ప్రత్తిసరకు విదేశముల కెగుమతి చేయుట కా విదేశము లేవియు ప్రస్తుతము కొనుపరిస్థితులలో లేవు. దేశమునందే దానిని అమ్ముటకు ప్రయత్నము చేయుటకా మనబట్టల మిల్లులవ్యాపారము చాల హీనముగ నున్నది. 'బాయికాట్' ఉద్యమము మూలముననను, మారకపు రేటు హెచ్చుచేయుటవలనను, మిల్లుల యాజమాన్యము సరియగుపద్ధతులపై నడుపబడక పోవుటవలనను, చాల బట్టలమిల్లులు తమతమ వ్యాపారము మానుకొనుటయు, సుమారు 50,000 మంది పనిచేయువారికి పని లేకుండ పోవుటయు తటస్థించినది. ఈ దుఃస్థితిని బాపుటకు వారును, వర్తకులునుకూడ తీవ్ర ప్రయత్నములు చేయవలసి యున్నదని వేరుగ చెప్పనవసరములేదు. మిల్లు పరిశ్రమలో యాజమాన్యము వహించినవా రందరును కలసి నష్టము తగ్గించుటకును, పని కట్టుదిట్టముగ జరుపుటకును, ఇదివరలో అమలునందున్న పాతపద్ధతులను తొలగించి క్రొత్త పద్ధతులపై మిల్లు వ్యాపారము నడపుటకు ప్రయత్నించుట ముఖ్యము.

## 3

యూరపియన్ దేశములన్నియు తమతమ జాతీయపరిశ్రమలకు రక్షణ నేర్పాటు చేసికొని ఇతర దేశముల సరకులు తమ దేశములోనికి దిగుమతి కాకుండ కట్టుబాట్లుచేసికొనియున్నవి. రక్షణపద్ధతివలన మొట్టమొదట లాభము చాల వర కున్నను దూరదృష్టితో నాలోచించిన కొన్ని నష్టములు కూడ కలవని గ్రహింపనగును. లాభములలో ముఖ్యమైన వేవనగా: ౧. పైదేశములవస్తువులు దేశములోనికి రాకుండ అరికట్టబడుటవలన దేశమందలి ప్రజలు స్వదేశ వస్తువులనే కొనవలసినవా రగుదురు. దాని వలన స్వదేశీఉద్యమము బలమగుటకు అవకాశము లేర్పడును. ౨. దేశీయపరిశ్రమ లభివృద్ధి

పొందుటకును, పరిశ్రమలందు పనిచేయు కూలీలకు హెచ్చుకూలీ నిచ్చుటకును వీలుండును. నష్టము లేవన: ౧ రక్షణ ఎప్పుడును క్రొత్తపరిశ్రమలకు బలము చేకూర్చుటకే ఈయబడవలెను గాని సాధారణముగ ఒకసారి రక్షణ పద్ధతిక్రిందకు తీసుకొనిరాబడిన పరిశ్రమలు తరువాత రక్షణ యక్కర లేకుండ తమంతట తాము స్వశక్తిపై నిలువబడుటకు ప్రయత్నించుట అరుదుగా కాన్పించును. కాన మొట్టమొదటిరక్షణ ఎల్లకాలమును రక్షణక్రిందనే పరిణమించును. ౨. రక్షణ పొందుచున్న పరిశ్రమలు కొంతకాల మగుసరికి ఇతెరులపోటీ లేకపోవుటవలన సర్వస్వేచ్ఛల ననుభవించుచు ప్రజాసామాన్యమునకు కంటకముగ పరిణమించుటయు కలదు. ౩. ప్రపంచమందలి వివిధ దేశములమధ్యను ఆర్థికసౌభ్రాత్రము నశించుట కవకాశము లేర్పడును. ఒకదేశముకంటె ఎక్కువగ వేరొకదేశము దిగుమతి పన్నులను విధించుటయు, చివరకు దేశములమధ్య ఆర్థిక యుద్ధము పెచ్చుపెరుగుటయు జరుగును. ప్రస్తుతకాలమందు ఈచివర చెప్పబడిన నష్టము చాల ప్రబలమగుచున్నది. ఈ వ్యాసము మొదట ప్రపంచమంతయు ఒకగొప్పఆర్థికస్థితిక్ లోనగుచున్నదని చెప్పియుంటిమి. ఆ దుఃస్థితికి ముఖ్యకారణములలో ఇచ్చట సూచింపబడిన రక్షణపద్ధతివలన కలుగుచున్న నష్ట మొకటి యని చెప్పవచ్చును. హిందూదేశమందు మనము మన ముఖ్యపరిశ్రమలకు రక్షణ నేర్పాటు చేయవలసినదని చాలకాలమునుండి కోరుచున్నాము. అట్లు కోరుటలో మన యుద్దేశ్యము ఆయా పరిశ్రమలు తమతమ పరిస్థితులను చక్కపెట్టుకొని, బలము సంపాదించుకొని కొంతకాలమునకు రక్షణ లేకుండగనే ఇతరదేశముల పరిశ్రమలతోపాటు సమానముగ పోటీ చేయుటకు సిద్ధ మగుననియే కాని ఆయాపరిశ్రమలు రక్షణ నండగా జేసికొని వాటివస్తువుల నుపయోగించువారికి నష్టము కలిగించియు, పనిచేయువారికి కూలీలు తగ్గించియు ప్రజాకంటకములుగ మారునని కాదు. ఏపరిశ్రమయైనను, బట్టల పరిశ్రమ కాని, ఉక్కుపరిశ్రమ కాని, అగ్గిపెట్టెల పరిశ్రమ కాని, ఈ షరతుల నంగీకరించి వాటికి లోబడి యుందునట్లు మాట నిచ్చినప్పుడే రక్షణ పొందుటకు తగిన స్థితియందున్నదని తలంచవలెను. లేనప్పుడు రక్షణ నిచ్చుట చాల పొరపాటు.

## ౪

ఇదివరలో హిందూదేశ పరిశ్రమలను గూర్చి వ్రాయునప్పుడు మన దేశపు పారిశ్రామికాభివృద్ధికి ముఖ్యమైన అడ్డంకులలో గవర్నమెంటువారి మారకపు (Ratio) విధాన మొకటి యనియు, మారకపురేటును 16 పెన్సులనుండి 18 పెన్సులకు హెచ్చించుట దేశారిష్టకమనియు సూచించియుంటిమి. కాని, అది ఒక్కకారణముమాత్రమే యయియున్నది. ప్రభుత్వమువారు రూపాయిమారకపురేటును నిర్ణయించుట కధికారము కలిగియున్నంత కాలమును వారు దేశమునకు ఎక్కువ లాభము సమ

కూర్పుపద్ధతి నేర్పాటుచేయుదు రని నమ్ముట కవకాశము లేదు. అది ప్రభుత్వమువారి లోపముమాత్రమే కాదు. ప్రకృతి విరుద్ధముగ కరెన్సీని హెచ్చించుట తగ్గించుట, రూపాయి ఖరీదు హెచ్చుచేయుట తగ్గించుట యను పద్ధతి యందే నిజమగులోప మిమిడి యున్నది. ఈ లోపమును సరిచేయుటకును, దేశమందలి సొమ్ము, నాణెములు, కరెన్సీనోట్లు మొదలగునవి వర్తకపు టవసరమును బట్టి హెచ్చుగుట, తగ్గుట మొదలగునవి జరుగుటకును ప్రభుత్వమువారు తగిన మార్పులను ప్రవేశపెట్టుటకు కృషిచేయవలసియున్నది. అట్టి మార్పులలో ముఖ్యమైనది బంగారులోనే అన్నివ్యాపారములును జరుగునట్లుగను, (Introduction of the Gold Standard) బంగారునాణెములు దేశమందు చలామణి యగునట్లుగను చేయవలసి యున్నది. బంగారులోహము చెక్కు చెదరనిది; చాలకాలము ఒకే ఖరీదునకు అమ్ముడు వోవునట్టిది. అట్టిలోహపునాణెములు మన దేశమందును, ఇతర దేశములందును చలామణీ యగుచుండిన దేశదేశములమధ్య జరుగువర్తక వ్యాపారములు ఎగుడుదిగుడులు లేకుండ సాఫుగా జరుగుచుండును. ఈమార్పును ప్రవేశపెట్టుటకు ప్రపంచమందలి ముఖ్యవర్తకపు దేశములన్నియు కలిసి యోజించి పని చేయవలసిన యావశ్యకము కలదు. దానివలన ప్రపంచ కళ్యాణము చేకూరి ప్రస్తుతము ప్రపంచ మంతటను వ్యాపించిన దుస్తరపరిస్థితులు సమసిపోవుటకు మార్గ మేర్పడును.

౫

హిందూదేశము ప్రస్తుతము మారుచున్న దశ (Transition Stage)లో నున్నది. మన దేశముకూడ ఇతర పాశ్చాత్య దేశములవలె పారిశ్రామిక దేశముగా మారుట మన యాశయము. పారిశ్రామికదేశ మనగా పూర్తిగ పరిశ్రమలే యుండి వ్యవసాయము పూర్ణముగ నశించవలెనని కాదు. హిందూదేశము సర్వత్ర పారిశ్రామిక దేశముగ మారునని కాని, వ్యవసాయమును విడనాడునని కాని తలంచుటకుకూడ ఎంతమాత్రము అవకాశము లేదు. అట్లు మారుట వలన నూఱుమిక్కిలి మన దేశమునకు నష్టమే కాని లాభము లేదు. ఇప్పుడు పారిశ్రామిక దేశములలో కిరీటస్థానము నలంకరించుచున్న అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లండు, జర్మనీదేశములపరిస్థితిగతులు కొంచెమవలోకించిన మన కామార్పు వలని నష్టములు గోచరమగును. ప్రస్తుత మాదేశములలో వ్యాపించియున్న నిరుద్యోగసమస్య, నిర్వ్యాపారత్వము, ఆర్థికదుస్థితి మొదలగున వన్నియు వ్యవసాయమునకు ఆ దేశములలో సరియగుస్థానమునీయక పోవుటవలననే కల్గినవి. ఈకష్టదశలో ఆ దేశప్రజలుకూడ ఈవిషయమును గ్రహించుచున్నారనుట కనేక నిదర్శనములు కలవు. ఇంగ్లండు దేశములో కార్మికప్రభుత్వమువారు నిరుద్యోగ సమస్యను తగ్గించుటకై పనిలేనివారి నందరను వీలైనంతవరకు వ్యవసాయములోనికి దిగవలెనని ప్రోత్సహించుచు దానికి తగిన అవకాశములు కల్గించుటకై ఒక్కొక్క పనిలేనివాని

కుటుంబమునకు 5 ఎకరముల బీడు భూమి నిచ్చుటకును, దానియందలి పంటను అమ్మకము చేయుటకై తగు విధానము నేర్పాటు చేయుటకును పార్లమెంటులో శాసనము చేయుటకు ప్రయత్నించుచున్నారు. ఇట్లే అమెరికాలో ప్రభుత్వమువారు వ్యవసాయదారులకు పంటలను పండించుటకై చాలపెట్టుబడి పెట్టుచు ఆపంటలను లాభకరముగ అమ్మకము చేయుటకై ఒకప్రత్యేకసంస్థను స్థాపించి యున్నారు. మన దేశముకూడ ప్రపంచమందలి ఇతర దేశములతో తులదూగవలెననినను, దానికి తోడు ఆయా దేశములలో దుఃస్థితికి కారణములగు పరిస్థితు లేర్పడకుండ నుండవలె ననినను, వ్యవసాయపరిశ్రమలకు రెండింటికిని సమాన మగు ప్రోత్సాహ మిచ్చుట ముఖ్యావసరము. వ్యవసాయపు టౌన్నత్యమును, పరిశ్రమలయౌన్నత్యమునుకూడ పెంపొందించుటకు కొన్నిమార్గములు ఇదివరలో వ్రాయబడిన వ్యాసములలో సూచింపబడినవి

౬

ఏవస్తువును కాని పండించుటతో గాని, తయారుచేయుటతో గాని దానిపని ముగియలేదు ఆవస్తువులను కాని, ఆపంటను కాని తగిన ధరలకు వాటిని ఎక్కువగ నుపయోగించు ఇతర దేశములకు అమ్ముటకు ప్రయత్నించుట చాల ముఖ్యము. ఇప్పటికాలములో ప్రయాణమార్గముల సౌకర్యమువలనను, ఇతర శాస్త్ర విజ్ఞానమువలన కల్గినమార్పులవలనను, ముఖ్యమైన పంటలలో కాని, వస్తువులలో కాని వర్తక వ్యాపారమునకు ప్రపంచమంతయు ఏకసంస్థయై ఒకే బజారుగా మారినది. వేర్వేరు దేశములు వేర్వేరు వర్తకపద్ధతుల నవలంబించుచున్నప్పటికిని పైన చెప్పబడిన మార్పులవలన ఏ ఒక దేశము కాని ఇతర దేశములతో సంబంధము లేకుండనుండుట దుస్సాధ్యము. ఒకపట్టణములో బజారునందంతయు ఒకవస్తువునకు ఒకేధర యుండునట్లుగా ఇప్పుడు ప్రపంచమందంతటను ముఖ్యవస్తువులకు ఒకే ఖరీదున్నదని మన కందరకు తెలిసినవిషయమే, వివిధ దేశములకు వర్తక వ్యాపార సంబంధ మెట్లున్నదో అట్లే వర్తకమునందుండు ఎగుడు దిగుడు లన్నియు ప్రతి దేశమందును కాననగును. అట్లగుటచేతనే ప్రపంచమందంతటను వర్తకవ్యాపారము క్షీణించిన ఈసమయములో మన దేశపు వర్తక వ్యాపారముకూడ క్షీణదశయందున్నది. ప్రపంచపునరుద్ధారణకై తీవ్రప్రతిబంధకముగ నున్న ఈవ్యాపార దుఃస్థితిని మరల్చుటకు వర్తమానకాలములో లోప భూయిష్ఠముగ నున్న వస్తువుల అమ్మకపు ( Marketing ) పద్ధతిని మార్చుట అవసరము. ఏ దేశములలో ఏవిధమైన వస్తువులు ఎక్కువగ అమ్ముడుపోవునో, వాటి నాయాదేశములకు తీసికొనిపోవుటకై సులభమార్గము లేవో మొదలగు విషయము లన్నిటినిగూర్చి శాస్త్రసమ్మతమైన విచారణ సల్పుట ముఖ్యము. ఇది అంతర్జాతీయ సమస్య కావున ఆయాదేశముల ప్రభుత్వము లన్నియు కలిసి పనిచేయుటవలన ఎక్కువలాభము

గల్గు ననుటకు సందియము లేదు. అంతర్జాతీయ సమితి (League of Nations) వారుకూడ ఈ విషయమై విచారణచేసి తగినసలహా నిచ్చుట కవసర మెంతేని కలదు. ఈసంవత్సరము జరిగిన అంతర్జాతీయసమితి సభయం దట్టి విచారణ సమితిసభవారు జరుపవలసినదని హైందవీయుడగు సర్ జహంగీర్ కోయాజీగారు ప్రవేశపెట్టిన తీర్మానమును సభవారు ఏకగ్రివముగ అంగీకరించియుండుటచే వారుకూడ ప్రపంచ పరిస్థితుల నిజస్థితిని గ్రహించినారని యూహించనగును. ఆకమిటీవారు చేయు సూచనల నాచరణయం దుంచుటవలన ప్రపంచకల్యాణము చేకూరునని తలచవచ్చును.

హిందూదేశపు సరకులు ఇప్పటికన్న విరివిగా ఇతరదేశముల బజారులలో అమ్ముడుపోవునట్లు చేయుటకు గట్టి ప్రయత్నములు చేయవలసి యున్నది. అట్టిప్రయత్నములు చేసినకాని మన దేశపు ఆర్థికస్థితి బాగుపడుటకు చాలకాలము పట్టును. ప్రభుత్వమువా రీవిషయములో చేయగల్గిన సహాయము ఎక్కువగ కలదు. హిందూదేశమున కంతకను ఒక అమ్మకపు సంఘము (Marketing Board) నేర్పాటుచేసి దానిక్రింద పనిచేయుటకు ప్రతిరాష్ట్రమునందును, ప్రతిజిల్లాయందును బ్రాంచి అమ్మకపుబోర్డుల నేర్పర్చిన ఎక్కువలాభము చేకూరును. మన దేశమం దిదివరలో పరిశ్రమాధికారులకును వర్తకులకును మధ్య సహకార మెక్కుడు లేకపోవుటచే సరియగువిధానముపై అమ్మకపు ఏర్పాట్లు చేయుట కష్టముగనుండెడివి. అట్టి సహకారము కొంతవరకు మనదేశపుబట్టల వర్తక పరిశ్రమలమధ్య నున్నది కాని అదికూడ శాస్త్రీయపద్ధతులపై నాధారపడియుండకపోవుటచే దానివలన పొందవలసినంత లాభము మనబట్టలపరిశ్రమ పొందియుండలేదు. ఇకముం దీవిషయమై ఎక్కువ శ్రద్ధ తీసికొనవలసిన ఆవశ్యకము ఎంతేని కలదు; దానివలన వచ్చు లాభముకూడ అమితమే.

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, ‘భారతి’.

# సాముద్రికం

## అరచేయి

ముద్దుకృష్ణ

"షీరోనమీ"(Cheirognamy) కన్న "షీరోమేన్సీ" (Cheiromanc ) యెక్కువ ఉత్సాహం కలుగజేస్తుంది. హస్తపరీక్ష కాగానే చేతిని వెల్లకితలా త్రిప్పి దృష్టిని అరచేతిమీద ప్రసరింపజేస్తే, గుట్టలవలె యెత్తగు ప్రదేశములు కొన్ని, కొన్ని పల్లపుప్రదేశములు, వాటిమధ్యనుండి నదులవలె ప్రవహిస్తూవున్న గీతలు కనుపించును. ఈయెత్తుప్రదేశాలను "తారాస్థానము"లని(Mounts), గీతలను "రేక"లని (Lines) అందుగు.




పటములో చూపిన తారాస్థానములు యెనిమిది. కుజుడు రెండుస్థానములు ఆక్రమించుటవల్ల తారలు ఏడూ తారల గుణాగుణములు చాల ముఖ్యము. రెండుమూడు అరచేతులు ఒకేపర్యాయము పరిశీలించిన, ఒక తారాస్థానము మిక్కిలి ఉన్నతంగాను'ఆ తారాస్థానమే యింకొక చేతిలో చాల లోతుగాను వుండును. ఇట్లే కొన్ని చేతులు ఈదృష్టితో పరీక్ష చేస్తే తారా స్థానములలో మూడు వ్యవస్థలు కనబడును. వీటిని ౧ ఉచ్ఛ, ౨ సాధారణ, ౩ నీచ అని నిర్ణయించవచ్చును. బొత్తిగా పొంగివుంటే దుర్లక్షణంగా యెంచవలెను. బొత్తిగా నీచగా వున్నట్టయితే ఆ తారవల్ల కలిగేగుణములు శూన్యం.

తారల సాధారణలక్షణములు, గుణములు:

శుక్రుడు (Venus):—

"శుక్రో వివాహే భాగ్యంచ
భోగస్థానంచ వాహనం."

ప్రాక్ప్రతీచీశాస్త్రజ్ఞు లుభయులదృష్టిలో శుక్రుడు ముఖ్యగ్రహములలోనివాడు. ఉభయులూ శుక్రుడు భోగాన్ని, భాగ్యాన్ని కూరుస్తాడు అని అంగీకరిస్తారు. హిందూ శాస్త్రజ్ఞులు ఈతడువివాహకారకుడని, వాహనాన్ని యిస్తాడని నిర్ణయించారు. పాశ్చాత్యులు వివాహరేఖలు బుధుని స్థానంలో నిరూపించేరు. కాని వివాహం కూర్చేవాడు శుక్రుడే; ఈ రేకను ఆసందర్భం కలిగినప్పుడు చూపించుతాను. శుక్రుడు ఉచ్చగా వుంటే ఆవ్యక్తి సుఖజీవి. పదిమందితో కలసి మెలసి వుంటాడు. శుక్రుడు మంచి పురుషత్వాన్ని కలుగజేస్తాడు. అందుచేతనే ఈవ్యక్తి భోగి; శృంగారము ప్రీతి. ఒకరిమనసునొప్పించవలెనంటే చాల అనిష్టము. నమ్మదగిన స్నేహపాత్రుడు, విశ్వాసార్హుడు, సత్యవంతుడు. ప్రకృతిని, చిత్రాలను అభిలషిస్తాడు. సౌందర్యార్చకుడు.

శుక్రుడు బొత్తిగా పొంగివుంటే ఆవ్యక్తి విషయలంపటుడయి వ్యసనములకు బానిస కాగలడు; బొత్తిగా నీచగా వుంటే పురుషత్వం తక్కువ.

గురువు (Jupiter):—

"గురుణా దేహపుష్టిశ్చ
బుద్ధిః పుత్రార్థసంపదః."

ఉభయుల దృష్టిలోనూ గురువు బుద్ధి, దేహపుష్టి కలిగించుతాడు. పాశ్చాత్యులు గురువు ఆశలకు స్థానం అంటారు. ప్రజాసంస్థలలో ప్రవేశింపజేస్తాడు. ఔదార్యము, ధైర్యము, స్వశక్తిపైన గట్టి నమ్మకము, గొప్ప గొప్ప ఆశయాలు ఇస్తాడు. గురువు పొంగివుంటే పట్టలేని గర్వం.

శని (Saturn):—

"ఆయుష్యం జీవనోపాయం
మరణంచ శనైశ్చరః."

మరణచిహ్నాలు ఈస్థానంలో ఉంటునని ఉభయులూ వొప్పుకుంటారు. శనిలో "నక్షత్రం" వున్నట్టయితే మారకం. శని సాధారణంగా నీచగా వుంటుంది. ఇతను మనిషిని సంఘానికి దూరం చేస్తాడు. ఓరిమి, పట్టుదల కూరుస్తాడు. ఎంతసేపూ నిర్మానుష్యంగా, శాంతంగా వుండే ప్రదేశాలకు నడిపించుతాడు. పాశ్చాత్యులు శని విచారాన్ని పెంచుతాడని తలుస్తారు. సంగీతంలో మంచిప్రవేశం కలుగజేస్తాడు.

రవి (Sun):—

"ఆత్మా ప్రభావ శ్శక్తిశ్చ
పితృచిన్తా రవేః ఫలమ్."

సాముద్రికంలో ఈస్థానం అన్నిటికన్న ప్రధానం. బుద్ధివికాసం, ప్రజ్ఞ, విజ్ఞానం రవిగుణాలు. చురుకైన మేధాశక్తి, మాటలలో తెలివిగా ఆకర్షించడం, యశస్సు సంపాదించడం, జ్ఞానార్జన చేయడం, పలువిద్యలు నేర్వడం, శిల్పం రవిగుణాలు. రవి ఉచ్చగా వుంటే ఎల్లప్పుడూ సంతోషం, హృదయవికాసం వుంటుంది.

బుధుడు (Mercury):—

"ప్రజ్ఞాచ కర్మ విజ్ఞానం
బుధేనైవ విచిన్తయేత్."

మనవారు గురుని లక్షణాలుగా యెంచిన పుత్రార్థసంపదలు బుధునికి ఆరోపిస్తారు పడమటివారు. బుధుడు కూర్చెబుద్ధి విశేషం వ్యాపారంలో ప్రసరిస్తుంది పశ్చాత్కర్తకలక్షణాల నిస్తాడు. ధనార్జనలో ఈబుద్ధి చురుకు. బుధుడు తార్కికుడు. న్యాయవాదులకు బుధుడు ముఖ్యం. వాక్చాతుర్యాన్నిస్తాడు. వక్తను చేస్తాడు. గణితం, వైద్యం అభిమానశాస్త్రాలు.

కుజుడు (Mars):—

"భ్రాతా భృత్యగుణో భూమిః
భౌమేనైవ విచిన్తయేత్."

సాముద్రికంలో కుజునిస్థానాలు రెండు. శుక్రునిపై స్థానం విలువ యెక్కువ. అంగారకుని గుణములను యెంచడంలో పాశ్చాత్యులకు హిందువులకు భేదం వున్నది. పాశ్చాత్యులు కుజుని విస్తారం గ్రహించలేదు. వారు శౌర్యం, ధైర్యం, పట్టుదల, బలం, యుద్ధములో నిపుణత అంగారకునివి అంటారు. మనవారు పైజెప్పిన గుణాలు యెంచుతారు.

చంద్రుడు (Moon):—

"మనో బుద్ధిః ప్రసాదంచ
మాతృచిన్తా చ చన్ద్రమాః".

మాతృచిన్త మనవారు అధికంగా చేర్చేరు. పాశ్చాత్యులు భావనాశక్తి, కవిత్వం, సముద్రయానం చంద్రుని ప్రత్యేకలక్షణాలు అంటారు. హిందూశాస్త్రజ్ఞులు సముద్రయానం కుజునిది అంటారు. చంద్రుడు విలక్షణంగా వుంటే దేశద్రిమ్మరి: బుద్ధిచాంచల్యం, సోమరితనం కలుగుతవి

రాహుకేతువులను పాశ్చాత్యులు ఎంచలేదు. మనశాస్త్రజ్ఞులు అరచేతిమధ్య వీరిని గుర్తించేరు. స్థిరత్వం లేకపోవుటవల్ల వీరి స్థానం నిర్ణయించడం కష్టం. అందుకు ప్రత్యేకపు కృషి కావలె.

ఇక, తారాస్థానములలో పరీక్షించవలసిన చిహ్నాములు బొమ్మలో వున్నవి. వీటి సాధారణలక్షణములుమాత్రం తెలుపుతాను.

చతుర రేఖ (Square):—

దీనినే మనవారు తటాకరేఖ అంటారు. దాతృత్వాన్ని, కరుణను సూచిస్తుంది. ఆపద నుంచి కాపాడుతుంది. రేక విరిగినచోట చతుర రేఖ వుంటే ఆగండం దాటుతుంది.

కోణరేఖ (Angle):—

ఉన్న ప్రదేశాన్ని బట్టి వివిధఫలాలు కలిగించుతుంది.

ముక్కోణరేఖ (Triangle):—

ఎక్కడ వున్నా మంచిదే. బలం కూరుస్తుంది. దుర్లక్షణాలనుంచి కాపాడుతుంది.

గ్రిల్ (Grille):—

మంచిది కాదని కొందరి అభిప్రాయం. 'కీరో' దుర్లక్షణం అంటాడు. ఇది తరుచు

శుక్రుడి మీద వుంటుంది. ఆస్థానంలో ముఖ్యం గా దుష్టం కాదని నా అభిప్రాయం.

క్రాస్ (Cross):—

కొన్ని ప్రదేశాలలో చాల శుభం. ముఖ్యంగా గురుస్థానములో వుంటే ప్రేమకు ప్రతిఫలం వుంటుంది.

నక్షత్రము (Star):—

కొన్ని చోట్ల చాలశుభం. కొన్ని ప్రదేశాలలో చాల ప్రమాదం. శనిలో వుంటే ప్రాణహాని. గురువులో వుంటే కీర్తి. రవిలో వుంటే తొలిశ్రమ, తుదకు సుఖం కూరుస్తుంది.

మచ్చలు (Spots):—

దుర్లక్షణం; జాడ్యకారణం.

















































శూన్యరేఖ (Circle or Veil):—

సాధారణంగా కష్టాలు కూరుస్తుంది. అదృష్టరేఖను ఆని వుంటే దావాలు నష్టం.

లంకలు (Islands):—

అశుభం. ప్రాణరేఖలో వుంటే రోగం. హృదయరేఖలో వుంటే వియోగం. అదృష్టరేఖలోవుంటే డబ్బు చిక్కు.

హలరేఖ (Sign of the Plough):—

సంపద కూరుస్తుంది.

యవరేఖ :—

ధాన్యరేఖ అని కూడా అంటారు. భోజనానికి లోపం వుండదంటారు. బొటవ్రేలిమధ్యవుంటుంది.

**కూర్మరేఖ:—**

చేతిపై భాగంలో వుంటుంది. వ్యాపారంలో మాంద్యం కలుగజేస్తుంది.

**మత్స్యరేఖ (Fish-tail):—**

సాధారణంగా రేఖ చివరను వుంటుంది. ఆరేఖకు బలం ద్విగుణీస్తుంది.

**బాణరేఖ (Arrow):—**

మంచిది.

**ధ్వజరేఖ (Flag):—**

ప్రఖ్యాతి నిస్తుంది. ముఖ్యంగా అదృష్టరేఖతో కలిసి వుంటే.

**ఛత్రం (Umbrella):—**

చాల అరుదు. రవిస్థానంలో వుంటే దేశాంతర విఖ్యాతి.

**శూలరేఖ (Fork):—**

మంచిది.

**రేకలు (Lines):**

బొమ్మలో చూపినవి ముఖ్య రేఖలు.

**ప్రాణరేఖ (Line of Life):—**

జీవితంలో ముఖ్యాంశములనుచూపుతుంది: అనగా, ఆయుఃపరిమాణం, కొన్ని జాడ్యములు, సంసారపరిస్థితులు, బంధువులు, బాధలు.

**తలరేక (Line of the Head):**

తలకుసంబంధించిన సమస్తాన్ని చూపుతుంది. తెలివితేటలు, శిరస్సుకు సంబంధించిన బాధలు, జాడ్యాలు.

**హృదయరేఖ (Line of the Heart):—**

హృదయం సమస్తాన్ని, అనగా ప్రేమ, వియోగం, హృదయానికి సంబంధించిన బాధలు, గుండెజబ్బులు తెలుపుతుంది.

**అదృష్టరేఖ (Line of Fate):—**

భాగ్యరేఖ అనికూడా అంటారు. "అదృష్టం" అనే పదాన్ని పూర్తిగా అన్వయిస్తే



ఈ రేకలక్షణాలు విశదం. జీవితంలో సుఖదుఃఖాలు చాలవరకు దీనిపైన ఆధారపడి వుంటవి. దీని గతులు చాలవింత. ఇది అనేక దారుల పోతుంది. ఒకప్పుడు గురువుమీదకు, ఒకప్పుడు శనిమీదకు, రవి బుధులమీదకు పోతుంది. దాని నడకనుబట్టి వివిధఫలములు చెప్పవలెను. ఈ సంగతి ఇకముందు తెలుపుతాను.

ఇవి ప్రధాన రేఖలు. ఈగీతలు బొమ్మలో వున్నట్టుగా సరిగావుంటే మంచిది. లేక వాటిగతులలో మార్పువుంటే అసాధారణలక్షణాలు వున్నట్టు.

రేఖలలో వుండే చిహ్నాలు:

తారాస్థానాలలోవలె గీతలలో కూడా చిహ్నాలున్నవి. వీటిలో మంచివి, చెడ్డవి అనిమాత్రం యెంచి విరమించుతాను.

మంచివి

ఊర్ధ్వరేకలు

ఖ్యాతియరేఖ

విరుపులు

అధోరేకలు

విజ్ఞానరేఖ

(Line of Celebrity):—

దీనినే "రవిరేఖ" అనికూడా అంటారు. కేవలం విద్యనే కాకుండా, తత్సంబంధమైన విద్యవనంతా తెలుపుతుంది. దీనిని మనవాళ్లు "విద్యారేఖ" అంటారు. "విజ్ఞానం" అనేపదం అర్థమయితే ఈ రేఖ పూర్తిగా అర్థమవుతుంది.

ఆరోగ్యరేఖ

(Line of Health or Hepatica):

ఈరేఖ లేకపోతే ఆరోగ్యం బాగా వుంటుంది. ఇది ఎంత విశదంగా వుంటే అంత అనారోగ్యం.

చెడ్డవి

గొలుసు

వివాహరేఖ

(Line of Marriage):—

ఈరేఖలు ఒకే నిడివి, లోతు వుండి, ఎన్ని హృదయరేఖవైపు వొంగివుంటే అన్ని వివాహాలు. ఈరేఖలో విరుపులు వున్నా, లంకెలువున్నా సంసారంలోకలత; సుఖంతక్కువ.

నరుకు

విరుపు

౧. మంచివి:—

విరుపు గలచోట ద్వితీయరేఖ వుంటే ఆనష్టం కాపాడుతుంది.

ఊర్ధ్వరేఖలు—

బలం, లాభం.

అధోరేఖలు—

నీరసం, కష్టం.

౨. చెడ్డవి:—

గొలుసులు (Chained Lines).

నరుకులు (Cuts).

---

# అడియాస

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు

ఓ యాణిముత్తెమా! ఒకన్నెపూవ!
కడలినీపుట్టిల్లొ? కాన నీనెలవొ?
కనకాలు కురియించి కనుమెరియించు
నేమహారాజులనే వరించెదవొ?

నేనేమి? నాపేదగానమ్మదేమి?
వెదురుంబొదలగాలిసొద లెంతనీకు?
చెదరునిట్టూర్పుల పదము మెచ్చెదవొ?
అడియాసలందునే నలయుటేగాక:

* * * *

మున్నీటినురుగుల ముందు సాగిల్లి
ఎన్నెన్నితలపులో విన్నవించుకొని
అలముత్తియపుకన్నె కందించగోరి
మనసు నీరగురీతి గసలి వేచితిని!

తలిరుటాకులనిద్ర మేలుకువమున్న
తొలిపొద్దురేకుతో వలపుల నెవ్వొ
అలుకుంజెలికి తెల్పుమని కేలు మొగ్గి
అడవి హద్దులలోన బడలి తాళితిని!

* * * *

తులలేనికళలీను తెలిమార్తికమ్ము
ఎంచు నాసైరాశ్యచంచలమ్మాచు
దూరదూరాననే తారు నాప్రేమ,
నిధులిచ్చు నారాజు నిచయమ్ములుండ!

బంగారుమందరప్రాంగణమ్ములనె
ఆయమూల్యసుమంపు టంతరంగమ్ము
అలరి జీవించునో అదియేమొ కాని
లోకమ్మెరుంగును, ఆకన్నె మెరుగు!

నాకుహర్మ్యము పేద ఆకుటీరమ్మె,
చీకటిచాయలో చిందు వెన్నెలయె
నాకాంచనధనమ్ము, నన్నెట్లువలచు
మెరుగులేమోహించు విరిబోడి నేను?

ఆణిముత్తెపుకన్నె, అలరుముద్దియమె,
అతులితసుకుమారి, అమరసుందరియె
నానిత్యగీతదీనాను లాపనల
నేమెమొన్నడొ ఆమెయే వరించునోకొ?

* * * *

---



# విసనకర్ర

కో. నరసింహాచారిగారు

మన ముపయోగించెడి విసనకర్రలు సాధారణముగా తాటియాకులతో గాని, వెదురు బద్దలతో గాని చేయబడినవయి యున్నవి. అవి మడచుటకు వీలు లేనివయి యున్నవి. కాని నేనిప్పుడు చెప్పబోవు విసనకర్ర తాటియాకులతో చేయబడి మడచుటకు వీలుగలిగియుండునదయి యున్నది. ఇట్టివిసనకర్రలు ఆకులవలె చిక్కిలి సన్నముగా జేయబడిన గంధపు చెక్కలతోను, దంతములతోనుగూడ జేయవచ్చును. అవి చాల విలువగలవి.

తాటియాకుల విసనకర్ర:

ఒక లేత తాటియాకు మట్టను దీసికొని దానియందలి ఆకుదళములను వేర్వేరుగా చించి వాటి యీనెలను తీసివేయవలసినది. పిమ్మట నాయాకుల నన్నింటిని జేర్చి సుమారు ౭ అంగుళముల నిడివికి కత్తిరించవలెను. ఆకుల సంఖ్య ౫౦ యుండిన బాగుండును. ఇట్లు కత్తిరించబడిన యాకుముక్కలు స్వాభావికముగనే ఒక కొనయందు వెడల్పెక్కువగను, రెండవకొనయందు వెడల్పు తక్కువగను ఉండును. వాటి నన్నిటిని కొనలయందు గుండ్రముగా నుండునట్లు మూలలనుగూడ కత్తిరించవలెను. (చిత్రము ౧.) ఒకసారి మూడునాలుగు ఆకులకన్న నెక్కువగా దీసికొనినయెడల కత్తిరించుట కష్టము. కాబట్టి ఒక్కొక్క మారును కత్తిరించుటకు సాధ్యమగునన్ని యాకులను మాత్రము చేర్చి పట్టుకొనవలెను. కత్తిరింపుతీరు ఆకు లన్నిటియందు నొకేతీరుగా నుండవలెను. కాబట్టి మొదటిసారి కత్తిరించిన ఆకులలో నొకదానిని మాదిరి తీసికొని దానితో కత్తిరించవలసిన యాకులను కొన్నిటిని చేర్చి పట్టుకొని పైమాదిరి ప్రకారము క్రిందియాకులను గూడ కత్తిరించవలెను. కొన్ని వంపులను కత్తిరించుటకు కత్తెరతో సాధ్యము కాకపోయినయెడల వాడియగు కత్తితో నా వంపులపట్ల కోయవచ్చును. చిత్రము ౨ నందలి రీతిగా పైని సిద్ధము చేసి

కొనిన ౫౦ తునుకలను కోసికొని వాటినన్నిని కొనలయందు రంధ్రములను చేయవలెను. పిమ్మట నా రంధ్రములలో నొక దారమును దూర్చి ఆకుల నన్నిటిని చేర్చి గుత్తిగా కట్టవలెను. (చిత్రము ౮.) ఆ గుత్తినుండి యొక యాకును దీసికొని దానియొక్క వెడల్పు కొనయందు ఒకయంగుళము విడిచి దారముతో చిత్రము 3 నందువలె కుట్టవలెను. కుట్టి గుడి వేసి, మొదటి యాకునకు వెంబడి పైనుండు ఆకును దీసికొని ఆదారముతో మొదటిరీతి గనే రెండవయాకునుగూడ సూదితో కుట్టవలెను. రెండాకుల మధ్య అర యంగుళము దారము విడుచుచు రావలెను. అట్లు విడుచుట వలన విసనకఱ్ఱను విచ్చునపుడు ఒక్కొక్క ఆకును కొంతదూరమునకు జరిగి మొత్తమునకు చిత్రము ౫ నందలి రీతిగ విసనకఱ్ఱ యేర్పడును. ఆకులను కుట్టు రీతి చిత్రము ౯ నందు మ, ప, లను గమనించిన బోధపడును. రెండాకులను కుట్టిన పిమ్మట మూడవయాకును, పిమ్మట నాలుగవ యాకును, ఇట్లు వరుసగా 50 తునుకలను కుట్టవలెను. ఆకులమధ్య వదలబడు దారముయొక్క నిడివి తక్కువగా నున్న యెడల ఒక్కొక్క ఆకును దాని యడుగున నుండు ఆకునందలి కుట్లను మఱుగుపఱచును. దారపు పొడవు కొంత యెక్కువగా నున్నయెడల చిత్రము ౫ నందలి విధముగా కుట్లు కనబడును. ఆకుల నన్నిటి పై విధముగా కుట్టిన తర్వాత విచ్చి, వలయము పూర్తిగా నేర్పడునా యని చూచి, కొఱతవడిన యెడల మఱి కొన్ని యాకులను చేర్చి కుట్టి వలయమును పూర్తి చేయవలెను.



పిమ్మట ఆకుల నిడివికి రెండింతలు నిడివి గల రెండు వెదురుబద్దలను సన్నముగా చెక్కుకొనవలెను. బద్దల వెడల్పు ఆకుల వెడల్పునకు సమానముగా నుండవలెను. బద్దలయొక్క సన్నని కొనలయందు ఆకులందు వలెనే రంధ్రములను చేయవలెను. పిమ్మట ఆకులను కట్టియుంచిన దారమును తీసివేసి (చి. ౪. ౪.) మఱియొక గట్టిదారమును వాటి రంధ్రముల గుండ దూర్చి, ఆకులపై నొకబద్దను పెట్టి దారము యొక్క పైకొనతో బద్దను చేర్చి కట్టవలెను. (చిత్రము ౬.) అదేరీతిగ ఆకుల యడుగున రెండవ బద్దను పెట్టి దారపు రెండవ కొనకు నాబద్దను చేర్చి కట్టవలెను. బద్దను కట్టునపుడు మొదట దారమును బద్దయందలి రంధ్రమునుండి బయటికి దీసికొని దాని ప్రక్కనుండి దారమును బద్ద యడుగునకు బోనిచ్చి మఱల బద్దలోని రంధ్రమునుండి బయటికి దీసికొని, దాని రెండవప్రక్కనుండి అడుగునకు బోనిచ్చి, రంధ్రమునుండి మూడవ మాఱు బయట దీసి ముడివేయావలెను. (చి. ౧, ౯.) పిమ్మట బద్దను ఎడమగా లాగిన యెడల విసనకర్ర విచ్చుకొనునట్లు చేయుటకై ఆకులలో పైదానిని పైబద్దకును, అడుగుదానిని అడుగుబద్దకును (చిత్రము ౫,) వ వద్ద కట్టవలెను. విసనకర్ర అప్పుడు పూర్తి యగును అది కావలసినపుడు విచ్చి విసరుకొనుటకును, లేనపుడు మడిచి జేబునందు పెట్టుకొనుటకును అనువుగా నుండును. చిత్రము ౭ నందు మూయబడిన విసనకర్ర చూపబడి యున్నది.



---

# స్వాగతగీతము*

లీల భవదీయమృదులనిశాలహృదయ
పేటి నిమిషించి కొనలేక 'రాట' మెత్తి
యొడికిపోసెదు నీదుప్రేమునేఁ దలంచి,
తరుగఁజాలని పత్రపత్రాల వ్రాసి
యలసి నెమ్మని చెమ్మట నాంధ్రభూమి
శాసనము లిడు నీదు వత్సలత నెఱిఁగి,
పాడి తుణ మాఁగి కమ్మని వేఁడియూర్పు
టలల భారతభాగ్యగీతామృతమ్ము
మాఱుచిలికించు నీభక్తిమాధురిఁ గని
అర్థిజనముల కిడి తృప్తి నందలేక
కోరి సోదరులకు స్వేచ్ఛ ధారవోసి
కట్టుపడినట్టి నీదుత్యాగమ్ముఁ జూచి
పాయనొల్లక నిను భారతీయు లరుగో,
పిలుచుచున్నారు రెండుచేతులనుఁ జాఁచి!
స్వాగతము! నీకుఁ దండ్రి! సుస్వాగతమ్ము.

—భారతి.

---

* పూడిపెద్ది వెంకటరమణయ్యగారు రచియించినది.

## భావశబలత

### శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరాయకవి

ఆయన జన్మమున వ్యాపారిపంతులు. కర్మమునఁ గావ్యకళోపాసిత. లోకజ్ఞుఁడు—మిత్రసంపన్నుఁడు. పరిభవమును మిగిలిన ప్రతిభ. బాహిరముగ లంపటుఁడు; ఆంతరముగ నిర్లిప్తుఁడు. పాంచభౌతికమును గృహచ్ఛిద్రముఁ



శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహరాయకవి

బొరలనిచ్చి, భావమును రోదసీకుహరమున విహరింపఁ బంపువాఁడు. ధనకాంక్షతో ధార్మికరతి పెనఁగులాడుచున్నది. పామరత్వముతోఁ బ్రజ్ఞకుఁ బోరాటము తప్పలేదు. మనసువలె మాటయు మెత్తనిది. అపేక్షలో ఉపేక్ష మెఱయుచున్నది. వివిక్తగోష్ఠీవినోదియే కాని, వివాదరంగములం దూఁటి కుస్తీ పేచీలకుఁ దలపడు రిజాలాంపహిల్వాన్ కాఁడు. లౌకికమార్గమును వీడలేదు; అలౌకికదృష్టికిఁ గొఱవడలేదు. కలిమికి గర్వింపలేదు; లేమికి వగవలేదు. ప్రాయము కైవ్రాలినది కాని ప్రబంధరచనాలౌల్యము పిచ్చలించుచున్నది. తనువు కృశించినది కాని బుద్ధికి పురి యెక్కుచున్నది. గానుగలోని చెఱకువలె ఈషణత్రయముల నడుమ నజిగిజయై అనుభూతరసము నొడ్చినాఁడు. అదియే ఆయన కవిత్వము— అదియే ఆయన వైలక్షణ్యము. మహారాజాశ్రయణమునకు మరులు గొనలేదు. అర్థమునకై యశోభిమానమునకుఁ దిలాంజలి వదలలేదు. స్వాధీనతామహామంత్రజపము మానలేదు. జన్మవాసనాలబ్ధజ్ఞానమునఁ దనివి నొనక శ్రమించి వ్యాసంగము చేసిన కర్షకుఁడు—కర్మపరతంత్రుఁడు. పరభాషాదేవత పాలు ద్రావియుఁ గన్నతల్లి కైంకర్యము నేమఱని నిజమైన కొడుకులలో నొకఁడు. సహజశేముషీవిభవము నావిష్కరించిన చతురుఁడు. ఆత్మసమృద్ధిపై నాధారపడినాఁడు గాని అనుకరణమునకు వెంపరలాడలేదు. అధికారియై కవి

ననిపించుకొన్నాఁడు గాని శబ్దములను ఛందోబద్ధము చేసి కవినని అధికారితకు దేబెరింప లేదు. ప్రాఁతపాతికలలోఁ గ్రొత్తరసము నించి నవనవరుచులు గొల్పు నేర్పరి. పురాణగాథలకుఁ బుత్తడి మెఱుఁగు లిచ్చిన శిల్పి. ప్రాచీనసంప్రదాయమునకు అర్వాచీనవృత్తుల ననుసంధించిన నీతికళాచణుఁడు. గ్రాంథిక వ్యావహారికముల కభేదాధ్యవసాయము గూర్చిన మధ్యవర్తి. కవనవ్యాపారమున రకరకపు దినుసుల దిగుమతి చేసిన సీమవర్తకుఁడు. తరగరికమాయిషీ లేదు. ఉలటాసీదాలు లేవు. నాణెమైన సరుకు—నగదుబేరము—ప్రమాణశుద్ధి.

* * * *

వస్తుసంగ్రహణమున, వాక్యనిర్మాణమున, శబ్దప్రయోగమున, భావప్రసాదనమున, సన్నివేశకల్పనమున—అన్నిట ఆయన శైలికి, ఆయన వ్రాఁతకు క్రొత్తపోఁత యొకటి లభించినది. ఇది ఆయన స్వామ్యము; తదీయాభిధాలేఖ్యాయూథముద్రితము. పద్యరచనయందుఁ బదలుబ్ధుఁడు—తిక్కనం దలఁపించినాఁడు. పద్యగతికన్న భావవ్యక్తీకరణము నెక్కుడుగాఁ బాటించువాఁడు. ప్రసంగధోరణిలో దుబారా వెచ్చగాఁడు. పద్యమునందలి బింకము, సంగ్రహణసామర్థ్యము గద్యమున సడలి విడబడినది.

నాటకముల రచించినాఁడు. నవలలఁ గల్పించినాఁడు. ప్రహసనములఁ బ్రకటించినాఁడు. "సాక్షి." యుపన్యాసముల సమీకరించినాఁడు. నాటకరచనానైపుణ్యమును రక్షించిన కొలఁదిమంది కవితిలకులలో నొకఁడనిపించుకొన్నాఁడు. గుణమునుఁ జూపి గణుతికెక్కినాఁడు. ఇతివస్తుప్రతిపాదనమున, పాత్రపోషణమున, సంభాషణక్రమకౌశలమునఁ బ్రయోజనమును, సందర్భశుద్ధిని, సమయోచితజ్ఞతను నిర్వహించినాఁడు. పాత్రచిత్తవృత్తికనుగుణమగు భావమును పలికింపఁ గలిగినాఁడు. భాషయందును మార్పు గన్పఱుచు నేర్పు నెఱపఁ బ్రయత్నించినాఁడు గాఁడు. పాత్రోచితభాష యసన, వ్యావహారికము, వ్యాకరణబద్ధమై యుండవచ్చును. భావమును బట్టియే కాదు; భాషను బట్టియు, వాక్యరీతినిఁ బట్టియుఁ బాత్రమనోధర్మము ఎఱుకపడునట్టు చిత్రించుటయే శిల్పము. అదియ లక్షణము; లక్ష్యము; గుణవిశేషము. పదునైదేండ్లకుఁ బూర్వము రచింపఁబడిన ఈయన నాటకములు పై ప్రమాణములకు బద్ధమై యున్నవి. పదంపడి రచితమైన ఏతత్కవికృతగ్రంథజాలమున హాస్యము మెండుకొని, ప్రధానరసమును ఆటుపోటు గలిగించి ఆవలకు నెట్టిన సందర్భములు గనఁబడుచున్నవి. అందలి ప్రసంగధోరణి సాక్షియుపన్యాసపాకమునఁ బడినది. కాని "రాధాకృష్ణ" అపూర్వనాటకరాజ్ఞి యనిపించుకొనినది. ఈయన నాటకరచన "బుద్ధబోధసు"ధాదకముతోఁ బ్రారంభమై "రాధాకృష్ణ"తోఁ బరిపాకము చెందినది.

* * * *

ఇఁకఁ బ్రహసనరచన ఆయన సొమ్ము. హాస్యరసము ఆయన రచనలకు జీవగఱ్ఱ.

సాక్షి యుపన్యాసముల ముఖమున ఆయన విమర్శింపని సమాజము లేదు; గర్హింపని యనర్థాచారము లేదు; చూపని వాక్యరచనా వైచిత్రి లేదు; వెదచల్లని ప్రచలితభావము లేదు; వెక్కిరింపని కుటిలవృత్తి లేదు; త్రొక్కని నూతనఫక్కిక లేదు; పరామర్శింపని మనఃప్రవృత్తి లేదు; తడవని జీవనము లేదు. నాట్యప్రయోగరీతులను జూపినాఁడు. నటకుల నటనకౌశలముం గన్పఱిచినాఁడు. జంటకవుల ఆశుకవితావినోదము జరపినాఁడు. వెట్టి రామశాస్త్రిచే, సుబ్బలక్ష్మిచే పూర్వపక్షసిద్ధాంత చర్చలు పచరింపఁ జేసినాఁడు. తోలుబొమ్మల నాడించినాఁడు. పాచకమహాసభను ప్రశస్తికిఁ దెచ్చినాఁడు. వెలమదొర వెకలిచేతలను అచ్చకెక్కించినాఁడు. పఠితను మస్సుమందు చల్లి స్వాధీనము చేసికొనుటలో ఆయనకు సాటి ఆయనయే.

*　　*　　*　　*

ఆవేశము ప్రాధాన్యము వహించినంత వట్టు "సాక్షి" యుపన్యాసములు అట నట హాస్యము వట్ట్రోడి అనభ్యతం బడుచుండినను, రక్తికిఁ దొలఁగలేదు. అర్థసంగ్రహవ్యాపారము ప్రాధాన్య మగుటతో

"విగతలసితవిద్యుల్లత యగుచు నీర
నం బయిన శారదాభ్రంబు సరణి గాఁగ"
—వనవాసరాఘవము.

నయ్యెను. నీరసించి నిర్గుణతత్త్వమున లీన మయ్యె నన్నమాట. అంతట మేల్కొని వానికి (ఆ యుపన్యాసములకు) శాంతిపాఠము చెప్పినాఁడు; లౌకికుఁ డనిపించుకొన్నాఁడు.

ఆంధ్రదేశమందలి నేఁటి కావ్యకళాప్రవణులలో లక్ష్మీనరసింహరాయఁడు గణ్యుఁడయినాఁడు. తనరచన ఉపమానభూతమైనది. తనశైలి దేశము దశదిశల వ్యాపించినది. ఈవిద్యయందు ఆచార్యపద మందినాఁడు. ఏకలవ్యులు అనేకులు తెలుఁగునాట వెలసినారు. ఆ గురుని వలె ఈ గురుఁడు దురూహామగు దక్షిణ కోరఁడు. తన సృష్టించినపాత్రలు జీవత్ప్రతిమ లయి వాఙ్మయవీథుల వాహ్యాళి సల్పుచున్నవి.

ఆయన తన తెలుఁగుతల్లికిఁ జేసిన యుడిపోసి యూడిగమునకుఁ బసదన మెంత యిచ్చిన అప్పుదీఱఁగలదు?

గ్రంథములను బెక్కింటిని రచించినాఁడు. గుణము పరిమళించి వ్యాపించినది. మహారాజాదరించి వదాన్యుఁ డైనాఁడు. కవియు ధన్యుఁ డైనాఁడు. ఖ్యాతి యజరామర మైనది.

"యేనామ కేచి దిహనః ప్రథయ న్త్యవజ్ఞామ్
జాన న్తి తే కిమపి తా న్ప్రతి నైష యత్నః,
ఉత్పత్స్య తేఽ స్తిమమ కోఽపిసమానధర్మా
కాలో హ్యాయమ్ నిరవధిః,విపులాచ పృథ్వీ"

అనిన భవభూతి సూక్తిని జ్ఞప్తిచేయుచు లక్ష్మీనరసింహరాయమనీషికి—

నమస్కార మందింతును.

తా. క. శ్రీ లక్ష్మీనరసింహరాయకవిగ్రథితములను యథామతి నావిష్కరింప నుద్యోగించితిని. అది మున్ముందు అవకాశముబడి.—మున్నంగి—శర్మ.

# కవిజనకర్తవ్యము*

మహామహోపాధ్యాయ, ముదిగొండ నాగలింగశాస్త్రులు గారు

ఉత్పల పద్య మాలిక

*　　*　　*　　*　　*　　*　　*

భారతప్రపంచమునఁ బుణ్యులు గొందఱు వ్యంగ్యమెంతు రిం
పారు రసంబె ముఖ్యమని యందురు గొందఱు నొయ్య శయ్య నే
చారువుగాఁ గొందఱు ప్రశంసయొనర్తురు గొందఱ ట్లలం
కారము లిచ్చగింతు రదిగాక పదంబుల మైత్రి మేలుగా
సూరులు గొంద ఱెంతురు విశుద్ధమతిం బరికింప నిన్నియుం
గూరుచుగాదె సత్కవులకున్ ముదమున్ రుచిభేదసంగతిన్.

సారరసజ్ఞతాగరిమ చానకు ముఖ్యమ్మైన రీతియుం
జారుగుణంబులున్ సతికి శస్యము గాదొకో? యవ్వి యుండియున్
దోరపురూపు గల్గినను దోసమె? యింకను భూష లున్న సిం
గారము తగ్గునే? యటులు గావ్యవిలాసినికిన్ ధ్వనిస్ఫుర
త్సారరసంబె యన్నిటఁ బ్రధానత నొప్పెడుఁ గాక దానికిం
జేరినరీతియుం గుణము సేరుట యొప్పదె? శయ్యయున్న సొం
పారచియింపకున్నె? గనట్టు లలంకృతు లింపుఁగూర్పవే?

యోరసికాగ్ర్యులార! ఇద యుండుత చూడగ దీర్ఘవర్ణనల్
కూరిమి దృశ్యకావ్యములఁ గూర్పవుగా కవి శ్రవ్యభావలం
దూరు వహించునెట్లు? విబుధుల్ తమ నేర్పుకొలంది యద్భుతా
కారమునం గరంబెనయు కల్పనలం బచరించు టెంతయున్

సారపు నూహలం జనమనంబు లొగిన్ వికసింపఁ జేయఁగాఁ
దాను తలంచియుండు రని తప్పక తోఁచెడుఁ గాక లేనిచో
వారలు రిత్తగాఁ గృతు లవారియొనర్చిరె? వేర్పరింపఁగా
వేరగుబుద్ధులుం గృతులు, వేరగు గల్పనలెంచి చూడఁగా
వేరగుచుండు భావములు, వేరగుచుండు రసంబులన్ రుచుల్

---

* ౧౯౩౦ సం. సెప్టెంబరు ౨౦-౨౧ తేదీలలో పెద్దాపురమున జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తునందు చదివిన పద్యములు. ఇందు ఆదిని ౩౧ చరణములును అంతమున ౧౮ చరణములును, కవిజనకర్తవ్యము నుపదేశించునవి కామి వాని నిట ప్రకటింపలేదు.—సం. భారతి.

వేరగుచుండు లోకులకు విశ్వమునం దదియెట్లు క్రొత్తయా
వేరుదనంబె సృష్టికిని వేరగుచు న్మహిమంబు నొందదే?

సారమనీషులార! బుధసత్తములార! యనాదిసర్గమం
దారసి చూడగా జనములందఱు నొక్కవిధంబువారె? య
వ్వారలు తాము నేర్చుగతి భారతి నర్చనసేయు టొప్పదే?
వీరు రసధ్వనిద్వ్యక్కృతి విస్తృతుల న్దనసేవ సల్పఁగా
లేరని కిన్కఁబూని యదలించునె వాక్సతి? కొందఱన్న శృం
గారరసానవద్యతరగద్యశుభావహపద్యమంజుల
దారనిబంధనావళి విధానవిధాప్రథితాత్మనీన మే
ధారుచిసాంద్రు లింక వసుధం బరికింపఁగఁ గొంద ఱన్యకా
వ్యోరురసానుభావవిభవోదితభవ్యతరస్వభావు లీ
దారుల దూరి కొందఱు సతంబు ధృతిం బరకీయకావ్యదో
షోరుగవేషణప్రచురణోద్ధతభాషణభీషణాస్యు లీ
దారియు విందుబృంద రుచిదంబయి యొప్పిన నొప్పుఁగాక శ్రీ
భారతిసేవసేయ దృఢభావము గల్గెనయేనిఁ గూర్మిఁ దా
నేరుచు రీతి నొక్కకృతి నిర్మితిసేసినఁ జాలదే? స్వచి
త్తోరుగుణంబు దాన వెలుగొందదె? పూర్వకవుల్ స్వబుద్ధి వి
స్తారము దెల్పుటెల్లఁ గృతి జాలవినిర్మితిగాదె? దాన న
వ్వారలఁ జెందదేయశ? మపార గుణాదుల లక్షణం బలం
కారవిచక్షణుల్ స్ఫుటముగా రచియించిర కాదె? తద్విదుల్
సార మసారముం దెలియఁజాలరె? యిందు నిజం బదేమనన్?

చారుకృతిన్ రచింపధృతి చాలని ధీరులు కీర్తినొంద నీ
దారి సుగమ్య మాపగిది ధాత సృజింపను బోలు? మేలుమే
లీరస వెల్గు విజ్ఞతతి యీరసము న్విడనాడి యోర్పుమై
సారమనీష నింపెనయు చారుకృతుల్ రచియించి వానిచే
భారతిఁ దన్పి దాన బుధవర్గము మెప్పు గణించి దేశసే
వారతి సద్యశః పటలభాజనతంగనుఁగాత; పండితుల్
సైరణఁబూని యన్యకృతిజాలగుణంబుల నుద్ధరింపనే
కోరి విమర్శనంబుల నకుంఠమతిన్ బచరింత్రుగాత [మున్].



# పునర్విమర్శనము

## వసుచరిత్రరచనాకాలము

### ౧

వసుచరిత్రరచనాకాలమును ప్రథమమున నిర్ణయించినవారు కందుకూరు వీరేశలింగంపంతులుగారు. "వసుచరిత్రము ౧౫౭౭ వ సంవత్సరమునకు తరువాతనే ముగింపబడినట్లు స్పష్టమగుచున్నది" అని వీరు సిద్ధాంతీకరించిరి. దీనికి వీరు చూపిన హేతువులు రెండు:

౧. తిరుమలరాయలు "పెనుగొండను రాజధానిగా జేసికొన్న తరువాత మహమ్మదీయులతో జరిగిన యుద్ధవార్త వసుచరిత్రలోని యీ పద్యమునందు చెప్పబడి"యుండుట:

చ. 'తిరుమలరాయశేఖరుని
        ధీరచమూభటరాజి యాజి భీ
    కరయవనేశ్వరప్రహిత
        ఖానబలంబుల జక్కుసేయ ని
    ద్ధరఁ బెనుగొండ కొండలను
        దద్విపచర్మకపాలమాలికా
    పరికరభూషితంబులయి
        బల్విడిఁ గాంచె గిరీశభావమున్.

పైపద్యమున జెప్పినట్లు తిరుమలరాయడు "యవనేశ్వరప్రహితఖానబలంబుల" జక్కుచేసిన దెప్పుడో శ్రీపంతులుగారు వివరింపరైరి. ౧౫౭౭ వ సంవత్సరమున తిరుమలరాయని "మూడవ కొడుకయిన వెంకటపతిరాజు అలీ అదిల్ షాతో యుద్ధముచేసి" పరాజితు డగుటయే ఇచ్చట రామరాజభూషణునిచే తిరుమలరాయని జయముగ వర్ణింపబడినదని వీరేశలింగంపంతులుగారు తలచినట్లు తోచుచున్నది. అట్లగునేని వీరు భ్రమపడిరని చెప్పవలయును.

౨. వెంకటపతిరాజు రాజధానిని చంద్రగిరికి మార్చిన సంగతి సూచించియున్నాడు:

మ. 'హరుఁడా తారకశైలదుర్గమున స
        ద్ధ్యానైకనిష్ఠుడై రాజశే
    ఖరవిఖ్యాతి వహించు జంద్రగిరిదు
        ర్గంబందు శ్రీవేంకటే
    శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖరసదా
        సంసేవ్యుడై యారయి
    ద్ధర బంకేలిక వాసి తద్గిరులకున్
        దప్పల్లభశ్రీలకున్'.

ఈమార్పు ౧౫౭౭ వ సంవత్సరమునందు జరిగెను. కావున వసుచరిత్ర తదనంతరమే రచియింపబడెను. వీరేశలింగం పంతులుగారు పెట్టిన మేలుబంతి ననుసరించి, యితర విమర్శకులు కాపీ వ్రాసియుండుటవలన వారియభిప్రాయములను వేరుగ బేర్కొనుట యనవసరము. కాబట్టి, వీరేశలింగముగారు తమసిద్ధాంతమును నిలుపుటకు జూపిన కారణము లెట్టివో కనుగొందము.

### ౨

వీరేశలింగంపంతులు మొదలగువార లొనర్చిన కాలనిర్ణయము సరికాదని నిరూపించుచు శ్రీ కుందూరు ఈశ్వరదత్తుగారు ఆషాఢ భారతియం దొక వ్యాసము వ్రాసియున్నారు. అందు, తిరుమల రాయలు ౧౫౭౦ లో మృతి నందినా డనియు, తత్కారణమున వెంకటపతిరాజు ౧౫౭౭ లో అలీ అదిల్ షాతో యుద్ధముచేసి పరాజితు డయినప్పుడు సజీవుడైయుంట యసంభవమనియు, వసుచరిత్రమునందు వర్ణింపబడిన తురకలదాడి అతడు బ్రతికియుండగనే పెనుగొండకు వచ్చియుండవలయుననియు వచించిరి. ఇంతే కాక వసు

చరిత్రలో తిరుమలరాయని పట్టాభిషేకము రెండుమూడు పర్యాయములు చేర్కొనబడియుండుటచేతను, సదరు పట్టాభిషేకము ౧౫౭౦ లో జరిగియుండుటచేతను, వసు చరిత్ర ౧౫౭౦ కి పూర్వమే విరచింపబడెననియు చెప్పియున్నారు. వీరు వ్రాసినది సత్యము. కాని సదరు వ్యాసమున వీరు తగుచరిత్రాధారములను సంపూర్ణముగ జూపకపోవుటచేతను, రాజధాని మార్పునుగురించి ప్రస్తావింపకపోవుటచేతను తద్విషయమై మరల వ్రాయవలసి వచ్చెను.

తిరుమలరాయలు ౧౫౭౦-౭౧లో మృతినందెను. తత్పూర్వము మహమ్మదీయులు పెనుగొండను ముట్టడించిరేమొ కనుగొందము. ఫెరిస్తాగ్రంథమున నాకాలమున నొక్కదండయాత్ర నడచినట్లు చెప్పబడియున్నది. ౧౫౬౬ లో హుస్సేన్ నిజాంషా చనిపోగా అతని మైనరుకొమారుడు మూర్తుజా సింహాసనము నధిష్ఠించెను "అల్లీ ఆదిల్ షా తనరాజ్యమును విస్తరిల్ల జేయుట కదియే యదనని తలచి, (అళియ)రామరాజు కుమారుడగు తిమ్మరాజును పెనుగొండ సింహాసనము నెక్కించి ఎఱదిమ్మరాజును (తిరుమలరాయని) రాజ్యపదచ్యుతుని జేయుటకై దండుతోగూడ తరలి ఆనెగొందికి వెళ్లెను. క్రమక్రమముగ విజయనగరరాజ్యములో నొకభాగమును బడయ నాశ జెందెను. ఎఱదిమ్మరాజు అతనికుట్రల నెఱిగి, మూర్తుజా నిజామ్‌షా పేరను, (అతని తరఫున ప్రభుత్వమును సల్పు) నతని జననియగు ఖుంజాసుల్తానా పేరను సాయము చేయుడని (యుత్తరములను) వ్రాసెను. బిజాపురసుల్తానుని యధికారము పెంపును జూడనోపక, ముల్లా ఇనాయతుల్లా చెప్పిన సలహాప్రకారము, రాణి దండుతోగూడ బిజాపురమునకు వెడలెను. అందుమీదట, నిజరాజధానిని రక్షించుకొనుటకు ఆదిల్ షా ఆనెగొంది నుండి మరలి పోవలసివచ్చెను." (Brigg's Ferista, Vol iii, P. 133.)

ఈవిషయమునే మరియొకచోటగూడ ప్రస్తావించి యున్నాడు. "నైజామ్‌శాహివారి రాజ్యవ్యవహారములు ఈస్థితియందుండగా, విజయనగర రాష్ట్రములోని ఆనెగొందియందుండు హిందువులపై అల్లీ ఆదిల్ షా దండువెడలెను. వారిరాజు, గతించిన రామరాజు తమ్ముడగు ఎఱదిమ్మరాజు పెనుగొండయందు నివసించుచుండెను. ఈవేళయందు ఎఱదిమ్మరాజు ఖుంజాసుల్తానాయొక్క సహాయము నపేక్షింపగా ఆమె పసివాడగు తనకుమారుని వెంటబెట్టుకొని సైన్యముతోగూడ బిజాపురముపైకి నడచెను. తన రాష్ట్రమును గాపాడుకొనుటకై అల్లీ ఆదిల్ షా ఆనెగొంది నుండి వెనుకకు దిరుగవలసినవాడాయెను." ( Brigg's Ferista, Vol. III, P. 251).

ఫెరిస్తా వ్రాతవల్ల ౧౫౬౬ లో బిజాపురసుల్తానగు అల్లీ ఆదిల్ షా అళియరామరాజు పుత్రుడగు తిమ్మరాజును సింహాసనాధిష్ఠుని జేయు వ్యాజముపై విజయనగరరాజ్యముపై దండు వెడలి ఆనెగొందికి వెళ్లెనని తెలియుచున్నది. ఫెరిస్తా వ్రాయకపోయినను తురకదండు ఈ సమయముననే పెనుగొండను ముట్టడించినట్లు శా.శ.౧౪౯౯ (క్రీ.౧౫౭౭-౭౮) నాటి శాసనమువల్ల దెలియుచున్నది. ఈ శాసనమునందు తత్పూర్వము నడచిన కొన్ని చరిత్రాంశములు వర్ణింపబడియున్నవి. క్రీ. శ. ౧౫౫౭-౫౮ కి సరియగు పింగళవర్షమున తిరుమలరాయలు పెనుగొండ రాజ్యాధిపత్యము చేయుచు, పెనుగొండ పట్టణమున నివసించుచుండెను. తిరుమలరాయల యాజ్ఞానుసారము రాయలకు వింజామరను వీచు చిన్నప్పనాయుడనునతడు దుర్గములో నొక చిల్లకోటను నిర్మించి, దానికి ద్వారములను, బురుజులను గట్టించి, కందకమును త్రవ్వించెను. పెద్దకోటకు క్రింద నున్న ప్రాత గిరిదుర్గమును బలపఱచెను. అతడు పెనుగొండయందు ప్రతిష్ఠించిన నిజకులదైవ మగు మారకాపుర చెన్నరాయని యనుగ్రహమువల్ల క్రీ. శ. ౧౫౮౬-౮౭ కు సరియగు క్షయ సంవత్సర పుష్యమాసమునందు రంబికేసరుఖాను డను తురకసర్దారుని ఓడించెను. విభవ సంవత్సరపు వైశాఖ మాసమునకు సరియగు క్రీ. శ. ౧౫౮౮-౮౯ మార్చి-యేప్రిల్ నెలయందు అంబినమాలిఖాను మొదలగు తురకసర్దారులను నిర్జించెను. క్రీ. శ. ౧౫౯౬-౯౭ కు సరియగు ధాతువత్సర మార్గశిరమాసమున పెనుగొండదుర్గము నాక్రమించు తలంపున నెత్తివచ్చిన ఏదులశాహిని జయించి వెడల నడచెను. (Arch. Sur. of India 1911-12,

p. 184.) ఇందువల్ల ౧౫౪౩—౪౪ ల మధ్యకాలమున తురకలు పెనుగొండ మూడుమార్లు ముట్టడించిరనియు, ౧౫౬౫—౭౦ ల మధ్య రెండుపర్యాయములు ముట్టడించిరనియు తెలియవచ్చుచున్నది. రంబికేసరిఖానుడును, వంబినమాలిఖానుడును ఫలానివారని నిర్ధారించి చెప్పుటకు వీలు లేకున్నను, వారు ఆదిల్ శాహి సర్దారులనుటకు సందేహింప బనిలేదు. ఫెరిస్తా గ్రంథమువల్లను, చన్నప్పనాయకుని శాసనమువల్లను మహమ్మదీయులు ౧౫౭౦ కి, అనగా తిరుమలరాయల మరణకాలమునకు పూర్వము పెనుగొండను రెండు పర్యాయములు ముట్టడించిరని స్పష్టమగుచున్నది. వసుచరిత్రపద్యమున వర్ణింపబడిన "భీకరయవనేశ్వర ప్రహితఖానబలంబులు" పై యిద్దరు ఖానులలో నెవ్వరివేనియు నొక్కరివి కావచ్చును. కావున నీ పద్యము వసుచరిత్ర క్రీ. శ. ౧౫౭౦ కి పూర్వము వ్రాయబడెనన్న వాదమునకు ప్రతిబంధకము గానేరదు.

## 3

ఇక రెండవకారణము నారయుదము:

మ. 'హరుఁ డాతాగకశైలదుర్గమున న
ధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి నహించు చంద్రగిరి దు
ర్గంబందు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖర సదా
సంసేవ్యుఁడై యోర, యి
ద్దర బంటేలికవాసి తద్గిరులకుం
దద్వల్లభశ్రీలకున్.'

ఈపద్యమున కవి "వేంకటపతి రాజధానిని చంద్రగిరికి మార్చిన సంగతిని సూచించుచున్నాడు" అని కందుకూరు వీరేశలింగంపంతులు వ్రాసిరి. వీరేశలింగం పంతులుగారు చెప్పినట్లు వెంకటపతి రాజధానిని చంద్రగిరికి మార్చినది క్రీ. శ. ౧౫౮౫ కు పూర్వమై యుండజాలదు. ఏలన: అదియే అతని రాజ్యారంభవర్షము. తత్పూర్వము అతని యన్నయగు శ్రీరంగరాయలు పెనుగొండ రాజధానిగ ప్రభుత్వము సేయుచుండెను. కావున, వసుచరిత్రరచన వెంకటపతిరాయల రాజ్యాభిషేక మైనపిమ్మట (అనగా ౧౫౮౫ కు తరువాత) సంపూర్తియైనదని చెప్పవలసియున్నది. అందువల్ల తిరుమలరాయదు సజీవుడై యుండగ రామరాజభూషణుడు వసుచరిత్రను వ్రాసి ముగించలేదని చెప్పవలసివచ్చును.

అయితే, వసుచరిత్రలోని ఈ క్రిందిపద్యములవల్ల పై అభిప్రాయము సరికాదని తోచకపోదు:

మ. 'ఘనశౌర్యుండు సిరంగరాయ నరలో
కస్వామి తోబుట్టు రా
మనృపాలాగ్రణి సహ్యజాంబుధిపయో
మధ్యోర్వి శ్రీరంగప
ట్టణ లంకానగరంబు పుణ్యజనసే
వావార్త లేకుండఁగ
గొనియె న్మిత్రభవోపకారనిరపే
క్షుండై విచిత్రంబుగన్.'

మఱియు,

ఉ. 'హరిపదభక్తిశీలుఁ డగు
నా రఘునాథనృపాలు కూర్మి సో
దరుఁడు సిరంగరాయవసు
ధావరుఁ డాత్మగుణప్రమోదవ
త్తిరుమలరాయశేఖర వి
తీర్ణ మహాయువరాజపట్ట బం
ధురుడయి సర్వభూభువన
ధూర్వహశక్తి వహించు నెంతయున్.'

పైపద్యములయందు రామరాజభూషణుడు తిరుమలరాయలు రాజ్యము సేయుచున్నప్పుడు అతనిపుత్రు లేవదవులయందుండినదియు చెప్పుచున్నాడు. శ్రీరంగరాయలు యువరాజపట్టమును బొంది తిరుమలరాయలకు రాజ్యపాలనము నందు తోడైయుండెను. రామరాజు కావేరీ సాగరముల మధ్యనున్న కన్నడదేశమును శ్రీరంగపట్టణము రాజధానిగా పాలించెను. వెంకటపతిరాజు చంద్రగిరియందు నిలిచి పెక్కు సామంతనృపాలురు గొల్వ దక్షిణదేశము నేలెను. తిరుమలరాయనిపుత్రు లందఱును వారి తండ్రిపక్షమున, అతనికి లోనై సామ్రాజ్యములోని పలుభాగముల నేలు

చుండిరి. వారివారికి వేర్వేరు రాజధాను లున్నను సామ్రాజ్యమున కంతటికిని పెనుగొండ యొక్కటియే రాజధాని. వెంకటపతి ౧౫౮౬ లో మహారాయపదమున కభిషిక్తు డగువఱకు సామ్రాజ్యమునకు చంద్రగిరి రాజధాని కాలేదు. వసుచరిత్రపద్యములో జెప్పబడినది చంద్రగిరి సామ్రాజ్యమునకు రాజధానియని కాదు; దక్షిణదేశము నేలుచున్న వెంకటపతికి రాజధానియనియే తలవలయును.

చిక్కదేవరాయ చరిత్రమున నీయంశము లన్నియు చక్కగ వర్ణింపబడియున్నవి:

“తన్న (ఎఱె దిమ్మరాజన) మూవరుఁ మగరోళ్ మొదలిగనాద శ్రీరంగరాజనం పెనగొండెయోళిట్టు తంగె తెలుఁగనాడొడెతనమం, ఎరడనెయ రామరాయనం శ్రీరంగపట్టణదోళిరిసి యనంగె కర్ణాటదేశాధిపత్యమం మూఱనెయ వెంకటపతిరాయనం చంద్రగిరియొళిట్టు అతంగె తుండీర చోళపాండ్య మండలేశ్వగమనిత్తం ”*

ఇందువల్ల తిరుమలరాయలు రాజ్యమునేయుచుండగనే పరిపాలనసౌకర్యార్థమై పునరుద్ధారిత విజయనగర సామ్రాజ్యమును మూడుభాగములు చేసి, వానిపై తన మువ్వురు పుత్రులను పాలకులుగ నియమించెనని విశదమగుచున్నది. తత్కారణమున తిరుమలరాయని రాజ్యకాలముననే, అనగా క్రీ.శ. ౧౫౭౦ కి పూర్వమే, వెంకటపతి చంద్రగిరిని పాలించుట కవకాశము గలిగెను. ఈ విషయములను మనస్సునం దుంచుకొంటిమేని క్రీ.శ. ౧౫౭౦ కి ముందు రామరాజభూషణుడు దారచించిన వసుచరిత్రలో వెంకటపతి చంద్రగిరియం దున్నట్లు వ్రాయుట సహజముగ గన్పించును “కావున వసుచరిత్రము (తిరుమల) రాయలు పట్టాభిషేకానంతరము పెనుగొండలో ౧౫౬౮వ సంవత్సరమున కృతి నందెననుటకు సందేహము లేదు” అని శ్రీ ఈశ్వరదత్తుగారు వ్రాసినది మిక్కిలియు నొప్పియున్నది.

యన్. వెంకటరమణయ్య.

---

# ద్రావిడభాషాచరిత్రోపోద్ఘాతము¶

## సమాధానము

నేను రచించిన “An Introduction to Dravidian Philology” అనే గ్రంథమును ౧౯౩౦ సం. మార్చి భారతిలో విమర్శిస్తూ శ్రీ కందూరి ఈశ్వరదత్తు గారు నేను ప్రతిపాదించిన కొన్నివిషయములను గురించి తమకు కలిగిన సందేహములను తెలిపినారు. ఆంగ్లవైయాకరణుల సంప్రదాయము నీమధ్య మరచిపోయిన మనవారి కందరికిన్ని ఇట్టిసందేహములు కలుగుట వింత కాదు గనుక వాటికి నాకు తోచినసమాధానమును చెప్పుటకు ప్రయత్నిస్తాను. అట్టిసమాధానమును చెప్పుటకుపూర్వము కొండుమాటలు వ్రాయవలసి వున్నది.

నేను చాలకాలముక్రింద (౧౯౧౫ లో) ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక ఆరోసంపుటములో “తెనుగునందలి దేశ్యాన్యదేశ్యపదజాలము” అనే పేర ఒకవ్యాసము వ్రాస్తిని. ఆవ్యాసమునకు ఆధారములు (౧) శబ్దరత్నాకరము, (౨) బ్రౌనునిఘంటువు శబ్దరత్నాకరములోని తత్సమములు, వైకృతములు, ద్వయములు, యుగళములు, దేశ్యములును లెక్కపెట్టి ఏవియెన్ని తెలుగులో వున్నవో ఆవ్యాసములో తెలిపినాను. అన్యభాషాపదముల సంఖ్యను శబ్దరత్నాకరము, బ్రౌనునిఘంటువులలోని వాటిని లెక్కపెట్టి వ్రాసినాను.

---

* The Sources of Vijayanagara History, p. 303.

¶ An Introduction to Dravidian Philology, వెల రు ౨ లు; సాధన బుక్కు డిపో, అనంతపురము.

శబ్దరత్నాకరములో సీతారామాచార్యులవారు చేసిన విభాగము సరియైనదా, కాదా? వారు దేశ్యములను కొన్నవన్నీ దేశ్యములే అవుతవా? అనే విచారము నేనా వ్యాసము వ్రాసేటప్పుడు నాకు కలుగలేదు. కాని ఆతరువాత ప్రాకృతవ్యాకరణములను, ప్రాకృతకావ్యములను, పాలీభాషను కొంతవరకు చదువుటకు ప్రారంభించిననాటి నుంచిన్నీ దేశ్యములని మనవారనుకొంటూ వున్నవి చాలామట్టుకు ప్రాకృతభవములవుతవేమో అని నాకనుమానము తగిలినది. అయినా తెలుగుభాష ఒక ప్రాకృతభాషయే కావచ్చునని చెప్పడమునకు నేను ఆంధ్రచారిత్రకపరిశోధకమండలివారి త్రైమాసికసంచికలో "The Influence of Sanskrit and Prakrit on Telugu"—"తెనుగుభాషమీద సంస్కృతప్రాకృతభాషలకుగల అధికారము" అనేవ్యాసము వ్రాసేటప్పుడు సాహసము కలుగలేదు. ప్రాకృతపాలీభాషలతో నాకు పరిచయ మెక్కువ అయిన కొద్దిన్నీ నాఅనుమానము దృఢపడుతూ వచ్చినది. ఉత్తర హిందూస్థానభాషలు ప్రాకృతభవములని ఒప్పుకొంటూ, ఆభాషలకున్ను, దాక్షిణాత్యభాషలకున్ను భాషానిర్మాణములోగాని, శబ్దజాలము విషయమునగాని, ఎక్కువ భేదములేదని తెలుపగలిగితే, దాక్షిణాత్యద్రావిడభాషలుకూడా ప్రాకృతభాషలకు సంబంధించినవే అని నిరూపింపవచ్చును గదా అని ఆలోచించి, ఆదృష్టితో కొంత కృషిచేస్తిని. ఆకృషికి ఫలమే మనకు ప్రస్తుతవిషయమైన "An Introduction to Dravidian Philology" — "ద్రావిడభాషాచరిత్రోపోద్ఘాతము"న్ను, దానిమీద ఈశ్వరదత్తుగారు చేసిన విమర్శనమున్ను.

ఒక్క మనవి. ఈవిషయమై నేను చేసిన వాదము అతివాదము గానే కొందరికి కనబడవచ్చును. కాని, అది అతివాదమో, మితవాదమో ఇతరులావిషయమును బాగుగా ఆలోచించి నిర్ణయించవలసినది. శాస్త్రము రాజకీయరంగము గాదు. దానిలో అతి, మిత అనే భేదములకవకాశము లేదు. సత్యాన్వేషణమే దానికి విషయము. అతిసత్యము, మితసత్యము అని సత్యము రెండువిధములు కాదు గదా. ఈ అన్వేషణములో తప్పుదారి త్రొక్కితే సత్యము దొరకదు. తప్పుదారి త్రొక్కినామో, సరియైనదారి త్రొక్కినామో ప్రమాణముమీద ఆధారపడి ఉంటుంది. నేను చూపిన ప్రమాణములు సరియైనవయితే, నేను చేసినవాదము నిలుస్తుంది. కాకపోతే పోతుంది. అంతేగాని నావాదమే నిలువవలెనన్న పట్టుదల నాకు లేదు.

సంస్కృత మాద్యప్రకృతి, ప్రాకృతము ద్వితీయప్రకృతి, ఆంధ్రభాష వికృతి అని అందరు వైయాకరణులున్ను చెప్పినారు కాని, శబ్దములకు సంబంధించిన కొన్ని ఉదాహరణములను మాత్రము చూపి వారూరకొన్నారు ఇట్లాంధ్రభాష వికృతి అని చెప్పుతూ, ఆంధ్రశబ్దములలో తత్సమ, తద్భవపదములతోపాటు దేశ్యములను ఒకవిభాగమునుకూడా వారు చేసినారు. ఈ దేశ్యవిభాగమును చూచి, పాశ్చాత్యపరిశోధకుల ననుసరించిన మనవారు ఆంధ్రభాష సంస్కృతప్రాకృతములకు భిన్నమైనదనిన్ని, వాటికిన్ని ఆంధ్రభాషకున్ను ప్రకృతి వికృతి సంబంధము లేదనిన్ని తెలుప మొదలుపెట్టినారు. ఈఅభిప్రాయము నానాటికిని నాటుకొనినది. ఇందుకు కారణము లేకపోలేదు. కేవలపదసంబంధమును చూపించినంతమాత్రాన ప్రకృతి వికృతి సంబంధమును నిర్ధారింప వీలు లేదనిన్ని, భాషల నిర్మాణములో సామ్యముంటేనే అట్టిసంబంధమును నిర్ణయింపవలెననిన్ని శబ్దశాస్త్రజ్ఞుల మతము. ఇది సత్యమే. కాని, మనవారుగాని పాశ్చాత్యులుగాని, పూర్వవైయాకరణులున్ను, నైఘంటుకులున్ను చూపిన కొలది ప్రమాణములను మాత్రము పరీక్షించి, శబ్దముల విషయమున మరి కృషి చేయనే లేదు. సరిగదా, భాషానిర్మాణసామ్యములనుగురించి ఎట్టిపరిశోధనమున్ను చేయలేదు. కాల్డ్వెల్ పండితుడుమాత్రమట్టి పరీక్ష చేసినాడు. అతని పరీక్షామార్గము సరియైనది కాదనిన్ని, సంస్కృతముతోమాత్రము ద్రావిడభాషలను పోల్చుటవల్ల సత్యము పట్టుపడదనిన్ని, శబ్దవిషయములోను, భాషానిర్మాణవిషయములోను కూడా ద్రావిడభాషలను ప్రాచీనప్రాకృతభాషలతోను, నేటిప్రాకృతములయిన ఉత్తరహిందూస్థానభాషలతోను పోల్చవలెననిన్ని నాగ్రంథములో వాదించి, నాకు గోచరించినంతమట్టుకు ఉదాహరణపూర్వకముగా నావాదమును స

ర్థింప యత్నించినాను. వివరములు కావలసినవారు నా గ్రంథమును చదువవలెను.

ఇక ఈశ్వరదత్తుగారు తమ విమర్శనములో వేసిన ప్రశ్నలకు సమాధానములు చెప్ప ప్రయత్నిస్తాను.

౧. "ఆంధ్రమునందుగల దేశ్యములన్నియు నపభ్రంశ భాషలలో నుండియే వచ్చెనా?"

"దేశ్యములన్నీ అపభ్రంశభాషలలో నుండియే వచ్చినవని నేను చెప్పలేదు. అతి ప్రాచీనకాలము నుండిన్ని వచ్చిన ప్రాకృతపదజాలము మార్పులు పొంది పొంది నేటికి మూలములతో దగ్గరపోలికలు లేకపోవుటచేత దేశ్యములుగా పరిగణింపబడినవనిన్ని, ప్రాకృతము ద్వారా తరువాతికాలములో ఆ క్రమములో చొచ్చి ఇంకను ప్రాకృత పదములతో పోలికలు గలట్టివిన్ని, ప్రాకృతలక్షణము ననుసరించి మనవారు కల్పించుకొనినవిన్ని నేడు తద్భవముగా ఎన్నబడుచున్నవనిన్ని, ఆదియందేర్పడిన ప్రాకృతభవములు సాధారణముగా అపభ్రంశ పైశాచీ ప్రాకృతభవములై ఉండవచ్చుననిన్ని, తక్కిన ప్రాకృతభాషలనుంచికూడా కొన్ని పదములు చేరినవనిన్ని వ్రాసినాను.

౨. "భాషను సంస్కృతభవము, ప్రాకృతభవమని వర్గీకరింపక, దేశ్యము అనియుగూడ నేల విభజింపవలెను?"

తద్భవములును, తత్సమములును కావని భ్రాంతి కలిగించే చాలా శబ్దము లుండడముచేతనే వైయాకరణులట్లు చేసినారు. ఇట్లు చేసినవారు ఒక్క ద్రావిడభాషా వైయాకరణులే కారు. ఉత్తరహిందూస్థాన భాషలకు వ్యాకరణములు వ్రాసినవారు కూడా తమతమభాషల శబ్దజాలములో దేశ్యవిభాగ మొకదాని నేర్పాటుచేసుకొన్నారు. ఇం తెందుకు? ప్రాకృతలక్షణమును వ్రాసిన ఆచార్యులుకూడా ప్రాచీనప్రాకృతభాషలలో తత్సమ, తద్భవ, దేశ్యవిభాగమును చేసుకొన్నారు. హేమచంద్రుడు "దేశీనామమాల" అనే నిఘంటువులో తాను దేశ్యములను కొన్న ౩,౯౭౮ పదములను చేర్చినాడు. ప్రాకృతభాషను బాగుగా అభ్యసించిన పాశ్చాత్యపండితులు దేశ్యములని హేమచంద్రుడు వ్రాసిన వన్నీ దేశ్యములు కాక పోవచ్చుననిన్ని, భాషామర్యాదలప్రకారము విచారిస్తే వీటిలో చాలావాటికి సంస్కృతమూలముల నేర్పరుప వచ్చుననిన్నీ తలంచినారు. హార్నెల్ పండితుడీ విషయమై యిట్లు వ్రాసినాడు:

"Native grammarians add the ***desya*** as a third division, to the *tatsama* and ***tad-bhava***. The term *desya* means literally 'belonging to the country', i. e. provincial or perhaps aboriginal. They designate by this name all those words which they are unable to derive satisfactorily to themselves from some Sanskrit word, and therefore consider to have had their origin in the country (i. e. *rure* or ***provincia***). In what way exactly they suppose them to have originated is not clear; namely whether borrowed from the aborigines, or invented by the rustic Aryans themselves in post-Sanskritic time (Beames, I. 12), or so corrupted by their common parlance from a Sanskrit original as to make them unrecognizable. The last seems to me the most probable, to judge from the sentiment of modern pandits on the subject. The results of modern research tend towards diminishing the number of these ***desya*** words, by discovering, through means unknown to native grammarians, their real origin and tracing them back to Sanskrit and Prakrit."

ఇట్లే బీమ్సుపండితుడు ఆధునిక ఉత్తరహిందూస్థాన భాషలలోని దేశ్యములని ఆయావైయాకరణులు తలంచిన శబ్దములను గురించి వ్రాస్తూ,

"It is therefore not presumptuous to say that further research and a better ac. quaintance with the laws of development of these languages, will probably enable us ere long to diminish the number of the ***desajas*** by tracing them back through newly discovered processes either to Sanskrit or

Prakrit. Even as matters stand at present, if all the *tatsamas* and all the *tadbhavas* be Aryan, there is only a very small proportion left which can be non-Aryan."

అని తన అభిప్రాయమును తెలిపినాడు. ఇట్లే తన పుస్తకములో మరొకచోట:—

"A *desaja* word may, like an early *tadbhava*, be derived from a word which though not Sanskritic is yet Aryan, and such a word may not be found either in Sanskrit or in Prakrit. It would then be necessary to search for it in all the branches of the Indo-Germanic family before giving it up."

అని వ్రాసినాడు. ప్రాకృతభాషలలోను, ఇప్పటి గౌడభాషలలోను దేశ్యశబ్దముల స్థితినిగురించి పండితులు పరిశోధించి ఇట్టి అభిప్రాయములను వెలిబుచ్చినప్పుడు, ద్రావిడభాషలలోని దేశ్యములు కూడా పరిశోధనముచేసిన మీదట చాలా మార్పుచెందిన తద్భవములు కాకూడదా అని నా గ్రంథములో ప్రశ్నించి, అట్లు వాటిని తద్భవములుగా పరిగణించడమునకు నాకు కనబడిన హేతువులను ఉదాహరణ పూర్వకముగా నిరూపించినాను.

ఈ నిరూపించడములో కేవలము శబ్దజాలములోని పోలికలను మాత్రము చూపి, మన పూర్వవైయాకరణుల వలె నేను తృప్తిపడలేదు. భాషలసంబంధమును స్థిరపరచడానికి ముఖ్యమైన నిర్మాణసామ్యములను చాలా వాటిని చూపినాను. సంస్కృతభాషానిర్మాణమునకున్ను ప్రాకృతభాషానిర్మాణమునకున్ను గల అత్యంతభేదమును చూపి, కాల్డ్వెల్ పండితుడు ద్రావిడభాషలను సంస్కృతముతో పరిపోల్చి ఆ రెండింటికిని సంబంధము లేదని చూపడానికి ఉపయోగించిన యుక్తులన్నీ సరియైనవి కావని తెలిపినాను. ద్రావిడభాషలకున్ను సంస్కృతభాషకున్ను గల సంబంధమును తెలుసుకొనడానికి ప్రాకృతభాషాజ్ఞాన మెట్లవసరమో చూపినాను. ఉత్తర హిందూస్థానభాషలకున్ను, ద్రావిడభాషలకున్ను గల పోలికలను చూపినాను. ప్రాకృతములలో ప్రాకృత లాక్షణికు లేర్పరచిన ప్రధానములైన షడ్భాషలతో గల సంబంధ మటుండగా, ద్రావిడభాషల తత్త్వము తెలుసుకొనడానికి ముఖ్యముగా అపభ్రంశ, పైశాచీ భాషల పరిశోధనము ఎక్కువగా తోడ్పడుతుందని తెలుపుతూ, పూర్వకాలపు పైశాచీభాషలకు సంబంధించిన నేటి పైశాచీభాషలలో ఎక్కువసామ్యములు కనబడుతూ ఉండడమును నిరూపించినాను. ఈవిషయము లన్నిటికిన్ని ఉపోద్ఘాతముగా ప్రాకృతభాషలను మాట్లాడుచుండిన జనుల పూర్వచరిత్రమును స్మరించి, వారికిన్ని ద్రావిడులకున్ను గల సంబంధమును నిర్ధారణ చేయ ప్రయత్నించినాను. నా పుస్తకమును జాగ్రత్తగా చదివినవారు నా యీ అభిప్రాయమును గుర్తింపగలరు. "దేశ్యపదములు అన్యదేశములై ఏ పైశాచీభాషాపదజాలమునకో ముడిపెట్టనగునా? ఆంధ్రభాష ప్రాకృత పైశాచీభాషాంతర్గతమా? ఆంధ్రభాష కేవలము పైశాచీ భాషయేనా?" అని ఈశ్వరదత్తుగారు వేసిన ప్రశ్నల కవకాశమే లేదు. ఆంధ్రభాషకు ప్రత్యేక వ్యక్తిత్వము లేదని నా అభిప్రాయ మైనట్లు వారు తేల్చినారు. ఆంధ్రభాష ప్రత్యేకభాషగా ఉండలేదని కాని, ఇప్పుడది ప్రత్యేక వ్యక్తిత్వము గల భాష కాదని కాని నే నెప్పుడును వ్రాయలేదు. అట్లు వ్రాయడానికి అవకాశమున్ను లేదు.

ద్రావిడభాషలు ప్రాకృతభాషలనిన్ని, ప్రాకృత భాషలకు గల లక్షణములన్నీ ద్రావిడభాషలకున్ను ఉన్నవనిన్ని చూపడమునకే నే నిప్పుడు చేస్తూ ఉన్న కృషి. ఈకృషి ఎంతవరకు ఫలిస్తుందో తెలియదు. భాషాపరిణామవిధుల ననుసరించి కొన్ని సూత్రముల నేర్పరచి, ఆసూత్రములప్రకారము ద్రావిడ దేశ్యపదములకున్ను, సంస్కృత ప్రాకృతములకున్ను గల సంబంధము నిరూపించడానికి ప్రయత్నిస్తున్నాను. నా ప్రయత్నములను మరి ఒక గ్రంథములో తెలుపుకొంటాను.

ఈశ్వరదత్తుగారు ఆంధ్ర వ్యాకరణముల ప్రకారము సంస్కృతప్రాకృతములలో ఎ, ఒ, ఁ, ౘ, ౙ, ఱ, అనే అక్షరములున్ను లేవు గదా, ఈవర్ణములుగల పదము

లున్నూ ప్రాకృతపైశాచీపదములేనా? అని ప్రశ్నించినారు. మనవైయాకరణులు సంస్కృతప్రాకృతముల కున్నూ, ఆంధ్రభాషకున్నూ చూపినభేద మిదొక్కటే. అందుచేత ఈవిషయమై సమాధానముచెప్పితే ఆంధ్రవ్యాకరణములనుమాత్రము చదువుకొన్నవారికి సందేహము పోతుందని ఈ అక్షరములవిషయమై కొంచెము మనవి చేస్తాను. పై అరక్షరములున్నూ సంస్కృతములో లేవన్నమాట నిశ్చయమే. కాని, ప్రాకృతభాషలలో అవి ఉండేవని ఊహించడానికి కొన్ని నూచనలున్నవి.

'ఎ, ఒ,' లు

ద్విత్వాక్షరములకు పూర్వమందున్న ఎ, ఒ, లు హ్రస్వములని యనట్లు వరరుచి యిచ్చిన ఉదాహరణముల వల్ల తెలుసుకోవచ్చును:—

నిద్రా, ణిద్దా, ణెద్దా; నీడమ్, ణెడ్డం; శైత్యమ్, సెత్తం; శయ్యా, సెజ్జా; ఏకమ్, ఎక్కం; సేవా, సెవ్వా; ముక్తా, మొత్తా; యౌవనమ్, జొవ్వణం; త్రైలోక్యమ్, తెలొక్కం మొదలగునవి.

కాని, ప్రాచీన ప్రాకృతలాక్షణికు లీవిషయమై యొక్కడా స్పష్టముగా చెప్పలేదు అపభ్రంశ భాషలగురించి చెప్పినప్పుడు హేమచంద్రుడున్నూ, త్రివిక్రముడున్నూ మాత్రము "కాదిస్థైదోతోరుచ్చారణ లాఘవమ్"—అనగా హల్లులపై వచ్చే ఎ, ఒ, లు లఘువులుగా ఉచ్చరింపబడుతవని చెప్పినారు. అప్పయ్యదీక్షితులవారు రచించిన "ప్రాకృతమణిదీపము" అనే గ్రంథము నా వద్ద ఉన్నది.* అందులో "సిద్ధిర్లోకాచ్చ" అనే మొదటిసూత్రమునకే వివరణము వ్రాస్తూ దీక్షితులవా రిట్లు వ్రాసినారు: "ప్రాకృతశబ్దానాం మధ్యే ఏ తే ప్రయోజ్యాః ఏ తేన ప్రయోజ్యా ఇతి వ్యవస్థాయాః సిద్ధిర్నిశ్చయో న కేవల వక్ష్యమాణ సూత్రేభ్యఏవ, కింతు కార్యజ్ఞలోకవ్యవహారా దపి స్యాత్. తేన, అత్ర శాస్త్రే సూత్రాఽననుశిష్టోఽపి కావ్యాభియుక్త వ్యవహారస్థో హ్రస్వ ఏజ్ సాధురితి సిద్ధమ్. తేన నీడం, నెడ్డం; దైవాదిత్వాద్దస్య ద్విత్వే, త్వేదిత ఇత్యేత్త్వం, సంయోగ ఇతి హ్రస్వః. పుస్తకమ్, పొత్థఅం; స్తావితోత్యత్వమ్; స్త ఇతి థత్వమ్; హ్రస్వః ప్రాగ్వత్. ప్రాయో లుగిత్యాదినా కలోపః." అని ప్రాకృతములో హ్రస్వములైన ఎ, ఒ, లు ఉన్నట్లు సమర్థించినారు.

ప్రాకృతభాషా భవములని అందరున్నూ అంగీకరిస్తూ ఉన్న ఉత్తరహిందూస్థాన భాషలలో హ్రస్వములైన ఎ, ఒ, లున్నవి. ఉదా:

బంగాళీ: ఎక్=ఒకటి; గోర్మ=గోధుమ; బొలె=వాడు మాట్లాడుతున్నాడు.

ఒరియా: ఈభాష ఈ విషయములో బంగాళీ భాష ననుసరిస్తుంది. వ్రాతలో 'అ' అని వ్రాసినా దానిని 'ఒ' అని ఓఢ్రు లుచ్చరిస్తారు. గమ్, బలె అని వ్రాసి గొమ్, బొలె, అని చదువుతారు. గౌడభాషలన్నిటిలోను ఆదికంచిన్ని ఎ, ఒ, లు ఉన్నవని అనుకోవచ్చును. సింధీభాషలో కొన్ని శబ్దములలో ఇంకా 'ఎ' కనబడుతున్నది; కాని, అభాషలో 'ఎ' లన్నీ 'ఇ' లుగాను, 'ఒ' లన్నీ 'ఉ'లుగాను సాధారణముగా మారిపోయినవి. పశ్చిమ గౌడభాషలలో ఈమార్పు సర్వసాధారణముగా ఉన్నది. తూర్పు గౌడభాషలలోకూడా ఈ మార్పు అప్పుడప్పుడు కనబడుతుంది. పష్టూభాషలో ఎ, ఒ, లున్నవి. బంగాళీభాషలో కొన్ని విశేషణముల కొననుండే అకారము ఉత్వముగా వినబడుతుంది; 'బడ' అని బంగాళీనారు వ్రాసి 'బొరొ' అని చదువుతారు. ఇట్లు బంగాళీలో 'ఒ'త్వము అకారము 'ఒ'గా మారుట చేతను, 'ఓ' అనే దీర్ఘాచ్చు హ్రస్వము కావడముచేతను రెండురీతులుగా ఏర్పడినది.

ద్రావిడభాషలలోని ఎ, ఒ, ల తత్త్వముకూడా ఇట్టిదే అయిఉంటుందని నా అభిప్రాయము. నాగరాక్షరములలో హ్రస్వ 'ఎ'కారమునకు గురుతు లేదు. ఇట్లే నాగరాక్షరములఎకారములను వాడేలిపులన్నిటిలోనున్ను క్రొత్తగాహ్రస్వ'ఎ'కారమున కామూభాషలవారువ్రాత అక్షరముల కేర్పాటు చేసుకొన్నారు. దాక్షిణాత్య

* ఈ గ్రంథమును కొద్దికాలములో ప్రచురింపబోతున్నాను.

లిపులుకూడా నాగరాక్షరములవలె అశోకు నిలిపి నంచి పరిణామము పొంది ఏర్పడినవే. ప్రాత తాటాకుమీద వ్రాసిన తెనుగు గ్రంథములలో ఎ, ఏ; ఒ, ఓ లకు ఒక్కటే అక్షరము కనబడుతుంది. కొన్ని శాసనములలో కూడా అల్లే. ఎ, ఏ; ఒ, ఓ లకు వ్రాతలోని భేదము నవీన మయినట్లు తోస్తుంది.

## అరసున్న

అరసున్న (ఁ) గురుతు మొదటినుంచిన్ని తెనుగులో ఉన్నదనుకొనడము పొరబాటు. తాటాకు ప్రతులలో గాని, శాసనములలో గాని ఈ గురుతు కానరాదు. ఈ అరసున్న, లేక ఖండబిందువు (ఁ) తెనుగు భాషకు అచ్చు ఏర్పాటయిన తరువాత వచ్చినది. దానిని బ్రౌనుదొరగారో, మరియెవరో అచ్చుసౌకర్యముకోసము ఏర్పాటుచేసినారు. తెనుగులో అరసున్న లేదు గాని, అర్ధానుస్వార మున్నది. అనగా అర్ధానుస్వారోచ్చారణ మున్నది. ఈ అర్ధానుస్వారోచ్చారణము వైదికభాష నుంచిన్ని వస్తూఉన్నదే. కొన్ని వైదికశబ్దములలో ఖండోచ్చారితమైన అనుస్వారము (ఁ) ఇట్టిదే అని కొందరి అభిప్రాయము. ఈఖండానుస్వారోచ్చారణము ప్రాకృత భాషలలోకూడా ఉండి ఉండవలెను. ఇప్పటి గౌడ భాషలలో అది కనబడుతున్నది. ఇది సాధారణముగా దీర్ఘాచ్చులమీదనే వినబడుతుంది. ఒకప్పుడు, ముఖ్యముగా అనునాసికాక్షరము, లోపించినచోట ఈ ఖండానుస్వారోచ్చారణము వినబడుతుందని గౌడభాషా వ్యాకరణములు చెప్పుతున్నవి. తెనుగులోని అర్ధానుస్వార తత్త్వమున్ను ఇంతే.

## చ, జ, లు

దంత్యోచ్చారణము గల చ, జ, లు తెనుగులో మాత్రమే ఉన్న వనుకొనడము మరి ఒక పొరపాటు. 'చజౌ తజ్జే ప్రాకృతేచ దంత్యావేవ న సంశయః' అనే అథర్వణ వచనమును అప్పకవి ఉదాహరించినాడు. వరరుచి, మార్కండేయుడు, క్రమదీశ్వరుడు మొదలైన కొందరు ప్రాకృత వైయాకరణులు చ, జ, ల దంత్యోచ్చారణమును సూచించినారు. సింధీభాషలో తప్ప ఇప్పటి పాశ్చాత్య గౌడభాష లన్నిటిలోను చ, జ, లకు దంత్యోచ్చారణ మున్నది. మరాటీభాషలో చ, జ, లే కాక ఛ, ఝ, లుకూడా ఉన్నవి. పష్టూ, కాఫిరీ భాషలలో చ, జ, లు కొన్ని సందర్భాలలో తాలవ్యములున్ను, మరికొన్ని సందర్భాలలో దంత్యములున్ను అవుతవి. తాలవ్యోచ్చారణము తెనుగులోవలె తత్సమములలోను, తాలవ్యాచ్చులైన ఇ, ఈ, ఎ, ఏ, లతో కూడినప్పుడున్ను వినబడుతుంది. కొన్ని గౌడభాషలలో 'చ'కారము దంత్యము కావడమే కాకుండా 'స' గాకూడా మారిపోయినది.

సంస్కృతము: ఋక్ష; తూర్పుహిందీ: రీచ్; మరాటీ: రీస్.

సం: చక్రీ; తూ.హి.: చక్కీ; మారాటీ: సక్కీ.

ఆధునిక పైశాచీభాషలైన కాశ్మీరీ, షినాభాషలలో చ, జ, లకు దంత్యోచ్చారణ మున్నది.

## ఱ

వ్రాతలోని ఆకారమునుబట్టి తెనుగులో శకటరేఫమని పిలువబడే 'ఱ' అనే ధ్వని ద్రావిడభాషలన్నిటిలోను ఉన్నది. ఈధ్వనితో సంబంధించి, కొన్ని యెడల దానికి బదులుగా వచ్చే 'ర, ల, డ, ఴ, ళ' అనే ధ్వనులున్ను ద్రావిడభాషలలో ఉన్నవి. ఈధ్వనులన్నీ ఉత్తరహిందూస్థానభాషలలోకూడా ఉన్నవి. ఴ, ళ, లకు ఒత్తులుకూడా ఆభాషలలో ఉన్నవి.

౧. దంతములు:—వీటికి నాలుకచివరను తగిలించి నిశ్శ్వాసమును సంపూర్ణముగా నిరోధించి, నోటిద్వారా వదలిపెట్టితే త, థ, ద, ధ, అనే ధ్వనులు పుట్టుతవి; ముక్కుద్వారా వదలిపెట్టితే 'న' అనే అనునాసికధ్వని పుట్టుతుంది. అదేస్థానములో నాలుకను తగిలీ తగలనట్లుంచి, ఊపిరిని ఒక్కప్రక్కనుంచి వదలిపెట్టితే నాలుక అదురుతో 'ల' అనే ధ్వని పుట్టుతుంది.

౨. తాలువు వెనుక భాగము, మూర్ధమునకు కొంచెము దగ్గరస్థానము:—ఇక్కడ 'ర' అనే ధ్వని పుట్టు

తుంది. దీనిని ఉచ్చరించే టప్పుడు నాలుకచివర మిక్కిలి కొంచెము వెనుకకు మణగి, స్థానమునకు తగిలీ తగలన ట్లుండగా, ఊపిరి నాలుక నదరజేస్తూ, రెండుప్రక్కలనుంచిన్ని బయటికి వస్తుంది.

3. సాధురేఫమున కింకా కొంచెము వెనుక, మూర్ధమున కింకా కొంచెముదగ్గర:—ఇచ్చట ఱ, ళ, అనే ధ్వనులు పుట్టుతవి. నాలుకను 'ర' కుకంటె కొంచె మెక్కువగా మణచి ఆస్థానమునకు తగిలీ తగలన ట్లుంచి, రెండు ప్రక్కల నుంచిన్ని ఊపిరిని వదలుతే 'ఱ' ధ్వనిన్ని, ఒకప్రక్కనుంచి వదలుతే 'ళ' అనేధ్వనిన్ని అదరుతో పుట్టుతవి. 'ర' ఒత్తిపలుకుతే 'ఱ'యున్ను, 'ల'ను ఒత్తిపలుకుతే 'ళ' యున్ను కలుగుతవని చెప్పడము సరి కాదని తోస్తుంది.

4. మూర్ధము:—ఇక్కడనే ట, ఠ, డ, ఢ, ణ, అనే ధ్వనులు పుట్టుతవి. వీటి ఉచ్చారణములో నాలుక పూర్తిగా వెనుకకు మణగుతుంది. ఊపిరిని సంపూర్ణముగా నిరోధించి నోటిద్వారా వదలుతే ట,ఠ,డ,ఢ,లు పుట్టుతవి; ముక్కుద్వారా వదలుతే 'ణ' పుట్టుతుంది. సంపూర్ణముగా మణచిన నాలుకను ఆస్థానమునకు తగిలీ తగలన ట్లుంచి, నాలుకప్రక్కనుంచి ఊపిరిని వదలుతే 'ఴ' అనే ధ్వని కలుగుతుంది.

మనవారు 'ఱ,ఴ' లను 'ట,ఠ,డ,ఢ'ల తోపాటు మూర్ధన్యములుగానే పరిగణించినారు. కాని, వాటి ఉత్పత్తిస్థానములనుబట్టి వాటిలో వాటికి కొంచెము భేద మున్నదని పై వివరణమువల్ల తెలుస్తుంది. 'ర'కు ఒత్తక్షరము 'ఱ' అని చెప్పడానికి వీలు లేదు.

'ఴ' ఉత్తర హిందూస్థానభాషలలో ఉన్నదని చెప్పడానికి రెం డుదాహరణములు: హిందీ: బఢ్నా-పెరుగుతుంది; బఢేలా-వరాహము. హిందీలో 'ఴ' కు ప్రత్యేక అక్షరము లేదు, గనుక దానిని 'డ్హ' అని వ్రాస్తారు. అట్లు వ్రాసినా, దానిని సంయుక్తాక్షరముగా గాక, ఏకాక్షరముగానే పలుకుతారు.

సంస్కృతములోకూడా పరుషోచ్చారణము గల రేఫమునకు ప్రత్యేకమైన వ్రాతఅక్షరములు లేకపోయినా కొన్నిసందర్భాలలో, అనగా రేఫము మరిఒకహల్లుతో సంయుక్తమై ఉన్నప్పుడు దానికి పరుషోచ్చారణ ముంటుందనిన్ని, అందుచేతనే బీభత్సరసమును వర్ణించేటప్పుడు సంయుక్తరేఫములు గల పదముల నుపయోగించవలసిన దనిన్ని ప్రతాపరుద్రీయ రత్నాపణ వ్యాఖ్యానములో ఉన్నది. ఇంతమాత్రముచేత సంస్కృతములో శకటరేఫోచ్చారణ మున్నదని చెప్ప వీలు లేదు గాని, నావాటికిని అది ప్రాకృతభాషలోనికి వచ్చినదనిన్ని, ప్రాకృతభాషలలో శకటరేఫోచ్చారణము లేదని చెప్పడము సరికాదనిన్ని అనుకోవచ్చును.

శ్రీ ఈశ్వరదత్తుగారు చేసిన ప్రశ్నకు సమాధాన మిచ్చినా ననుకొంటాను. విషయము చాలా ముఖ్యమైనది; అనేకులు కలిసి కృషిచేయవలసినది. కనుక ఈశ్వరదత్తుగారి వంటి మిత్రులు నా గ్రంథమును చదివి తమకు తోచిన సందేహములను తెలుపుతూ, తమ అభిప్రాయములను కూడా వెల్లడిస్తే భాషకు కొంతవఱకు సేవ చేసినవార మవుతాము.

డాక్టరు చిలుకూరి నారాయణరావు,
M. A., Ph. D., L. T.

పల్లెటూరివాని భ్రమ



## భావశబలత

పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

క్వా కార్యం శశలక్ష్మణః క్వచ కులం భూయోఽపి దృశ్యేత సా
దోషాణాం ప్రశమాయ మే శ్రుతమహో కోపేఽపి కాన్తం ముఖమ్,
కిం వక్ష్యన్త్యపకల్మషాః కృతధియ స్స్వప్నేఽపి సా దుర్లభా
చేతః! స్వాస్థ్య ముపైహి కః ఖలు యువా ధన్యోఽధరం ధాస్యతి?

సీ. చెడుగుకార్యంబేడ సిరియన్నకుల మేడఁ
గీ. గంటికిం గనుపడునె యాకాంత మరల?
సీ. దోసమ్ములను బాఱఁదోల నాచదువయ్యొ
గీ. అలుక బూనిన ముద్దులు గులుకు మోము
సీ. పుణ్యాత్ములగు సూక్ష్మబుద్ధు లేమందురో?
గీ. స్వప్నమందైన నాచానజాడ గాన
సీ. డెందమా! స్వస్థతఁ జెందుమా నీవింక
గీ. వాతెరం గ్రోలు ధన్యుఁడే పడుచవాఁడొ.

## వ్యవసాయ ప్రశంస

బలిజేపల్లి లక్ష్మీకాంత కవి గారు

రామా ద్యాచయ మేదినీం ధనపతే ర్బీజం బలా ల్లాంగలమ్
ప్రేతేశా న్మహిషం తవా స్తి వృషభః ఫాలం త్రిశూలం కురు,
శక్తాహం తవ చాన్నదానకరణే గోరక్షణే షణ్ముఖః,
ఖిన్నాహం హర భిక్షయా కురు కృషిం గౌరీవచః పాతువః.

ఒక్కింత మడిమాన్య మొసఁగఁడే రాముండు చెలికుబేరుఁడు బీజములకు లేఁడె
కావలెనన్న నాగలి బలుం డీయఁడే కఱ్ఱుగా శూల మక్కఱకు రాదె
అడిగిన మహిషంబు నంపఁడే ధర్ముండు జత సేయ మన మహోక్షంబు లేదె
చేని కన్నము దేరనైన నేనోపనే గొడ్డేలుటకు షణ్ముఖుండు లేఁడె
ఏల సరివారిలో నవ్వులాటలు నాకు-మాను మికనైన బిచ్చాలమాఱి బ్రతుకు
కడఁగి కృషి సేయుమనుచు నెప్పుడు నిజేశు-హెచ్చరించెడు గౌరి మిమ్మేలుఁగాక!

# అద్భుత రసము

బీభత్సమునకు తర్వాత తద్విరోధియగు నద్భుత మెనిమిదవది. అద్భుతము పీతవర్ణము, గంధర్వదైవతమును. విస్మయము స్థాయిభావము. లోకాతిగ మగువస్తు వాలంబనము. తద్గుణమహిమాదు లుద్దీపనములు. నేత్రవికాసము, స్తంభము, స్వేదము, రోమాంచము మొదలుగా గలవి అనుభావములు. వితర్కము, ఆవేగము, సంభ్రమము, హర్షము, మొదలయినవి వ్యభిచారులు.

## అద్భుతరసము (గీతము) నట్టారాగము - గజతాళము.

జయజయ రాఘవ జనకసుతాధవ నీలాంబుదతనుకాంతే,
వితరరజోఽంఘ్రిసరోజయుగళజను భవభయహారణమిషం తే.
పునరపి వర్ష్మణి మమ కరుణార్ణవ దావా దేకళ ఏతస్యాః,
కిమపి మనుష్యకలేబర మద్భుత మద్యముదిత మయి భాతివిభో.
పతికృతశాపనం నైవ వినశ్యతి సమ్యగదస్య రఘునందన యస్యాః,
అతిశయదుర్మతి సురపతిసంకృత కృత్యా త్పాతకపూర్ణాపా.
అభిశపనేన మునేః ఖలు ప్రస్తరవిగ్రహా సుభిషన మాస్తవతీ,
కథమతి వినయాత్ గౌతమతాపస కామినీతిశపము క్తయమేషా.

## అహల్యాశాపవిమోచనము

## రంగము—గౌతమాశ్రమము

(విశ్వామిత్రునితో రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

రాము—ఓయీలక్ష్మణా! ఎంత ప్రశాంతములగు ప్రదేశములు. ఇదియొక ఆశ్రమముగా నుండియుండును. మనము నిలిచియున్న దొక పవిత్రస్థలము గావలయు. వత్సా! దీనిని ప్రవేశించినంతన ప్రశాంతమును సంతోషము నీకు కలుగుట లేదా?

లక్ష్మ—అన్నా? అవును, కలుగుచున్నది. కాని యిది నిర్మానుష్యముగా నున్న దేల?

రాము—నేను నదియే ఆలోచించుచుంటిని. మంచిది, ఆవిషయమును మనగురువుగారి నడుగుదము. (విశ్వామిత్రునితో) స్వామీ! ఇదితొలుత నిదే నొకమహర్షి కావాసముగ నుండెనా! దయయుంచి తెలుపుడు.

విశ్వా—రాజకుమారా! అవును. ఇచ్చట గౌతమమహర్షి వసించుచుండెను.

రాము—ఓహో! మహర్షి గౌతములా? అయిన నిపు డదియేల నిర్జనముగ నున్నది? ఏమినిశ్శబ్దత! గాలిలో నొక పురువైనను తిరుగాడదు. అహా! ఏమివింత!

విశ్వా—రమ్మా, వానోరమ్మా. నీకోరిక దీర్చెదమ్మా.

రాము—స్వామీ! ఇదుగో వచ్చుచున్నాను. (వారొకప్రదేశమునకు బోదురు. రాము డొకశిలపై నడుగిడినంతనే యది స్త్రీరూపము గ్రహించును)

రాము—ఏమిది? ఏమిది? ఏ మద్భుతము?

లక్ష్మ—ఏమాశ్చర్యము? ఇది మానవమా లేక దివ్యమా? ఆచూపు, ఆమధుర భావప్రకాశనము అమానుషములుగ తోచుచున్నవి. ఏమి నిష్కాపట్యము! స్వామీ! మీరు సర్వజ్ఞులరు. ఇద దేమో తెలుపుడు.

విశ్వా—కుమారా! ఈమె గౌతమపత్ని యహల్యాదేవి. పతిశాపముచే శిలారూపము నంది యిపుడు నీపావనపద స్పర్శచే తొల్లిటిరూపమును గ్రహించెను.

రాము—ఈమెకథ మీవలన విన్నటులుజ్ఞప్తి. అట్టిశీలవతి కిట్టిగతి పట్టుట శోచనీయము.

లక్ష్మ—మొదట నేను దిగులుపడితిని. ఇప్పుడు సంగతియంతయు విన్నపిమ్మట మనసు కుదుట బడినది. మహర్షి యనుగ్రహమున నీనా డొకవింతను గంటిమి.

రాము—వారిసహవాసమున నీయడవియందు మనమెన్ని వింతల గనలేదు.

విశ్వా—రామా! ఇదియంతయు నీపనియే. ఈప్రపంచమునకు జీవితము నీవు. నీవలన నీసృష్టిలోనిదంతయు నద్భుతమే. నీబలముననే గ్రహములు ఆకాశమున చుట్టివచ్చుచున్నవి. ఇదియొక వింతకాదా? ఇప్పు డాకాశము స్తిమితముగ నున్నది. ఉత్తరక్షణములో మేఘములతో నిండి వర్షించును. ఒకచిన్నగింజ పెద్దవృక్షమగును. ఒకప్రాణి మరియొకప్రాణినుండి వచ్చును. నీకృత్యము లెంత ఆశ్చర్యజనకములు! [తెర.]



౮. అద్భుతరసము—అహల్యా శాపవిమోచనము



శ్రీమహావిష్ణువు - విశ్వరూపావతారము

# లైబ్రరి ఉద్యోగులు-వారి పాండిత్యము

యస్. ఆర్. రంగనాథను గారు, M. A., L. T., F. L. A.
లైబ్రేరియను, యూనివర్సిటీ లైబ్రరి, చెన్నపురి.

లైబ్రరీలలో ఉద్యోగులు విద్యావంతులుగా ఉండవలెనన్న అభిప్రాయం కొందరికి మాత్రమే. వెనుక ఒకనగరంలో పెద్ద లైబ్రరీ ఒకటి పెట్టినపుడు పక్క కార్యాలయంలో



యస్. ఆర్. రంగనాథను గారు

ఉన్న ఒక బంధువుకు లైబ్రరీ పెద్ద ఉద్యోగాల్లో ఒకటి లభించింది. ఇందుకు కారణం అతడు చాలా యోగ్యుడనీ, అతనికి లాభించే పనులు వేరే ఏవీ లేవనీ. ఇంకొక చోట జిల్లా బోర్డువారు ఒక యూనియను అధ్యక్షుణ్ణి ఆ యూనియన్ లోని లైబ్రరిలో దినం కొంతసేపు పనిచేయడానికి పదిరూపాయల జీతంమీద ఒక లైబ్రేరియనును నియమించమంటే నమ్మకం గలవాడనీ, పుస్తకాలుపోకుండ లైబ్రరీని జాగ్రత్తగా చూచుకొంటాడనీ తన బంధువునే లైబ్రేరియనునుగా ఏర్పాటుచేసినాడట. ఇటీవలనే పాశ్చాత్యుల పద్ధతుల మన్నించు పండితు డొకడు 'లైబ్రేరియనుకు మందుల దుకాణంలోఉండే సేవకునికి వచ్చిన చదువు కంటే ఎక్కువ చదువు పనిలే'దని శాసించాడు.

ఇంతకంటె ఆశ్చర్యం-ఒక విపరీతవిషయం ఏమంటే: 'లైబ్రేరియను చదువరిగా ఉండకూడ'దని. ఒకపట్టణ అధికారి కొకడికి ఒక లైబ్రేరియనుకు ఆతిథ్యం ఇవ్వవలసినట్లు తటస్థించగా అతనికిచాలాచికాకు కలిగింది. అపుడాతని చిన్న గుమాస్తా ఒకడు తానాతిథ్యంఇస్తానని చెప్ప ఆతని చీకాకు కొంత తగ్గింది. ఈ గొడవ ఏదీ యెరుగని లైబ్రేరియను తిన్నగా అధికారి యింటికిపోయి తన పేరు వ్రాసిన చీటిని అతనికి పంపినాడు ఆ చీటిలో లైబ్రేరియను పేరునకు పక్కనున్న యం. ఏ. అనే రెండు అక్షరాలనూ చూచేసరికి అధికారి చికాకంతా ఆశ్చర్యంలోకిదిగింది. ఇంకా

భోజనాలయిన తర్వాత తాంబూలాల ప్రమేయంలో అత్యురాస్యు డయిన ఆ ఉద్యోగి యొక్క ఆశ్చర్యమంతా సానుభూతితోకూడిన జాలిగామారి ఆ యం. ఏ. కు పట్టిన దుస్థితిని గూర్చి విచారంలోకివచ్చింది. ఇంతేకాకుండా 'యం. ఏ.' చదివి, తెలివి తేటలు, సామర్థ్యా సంపాదించి, గతిచూలి చివరకు లైబ్రేరియను ఉద్యోగం చేయవలసినట్లు కూర్చిన కాలవై పరీత్యాన్ని దూషించాడు. అంతటితో ఆగ లేదు. ఆ లైబ్రేరియను జీతం తన జీతానికంటె కొంత ఎక్కువని తెలిసేటప్పటికి అతని జాలి అంతాపోయి ఒక యం. ఏ. ను పాడుచేయడమే కాకుండా దేశాదాయంలో అంత సొమ్మును కూడ వ్యర్థంగా పాడుచేస్తున్నారని కోపం వచ్చిందట. ఇంతకు ఇలాటివాళ్లు ఇత డొక్కడేకాక ఇంకా కొందరుంటారనడమే మనవిషయం. ఎప్పుడూకూడ లైబ్రరీని ఎరుగనీ, మంచి ఏర్పాటుగల లైబ్రరివలన లాభాన్ని పొందనీ అందరికీ ఈ యుద్యోగి అభిప్రాయం లాంటి అభిప్రాయం ఉండడం సహజమే.

తరుచు లైబ్రరీలకుపోతూ, అక్కడ గ్రంథాలను చదివీ, తమ జీవితకాలంలో ఏదయినా విషయాన్ని గూర్చి పరిశోధనలు చేసిన వారు మాత్రం లైబ్రరి ఉద్యోగుల్లో అధమం ఒక్కడయినా తమభాషను తెలిసినవాడు గాను, లైబ్రరిలోఉండే గ్రంథముల వివరమును బాగా ఎరిగినవాడుగాను, తాము పరిశోధిస్తూ ఉన్న విషయాలన్నీ కొంచెమయిన తెలిసిన వాడుగాను ఉండవలెనని ఆశిస్తారు.

ఒకానొక పాశ్చాత్యవిశ్వవిద్యాలయం అధ్యక్షుడు అన్నాడు: "లైబ్రరి లైబ్రేరియను బోధకుడుగా ఉండవలెను. అతడికి కార్యనిర్వాహణసామర్థ్యం ఉండవలసిందే. కాని అతడు విద్యావంతుడుగా ఉండకపోతే అది కేవలం వ్యర్థమే." అని.

లైబ్రరిఉద్యోగులు మరి ఇక ఎలాటిపండితులుగా ఉండాలె? నవ్వటాలబొమ్మలాగు పత్రికల్లో ప్రకటింపబడే పండితులవంటివారు కాదు. మేమే గొప్పవాళ్లం అనే పండితమ్మన్యుల రకం వారు కాదు. తక్కువ ఉపయోగం గల విషయాన్ని ప్రత్యేకం ఎక్కువగా చదువుకున్న రకంవారు కాదు. వివేకి, వినీతుడు, విజ్ఞానవంతుడు కావాలె; విద్యార్థివలె చురుకయిన వాడయి ఉండాలె.

గ్రేట్బ్రిటను పబ్లికులైబ్రరికమిటీవారు కూడ "లైబ్రరిఉద్యోగులు, వివిధసారస్వతాల యందు సాహిత్యమూ, ఆదరమూ కలవారు గానూ, ఏయే సారస్వతంలో ఏయే గ్రంథాలు మంచివో. తెలిసికోగలవారుగాను, పాఠకులకు అవసరమైన సహాయం చేయగలవారు గాను, పాఠకులు తెలుసుకోగోరేవిషయం ఏగ్రంథంలో ఉంటుందో వెంటనే తెలుపగలవారుగాను ఉండవలె. మఱిన్ని, వారు లైబ్రరీలోని పుస్తకాలు మొదలయినవాటిని కేవలం జ్ఞానం వ్యాపింప చేయడానికిమాత్రమే కాక దానిని విస్తరింప చేయడానికిన్ని ఉపయోగించు సమర్థులయిఉండాలె" అన్నారు.

దీనివలన, విశ్వవిద్యాలయపు మామూలు పట్టము పాశ్చాత్యదేశాలలో లైబ్రరీపాఠశాల లలో ప్రవేశించుటకు సామాన్యార్హతను కలిగించేదనీ, లైబ్రరీలలో గొప్ప ఉద్యోగాలు కోరేవారికి పెద్దపట్టములు కావలెననీ, ఇటీవల సత్వరముగ అభివృద్ధి చెందుతూం డే లైబ్రరీలలో జరుగుతూండే లాగు లైబ్రరీ ఉద్యోగులు దినమూ కొంతసేపయినా అధ్యాపకత్వంలో దిట్టలయినవారికి లైబ్రరీలో వారు చేయు పరిశోధనలయందు తోడ్పాటుచేయు చుండడం అవసరమనీ తేలుతూంది. దీనిని బట్టే ఆర్నాల్డు బెన్నెట్టు 'లైబ్రరీలు పుస్తకాలకు తక్కువగను, విద్యావంతులగు ఉద్యోగులకు ఎక్కువగను సొమ్మును వెచ్చిస్తే లాభం చాలా కలుగుతుంది. లైబ్రరీలలో పుస్తకాలకు ఏకొరతా ఉండదు. కాని వాటిని చక్కగా ఉపయోగించడం తెలియకపోవడమే కొరత. విద్య, వ్యక్తిత్వంగల ఉద్యోగులుంటే ఈకొరత తీరుతుంది' అన్నారు.

[ఆంగ్లమునుండి అనువాదము]

---

## ఉపశాంతి

వేదాద్రిశిఖరాన వెలిగేటిజోతి
నాపూరిగుడిసెలో దీపమై వున్నె?
స్వర్గపుద్యానాల వాసించుపూవు
నామోటుచేతిలో నలిగిపోయేనె?
భూర్భువర్లోకాల బోయేటిపిట్ట
కటికనాకౌగిట కైదులో వున్నె?
పరమాత్ముడౌ జగద్వ్యాపి పాపాయి
ఇరుకునాగుండెలో యిమిడిపోయేనె?

*   *   *   *

## జీర్ణం జీర్ణం

వేదాద్రిశిఖరాన వెలిగిన్న జోతి
మినుకుమని కాసేపు కునికిపోయింది!
దేవలోకము నుంచి దిగినట్టెగంగ
వచ్చిన్నదారినే పట్టి మళ్లింది!
పంజరం దూరిన బంగారుపిట్ట
తలుపు గీసేవేపా తర్లిపోయింది!
కాపుర మొచ్చిన కన్న పాపాయి
యిల్లు కాళీ జేసి వెళ్లిపోయాడు!

బసవరాజు వెంకట అప్పారావు.

---



* శ్రీ సుబ్బారావుగారు—కృష్ణుడు:

ఒక సమస్యయే అయి కూరుచుండిన 'రంగగతసంగీతము' పద్యభూయిష్ఠమగు నాటకము ప్రదర్శించుపట్ల అతిమాత్రమై రక్తికి దెబ్బకొట్టుచు తన అప్రశస్తిలో దొరకిపోవును. రచనాకాలపు టభిరుచి మాటలో నాటకము తన బాధ్యత నటు ముసుగువెట్టుకో బోయినను, ఒక్కొకచో మఱికొన్ని విషయములతో పాటు తాను నటులను విమర్శను బారికి త్రోయును. అయిన ఉత్తమ నటులు తమ లోపములను తెలిసికొని సంస్కరించుకో నుత్సహింతురు.

శ్రీకృష్ణపాత్రము ధరించిన శ్రీ బెల్లముకొండ సుబ్బారావుగారు భావ ప్రకటనము మిన్నగ చేయుటకు తోడ్పడునని భావించి శాబోలు, సంగీతము కొంత ఎక్కువగ సారించిరి.

కొలువురంగమున వీరు పీఠము వీడి విచ్చలవిడిగ తిరుగుచుండుట పాత్రగౌరవమును తగ్గించును. సుయోధనుడు, నతని పరివారమును తన్ను బంధింప జూచుపట్ల కృష్ణుడు తిరుగుచు తప్పించుకొన నుద్యమించుటయు, అదేపనిగ సుయోధనుని వెల్లడిగ తిలకించుచుంటయు మున్నగు అభినయము సందర్భమునకు అదుకుట లేదు.

భీముడు నిత్యము కోపముతో ఉండవలెనను కొందఱి ఊహవలెనే, కృష్ణుడు సదా ఉల్లాసముతో నుండవలెనను ఒక చిత్రమగు సామాన్యభావన వీరికిని ఉండినట్లు కన్పట్టును. కనుమెలపునను, నిలుపునను, ప్రతి ముద్రయందును ప్రజ్ఞ ఉట్టిపడు శ్రీకృష్ణుని సహజ గంభీర ప్రకృతి, కొందఱి చేతనైన దేవదేవుడని భావింపబడ్డ అతని ఆకర్షణ, ఔదార్యములు మున్నగు ఘనభావములు ప్రసన్నతకు తోడుగ తమలో అంతగ ఒప్పకుండుటకు తామే బాధ్యులగుచో వీరు సంతసింప వలసినదే; ఏలయన, అట్లు కానిచో సంస్కారము వీరివశము గాదు.

* ఈనడుమ చెన్నపురి ఆంధ్ర మహాసభవారు శ్రీ తిరుపతి వేంకటకవి ప్రణీతమగు 'పాండవోద్యోగ' నాటకము ప్రదర్శించిరి. అందు శ్రీ బెల్లముకొండ సుబ్బారావుగారు శ్రీకృష్ణపాత్రమును, శ్రీ మాధవపెద్ది వేంకటరామయ్యగారు దుర్యోధనపాత్రమును అభినయించిరి.

వీరీపాత్రకు చిరకాలముగ పేరుగన్నవారు. రంగమున వీరు చుఱుకుదనముతో వర్తింతురు. ముఖ్యము లగు కొన్ని పట్లు జనరంజకముగ నొప్పించుచుందురు. కృష్ణుని రాజనీతి చాతుర్యముల పోకడలు స్ఫురింప జేయుటయందు వీరికి నేర్పు గలదు. కొంత ఉన్నతి నిరూపణము, భావశబలత చూపునేర్పు, ఔచిత్యపు నిండు, భావ పుష్టిని సడలింపబోని ఆలాపపరిమాణము మున్నగు మెఱుగు లవలంబించుచో వీరి ప్రతీతి యింకను మెఱుగు వాఱును.

శ్రీ వేంకటరామయ్యగారు—దుర్యోధనుడు :

అభిమానిత, తనశక్తియందును, బలము నందును మెండగు విశ్వాసము, శ్రేష్ఠ కుటుంబములోని దేరాజ్యాధికార మగుట ధర్మమైనను తన పక్షమేయను ప్రత్యయము, జయము గాకున్న స్వర్గమనియెడు వీరభావము—ఇన్ని లక్షణములతోడి దుర్యోధనుని ఉత్కటప్రకృతి శ్రీ మాధవపెద్ది వేంకటరామయ్యగారు తమలో చిత్రించిచూపుదురు. కాని, యెంత గంభీరత, అభిమానిక, ఠీవి చూపినను, కర్ణాదులతోడ నైనను ప్రసన్నమగు నుత్సాహముతో నుండి నట్లు చూపదగును. ఆహార్యము (వేష నిర్మాణము)నందు రాకుమారుని కోమలత రావలసినది రాకపోవుటకుతోడు ప్రసన్నత సుంతయు లేకపోవుటతో ఆపాత్రము చిత్రచ్ఛాయలు కొంత తత్తఱిల్లినవి.

కావుననే ఆత్మవిశ్వాసము, బెదరులేని తెగువ మున్నగు భావములు ఆమాటలు చెప్పు పట్ల కన్పడినను, సహజముగ నాతనిలో ప్రసరించియున్నవిగా కన్పట్టజాలవాయెను.

కొలువున తలిదండ్రులకు దుర్యోధనుడు తన నడవడిని గూర్చి సమాధానము చెప్పుపట్టున వీరుచక్కగ నభినయించిరి. తలిదండ్రులనుఒప్పించియే ముందు పని చూచుకొను తాత్పర్యము లేదు దుర్యోధనునకు. వారియెడ కేవల తిరస్కారభావమును కాదు,—తల్లిదీవనకుకూడ తమకపడి నాడతడు. అవసరము వచ్చినది కాన సమాధానము చెప్పినాడు. "పిచ్చిసంజయుని మాటలు విన్నది మొదలు దేవతలు కూడ పాండవులకు సహాయులగుదురని చెప్ప" తలిదండ్రుల 'ఛాందసత'కు మందలించుచు, ఉపేక్షపగుళ్లనుండి ఉబికివచ్చు వాదప్రకాశమున తన నిశ్చయమును ప్రకటించినాడు. ఆతని వాదము నకు సమంజసమగు ప్రత్యుత్తరము లభింప దెవ్వరినుండియు,—ఆత డెందులకు తనసంకల్పములు మార్చుకోవలయును? సభాస్తారులలో పెక్కురాడుమాట నిరర్థకమైనను చేకొనుట అతనికి నయింపదు. ఇట్లు కొలదిలో చిత్రితమైన యీ పెద్దపాత్రము వీరియందు చాలవఱకు సజీవముగ నొప్పును.

కృష్ణుని బంధింప యత్నించు సందర్భమున వీరి అభినయమున దుర్యోధనునందు నిశ్చయమునకంటె కొంకుఎక్కువగకన్పట్టినది. కృష్ణునంతవానిని, సంధిసేయ దూతగ పంపబడ్డ వానిని, నిండుసభయందు—అటనుండి తాను లేచిపోవుటయేకాక,—అచటిప్రాజ్ఞులగు సభ్యు

లకు గాని, తన తలిదండ్రులకు గాని అది సమ్మతముకాదని యెఱుగగల ఆతడు బంధించుటకు కొంకు గొనుట సహాజము కాకపోదు; కాని తనకు ఉచితములని నచ్చిన కొన్ని హేతువుల ప్రేరణచే కొ కును దాటి నిశ్చయము నిలుపుకొని ఆ కార్యము చేయుబోవు చున్నాడు: కృష్ణునిప్రసంగ మిష్టము కాక, ఆతని చతుర నీతిప్రక్రియకు పైయెత్తుగా,— సుయోధనుడు దుర్మార్గుడు గాన లోకముకొఱకు ఆతని వర్జింపనైనను, వధింపనైనను దగునన్న ఆతని దురుపదేశములకు ఉద్వేగముతో, కినుకతో, అభిమానముతో,—పాండవులకొకవంచనగా, తన బుద్ధికొలది ఆతని బంధించు పన్నుగడకు నిశ్చయించుకొన్న దుర్యోధనునందు, అంత మంచి సంకోచమును దాటిపోయిన దుర్బలత ఉండవచ్చుగాని, ఆసంకోచమును మీఱి ఉబికి రాక, నిశ్చయత్వమునే పొందక, క్రిందుగనున్న వెడగు వాంఛకు లొంగి సంశయాత్మతతో చరింపబోయినంతటి దుర్బలత లేదు. కృష్ణుని పొఱచూచునపుడును, ఆతనిచే చూడబడునపుడును క్రక్కిన సంకోచము నిశ్చయము పొంగులో త్రొక్కుకొన్నట్లు చూపదగును. ఆ నిశ్చయము లేకయే ఆచరించుట ఆతని ప్రకృతికి అత్తనిది.

వీరు గానప్రవీణులు కాకున్నను పద్యమును భావప్రకటనమునకు బాగుగా నమర్చుకొందురు.

వీరు తమ అభినయమున ఎడనెడ సోకుకొంచెము కఱకుదనము సవరించుకొని, ముఖ్యభావములకు స్ఫుటచిత్రణ మిచ్చుటయే కాక, సహజగంభీరముద్రలకు లోపము వాటిల్లకుండగనే భావశబలత ఇంకను సున్నితముగ మెలపుచు, పాత్ర జీవితాంశముల నిరూపణమున క్షణక్షణ జీవనలక్షణముల మేళవించుటలోను పూర్ణసాఫల్యము బడయనుద్యమింతురు గాక! కొం. జ.

---

శ్రీ శశికుమార బహదూరుగారు



వంగదేశీయుడగు సుప్రసిద్ధ నటశిరోమణి. ప్రకృతము వీరు తమ నాట్యమండలివారిని గొని అమెరికాదేశమున నాటకముల ప్రదర్శించుచున్నారు.









## శ్రీ చావలి నాగేశ్వరరావుగారి చిత్రరచనలు

శ్రీ నాగేశ్వరరావుగారు దేశనాయకుల చిత్రము లనేకములు రచించియున్నారు. వానిలో రెండవమారు పదుమూడు* వెలువడినవి. మంచి ఆర్టుపేపరుపై కలకత్తా యు. రే అండ్ సన్సువారిచే అందముగ ముద్రితములైన యీ వర్ణ చిత్రములు రచయిత సామర్థ్యమును బాగుగ వెల్లడించుచున్నవి. సంస్కృతి పోకడలు కళలలో ప్రతిబింబితము లగుట సభ్యజాతులపట్ల చూడనగు లక్షణ మగుటకు ఈచిత్రములు నిదర్శనము లగుటయే కాక, ఆసంస్కృతిలో ఈప్రత్యేకకళాసంపద యే పరిపాకమున వెలయుచున్నదో సూచింపగల రచనలలో చేరి, ఆంధ్రుల కౌశలమునకు ప్రతీతి సంపాదించుచున్నవి దండియాత్ర సందర్భమున గమనించి రచించిన మహాత్ముని చిత్రము(ఇది పెద్దది;ఇందు మహాత్ముని వ్రా లున్నవి) ఆయన ప్రసన్నతను, ఉత్సాహమును, దీక్షాపరత్వమును చూపుచు నాటి మహాత్మునిముద్రకు చిరస్థాయిత కల్పించుచున్నది. ధర్మహావిస్సయిన జతీంద్రనాథుని చిత్రమును ప్రసన్నగంభీరత నిరూపించుచు అందముగ నున్నది. ఇట్లు ప్రఫుల్లచంద్రరాయి, లాలా లాజపతరాయి, కస్తూరీబాయి మున్నగు ఇతర చిత్రములును సజీవముగ నున్నవి.

భావ ప్రధాన మగు ప్రాచ్య ఫక్కీకి (Oriental Style అనబడుదానికి) చెందినది కాదు కాన వీరిరచన సజీవతతోను, వర్ణసామరస్యముతోను ఒప్పుచు, నైజవైఖరులు సహజముగ, రమ్యముగ ప్రదర్శింప గలది యని చెప్పిన చాలును.

౨౧ × ౧౬ సైజు — ౫ అ. చొప్పున

౧3 × ౧౦ ,, — ౨ ,, ,,

ప్రకాశకులు: ఆంధ్ర చిత్రశాలవారు, లక్ష్మీభవన్, గుజ్ దర్ పార్కు, బొంబాయి ౨.

కొం. జ.

---

* 1 మహాత్ముడు (దండియాత్రనాటిది), 2 ప్రఫుల్లచంద్రరాయి, 3 మౌలానా అబుల్ కలాం ఆజాదు, 4 అబ్బాస్ తాయేబ్జీ, 5 శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి, 6 కే. యఫ్. నారిమను, 7 శ్రీమతి వసంతాదేవి (సి. ఆర్. దాసుసతి,) 8 జతీంద్రనాథదాసు, 9 (a) సర్దార్ భగత్ సింగు, (b) బటుకేశ్వరదత్తు, 10 లాలాలాజపతరాయి, 11 శ్రీమతి కమలాదేవీ ఛటోపాధ్యాయ, 12 శ్రీమతి కస్తూరీబాయిగాంధి, 13 జే. యం. సేనుగుప్త.

## అష్టరస చిత్రములు

శ్రీ రాజా సౌరీంద్రమోహన టాగూరు గారు, 'The Eight Principal Rasas of Hindus' అను పేరున నొక గ్రంథమును ఆంగ్లమున ౧౮౮౦-వ సం.న కలకత్తానగరమునందు ముద్రించి ప్రకటించినారు. రూపకభేదములు, శృంగారాదిరసములు, స్థాయ్యాదిభావములు, తత్తద్రసానుగుణములగు రాగనృత్యాదులు, నాటకరంగము, ప్రేక్షకులు మొదలగువాని లక్షణాదులను నాట్యాలంకారశాస్త్ర గ్రంథములనుండి యుద్ధరించి యందు కూర్చినారు. శృంగారాద్యష్టరసముల స్వరూపములను చిత్రింపజేసి యాచిత్రముల నందుచేర్చినారు. అవి ప్రసిద్ధ నాటకములయందలి తత్తద్రసనిష్పాదకములగు పట్టులగలభావమును పురస్కరించుకొని చిత్రింపబడినవి. ఆపట్టుల ఆంగ్లానువాదము, తత్తద్రసానుగుణములగుసంస్కృత గేయములు సస్వరముగ నందు ముద్రితములయినవి. ఈసంచికయందు ఆచిత్రముల ప్రతికృతులు, తద్రచన కాధారములగు పట్టుల ఆంధ్రానువాదము, గేయములు, రససామాన్య విచారము, శృంగారాదిరసముల లక్షణాదులు* మొదలగువాని వివరములతో చేర్పబడినవి. ప్రతి రసమునకు జెందిన సాహిత్య మా రసచిత్రమునకు ముందుపుటలయందున్నది. ముద్రిత గ్రంథము చెన్నపురి కన్నిమరా లైబ్రరిలో నున్నది. రౌద్రరసచిత్రముమాత్ర మందు కానరాలేదు. రససామాన్యవిచారము, రౌద్ర రస చిత్రమునకు సంబంధించిన సాహిత్యమీ క్రింద గలదు. ఈ గ్రంథముప్రతి యింకొకటి లభింప దయ్యెను. లభించినపుడా చిత్రమును ప్రకటితము కాగలదు.

## రస విచారము

'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః.'

విభావాదులు భావములు. సుఖదుఃఖాది స్థాయి భావములకు రసత్వము నాపాదింపజేయు మానసవికారములు భావములు.

'సుఖదుఃఖాదికై ర్భావై
ర్భావ స్తద్భావ భావనమ్.'

సుఖము శమము, దుఃఖము శోకము; ఆదిపదముచే రత్యాదుల బరిగ్రహించునది. అంతఃకరణవృత్తిరూపములగు నీభావములు సంస్కారరూపమున చిరకాలము నిలుచుటచేతను, రసప్రతీతికాలపర్యంత మను సంధింపబడుటచేతను స్థాయిభావములని వ్యవహరింపబడుచున్నవి. నిర్వేదాదివ్యభిచారిభావములును వాసనారూపములే యయినను తదభివ్యక్తి విద్యుదుద్యోతప్రాయమగుట నవి స్థాయిభావములు కాలేవు. ఈ స్థాయిభావము లెనిమిది. శమము నవమము నన్నదందురు కాని దానికి నాట్యమున విశేషపరిపోషము లేదు.

'అష్టౌ నాట్యే రసాః స్మృతాః'

అని ఆలంకారిక ప్రకాండులుకూడ. ఏతద్విషయములగు వాదోపవాదముల నిందు బొందుపరచుటకు తావుచాలదు. పైగా చర్వితచర్వణముకూడ నగును. దానినంతయు వదలి సామాన్యముగు అష్టత్వవాదమునే మనము నంగీకరింతము. అవి—

రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము ననునవి.

పాలెటు లామ్లయోగమున దధిరూపముగ పరిణమించునో, అటు లీస్థాయిభావములను కావ్యోపస్థాపి

* అనువాదము, రససామాన్య విచారము, శృంగారాది రసముల లక్షణాదులు 'ఆచార్య' కర్తృకములు.

తము లగు విభావానుభావవ్యభిచారిభావముల సంయోగముచే చిదానందస్వరూప మంది రసరూపమున పరిణమించును. స్తంభాదిసాత్త్వికములు రసఘటకములే యయినను అనుభావరూపములే యగుట వాటికి వేరుగ సూత్రమున నిర్దేశము కానరాదు. ఇక విభావాదుల స్వరూపము—

విభావములు—

రత్యాది స్థాయిభావముల ఉద్బోధకు కారణములగునవియే కావ్యనాట్యముల విభావము లనిపించుకొనును.

'విభావః కథ్యతే తత్ర రసోత్పాదనకారణమ్'

ఆ కారణములును రెండువిధములు. ఆలంబనములు, ఉద్దీపనములు నని. రససమవాయికారణము లాలంబనములు. వీటినాశ్రయించియే రసము ప్రాదుర్భవించును. తదితరకారణజాతి ముద్దీపనవిభావము. ఇది రసోద్దీపకమగును. ఇది నాలుగు విధములు: ఆలంబనగుణములు, తచ్చేష్టలు, తదలంకరణములు, తటస్థములు నని. రూపయౌవనాదు లాలంబనగుణములు; యౌవనజనితము లగు హావభావాదులు చేష్టలు; నూపురాంగదాదు లలంకరణములు; దేశకాలములు, చంద్రచందనకోకిలాలాపాదులును తటస్థములు. ఈ కారణజాత మంతయు రసమునకు పరిపోషాతిశయమును గూర్చును.

అనుభావములు—ఆలంబనములచేతను, ఉద్దీపనములచేతను అంతరుద్బుద్ధ మగు రత్యాదికమును వెలువరచి ప్రకాశింపజేయున వనుభావములు. అవి కార్యరూపమున నుండును శరీరజము లగు కటాక్షాదు లిందు జేరును.

'భ్రూవిక్షేపకటాక్షాదివికారో హృదయస్థితమ్,
భావం వ్యనక్తి యస్సోయ మనుభావ ఇతీరితః.'

కటాక్షాదులవలె సాత్త్వికములును కార్యభూతములును, భావసంసూచకములు నగుట అనుభావములే యగును కాని సత్త్వమాత్రోద్భవము లగుటచే భిన్నములుగా పరిగణింపబడును.

'పృథగ్భావా భవంత్యన్యే
ఽనుభావత్వేపి సాత్త్వికాః.
సత్త్వాదేవ సముత్పత్తే
స్తచ్చ తద్భావ భావనమ్.'

సత్త్వమువలన నిర్వర్తింపబడునవి సాత్త్వికములు. అభినయాదిద్వారా పరగతసుఖదుఃఖాదిభావనయందు అత్యంతానుకూలమగు నంతఃకరణత్వము కలిగియుండుట సత్త్వము. ఖిన్నుడగుచో నశ్రువులను, ప్రహృష్టుడగుచో రోమాంచమును నిర్వర్తింపజేయుటయే సత్త్వము కలిగియుండుట. దీనివలన కలుగు భావములు సాత్త్వికములు. కాన విభావాదిదర్శన జన్యములగు నను రాగనిర్వేదాదిమనోవృత్తులు విభావాదితన్మయీభవనరూపమగు సత్త్వముచేతను, సామాజికమానసాత్యంతానుకూల్యజన్య మగు నసాధారణకారణముచేతను అవస్థాంతరమునుపొంది స్తంభాదు లయి సాత్త్వికము లగుచున్నవి. అవి—

'స్తంభః ప్రళయరోమాంచౌ
స్వేదో వైవర్ణ్యవేపథూ,
అశ్రువైస్వర్యమిత్యష్టౌ
సాత్త్వికాః పరికీర్తితాః.

(స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథువు, అశ్రువు, వైస్వర్యము.) అనునవి.

వ్యభిచారిభావములు—

సాగరమందు కల్లోలములవలె రత్యాదులం దావిర్భావతిరోభావములచే రసపరిపోషమునకు సహకారకములయి తాదాత్మ్యము నందునవి వ్యభిచారిభావములు. అవి ముప్పదిమూడు. ఇంకను ఎక్కువగకూడ నుండును. కొన్ని స్థాయిభావములే ఒకొకప్పుడు వ్యభిచారు లగును. హాస్యక్రోధాదులు శృంగారమం దట్లు. అవి—

'నిర్వేదావేగదైన్యశ్రమమదజడతా
ఔగ్ర్యమోహౌ విబోధః,
స్వప్నాపస్మారగర్వా మరణ మలసతా
మర్ష నిద్రావహిత్థాః,
ఔత్సుక్యోన్మాదశంకాః స్మృతిమతిసహితా
వ్యాధిసంత్రాసలజ్జా

హర్షాసూయావిషాదాః సధృతిచపలతా
గ్లాని చింతా వితర్కాః.'

(నిర్వేదము, ఆవేగము, దైన్యము, శ్రమము, మదము, జడత, ఉగ్రత, మోహము, విబోధము, స్వప్నము, అపస్మారము, గర్వము, మరణము, అలసత, అమర్షము, నిద్ర, అవహిత్థ, ఉత్సుకత, ఉన్మాదము, శంక, స్మృతి, మతి, వ్యాధి, సంత్రాసము, లజ్జ, హర్షము, అసూయ, విషాదము, ధృతి, చపలత, గ్లాని, చింత, వితర్కము.) అనునవి.

కావ్యోపాత్తములో, అభినయోపదర్శితములో అగు నిట్టి విభావానుభావవ్యభిచారులచే శ్రోతృప్రేక్షకుల అంతఃకరణమున విపరివర్తమానమగు రత్యాదిస్థాయి భావము నిర్భరానందసంవిదాత్మతను పొందింపబడుచు రసమగును. ఈ రసము అనుకార్యగతమును కాదు, అనుకర్తృగతమును కాదు. కేవలసహృదయగతము. ఇట్టి రసము లెనిమిది.

'శృంగారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః,
బీభత్సాద్భుత ఇత్యష్టౌ రసాః......'

(శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము' వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము, అనునవి.*

## రౌద్రరసము

కామ మర్థజన్యము కాబట్టి అర్థప్రధాన మగు రౌద్రము నాలవది ఇది రక్తవర్ణము కలదిగను, రుద్రదేవతాకము నగును. క్రోధ మిందులకు స్థాయిభావము. శత్రువు లాలంబనములు. వారిచేష్ట లుద్దీపనములు. ముష్టిప్రహారములు, ఖడ్గచ్ఛేదము, సంగ్రామము మొదలగునవి వారిచేష్టలు. భ్రూవిభంగము, ఓష్ఠనిర్దంశము, బాహుస్ఫోటనము, తర్జనము, ఆత్మావదానకథనము మొదలుగా గలవి అనుభావములు. మోహము, అమర్షము, మదము, ఉగ్రత, గర్వము మొదలగునవి వ్యభిచారులు

## రౌద్రరసము (గీతము)

తురష్క-గౌడరాగము-వసంతతాళము.

నృపతికలంక మనుజకీట పామర ధృతదుర్మతే,
విక్రయ మయిపశ్య తపసి మహతి మయి సవారతే.

దేవాసురమనుజవార దుస్సహ మతిదారుణమ్,
త్వాం స్మరమివ భస్మయామి గిరిశ, ఆత్మమోహనమ్.

భువననాశ నిపుణశక్తి మవిరత మవగచ్ఛ రే,
కుపితహృదయ కుశికతనయ మమరీకృత మధ్వరే.

భావత ఇతి వహ్నిమూర్తి రేవ కోపపూరితః,
కౌశికేయ ఇషుధరకర మవనినాథ మగ్రతః.
నాఽనగమ్య భర్త్సయంతి మము మపి నియమాన్వితమ్,

భృశ మముష్య నికటవర్తి లలనాత్రయరోదితమ్.
అభినిశమ్య సమవగమ్య హంతు మంగనాగణమ్,
కృతమతిమతికఠిన మేవ తంత్రిశంకుభావనమ్.

## రౌద్రరసము

### విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని శపించుట

### రంగము—విశ్వామిత్రాశ్రమము

(విశ్వామిత్రుడు యోగాసనమున కూర్చుండియు, ముగ్గురు దేవకన్య లేడ్చుచును ప్రవేశింతురు)

మొదటి—దయామయా! హరిశ్చంద్రా! ఇపు డెక్కడ నున్నావు?

రెండవ—రాకుమారా! రమ్ము, మాగతిని తిలకింపుము. ఈపాపి మమ్ములను బందీలనుగా గొనితెచ్చెను. రమ్ము, మమ్ము రక్షింపుము. మేము దేవతకు బలి కాబోవుచున్నాము.

మూడవ—దయామయా! ఎక్కడనున్నావు?

(హరిశ్చంద్రుడు ప్రవేశించును)

హరిశ్చ—(దేవకన్యల సమీపించి) ఏమిసంగతి? భయపడవలదు. ధైర్యమూనుడు. మిమ్ము వీనిబారినుండి

* వీని వివరము (రౌద్రరసము తప్ప) ప్రత్యేకము ఆయారసచిత్రముల సాహిత్యముతో చేర్చబడినవి.

తప్పింప వచ్చితిని. దీని కంతకును కారకు డెవడు? (ముందుచూచుచు) ఓ! ఇదిగో ఆపాపి. ద్రోహీ! అనాథలగు కాంతలను సంహరింపబూనెదవా? ఇది నా రాజ్యమని యెఱుగవా? దౌర్జన్య మిచ్చట పనికిరాదని తెలియదా? మూఢభక్తిచే జేయుదుష్కృత్యములనెల్ల నాశ మొనర్చుట నా పని యని యెఱుగవా? కాని యీ దుష్కృత్యమునకు ఫలమనుభవింతువు. నీ వీ యనపరాధలను హింసించుటకుముందే నీ మాంస మగ్నికాహుతి యగును. వంచకా! నీకు వస్త్రములు నారచీరలా? రుద్రాక్షమాలలా? జటలా? కండ్లుమూసుకొని మంత్రము లుచ్చరించుటయా? పాపీ! నా యాయుధమున కెర యయితివి. (కత్తినిఝళిపించును)

విశ్వా—(అత్యాగ్రహమున) నాతపస్సు నీవిక మున భంగపరచువా డెవడు?

(ఆసనమునుండి లేచును)

దేవకన్యలు—జయము హరిశ్చంద్రునకు – రాకుమారునకు జయము.

(పరుగువడుదురు)

విశ్వా—(హరిశ్చంద్రుని చూచుచు) హరిశ్చంద్రా! త్రిశంకుతనయా! హరిశ్చంద్రుడవు కమ్ము, త్రిమూర్తులలో నొకడవు కమ్ము. ఇదిగో నిన్ను శిక్షించుచున్నాను. నాకోపమున కాహుతియయితివి. నేను తపస్సు చేయుచుండ భంగపరుప వచ్చితివా? బుద్ధిహీనుడా! నీగర్వము నడంతును. (తనలో) నేను వీనిని శిక్షించు టెటులు? (ఎడమచేతిని విల్లుపైనుంచి, హరిశ్చంద్రుకంపింప కుడిచేతి నెత్తును) ఆయుధమునపైనను సరియే, శాపమునపైనను సరియే వానిని శిక్షించి తీరవలయును. (నడుముకట్టను విడిచి యుద్ధముజేయ సన్నాహపడును. ఘురల కొంత ఆగును). అవును. శివుడు క్రోధాగ్నిచే మన్మథుని భస్మ మార్చినటులు నేనును ఈ యధికప్రసంగిని శిక్షింతును.

[తెర]

## భారతీయమహిళామండలి




శ్రీ టి. యన్. పంకజమ్మగారు

ఈమె డాక్టరు వి. ఆర్. నటేశనుగారి సతి. ఈమె విశాఖపట్టణము మునిసిపలుసంఘమున సభ్యురాలుగా నియమింపబడెను.



## ఆముక్తమాల్యద - శ్రీకాకుళశాసనము

శ్రీకృష్ణదేవరాయలు "మున్ను కళింగదేశ విజిగీషామనీషన్ దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపంబోయి హరివాసరోపవాసం బచ్చటం గావింప నప్పుణ్యరాత్రచతుర్థయామంబున" అని ఆముక్తమాల్యద పీఠికలో నా గ్రంథనిబంధన ప్రారంభక్రమమును దెల్పుకొనెను. ఆ హరివాసర మెప్పుడు జరిగెనో నిర్ణయింప గలిగినచో మనము మహాప్రబంధ నిర్మాణక్రమమును దెలుసుకొనిన వార మగుదుము.

ఇప్పటికి పదిపండ్రెండేండ్ల క్రిందట కీర్తిశేషులైన శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు శ్రీకృష్ణరాయల శ్రీకాకుళశాసన మొక్కటి Elliot Collections లో నుండగా దానిని ప్రకటించి వారు హరివాసరోపవాసకథను చరిత్రాత్మకమైన యొక్క నూతనాంశముగ విస్పష్టము గావించిరి. అందులకు వారికి ఆంధ్రలోకము కృతజ్ఞతాపూర్వకవందనము లెన్ని యిచ్చినను ఋణము తీర్చుకొనలేదు.

ఈమధ్య దొరతనమువారు దక్షిణహిందూదేశ శాసనములను ప్రచురించుచు, నాల్గవసంపుటమునం దీ శ్రీకాకుళశాసనప్రతిని ప్రచురించిరి. ఆశాసనమంతయును, శ్రీలక్ష్మణరావుగారిచ్చిన నకలును చివర వ్రాసియుంటిని. చదువరులు చూడదగును.

## కుంభ సంక్రమణకాలము

శాసనములు రెంటిలో రాయలు కుంభ సంక్రమణకాలము నందు శ్రీ కాకుళాంధ్రదేవునకు గావించిన ధర్మశాసనము విషయము కలదు. ఆ శాసనముల ప్రకారమె రాయలు శ్రీకాకుళాంధ్రవిష్ణువును కుంభ సంక్రమణ పుణ్యకాలమునందు సేవించి, దానశాసనమును వ్రాయించెను. కావున రాయలు శ్రీకాకుళమున నున్నది కుంభ సంక్రమణ పుణ్యదినముకాని, ఆ శాసనకాలమైన ఫాల్గున శుద్ధ దశమీ శనివారముకాని, ఫాల్గుణ శుద్ధ ఏకాదశీ శుక్రవారముకాని కాదు. * ఆముక్తమాల్యదలో రాయలు శ్రీకాకుళనికేతను సన్నిధిని హరివాసరోపవాసమును గావించెనని చెప్పుకొనెను. అది సత్యమే. మనకు దెలిసినంతవరకు రాయలశాసనము శ్రీకాకుళాంధ్రనాయకున కిచ్చినది యొక్కటియే కన్పట్టుచున్నది.

## కుంభసంక్రమణ పుణ్యకాలము - హరివాసరము

కుంభసంక్రమణ పుణ్యకాలము-హరివాసర మొక్క దినముననే సంభవించెనేమో యని లెక్కవేసి చూడంగా, నారెండు పుణ్యదినము లొక్కదినముననే కలిగెను. బహుధాన్యనామసంవత్సరము (క్రీ. శ. 1519) కుంభ

* గవర్నమెంటువారి శాసనపునకలు ప్రకారము ‘ఫాల్గుణ శుద్ధ దశమీ శనివారము. ఎల్లియాట్ ప్రతి ఫక్కని ఫాల్గుణ శుద్ధ ఏకాదశి శుక్రవారము.

సంక్రమణ పుణ్యదినము 27-1-1519 తేదీయగుచున్నది. ఆనాఁడే, బహుధాన్యనామసంవత్సర మాఘబహుళ ఏకాదశి యయ్యెను. ఆదినము గురువారము. విష్ణుపాద సంక్రాంతియు, విజయ ఏకాదశియు నొక్కదినమే యయ్యెను. ఆనాఁడే శాసనము ప్రకారము రాయలప్పటి నుండి, లక్ష్మీవల్లభుఁడైన ఆంధ్రభూవల్లభునకు రాయలు దానములు గావించి, హరివాసరోపవాసమును గావించెను. ఆనాఁటి చతుర్థయామముననే స్వామి విజయనగర సామ్రాజ్యాధీశునకు స్వప్నములో సాక్షాత్కరించి గ్రంథ నిబంధనమున కారంభింపుమని యానతిచ్చెను.

శ్రీ లక్ష్మణరావుగారు శాసనకాలమైన (వారెత్తిన శాసనప్రతి ప్రకారము) ఫాల్గుణ శుద్ధ ఏకాదశియే రాయలుగావించిన హరివాసరోపవాసదినమని వ్రాసిరి. అదికాదని తెలిసికొన్నాఁగము. దొరతనమువారి ప్రతి ప్రకారము శాసనకాలము ఫాల్గుణ శుద్ధ దశమి శనివారము. దొరతనమువారి ప్రతిప్రమాణమో, ఎల్లియాట్ దొరగారి నకలు ప్రమాణమో నిర్ణయించుట దుర్ఘటముగానున్నది. నేను లెక్కవేసిచూడఁగా బహుధాన్యనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ ఏకాదశి గురువారమయ్యెను కాని, శుక్రవారము కాలేదు. దశమి బుధవారమయ్యెను కాని, శనివారము కాలేదు. శాసనకాలము తిథివారములలోఁ బరస్పరవ్యత్యాసమును గలిగియున్నవి. మిగిలినదంతయు సమానమే. శాసనప్రతుల నీ క్రింద నిచ్చుచున్నాఁడను:

No. 981. of South Indian Inscriptions, Vol. IV.

౧. శుభమస్తు-హరేర్లీలావరాహస్యదంష్ట్రా దండ స్సపాతువః, హేమాద్రికలశో యత్ర ధాత్రీచ్ఛత్ర శ్రియ[ం]దధౌ, స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహనశర్షంబ్బులు ౧౪౪౦ [అగు నేంటి] బహుధాన్య సంవ్వత్సర ఫాల్గుణ శుద్ధ ౧౦ శ. శ్రీకాకుళపు తెలుంగ్గ రాయలకు శ్రీమ(ం)న్మహారాజాధిరాజరాజశ.

౨. రమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీ కృష్ణరాయ మహారాయలుంగారు దండ్డం సమర్పించ్చియిచ్చిన ధ(ం)ర్మశాస[న]ము స్వామిని కుంభిసంక్రమణ పు(ం)ణ్య కాలమండ్దును దర్శించి స్వామి కీ కొండపల్లి సీమకుం జెల్లి వచ్చిదేవరపుం గోటస్థలంలోపలి జార్లగడ్డ [గ్రా]మం ౧న్ని మేడూరుస్థలంలోపలి దేవరలంక్కపల్లి గ్రామం ౧న్ని దేవర.

3. పల్లిగ్రామం ౧న్ని శ్రీకాకుళానుస్వామికి ప్రతిగ్రహలబ్ధమైన దళకదొడ్డింగ్ని క్రయలబ్ధమైన సత్రాల భూమి, తోంటలు, నిత్యవసరాలు, శ్రీరామానుజకూటము, ద్వాదసులు సహితమైన భూమి(ం)న్ని క్రొత్తలంక, చింతలంక్క, పుంద్రేకులపింట్లు పులుగుదు లంక్క, క్రో.

౪. మూరనుం జెల్లినచ్చి కంచ్చాల దొడ్డింన్ని కొండవీటిశీమలోని పెదగాడిద పట్టుంను వినికొండ్డ శీమలోని మధుమంచ్చిన్ని స్వామిసంన్నిధిని ధారాపూర్వకంగాను స్వామినిత్యనైవేద్యాలంకు (ం)న్ను (అ)ంగ్గ రంగ్గవైభవాలకున్ను యీ (ధర్మ)......ంగారి వశానను తెలుంగువల్లభునికి స.

౫. మర్పింస్తిమి గనక ఆచంద్రార్కస్థాయిగాను అవధరించ్చిది. స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం పరదత్తాపహారేణ స్వదత్త(ం) నిష్ఫలంభవేత్. యీధ(ం)ర్మానకు యవ్వరు తప్పినాను గంగలోను గోవు బ్రాహ్మణవధ చేసిన పాపానంబోదు వారు.

౬. యీ అయిదు గ్రామాలు(ం)న్ను శ్రీవల్లభునికి సమర్పించి యీ అయిదుగ్రామాల ఆయంల్లాను శేశిన నిత్యనైవేద్య కట్టెడ దద్యోవంపళాలు ౪ అకా (శ) ప్రసాదంపళ్యాలు ౪ అప్పాలు ౨౬. కి పళ్లెం ౧ అతిరసాల పళ్లెం వడలిపళ్లెం ౧ యిడెనకు(తు)ముల పళ్లెం ౧ పప్పు

౭. కూరకూరలు నెయి పెర్గు పచ్చళ్లు ఊరంగాయలతోడను అరగించ్చి పళ్లెలు ౬ం న్ని ఆనవాల ప్రసాదం పళ్లెలు ౨ వెరశి అరగించ్చి ౭౪ డెబ్బది నాలిగింట్టికి పళ్లెం ౧ కి అముతుపడిన లెఖ్కను కస్తూరి కర్పూర పరిమళ సహితగంధం పలాలు 3...........

శ్రీ లక్ష్మణరావుగారెత్తిన నకలు క్రిందను బొందుపఱచుచున్నాఁడను. ఈ భాగము తప్ప రెండు శాసనములును మిగిలిన విషయములం దొకటిగానే యున్నవి.

## శ్రీ లక్ష్మణరావుగారికిచ్చిన శాసనము

శుభమస్తు హారేర్లీలావరాహస్య దంష్ట్రాదండస్య పాతువః హేమాంకలశాయిత్ర ధాత్రీఛత్రశ్రియందశా. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౦ అగునేటి బహుధాన్యనామసం॥ర ఫాల్గుణ శుద్ధ ౧౧ శుక్రవారం శ్రీకాకుళపు తెలుగరాయనికు శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలుంగారు [illegible] సమర్పించి యిచ్చిన ధర్మశాసనం. * ............

---

## కెమలుపాషా

అయ్యది ౧౯౧౯ సంవత్సరము జూను ౨౦ వ తేది. టర్కీసుల్తాను రిజయతుల్లాఖాను తన రహస్యాలోచన మందిరమున నటునిటు పచారొనరింపుచు సేనా



కెమలుపాషా

నాయకుడైన కెమలుపాషాకు కబురంపెను. సుల్తాను తెలివిగల పరిపాలకుడు కాడు అంతియగాక భోగలాలసుడు. పరిపాలనమంతయు మంత్రుల హస్తగతమై యుండెను. వారెల్లరు స్వార్థపరులై యమితముగ పన్నుల విధించి ప్రజలబాధించుచుండిరి. 'యథారాజాతథాప్రజా' యను విధంబున వారుకూడ భోగలాలసులై నృత్యగీత వాద్యముల యందనురక్తులై మదిరాసక్తులై కాలముగడుపుచుండిరి. ఇక సుల్తానుసంగతి వివరింపనక్కరయేలేదు. ఎంతసేపును తనజనానాయందు ప్రేమించి ద్రాక్షాసవమును త్రాగి రంభోర్వశులమించు అందకత్తియలతో జలక్రీడలాడుచు, సంసారచోనైపుణిని ప్రకటించుచు మహదానందమున నోలలాడుటయే యతనిపని. ఇతని పరిపాలన క్రింద టర్కీదేశము మిక్కిలి హీనస్థితి కరుదెంచెను. విదేశీయులెల్లస్థలముల నాక్రమించి, తమ వర్తకశాలల స్థాపించి, దేశమునందలి ధనప్రవాహమును తమ దేశములకు గొంపోవుచుండిరి. రానురాను చేతిపనులు సన్నగిల జొచ్చెను. దారిద్ర్యము, కాటకము ప్రబలజొచ్చెను. టర్కీదేశము పాశ్చాత్యులచే "యూరపుదేశమునందలి జబ్బుమనిషి"యను దుర్యశమునకు పాల్పడియెను.

ఇట్టి క్లిష్టపరిస్థితులయందు టర్కీదేశ మొనరించుకొనిన పూర్వపుణ్యావశంబున కెమలుపాషా టర్కీసైన్యమునకు సేనాధిపతియగుట తటస్థించినది. టర్కీసేనాధ్యక్షుడగు కెమలుపాషా యువకుడు. దేశభక్తి యతనికుగ్గుపాలతో బెట్టబడినది. టర్కీదేశముయొక్క పూర్వపు ఔన్నత్యము నాతడు దేశచరిత్రలయందు పఠించి కంటతడిపెట్టి టర్కీని పూర్వపు ఔన్నత్యమునకు గొనిరా ప్రతిజ్ఞగైకొనియెను. టర్కీసుల్తానుయొక్క యవినీతికరమగు పరిపాలన, మంత్రులస్వార్థపరత్వము, దుర్భరమగుపన్నులు, విదేశీయులవర్తకపు పోటీ మొదలగువాని వలన దేశములో విప్లవము చెలరేగినది. టర్కీదేశమునందలి అనటోలియా ప్రదేశమున మొదట నీవిప్లవాగ్ని బహిర్గతమైనది. టర్కీసుల్తాను కెమలుపాషాకు కబురంపించి యిట్లుపలికెను.

"చండవిక్రమమగు టర్కీసేనల బరోపాసంగ్రామమున విజయవంతముగ నడిపించిన సైన్యాధ్యక్షా! నా ప్రియమగు కెమలుపాషా! బాస్పరసుసరోవరతీరమున

* లక్ష్మణరాయవ్యాసావళి - ఆముక్తమాల్యదరచనా కాలము.

నిర్మితమైన యీ యిల్డిజు రాజభవనము భవదీయవిక్రమ పరిరక్షితము. నేడు టర్కీదేశమును విప్లవాగ్ని బారి నుండి రక్షింపగలిగినది భవదీయ బాహుబల శౌర్యమే. నీవు అనటోలియాంతరంగమున కరిగి వలసినచో విదేశీయుల సాయమునుగొని యీ విప్లవాగ్ని బారినుండి టర్కీ నుద్ధరింపుము." అనియెను.

బాస్ఫరసు సరోవరతీరమున కాలియొడ్డున విడిసియున్న విచిత్రమందలి యుద్ధనావలగాంచి మనమున రేకెత్తుచున్న కోపాగ్నిని అనునయించుకొని "దేవా! ఈ తరుణమున నేను నిమిషమైన నాలస్యమొనరింపకుండ అనటోలియాకరుగుటయే యుత్తమంబు" అని విన్నవించి తన యంగరక్షకునితోడ గూడ యిల్డిజు రాజభవనమును వీడి యింటికేగి తల్లికడను, చెల్లెకడను సెలవుగైకొనియెను. తనమోటారుకారు నెక్కి సరోవరతీరమునందలి నౌకాశ్రయమును చేరదలంచుచుండ నతని యిరువురు మిత్రు లరుదెంచి "మిత్రమా! నేడు నీ వరుగవలదు. విదేశీయులును విప్లవకారులును నిన్ను అనటోలియాయందలి సాంసను నగరమును చేరనీయరు సుమా? ఎందులకు వృథాగా ప్రాణముల గోల్పోయెదవు!" అనిన వినక వారిమాటలనవలద్రోచి నౌకాశ్రయమును జేరి నావికులబిలచి "ఓ నావికసోదరులారా! నేను టర్కీయొక్క భావిక్షేమము మీపై నాధారపడియున్నది. ఈ తరుణమున మీలో నెవరైన ప్రాణముల గోల్పోయెదరేని వారి కుటుంబములకేలోటు లేకుండ జీవితాంతము వరకు నే పోషించెదను. మీపుత్రు లుచితవయస్కులైన వెంటనే సేనయం దుద్యోగములనిచ్చెదను. ఈనౌకను నాభటులతో మీ రానలియొడ్డును చేర్పవలయును" అనిన విని వారలు "దేవా! మాప్రాణముల మేము లెక్కపెట్టము. మా కుటుంబము లిక దేవరవారికి చెందినవియే. మిమ్ముల తప్పక మా ప్రాణములనొడ్డియైన యవలదరిచేర్చెదము. వెంటనే నౌక నధిరోహింపు" డని వా రెల్లర నెక్కించుకొనిరి. వారెల్లరు నౌక యడుగుభాగమున బరుండిరి. నావికులు తెడ్ల వేయజొచ్చిరి. విదేశీయులు వీరిపై తుపాకులగాల్చ జొచ్చిరి. ఒక నావికునకు దెబ్బతగిలి మృతినందిన వెంటనే వానిస్థానము నింకొకడుపూర్తి యొనర్చి నౌక యిట్లు అమందగతిని యానలియొడ్డునకు గొంపోయిరి. నాడట్లు నిశ్చలభక్తిచే టర్కీసామ్రాజ్యముకొరకై యసువుల నర్పించిన దేశభక్తులగు నావికులసంఖ్య పందొమ్మిది. వారి నామములు టర్కీదేశచరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపబడి యున్నవి. వారి కుటుంబము లిప్పు డత్యంతయున్నతస్థితియందున్నవి. వారిజ్ఞాపకార్థమై దివ్యమైనపురమందిర మొకటి నేడు టర్కీ ప్రధానపట్టణమగు కాంస్టాంటినోపిలు నగరరాజమున విరాజిల్లుచున్నది. దేశముకొరకు తనువు నర్పించువారు ధన్యులు. అట్టివారికి మోక్షము కరతలామలకమగును. దేవతలు వారిత్యాగమును వినుతింతురు. వారు స్మృతిచెందియు జనమధ్యమున జీవించియే యుందురు. అట్లుగాక యెవడు తన కడుపుకొరకై దేశమును పరులకొప్పజెప్పునో వానికిక పుట్టగతులుండబోవు.

కెమలుపాషా నావికుల యపూర్వమగు త్యాగబలముకతంబున అనటోలియాయందలి సాంసను నగరము సురక్షితముగా చేరి పశుబలముచే విప్లవదారుల దారుణములగు ఫిరంగిగుండ్లబారి కగ్గము గావింపక వారలనెల్లర నొకచో నిలచి సరసవచోనైపుణిని వారికిట్లనియెను. "ఓ నాప్రియమైన టర్కీసోదరులారా! నేటి సుల్తాను పరిపాలనమున మీ రెల్లరు అసంతృప్తులయియుండుట కడుంగడు సహజము. అందులకు మిమ్ముల నేనిసుమంతయు నిందింపను. అందులకని మీ మాతృదేశమగు టర్కీని విదేశీయులపాలొనరింతురా? ఇది మీకు తగునా? వలసినచో సుల్తానును పదభ్రష్టునొనరించి మీలో నొక దేశభక్తుని రిపబ్లికు ప్రెసిడెంటుగ నెన్నుకొనవలెను గాని యిట్లు లోనరింప పాడియా? వలయునెడల సర్వసేనాధ్యక్షుడ నగు నేనే మీపక్షము వహించెదను. సుల్తానును విదేశీయులకుగూడ తఱిమివైచి టర్కీని ప్రపంచమునగల రాజ్యములన్నిటి యందు మిన్నగ నొనర్చెదను" అన విని విప్లవదారులెల్లరు సంతోషహృదయాంతరంగులై "కెమలుపాషాకు జయమగుగాక. ఈతడెంత సహృదయుడు. మనల పశుబలముతో బరిమార్పగలిగియుండియు కర్తవ్యము నెట్లు బోధించినాడు. ఇట్టితరుణముననే మనము టర్కీస్వాతంత్ర్యమును తప్పక బడయవలయును" అని వారి

లో వారు సంప్రదించుకొని కెమలుపాషా నాయకత్వము క్రింద గ్రీకులను స్మిర్నా సముద్రపు టావలికి బారద్రోలి విదేశీయుల నెల్లర నోడించి పారద్రోలి యనామకుడగు సుల్తానును పదభ్రష్టు నొనర్చి కెమలుపాషాను టర్కీ స్వాతంత్ర్యోద్ధారకుని, టర్కీ డిక్టేటరు (నిరంకుశాధికారి)గా నియమించిరి. కెమలుపాషా గారి పరిపాలన క్రింద అతిశీఘ్రముగ టర్కీదేశము ప్రపంచనాగరికతాశిఖరము నధిరోహింపగలిగినది. ఇప్పుడాయూర కాటకమునకు కాటక మరుదెంచినది రోగమునకు పెద్దరోగము వచ్చినది. సౌఖ్యమున కాలవాలమైనది. విద్యలకు నిలయమైనది.

పులవర్తి కమలావతిదేవి.

---

## గాంధిమహాత్ముని ఆత్మకథ:
## లండను టైమ్సుపత్రిక

గాంధిమహాత్ముని ఆత్మకథగూర్చి అభిప్రాయ మిచ్చుచు ఈవార మందిన లండను టైమ్సు పత్రిక మహాత్ముని నిష్కాపట్యమును మిగుల శ్లాఘించెను తాను వ్రాసిన కథవలన ఇతరులలో నెట్టిభావము లుదయించునో యని మహాత్ముడు లెక్కింపడని, టైమ్సుపత్రిక భావించుచున్నది. సాధారణముగ స్వీయచరిత్రలను వ్రాయువారు, తమ లోపములను బయల్పరుచుటకు ఇనుసీసెదరు. అట్టి ప్రయత్నము మహాత్ముని ఆత్మకథయందు గనుపింపదని, టైమ్సు అభిప్రాయపడుచున్నది. కొందరు స్వీయచరిత్రకర్తలు, తమ ప్రయత్నము లేకుండ కలిగిన ఫలితములకు గూడ గొప్ప చెప్పుకొందురు. అట్టి దేదియు దీనియందు కనుపింపదని, టైమ్సుతలంపు. మహాత్ముని ప్రధానాశయ మేమి? టైమ్సుపత్రిక ఇటుల వ్రాసెను:-

"గ్రంథమునందంతటను బాధ ననుభవించెడి బీదలతోనే గాంధి కలసియున్నటుల గనుపించును. ఇక రాజప్రతినిధిగారితోగాని, పాలకులతోగాని, గాంధిగారికి గల సంబంధము, విధిలేక పిలిపింపబడెడి ప్రతిపక్షిగను, కారాగృహమున నిర్బంధితుడుగను మాత్రమే గనుపించును. దీనివలన గలిగిన ఫలితము గాంధిగారి ఆధ్యాత్మిక దార్ఢ్యము."

మహాత్మునికి ఎల్లరపై గల పలుకుబడికి గల కారణమును ఈరీతిని దెలుపుచున్నది:

"గాంధిగారియొక్క పలుకుబడి ఇతర నాయకులందరకన్నను ఎక్కువయినది. వీరికన్న తీక్ష్ణబుద్ధిగల నాయకులును, వాదసామర్థ్యము గల నాయకులును గలరు. వీరందరకన్నను గూడ మహాత్మునికెక్కుడు పలుకుబడి ఏర్పడుటకు గల కారణ మీ గ్రంథముద్వారా గ్రహింపవచ్చును. గాంధిగారి మనస్సు విషయమును సూటిగ గ్రహించును. ఇట్టి గ్రహణశక్తి నిరుపమానము. తన మనస్సుపై నింతనమ్మకము గల వ్యక్తి మరియొకరిలోకమున నెన్నడును జనింపలేదు. అతని మనసు. సత్యమును జూచుటకు సూటిమార్గము ద్రొక్కును. సత్యమనిన కేవలము ఊహాప్రపంచమునకు సంబంధించినది గాదు. సత్యమనిన ఆచరణకు సంబంధించిన సత్యమే. సత్యమును మాత్రమే అన్వేషింపవలయును; సత్యమును మాత్రమే అనుసరింపవలయునను విశ్వాసము, అతని మనస్సును మొదటినుండియు ప్రేరేపించుచుండెను. గాంధిగారి జీవితమిందువలన నిరాడంబర మయ్యెను. మనలో పలువురు నిజమని నమ్మినదానిని జేయదలచినను, అనేక పర్యాయములు మన హేతువాదము సరియగునో కాదో యని అనుమానించుచుందుము. ఎక్కడనో పొరబాటు కలదని భయపడుచుందుము. గాంధిగారెన్నడును నిట్టి అవిశ్వాసమునకు లోనై యుండలేదు. అతని మనస్సు అతని విధులను నిర్ణయించెను. అతని విశ్వాసములను నిరూపించెను. అతని కవి నిశ్చయములే. అందుచేతనే, అతడు తాను దొక్కిన పథము నేమాత్రము వీడడు. కాని,

అతని వినయము గూడ ఆశ్చర్యముగ నుండును. అతని యూహ లతనికి సత్యములు. ఇతరులకన్న తన కెక్కువ బుద్ధిప్రతిభ గల దని, గాంధిగారు ఎంచుట లేదు. కాని, వేదవాక్యములవలె నతని మనస్సున కట్టి సత్యములు స్ఫురించుచుండును. తరుచుగ అత డితరులపై తన విశ్వాసములను జొప్పింప గలిగెను. అతడు ఇతరులను అనుమానింపకుండుటకు, అతని నిష్కల్మషహృదయమే కారణము. అట్టి నిష్కలుషమనస్సుతోనే వివాదమునకు దిగును. ఆ వివాదము అతని మానసమును ప్రేరేపించి, అతని విశ్వాసమును ప్రేరేపించును. ఆకారణముచే నతని విశ్వాసము భిన్నాభిప్రాయములుగల ఇతరప్రముఖులనుగూడ ప్రేరేపింప గలిగియుండెను. తిలక్, చిత్తరంజనదాసు, పండితమాళవ్యాగార్ల బోలువారు తమ విశ్వాసములను విడనాడి గాంధిగారి విశ్వాసముల ననుసరించి నడువవలసివచ్చెను."—ఆంధ్రపత్రిక.

---

## పొట్టిదుస్తులు

అమెరికాలో, పడుచులు కట్టుకొనే దుస్తులు రానురాను పైకెగదీసికొని పోతున్నవని దాన్ని నిషేధిస్తూ ఒక శాసనం చేశారట. వాళ్లు కట్టేదుస్తుల అడుగు అంచునుండి మోకాటివరకు గల మేర పది అంగుళాలకన్న ఎక్కువ ఉండాలట; లేకుంటే శిక్షిస్తారట. ఇక్కడ ఉండే చిత్రంలో అమెరికాయందు బీచి-కావలి పోలీసుద్యోగి ఒకడు శాసనం ప్రకారం పది అంగుళాలుందా లేదా అని కొలిచి చూస్తూన్నాడు.

మనదేశం పట్టాల్లోకూడా పాశ్చాత్యజాతుల ఆడువారూ, వారిసంపర్కం ఉండే మరికొందరు ఆడువారూ ఇంచుమించు ఇలాటి చాలీచాలని దుస్తులనే కట్టుకుంటూన్నారు. కట్టుకునేవాళ్లకి లాభాలు ఎన్నో ఉండవచ్చు, కాని బ్రిటీషువారికి బట్టలవ్యాపారంలో మాత్రం కొట్లకొలది నష్టం ప్రాప్తిస్తూంది. ఈ విషయంలో సానుభూతికల ఏశాసన సభ్యుడయినా బ్రిటీషువారి కీయుప



ద్రవం తొలిగేటట్లు ఓ శాసనం ప్రవేశపెట్టాల సుంది.

—బొంబాయి క్రానికల్ పత్రికనుండి.

---

## ఉత్తరరామ చరిత్రము

### కరుణరసప్రధానక మగునా ?

శ్రీయుతులు కొంపెల్ల సుబ్బారాయ శాస్త్రులుగారు ఉత్తరరామచరిత్ర యందలి రసము కరుణ విప్రలంభ శృంగారమని సిద్ధాంతము చేయుచు వ్రాసిన వ్యాసము భారతియందు ప్రకటిత మయిన పిదప దానిపయి ఖండన మండన ముండనాదులు కొన్ని విషయమునకు, వినీతికి దూరములగు వ్యక్తుల వెంట బరువిడ జొచ్చినవి. కావున నీవివాదము నింతతో ప్రకటింప మానితిమి.

—సం. భారతి.



## ఇందిరేయప్రేమ (కన్నడము-వచనము)

గ్రంథకర్త: శ్రీ ఆర్. వెంకటశెట్టిగారు. ప్రకాశకులు: కర్నాటక మిత్రమండలి, బళ్లారి. పుస్తకము చిన్నదియైనను ఘనవిషయమును లోగొనియున్నది. గ్రంథకర్త యువకుడైనను, సనాతనధర్మపరిపాలన మత్యావశ్యకమనియు, కొన్ని సామాజికదోషములను పారదోలవలయుననియు, స్వదేశసేవకు బూనవలయుననియు, సరసశైలిని హితవాదము నొనర్చినాడు. ఇది హిందూదేశాభిమానులందరును చదువదగిన పుస్తకము. వెల రెండు అణాలు మాత్రమే. అందందు అనావశ్యకముగా నవ్యదేశీయపదములును, గ్రామ్యశబ్దములును కన్పట్టుచున్నవి. పునర్ముద్రణమునందవి సవరింపబడిన బాగుండును. K. N.

---

## NATIONAL ANTHEMS
## (జాతీయగీతములు)

డెమ్మి ౧౬ సైజు; ౧౨౮ పుటలు. వెల రు. ౧.

సంపాదకులు, ప్రకాశకులు: ఆర్. కె. ప్రభుగారు, గణపతి టెంపిల్ స్క్వేర్, మంగళూరు, దక్షిణ కనరా.

ఏ దేశీయులకైనను తమతమ మాతృభూమిపై భక్తిప్రేమలు నైసర్గికములు. నెత్తురు ఏరదలుకట్టినను, ఆ భావములు దేశీయుల హృదంతరములందు మరింత ప్రజ్వరిల్లునే గాని, శమింపవని ప్రపంచముయొక్క చరిత్ర స్పష్టము సేయుచున్నది. దేశభక్తి అవ్యాజభావ మగుటచేతనే, అది కవికుమారుల గీతములంబడి అక్షరరమ్యాకృతిం బొరసినది. శాసనసభలు లేని దేశమైన నుండనోపును కాని జాతీయగీతము పాడుకొనని దేశము విశ్వమున నుండనోపదు. కవులేగదా మానవకోటికి నిజమైన శాసనకర్తలు.

అట్లగుట, నానాదేశముల జాతీయగీతములు సపుటీకరింపబడిన యీ గ్రంథము (National Anthems) ఆకర్షణీయము గాక తప్పదు. భారతయువజనుల కిది కోర్కెలూరించునది కూడనై యున్నది. ఇట్టి గ్రంథములందు అనువాదమే ఒక లోపమగుట సహజము. జాతీయగీతములు ముఖ్యముగా అనువదింపరానివి. వానియందు దేశీయులభావమును భాషయు నభేదతం బొరయును. ఐనను, అన్యభాషలవారు ఇంచుక రుచి చూచుటకు అనువాదము లుపకరింపక పోవు.

ఈ గ్రంథమును సంపాదకులు ఆర్. కె. ప్రభుగారు 8 భాగములుగా విభజించినారు. ప్రథమమున, భారతజాతీయగీతములు గలవు. గ్రంథమునకు ఆది "వందేమాతరం" గీతము. దీనికి శ్రీ అరవిందుని అనువాదము ప్రశస్తిగాంచినది. లీదొరగారి అనువాదము కూడ గలదు. తొలిపలుకు రచించిన బి. జి. హార్నిమన్ గారు 'వందేమాతరం' గీతమును గూర్చి వ్రాసినవాక్యములు పరిశీలింపదగినవి — "భారతదేశమునకు తగిన జాతీయగీత మిప్పటికి లేదనియే నా యభిప్రాయము. ఇది ప్రామాణికముగా నేననుటగాదు గాఢముగా విశ్వసించుచున్నాను. 'వందేమాతరం' గీతము బెంగాలీయందును, ఏతదాంగ్లానువాదములందును రమ్యమైన గీతము. మాతృభూమి సౌందర్యవిశేషముల నద్భుతముగా వర్ణించునది. అది కళలనీను జీవకణిక. మాతృప్రేమయందు కవి తన్మయత్వము చెందినాడు. ఇతరులకు కైపునిచ్చుచున్నాడు కాని, 'ద్విసప్తకోటిభుజైర్ధృతఖరకరవాలే' అని యుద్ధతముగా బల్కుచున్నను గీతాంతమున కరవాలము చేతబూని విజయముగాంచి నిలుచువానిం జేయదా గీతము. నిజమైన జాతీయగీతమునకు విజయభావము ప్రాణము."

భారతజాతీయతయం దైక్యము కల్పించుకొనిన ఆంగ్లేయుని యభిప్రాయ మిది. ఇందువలన హోర్నిమన్ సైతము భారతమున స్తత్వమును పూర్తిగ గ్రహింపలేదని తోచుచున్నది. స్వవిజయము పరునకు పరాజయము గదా. విజయోత్కర్షయే జాతీయతకు ప్రాణమేని, స్వదేశాభిమానము పరదేశముపై ద్వేషముగా మారిపోవును. ఐర్లాండు స్కాట్లాండు జాతీయగీతములు ఇంగ్లాండుపై ద్వేషమును గ్రక్కుచున్నను, భారతదేశముకూడ ఇంగ్లాండుతోడి వైరము గొనవలసి వచ్చియున్నను, భారత జాతీయగీతము పరులపై ద్వేషమును సూచింపకుండుట దాని యుత్కృష్టతనే చాటించును. అందువలన మాతృభక్తి కొఱవడెదనుటకు హోర్నిమన్ గారు మెచ్చుకొనిన యాత్మన్మయత్వమే ప్రమాణము. ఇంకను ఒకమాట. ఇతర జాతీయగీతములందు మాతృభూమిని దైవముగా స్తుతించుట పొడకట్టదు. "వందేమాతరం" గీతమున కవి భరతమాతను దుర్గగాను, లక్ష్మిగాను, సరస్వతిగాను కీర్తించినాడు. ఇట్టి దేశభక్తి మతాంశమనుట నిర్వివాదము. భారతీయులు మతకర్తలుగా గదా విశ్వమున ప్రసిద్ధి.

భారతగీతములలో రవీంద్రనాథటాగోరుగారి "జనగణమన" గీతమును, ద్విజేంద్రలాల్ రాయిగారి గీతమును, ఏక్బాల్ గారి "హిందూస్థాన్ హమారా" గీతమును, సరోజినీదేవిగారి ఆంగ్ల గీతములును ఉన్నత భావోపేతములు, జాతీయతాప్రభాతకీర్తనలు, శాశ్వతములు.

రెండవభాగమున, ఇతర దేశముల జాతీయగీతములు కలవు. బర్న్సు కవియొక్క "Scots who hae' with wallace bled", ఫ్రాన్సుదేశపు 'మార్సెలై', జర్మనుల "The watch on the Rhine" గీతములు వీరరసభరితములైయున్నవి. ఆంగ్లేయుల "Rule Brittania, rule the waves Britons never shall be slaves" గీతమును అట్టిదే. ఐర్లాండుదేశపు "The wearing of the green" గీతము ఆ దేశీయుల దృఢచిత్తతను, ఆంగ్లేయులపై మాత్సర్యమును వ్యక్తపరచుచున్నది కెనడా జాతీయగీతము బ్రిటనుపై సౌహార్దమును వెలువరించుటకు కారణము, ఉచితరీతిని వారిస్వాతంత్ర్యమును బ్రిటను వారి కిచ్చివేయడమే యగుట జగద్విదితము. ఐర్లాండుతో బ్రిటను సంబంధము ఏతద్విపరీతముగా నుండుటయును వారి జాతీయగీతముయొక్క మాత్సర్యమునకు కారణము.

మూడవభాగమున స్వాతంత్ర్యగీతములు, నానాదేశపుకవులు రచించినవి కలవు. ఇందు సాధారణముగా పాశ్చాత్యదేశములందు జాతీయతకు గల సంకుచితదృష్టి వీడి, మానవకోటియంతను విశాలహృదయముతో ప్రేమించు కవివరులు పలువురు కన్పట్టుచున్నారు. జేమ్సురసెల్ లవెల్ గారి గీతము నిజమైన స్వాతంత్ర్యమును చక్కగ వర్ణించినది. "They are slaves who fear to speak for the fallen and the weak" అని, తమదేశపు స్వాతంత్ర్యమునకు మురిసికొనుచు, ఇతరులపై నవిచ్ఛిన్నముగా రాజ్యము సేయుచున్న సామ్రాజ్యవాదులను కవి సరిగా ఘట్టించినాడు. ఆర్థర్ హ్యూక్లొగారి "Say not the struggle nought availeth" మాల్కమ్ క్వీన్ గారి "Say not they die" గీతములు సూక్ష్మములో మోక్షమున్నరీతిని అద్భుతమైన కవనము

ఇన్ని గీతములను సంపుటీకరించుటకు, తగిన అనువాదముల సేకరించుటకు, ఏతత్సంపాదకులు చాల ప్రయాసకులోనై యుందురు. వారి యుద్యమ మెంతయు ప్రశంసనీయము. భారతీయు లిందలి భావములను తమ చిత్తమం దలవరించుకొనుచో, భారతస్వాతంత్ర్యసంపాదనప్రయత్నము సిద్ధిగాంచుచో, సంపాదకులు ధన్యులయ్యెదరు.

గు. వెం. సు.

---

## CONTRACT LABOUR IN BURMA

## (బర్మాలో కంట్రాక్టు కూలీ పద్ధతి)

గ్రంథకర్త: శ్రీయుత అవటపల్లి నారాయణరావు గారు.
క్రౌనుసైజు; ౧౯౪ పుటలు. వెల రు. ౧-౪.
'మేనేజరు, కరెంట్ థాట్ ప్రెస్, ట్రిప్లికేను, మదరాసు' అను విలాసమున గ్రంథములు దొరకును.

ఈ గ్రంథమును రచించిన నారాయణరావుగారు బర్మాలోని భారతీయులకొఱకు ఎడతెగక కృషి సలిపిన ఆంధ్రప్రముఖులు. వీరు బర్మాశాసనసభలో ౬ వత్సరములు సభ్యులుగా నుండి, కార్మికుల శ్రేయమునకై తమ యావచ్ఛక్తిని వినియోగించిరి. వీరికృషి కొంత

కొంత ఫలించినను, బర్మాకార్మికుల దౌర్భాగ్యమున కాదిహేతువైన మేస్త్రీవిధానము(Contract Labour) ఇంకను అంతరింప కున్నది. దీనినిగూర్చియే రావుగా రిప్పుడు గ్రంథమును రచించినది.

గత యేబదివత్సరముల లోపల బర్మాదేశపు పరిశ్రమలు అత్యంతాభివృద్ధి గాంచినవి. బ్రిటిష్ వణిక్పుంగవుల ఆర్థికసాహసికత కీవిధమున సహకారి యైనది భారతీయకార్మికుల కాయకష్టము. ఇప్పటికిని బర్మాపరిశ్రమాగారములందు భారతీయకార్మికులసంఖ్య అధికముగా నున్నది. ఆంధ్రులు, అరవలు, ఉత్కళులు, బంగాళీలు, హిందూస్థానీయులు బర్మావారికన్న నెక్కుడుగా నాదేశమున పాటుపడుచున్నారు. అట వీరి కూలిపద్ధతి దుర్భరముగా నున్నదనుటకు నారాయణ రావుగారి గ్రంథము ప్రబలమైన సాక్ష్యము. పరిశ్రమల యజమానులకును కార్మికులకును మధ్య మేస్త్రీలు గలరు. కూలిధనమున ఈ మేస్త్రీలు మూడవపాలుకు పైగా నపహరించి, కార్మికులను పీల్చి పిప్పిజేయుచున్నారు. తనగ్రామము వదలి భారతీయకార్మికుడు స్టీమ రెక్కినది మొదలు, ఏదోయొకవిధముగా ఈ మేస్త్రీలకు బానిసయైపోవుచున్నాడు. బర్మాలో వీరికి సంసార సుఖము లేదు. కార్మికవాసస్థలములు జైలుకన్న దుర్భరములు. వారమునకు ౭౧ గంటలు పనిచేయవలసి యున్నది. ఆరోగ్యము కాపాడుకొనుటకు అవకాశమే లేదు. రోగములకు వీరు తేలికగా బలియగుచున్నారు.

మేస్త్రీవిధాన మంతరించి, కార్మికులశ్రేయము పరిశ్రమాధికారుల బాధ్యతగా మారిననే గాని ఆశ కెడము లేదు. నాగరికత గల దేశములందు కార్మికులకు సౌఖ్య మొదగూర్చుటకు ప్రభుత్వములు అప్రమత్తములై యున్నవి. బర్మా యిప్పటికే పరిశ్రమలందు పాశ్చాత్యదేశములతో తులతూగుచున్నది. కాని, అచటి కార్మికుల కష్టనష్టములను విచారించు నాథులు లేరు. ముఖ్యముగా భారతీయకార్మికులు రెంటికి చెడిన రేవడలై యున్నారు. వీ రచట పరదేశీయులును కారు, స్వదేశీయులును కారు. ఇప్పు డిప్పుడే జాతీయతాభావోన్మత్తులైన బర్మీయులు భారతీయులపై నీసు వహించుచున్నారు. అందువలన భారతీయులు స్వజనముపై నెక్కుడుఆసక్తి కనపరుపవలసియున్నది. ఇష్టము లేనిచో, బర్మావారు భారతీయుల ప్రవేశము నడ్డగింతురుగాక! తమ యవసరములకే సాయపడుచున్న భారతీయకార్మికుల సరిగా చూడవలెననిమాత్రము మనము ఘంటాపథముగా తెలుప వలసియున్నది. గత మేమాసమున జరిగిన హింసలకు భావికాలమున అవకాశలేశ ముండకూడదు. అపుడు నిహతులైనవారు ముఖ్యముగా ఆంధ్రులు. స్వాభిమాన మెక్కుడుగాగల ఆంధ్రులు స్వజనముపై శ్రద్ధ వహించు నటుల చేయుటకు నారాయణరావుగారి గ్రంథము తోడ్పడుగాక. గు. వెం. సు.

---

# గ్రంథస్వీకారము

## విప్రసందేశము

అను నామాంతరము గల రుక్మిణీ పరిణయము (శుభావహ నాటకము).

కవి: కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. ఎల్. అభినవాంధ్రకార్యస్థాన సుప్రకాశితము. క్రౌను, ౧౧౨ పుటలు. వెల రు. ౧. ౧౯౩౦.

---

## మహావీరుఁడు

శూద్రకుడు. రచయిత: మానవల్లి రామకృష్ణకవి గారు, యమ్. ఏ. ప్రకాశకులు: యమ్. సుబ్బారావు గారు, రాజమహేంద్రవరము. క్రౌను, ౨౮౭ పుటలు. వెల రు. ౧-౪-౦. ౧౯౨౮.

---

## మహాలయము

రచయిత: శ్మశానవాసి, బెజవాడ. డెమ్మి ౭౬ పుటలు. ౧౯౩౦. వలయువారి కుచితముగ నందజేయబడును.

---

### కలభాషిణి చరిత్రము

రచయిత: సాహిత్యశిరోమణి, ఉభయభాషా ప్రవీణ, కొండూరు నరసింహాచార్యులుగారు, కడపజిల్లా బోర్డు విద్యాశాఖాంధ్రపండితులు. క్రౌను, ౮౦ పు. వెల ౧౦ అణాలు, ౧౯౩౦.

---

### ఈశ్వరశతకము

కవి: కవితావినోద, అల్లంశెట్టి అప్పయ్యగారు, పొందూరు. వెల ౨ అణాలు. గ్రంథము వలయువారు చదుపుల నందికేశ్వరరావుగారికి, పొందూరు (విశాఖపట్నం జిల్లా) వ్రాయవలయును.

---

### పార్వతీపతి శతకము

రచయిత: రామకోటిదాసుగారు, ఉన్నవ, గుంటూరు.

---

### నిష్కామయోగము

(శ్రీ గాంధి భగవద్గీతానువాదము—వ్యాఖ్యానసహితము.)

అనువాదకులు: బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

ప్రకాశకులు: తిపిర్నేని లక్ష్మీనారాయణగారు, మానవాదర్శగ్రంథమండలి, అంగలూరు, కృష్ణాజిల్లా. డెమ్మి ౧౬ సైజు, ౩౭౭ పుటలు. వెల ౬ అణాలు మాత్రము. ౧౯౩౦.

---

### దోషాభాసనిరాసము

గ్రంథకర్త: శ్రీమజ్జటప్రోలు సంస్థానాస్థాన విద్వాంసు లగు పనమ సీతారామ శాస్త్రిగారు. డెమ్మిసైజు, ౪౧ పుటలు.

---

### 'గృహలక్ష్మి' దశరాసంచిక వెల రు. ౦-౮-౦

విలాసము: గృహలక్ష్మి కార్యాలయము, తపాలు పెట్టె సంఖ్య ౩౯౨, ఎగ్మూరు, మదరాసు.

ఆంధ్రదేశమున స్త్రీలకొరకు ప్రత్యేకము దిష్టమయి ప్రకటిత మగుచున్న 'గృహలక్ష్మి' మాసపత్రిక యొక్క దశరాసంచిక యిది. ప్రారంభము మొదలు 'గృహలక్ష్మి' స్త్రీలకు వివిధవిషయములందు ప్రవేశమును, అభిరుచిని గలిగించుచు నానాటికి పెంపొందుచుండుట మిగుల సంతోషదాయకము. విద్యావతుల య్యును, సహజలజ్జావతులగు నాంధ్రస్త్రీలయం దుత్సాహమును పురికొల్పి వారు తమవైదుష్యమును పెంపొందించుకొనుటకును, ఆంధ్ర లోకమునకు జాటుటకును జాలిన సదవకాశ మును గలిగించి, వారి అభ్యుదయమునకు నూతన యుగప్రారంభమును గావించినది. ఆంధ్రవనితాలోకము యొక్క వైదుష్యాదుల యందు 'గృహలక్ష్మి' పుట్టుకకు పూర్వము నకంటె నేడు గల అభివృద్ధి 'గృహలక్ష్మి' చరిత్రను పరికించిన విస్పష్టమగును.

ఆంధ్ర స్త్రైణాభ్యుదయమునకు 'గృహలక్ష్మి'యు, 'గృహలక్ష్మి' అభివృద్ధికి ఆంధ్రస్త్రైణమును పరస్పరము నుపకరించు చుండుటకు ఈ మూడవ దశరాసంచిక నిదర్శనము. దీని యందు విమర్శీరత్నములగు శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మ, గుమ్మిడిదల దుర్గాబాయమ్మ, వింజమూరి వెంకటరత్నమ్మ, మదమంచి అనంతమ్మ, మరుపూరు వెంకటసుబ్బమ్మ, వెలువోలు వసం

తా దేవి మొదలగువారు రచియించిన వ్యాస ములును, శ్రీయుతులు కూచి నరసింహము పంతులు, రాయసం వెంకటశివుడు, వేంకట కాళిదాసకవులు, మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రి, పంచాగ్నుల ఆదినారా యణశాస్త్రి మొదలయిన విద్యాధికులు రచి యించిన అమూల్యవ్యాసములును గలవు. ప్రాచీనగ్రంథములనుండియు, సమకాలికములగు పత్రికలనుండియు నుద్ధృతములయిన స్త్రీ జనా భ్యుదయదాయకము లగు విషయములును, బాలబాలికలకు ఆనందమును గూర్చు పాట లును, కథలును గలవు. విద్యావతులయి పేరు గాంచుచున్న యువతీమణుల సంక్షేప చరిత్ర ములును సచిత్రముగ ప్రకటితములయి నవి. మఱియు స్త్రీ విద్యాసంస్థయగు మద రాసు సేవాసదన చిత్రములును, సుందరను లగు త్రివర్ణచిత్రములును, ఇతర చిత్రములును ఉన్నవి. ఈసంచికయందున్న ఇన్నియు నాంధ్ర వనితా లోకముయొక్క అభ్యుదయమునకు జాలినవగుచున్నవి. సుందరమగు అచ్చు కూర్పు మొదలయినవి సంచికకు అందమును సమకూర్చినవి.

పత్రికానిర్వాహణము వ్యయప్రయాస మూలకము. అందును అల్పసంఖ్యాకు లగు విద్యావంతులుగల ఆంధ్ర దేశమున. కేవలము స్త్రీలలో విద్యవచ్చినవారి సంఖ్య చాల తక్కువ. ఇక వారి కొరకయిన పత్రికను గూర్చి వేరుగ చెప్ప బని లేదు. కావున నాంధ్రలోకము, తనలో చక్కసగమగు స్త్రీ జనము నభ్యుదయమునకయి, వ్యయప్రయాస బాహుళ్యము నేని పరిగణింపక, ఎల్ల విధముల నొప్పునట్లు ఈ గృహలక్ష్మి పత్రికను ప్రక టించుచున్న తత్పత్రికాసంపాదకుల యొక్క సద్భావము నవకాశముగాగొని ఈ పత్రికవలన గాదగు నెల్లప్రయోజనములను స్త్రీలు పడయ గల్గునట్లు చేయుట సమంజసము.

---

## పువ్వులుకోయుట

పొద్దు పొడ్దూ లేదామా !
అక్కల్లారా! పోదామా!—పోయి
పొన్నపూలు తెద్దామా !—
తెచ్చి దండలు గుచ్చుదామా?—గుచ్చి
శివునిమెడలో వేద్దామా ?
వేసి, భజనలుచేదామా?

---




అనంతమైన విశ్వమును అఖండమైన ధర్మము సంరక్షించుచున్నది. అఖండమైన ధర్మము దేశ కాల పాత్రావరణములందు ఖండరూపములను దాల్చుచు మహాసంక్షోభమును గలుగజేయుచున్నది. దేశ కాల పాత్రావృతమైన ఖండధర్మము మమకారాహంకార పరవశమై పరమానర్థములకు మూలమగుచున్నది. పరమార్థపరములైన దేశధర్మము, కాలధర్మము, జాతిధర్మము, స్వార్థపరములై నిరంతర సంరంభమునకు మూలములయి జీవత్వమును, మానవత్వమును, దైవత్వమును దుస్సహము చేయుచున్నవి. ప్రపంచమునందు జాతీయాహంకారము గలుగజేయుచున్న మరణయాతన వర్ణనాతీతము. జాతీయాహంకారము, మమకారము, ధర్మనాశనమును, ఆత్మనాశనమును గలుగజేయుచున్నవి. విశుద్ధమైన స్వార్థపరత్వము ధర్మప్రమాణమై మహాప్రలయమును గలిగించుచున్నది. ఐరోపా మహాసంగ్రామము గలుగజేసిన దుఃఖానుభవమైనను పాశ్చాత్య ప్రపంచమునకు ముఖ్యముగాను, గ్రేట్‌బ్రిటనుకు జ్ఞానోదయమును గలుగజేయజాలక పోవుట సంతాపకరము. బ్రిటీషు రాజ్యాధికారులు ధర్మనామమునను భరతవర్షమునందు గలుగజేయుచున్న మహాసంక్షోభము ప్రపంచమునం దంతటను పరమానసహ్యమును గలుగజేయుచున్నది. భరతవర్షాభ్యుదయమునకును, ప్రపంచశాంతికిని, ధర్మాభ్యుదయమునకును, ఆత్మార్పణమును జేసిన గాంధిమహాత్ముడు యరవడా చెఱసాలయందు విచారణ లేకనే నిర్బంధము ననుభవించుచున్నాడు. 60,000 సత్యాగ్రహులు-స్త్రీలు, పురుషులు-కారాగృహములందు నిర్బంధముల ననుభవించుచున్నారు. అధికారులు శాంతిన్యాయరక్షణవ్యాజమునను జేయుచున్న యవినయకార్యములు నీతిబాహ్యములై పరమానసహ్యమును గలుగజేయుచున్న విధమును నిత్యవ్యవహారములు తెలుపుచున్నవి. దేశమునం దంతటను ధర్మదేవత యంతరించి దండనదేవత వెలసి పాలించుచున్నది.

* * *

దండనప్రస్థానము

అధికారులు గతించిన ఆరేడుమాసములందును నవలంబించిన రాజ్యాంగవిధానము బ్రిటీషుప్రభుత్వాభ్యుదయమును విస్పష్టము చేసినది. దేశమునం దంతటను 144 వ్యాపించినది. సభలు, సమావేశములు, ఉత్సవములు ప్రతి

షేధింపబడినవి. దేశసేవాసంఘము లంగీకరింప జేయబడినవి. లాఠీప్రయోగము నిత్యవ్యవహార మైనది. తుపాకులు కాల్చబడినవి జరీమానాలు విధింపబడినవి. నవీనములైన నిర్బంధాస్త్రములు నిర్మింపబడినవి. స్వరాజ్యపతాకములు, గాంధి టోపీలు, రాటములు, తక్లీలు, ఖద్దరుబట్టలు, విదేశవస్త్రబహిష్కారప్రచారము, మద్యపాన నిషేధప్రచారము, ఆతిథ్యము మొదలగు సామాన్య విషయములును నేరములై దండనార్హము లైనవి. స్త్రీలు పురుషులు, బాలురు వృద్ధులు, పండితులు పామరులు, సంపన్నులు సామాన్యులు నిర్బంధములను పరమానందముతో ననుభవించు చున్నారు. రక్షకభటులును, అధికారులును అవలంబించు చున్న నిర్బంధమార్గము ధర్మచ్యుతిని గలుగ జేయుచున్నది. ఆంధ్రదేశమునందును, గుజరాతు దేశమునందును, నితరప్రాంతములందును రక్షకభటు లవలంబించుచున్న దౌర్జన్యము బ్రెయిల్సు ఫర్డుగారివంటి యాంగ్లేయులకును పరమవిషాద మును గలుగ జేయుచున్నది. కన్నింగుహాము, గారెటుగార్లవంటి యధికారులు స్వరాజ్యప్రచా రకులకు తగిన శాస్తి చేసినటు లానం దించినను ధర్మదేవత యానందింప దని గ్రహింపవలయును. రాజమహేంద్రవరమునం దు డాక్టరు గురుమూర్తి గారి పట్ల పోలీసు అధికారులు చూపిన దుర్నయము పరమరాజ భక్తులకుగూడ పరమాసహ్యమును గలుగ జేయుచున్నది. కైరావిషయమై మహాదేవ దేశాయిగారు వ్రాసిన విషయములు గ్రామ సీమలందు పోలీసుదౌర్జన్యము వలన ప్రజలను భవించుచున్న కష్టములకు నిదర్శనముగ నున్నవి. బొంబాయియందు పోలీసువారు చూపిన దుర్నయవిధానము నాగరకప్రపంచ మునకు అవమానకరముగ నున్నది. గారెట్టుగా రడిగినట్లు ప్రతివారును శాంతి సంరక్షణకై "ప్రజలనేల కొట్టవలయును?" అని ప్రశ్నిం చుచున్నారు. కాని ఈ ప్రశ్నకు సమాధా నము చెప్పవలసిన బాధ్యత ఆంగ్లేయాధికారు లమీదకన్నను భారతీయాధికారుల మీదనే యధికముగ కలదని నిత్యవ్యవహారములు విశ దము చేయుచున్నవి. ప్రజలను నిర్నిమిత్త ముగ బాధించెడి రక్షకభటులు, ఇన్స్పెక్ట రులు, దండనాధికారులు, విశేషభాగము భార తీయులై యున్నారు. బ్రిటిషుప్రభుత్వ విధా నము భారతీయుల ఆత్మగౌరవమును, ధర్మ లక్ష్యమును కొంచెపరిచినది. గాంధిమహా త్ముడు నిర్ణయించిన సత్యాగ్రహప్రస్థానము స్తంభితమైన భారతీయుల ఆత్మవిశ్వాస గౌరవ మును, ధర్మలక్ష్యమును వికసింపజేయుచున్న విధమును దుస్సహమైన స్థితియందును ప్రజలు చూపుచున్న సహనము, శాంతి విశదీకరించు చున్నవి. భారతీయుల దుఃఖానుభవము దుర్భ రమైనను ధర్మవిజయమునకు సాధనముగ నున్నది. దిగంతములందును మారుమ్రోగు చున్న దుఃఖవేదనను ధర్మదేవత సహింప జాలదు. ధర్మమునకువిజయము తథ్యమని ప్రపం చేతిహాసములు వేయిముఖముల చాటుచు న్నవి. భారతీయులు పూనిన శాంతి సమరము

లోకమునం దంతటను ధర్మవిజయధ్వానమును ప్రతిధ్వనింప జేయుచున్నది. భారతీయుల స్వపరిపాలన సమస్య భారతీయుల ఆత్మవిశ్వాసము మీదనే ఆధారపడియున్నదనియు, పరులదాన ప్రదానముమీద నాధారపడి యుండ లేదని యును బ్రిటిషు ప్రభుత్వ మవలంబించుచున్న రాజ్యనీతియు, ప్రపంచానుభవమును విశదము చేయుచున్నవి.

* * * *

రౌండు టేబిల్ సమావేశము

బ్రిటిషు ప్రభుత్వము రౌండుటేబిలు సమావేశము ను జేయుటకు కారణము కాంగ్రెసు ప్రతిభయేయని అందరును అంగీకరించు చున్నారు. కాంగ్రెసు నాయకుడైన గాంధి మహాత్ముడు లేని రౌండు టేబిలు సమావేశము భారతీయప్రయోజనములకు నిరుపయోగమని రాజకీయపరిజ్ఞాత లందరును అంగీకరించు చున్నారు. ప్రజాభిప్రాయము వ్యక్తము చేయగల గాంధిమహాత్ముడు లేని భారతీయ ప్రతినిధుల సమావేశము నిరుపయోగమని లండను నందు గూడిన ప్రతినిధుల వ్యవహారములు విశదము చేయుచున్నవి. బ్రిటిషుప్రభుత్వాధికారులు తలపెట్టిన హిందూ మహామ్మదీయ విభేదములు, సంస్థానములు బ్రిటిషు దేశ విభేదములు, అతివాద మితవాద విభేదములు పరిస్ఫుటము గాకపోయినను అంతర్గతములై సమావేశప్రయోజనమును శిథిలము చేయు చిహ్నములు గనుపడుచున్నవి. భారతీయ ప్రతినిధులు పరస్పర విభేదములను విపరాడి అధినివేశ పరిపాలనను ప్రతిపాదించినను సంయోగసాహచర్యములు దుష్కరము లని భిన్నసంస్కారాభిప్రాయములు విశదము చేయుచున్నవి. సికనీ మహారాజాగారు కోరిన రెండునిర్ణయములు దుర్లభములని భావి కార్యవిధానము వ్యక్తము చేయుగలదు. కన్సర్వేటివు, లిబరల్ పక్షప్రతినిధులు డొమినియన్ స్టేటస్ మాటయే పనికిరాదని ఘోషించుచున్నారు. లేబరుపక్షపుమంత్రి రాంసే మాక్డొనాల్డుగారును, హిందూదేశపుమంత్రి వెడ్జివుడ్ బెన్నుగారును మౌనముద్రను దాల్చియున్నారు. భారతీయప్రతినిధులకును, బ్రిటీషుప్రతినిధులకును స్వపరిపాలనముపట్ల సమానలక్ష్యము కల్గుట దుర్లభము. భారతీయప్రతినిధులు డొమినియను స్టేటస్ విషయమై పర్యాలోచన లేనపుడు సప్రూగారును, జిన్నాగారును, రౌండుటేబిల్ సమావేశము మానుకొనెదరని వెడలిన వార్తలయందు సత్యములేదని ఫ్రీప్రెస్సువార్తలు తెలుపుచున్నవి. హిందూదేశమునందు మితవాద నాయకులు గాంధిమహాత్మునితో నడిపిన సంధిప్రయత్నములవలెనే లండనునందును బ్రిటిషుప్రతినిధులతోను, బ్రిటీషు ప్రభుత్వముతోను డొమినియను స్టేటసును ప్రతిపాదించుటయును, బ్రిటీషుప్రభుత్వము ప్రసాదించెడి రాజ్యాంగసంస్కరణములను స్వీకరించుటయును సహజము. రౌండుటేబిలుసమావేశము ప్రస్తుతము భిన్నపక్షములవారు ప్రతిపాదించెడి సిద్ధాంతరాద్ధాంతములతో నంతము నొందుట సంభవము. వాదప్రతివాద

ములు నడిచిన తరువాత నుపసంఘము లేర్పడుటయును, సమావేశము నిలిచిపోవుటయును సహజము. బ్రిటీషు రాజ్యాంగరంగమునందు డిసెంబరు-ఏప్రిలుమాసముల నడుమను జరుగనున్న మార్పులు దురూహములు. ప్రజలకు లేబరుపక్షముపట్ల గల విశ్వాసరాహిత్యమును గత వారమునందు జరిగిన మ్యునిసిపలు ఎన్నికలు విశదముచేయుచున్నవి. భారతీయ రాజ్యాంగ సంస్కరణములపట్ల కన్సర్వేటివు లిబరలుపక్షములకు గల విముఖత్వమును పక్ష నాయకులును, పత్రికలును విశదము చేయుచున్నవి. ఈ రెండుపక్షములును చేతులుకలిపి లేబరుపక్షప్రభుత్వము నోడించుటయును సంభవము. నవంబరు ౧౨ వ తేదిని జార్జిచక్రవర్తి రౌండుటేబిలుసమావేశము నారంభించుట శుభావహమైనను ఆశాజనకముగాదు. ఇర్విన్ప్రభువు ప్రతిపాదించినసద్భావములె సార్వభౌముని ప్రసంగమునందును గోచర మగుచుండును. ప్రసంగములకును, క్రియలకును గల భేదము భారతీయులకు హృద్గతమైయున్నది. ప్రభుత్వములు ధర్మబలము మీద నాధారపడియుండునటులు, బాహుబలముమీదనాధారపడియుండజాలవు. బ్రిటిషుప్రభుత్వము ప్రజావిశ్వాసమును బడయుటకు ధర్మబలమును పునరుద్ధారణము చేయుట ప్రధానధర్మము. బ్రెయిల్సుఫర్డు గారు వ్యక్తము చేసినటులు రాజకీయ నిర్బంధితుల నందరను నియమము లేక విడుదలచేయుట శాంతవాతావరణమును గలుగజేయుటకు ప్రథమ కర్తవ్యము. గాంధి, మాలవ్య, నెహ్రూ, వెంకటప్పయ్యగారులు మొదలగు దేశభక్తులు నిర్బంధముల ననుభవించుచున్నపుడు ప్రజాలక్ష్యము రాజ్యాంగముల మీదను ప్రసరింపజాలదు. నిరంకుశాధికారు లవలంబింపనున్న తీవ్రమైన నిర్బంధ విధానమున కధికారులు జవహరిలాలు నెహ్రూ, గోవిందకాంత మాలవ్య, సేనుగుప్త, రాజగోపాలాచార్యులు, అవంతిబాయి గోక్లెగారు మొదలగు దేశారాధకులకు విధించిన కఠినశిక్షలును, రక్షకభటు లవలంబించుచున్న దుర్నయ విధానములును ప్రబల నిదర్శనములు. నిరంకుశాధికారు లవలంబించుచున్న దండన ప్రస్థానము ప్రజోత్సాహమును నిర్వీర్యము జేయజాలని విధమును దేశావృతమైన సత్యాగ్రహప్రస్థానము విశదము చేయుచున్నది.

* * *

గాంధిమహాత్ముడు - సత్యాగ్రహము

గాంధిమహాత్ము డారంభించిన ఉప్పు సత్యాగ్రహ మనేక రూపములను దాల్చినది. విదేశవస్త్రములు, మద్యములు, అటవీశాసనములు మొదలగు విషయములు సత్యాగ్రహ స్వరూపమును దాల్చినవి. నిరంకుశప్రభుత్వము నిర్మించిన తాత్కాలిక నిర్బంధశాసనములన్నియును సత్యాగ్రహ ప్రస్థానమున కాటంకము లగుటకు బదు లనుకూలములుగను బరిణమించుచున్నవి. తొమ్మిదవ ఆర్డినెన్సు బొంబయినగరమునందు గలుగజేసిన మహాసంచలనము నిరంకుశాధికార వర్గమునకును మహా

సంభ్రమమును గలుగజేయుచున్నది. కాంగ్రెసు కార్యాలయములు, కాంగ్రెసు బోర్డులు, కాంగ్రెసు జండాలు, కాంగ్రెసు ప్రచారకులు అంతరించుటకు బదులు విజృంభించినవి. బొంబయి నగరమునందు రెండువారములకు పూర్వము దేశసేవికలు ౫౦౦౦ మంది కేసర వస్త్రములను ధరించి చేసిన సత్యాగ్రహ ప్రచారము దేవతలకైనను మహాదృశ్యముగ నున్నది. ఇట్టి శాంతసుందర దృశ్యములే [illegible]స్యమును స్తంభనము చేయుచున్నవి. నిర్బంధములు దేహేంద్రియములను బంధించినను చిత్తప్రవృత్తిని బంధింపజాలవు. గాంధిమహాత్ముని తపోమహిమ గలుగజేసిన [illegible]ములు భారతీయ ధర్మవిజయమునకు లక్ష్యములుగనున్నవి. గాంధిమహాత్ము డారాధించుచున్న ధర్మసాధనమే భారతీయ విజయమునకు సాధనముగా నున్నది.

యరవడా జెయిలును గాంధిమహాత్ముని నివాసము ధర్మమందిరముగ జేసినది. గాంధిమహాత్ముడు యరవడా మందిరమునుండి చేయుచున్న ధర్మోపదేశములు ప్రపంచలక్ష్యము నాకర్షించుచు నవయుగధర్మసంస్థాపనమున కుపచరించుచున్నవి. ఉపదేశాచరణముల సందర్భమునను షేక్సిపియరు మహాకవికి కలిగిన సందేహమును గాంధిమహాత్ముడు తన పవిత్రజీవితమువలనను నివారణ చేయగలిగెను. "మాటలవలెను చేతలును సులభములైన, మందిరములు దేవాలయములును, పూరిగుడిసెలు దివ్యమందిరములును నై యుండెడివి" అని షేక్స్పియరు తెలిపిన సంశయభావమును గాంధిమహాత్ముని పవిత్రజీవనము నివారణ చేయుచున్నది. సబర్మతి సత్యాగ్రహాశ్రమమునందు వలెనే యరవడా చెఱసాలయందును గాంధిమహాత్ముడు చేయుచున్న ధర్మప్రతిష్ఠ బ్రెయిల్స్‌ఫర్డుగారి కాశ్చర్యమును గలుగజేసినది. చెఱసాల ధర్మమందిర మైనది. రాజ్యాంగజిజ్ఞాస ధర్మజిజ్ఞాసగను పరిణమించినది. గాంధిమహాత్ముడు ప్రతివారమును జేయుచున్న ధర్మోపదేశములు ప్రపంచమునం దంతటను ధర్మజిజ్ఞాసను గలుగజేయుచు ప్రపంచలక్ష్యమును భారతీయశాంతిసంరంభమునందు లగ్నము చేయుచున్నది. బ్రిటీషువస్తువుల బహిష్కారబలము భారతీయుల స్వపరిపాలనాభిలాషను సువ్యక్తము చేసినది. సత్యాగ్రహోద్యమము మహోద్యమరూపమును దాల్చినది. బ్రిటీషు రాజ్యాధికారులకును, ప్రజలకును భయసంభ్రమములను గలుగజేయు చున్నది. గాంధిమహాత్ము డుపదేశించిన సత్యాగ్రహప్రస్థానము భరతవర్షమునకును, ప్రపంచమునకును ధర్మమార్గవిజయస్వభావమును సువ్యక్తము చేసినది. రౌండుటేబిలుసమావేశములును, రాజప్రతినిధిప్రకటనలును, సార్వభౌముని ప్రకటనలును సద్భావములవలెను సత్కార్యములకు సాధనము గాకున్నవి. భారతీయుల దృఢసంకల్పమును, ఉత్సాహమును, కార్యపరత్వమును సత్యాగ్రహమునందు వ్యక్తమగుచున్నది. విదేశవస్త్ర బహిష్కారము, మద్య

పాన నిషేధము, శాసనోల్లంఘనప్రస్థానము ధర్మనిర్వాహణము మొదలగు రూపములను సత్యాగ్రహ సత్రయాగమును గాంధిమహాత్ము డధ్వర్యుడై నడుపుచున్నాడు. ఈ సత్రయాగమునందు ప్రసాదము స్వీకరింప సమకట్టిన భారతీయులు ధన్యులు. సత్యాగ్రహ సత్రయాగమునందు స్త్రీలు పురుషులు, బాలురు వృద్ధులు భాగధేయమును యథాశక్తిని గల్పించుకొనగల విధమును ఆసేతుహిమాచల వ్యాప్తమైన మహాసంచలనము విశదను చేయుచున్నది. గాంధిమహాత్ముని యీ మహాసంకల్పము సార్థకమై స్వరాజ్యము సమకూరునట్లు భగవంతు డనుగ్రహించు గాత!



# రెండుకోట్ల ఆంధ్ర మహాజనులకు

# ఇది యొక్కటే దైనికపత్రిక.

ఆంధ్రదేశవార్తలను, భారతదేశవార్తలను, ప్రపంచవార్తలను ఏరోజున కారోజున ప్రకటించుచుండును. వార్తలకు సంబంధించిన పటములు ప్రచురింపఁబడును. ప్రజలస్వాతంత్ర్యమును కాపాడుటకును స్వరాజ్యము నతిశీఘ్రకాలములో సంపాదించుటకును, ఆంధ్రపత్రిక తోడ్పడినరీతిని మఱి యేపత్రికయు తోడ్పడ నేరదు. కాంగ్రెసు నాదేశమును, ఆంధ్రదేశమునం దన్నిమూలలను వ్యాపింపజేయుటలో ఆంధ్రపత్రికను మించిన పత్రికయే లేదు. ఆంధ్రుల క్షేమమును పెంపుజేసి ఆంధ్రత్వసిద్ధికై పాటుపడుపత్రిక ఆంధ్రపత్రికయే. ఆంధ్రపత్రికను పోషించుట ఆంధ్ర మహాజనుల ప్రధానవిధి యగుచున్నది. శైలి సులభమై ఎల్లరకును గ్రాహ్యమగురీతిని పత్రికావ్యాసము లలరారుచుండును.

## చందా యేర్పాటులు

| | | | |
|---|---|---|---|
| దినపత్రిక సంవత్సర చందా | రు. | 24 0 0 | వారపత్రిక సంవత్సరం 1 కి, చందా రూ. 4 0 0 |
| ,, అర్ధసంవత్సరము ,, | ,, | 12 0 0 | |
| ,, మూడుమాసములు,, | ,, | 6 4 0 | వారపత్రిక సంవత్సరమునకు తక్కువ చందాకు పంపబడదు. |
| ,, మాసమునకు ,, | ,, | 2 2 0 | |

## నూతనసంవత్సరాదిసంచిక వెలలు

| | | | |
|---|---|---|---|
| దినపత్రిక సంవత్సరచందాదారులకు | ... | ... | 1 0 0 |
| దినపత్రిక సంవత్సరపు తక్కువ చందాదారులకు | ... | ... | 1 4 0 |
| వారపత్రిక చందాదారులకు | ... | ... | 1 4 0 |
| ఇతరులకు | ... | ... | 2 0 0 |

(వి. పి. ఖర్చులు ప్రత్యేకము.)

## ఆంధ్రపత్రికాకార్యాలయము,

7, తంబుశెట్టి వీధి, మద్రాసు.